# ముందుమాట

ఈ గ్రంథం, "భారతదేశ జాతీయ సంస్కృతి",లో డాక్టర్ యస్. అబిద్ హుస్సేన్, భారతీయ సంస్కృతి కేంద్ర లక్షణాలు, ప్రారంభం నుంచి నాటిస్థితి వరకూ ఎలా పెరుగుతూ వచ్చాయో తెలియజేశారు. విషయాన్ని ప్రతిపాదించడంలో సమర్థత, ముందుచూపు, ప్రయోజనం ఉన్నాయి. ఎన్నో జాతులు, మతాలు కలసి జీవితంపై సామాన్య ఆధ్యాత్మిక దృష్టికి అభి వృద్ధిపరచడంలో తోడ్పడ్డాయని ఆయన వాదన.

"భారత దేశ సాంస్కృతిక చరిత్ర అనేక వేల సంవత్సరాలకు చెందింది. బలమైన దారాలు ఈ సమైక్యతను కాపాడాయి. అది వైవిధ్యం గల దేశ సంస్కృతి కంతటికీ వ్యాపించింది. ఈ సంస్కృతి అధికార వర్గాల ఒత్తిడుల మూలంగా ఏర్పడింది కాదు. జ్ఞానుల దూరదృష్టి వల్లను, ఋషుల జాగరూకత, తత్వశా స్త్రజ్ఞుల మీమాంసల వల్లను, కవుల, కళాకారుల ఊహల్లోను పెరిగింది. ఈ సాధనాల మూలంగా జాతీయ సమైక్యత విస్తృతమై, పటిష్టమై, శాశ్వతమైంది." మన ప్రభుత్వం మత ప్రాధాన్యం లేనిది. మన సంస్కృతి ఆధ్యాత్మిక విలువ లతో నిండినది. ఇది ఆశ్చర్యం ఏమీ కాదు. లౌకికవాదమంటే మత సంబంధం లేదని కాదు. నాస్తికవాద సంబంధీ కాదు. భౌతికానుభవాల ఒత్తిడితో నిండిందీ కాదు. సార్వజనీన ఆధ్యాత్మిక విలువలను, వాటికి అనేక విధాల సాధించవ చ్చనే విషయాన్ని తెలియజేస్తుంది.

మతం మారుతున్న అనుభవం. అది దైవ సిద్ధాంతం కాదు. ఆధ్యాత్మిక చైతన్యత. విశ్వాసం, నడవడిక, కర్మకాండలు, పండుగలు, హరవాదాలు తన్ను తాను తెలుసుకొనే కళకూ, దైవ సంబంధానిక లోబడ్డవే. వ్యక్తి అన్ని బాహిర్ సంఘటనల నుంచి తన ఆత్మను ఉపసంహరించుకొన్నప్పుడు, తన్ను తాను అంతరంలో కూడగట్టుకొని, దృష్టిని కేంద్రీకరించినప్పుడు లోలోపల తన సర్వస్వాన్ని కూడగట్టుకొంటాడు. అప్పుడతనికో అపురూపమైన, పవిత్ర మైన, ఆశ్చర్యకరమైన అనుభవం కలుగుతుంది. అతనిలో చైతన్యాన్ని

కలిగించి, అతని అస్తిత్వమౌతుంది. శాస్త్రానికి, హేతువుకు పుట్టిన బిడ్డ లైనా, ప్రధమమైన, నిగూఢమైన అనుభూతికి లోబడి తీరవలసిందే. ధర్మ శాస్త్రాలను నమ్మకపోవచ్చు, కాని సత్యాలను కాదనలేం. జీవితమనే అగ్ని, కన్పించే మంటల్లో పైకి వెళ్తుంది. అయితే పొగ తాగేవారు అగ్ని చుట్టూ కూర్చొని చేసే ఆలోచనల్లాగ కాదు. సాధించడమనేది సత్యం. సత్యం సిద్ధాంతం నుంచి గ్రహించేది. సత్యంతో సంబంధానికి, దానికి చెందిన అభిప్రాయానికి మధ్య అంతరం ఉంటుంది. దైవ మార్మికతకు, దైవ చింతనకు అంతరం ఉంది. ఇదే లౌకిక రాజ్యభావన. దీన్ని అర్థం చేసుకోవడం కష్టం.

భారతీయ సాంప్రదాయంతో ఈ దృక్పధానికి సామ్యం ఉంది. ఋగ్వేదం, వాస్తవమైంది ఒకటేనని చెప్తుంది. అయితే విద్యావంతులు దాన్ని వివిధమని చెప్తారు. అశోకుడు తన 12వ శిలాశాసనంలో ఇలా ప్రకటిస్తాడు. "ఎవరైతే తమ మతాన్ని గౌరవిస్తూనే ఇతరుల మతాన్ని చులకనగా చూస్తారో, తమ మతం ఎడల భక్తిభావంతో ఇతర మతాలకంటే తమ మతాన్ని కీర్తిస్తారో, వారు తమ మతానికి తప్పక హాని కల్గించినట్టే." సమావాయ యేవ సాధూ. శతాబ్దాల తర్వాత అక్బర్ యిలా అన్నాడు: "దేవుడు మన కర్పించిన దైవ సంబంధమైన కాణాచీయే వివిధ మత సమాజాలు. వాటిని మనం ప్రేమించాలి. ప్రతి మతానికీ భగవంతుని ఆశీస్సులున్నాయన్నది మన ప్రగాఢ విశ్వాసం కావాలి. ఎలాంటి విచక్షణా లేకుండా దేవుడు తన కరుణా కటాక్షాలను అందరిపై ప్రసరిస్తాడు." ఇదే, ఈ సిద్ధాంతాన్నే మన రాజ్యాంగ శాసనంలో పొందుపరచుకొన్నాం. తమ మతాలను గూర్చి మాట్లాడ్డానికి, మత పరమైన ఆచారాలను పాటించడానికి, కర్మకాండలను నిర్వహించడానికి, అవి మన నైతిక స్పృహకు విరుద్ధం కానంత వరకు పూర్తి స్వేచ్ఛ ఉంది. వివిధ మత సాంప్రదాయాలు ఏ ప్రాతిపదికపై సమంగా నిలిచి ఉన్నాయో మనం గుర్తిస్తాం. అందరికీ చెందిన ఈ ప్రాతిపదికకు ఆధారం శాశ్వతం కాగా, అందులో మనందరికీ హక్కు ఉంది. మౌలిక భావాల సార్వ జనీనతను గూర్చిన చారిత్రిక అధ్యయనాలు, తులనాత్మక మతం - ఇదే భవిష్యత్తుపై మనకున్న ఆశ. దాని మూలంగా మత సమైక్యత, అవగాహన కలుగుతాయి. చారిత్రకంగా మనం ఏ మతానికి చెందినవారమైనప్పటికీ, దేవుని అదృశ్య చర్చిలో మనమంతా సభ్యులమనే విషయం దీనివల్ల

తెలుస్తుంది.

డాక్టర్ అబీద్ హుస్సేన్, జాతీయ సమైక్యతను పటిష్ఠపరచడానికి కొన్ని సూచనలు చేశాడు. మనం వాటిని అంగీకరించినా, అంగీకరించ లేకున్నా, ఆలోచనా పరులైన భారతీయులు వాటిని తప్పక పరిశీలించాలి.

సర్వేపల్లి రాధాకృష్ణన్

2, కింగ్ ఎడ్వర్డ్ రోడ్, న్యూఢిల్లీ,
20, ఏప్రిల్, 1955

# పీఠిక

పదునెనిమిదో శతాబ్ది రెండవ దశలో అమెరికా స్వాతంత్ర్య ప్రజాస్వామ్య శక్తిగా పరిణమించడం, ఫ్రెంచి విప్లవానికి పరోక్షమైన కారణంగా చెప్పుకోవచ్చు. ఇది ఒక మహత్తర సంఘటన. చిన్న సెలయేరులా వున్న ఆధునిక ప్రజాస్వామ్యాన్ని, ఈ ఘటన శక్తివంతమైన జీవనదిగా మార్చింది. ప్రపంచంలో అనేక ప్రాంతాల్లో ప్రజాస్వామ్య భావనకున్న ఆధారాలు ఎండిపోతున్నప్పుడు భారతదేశ నూతన గణతంత్ర రాజ్య ఆవిష్కరణ ఒక గణనీయ ఘటన. ఇది స్వేచ్ఛా ప్రియులందరికీ ఆశాజనక సందేశాన్నందిస్తున్నది. అయితే ఈ ఆశలో తొంగిచూసే భయం లేకపోలేదు. మిగిలిన కొన్ని ఆసియా రాజ్యాల్లోలాగే భారతదేశంలో ప్రజాస్వామ్యాన్ని ప్రవేశపెట్టడం అపరిపక్వ చర్యగావచ్చు.

వివిధ ఆసియా దేశాల్లో ప్రజాస్వామ్యం సక్రమంగా వేళ్లూనలేక పోవడానికి మూడు ముఖ్య కారణాలున్నాయి. కొన్ని దేశాల్లో జాతీయ వ్యవస్థ, చారిత్రిక సాంప్రదాయం రెండూ కలసి, అననుకూలమైన వాతావరణాన్ని కలిగించటం; మరికొన్ని దేశాల్లో ప్రజలకు కనీస విద్య, రాజకీయ చైతన్యం కొరవడ్డం. ఒకటి, రెండు రాజ్యాల్లో బహిర్గత ప్రజాస్వామ్య వ్యతిరేక శక్తులు ప్రతిబంధక ప్రభావాన్ని చూపడం. అదృష్టవశాత్తూ, భారతదేశంలో ఈ అడ్డంకులేవీ ప్రజాస్వామ్య ప్రయోగానికి హానికరం కాలేదు. భారతీయ మేధకు, ప్రజాస్వామ్య ప్రయోగం కొత్తకాదు. ప్రాచీన భారతదేశంలో ఈనాటి ప్రాతినిధ్య ప్రభుత్వం అంటే వివరంగా తెలియక పోయినా గ్రామీణస్థాయిలో ప్రాథమిక ప్రజాస్వామ్యం అమల్లో ఉండేది. చదవను రాయను, రాని ప్రజలు ఎంతో మంది, ఆచరణలో మంచితనాన్ని అర్థం చేసుకోగలవారు, జన్మతః సామాజిక స్ఫూర్తిగల వారుండడమే ప్రజాస్వామ్యానికి మూలాధారం. స్వతంత్ర భారత దేశంలో జరిగిన మొదటి సార్వత్రిక ఎన్నికల్లో ఇది రుజువైంది. మానవ జాతి చరిత్రలోనే ఈ ఎన్నికలు చాలా పెద్దవి. బాహ్య ప్రభావాల

వరకూ ప్రజాస్వామ్యానికి అనుకూలాలే. బాహ్య విషయాలను గమనించే పరిశీలకుని కంటె, ఎక్కువగా మన నూతన ప్రజాస్వామ్యానికి ప్రమాదాన్ని కలిగించేదొక్కటుంది. భారత జాతీయత, జాతీయ సంస్కృతి చాలా సున్నితమైన సమతూకంలో ఏకత్వంలో భిన్నత్వంగా ఉంది. సాంస్కృతిక సమస్యను తప్పు దోవ పట్టించి, ఈ సమతూకం కోల్పోతే అది భయంకరమైన క్షీణతకు దోహదంచేసి, ప్రజాస్వామ్యానికి స్వస్తిపలికి, శాంతి భద్రతలకు భంగం కలిగి, మనం కష్టపడి సాధించుకొన్న స్వాతంత్ర్యానికి దెబ్బ తగులుతుంది. అది బాహ్య, అంతర్గత నియంతృత్వ పాలనకు దారి తీసే అవకాశముంది.

ఈ గ్రంథ ఉద్దేశం, ఈ ప్రధాన సమస్యను వీలున్నంతలో చర్చించడం, వస్తుపరత దృష్ట్యా పరిశీలించడం. గత అభివృద్ధిని అధ్యయనం చేసి, ప్రస్తుత భారత జాతీయతా భావాన్ని, జాతీయ సంస్కృతిని తెలుసుకొని, వాటి నిజాయితీని కాపాడ గలిగిన, పటిష్టవంతం చేయగల విధానాలను, సాధనాలను గూర్చి ఆలోచించడం. ఈ గ్రంథం మొదట ఉర్దూ భాషలో రాసినప్పుడు భారతదేశం రెండుగా విభజింపబడలేదన్న విషయం ఇక్కడ చెప్పాల్సి ఉంది. అందువల్ల నా చర్చ పరిధి మొత్తం అవిభాజ్య భారతదేశానికి సంబంధించింది. దేశ విభజనకు ప్రధాన కారణం సాంస్కృతిక వేర్పాటుశక్తులు. మొదట్లో నేను చూపిన హానికరమైన అంశాలు వాస్తవాలు కాగా రెండో అంశం, నా చర్చ అంతా భారతదేశం, అంటే అవిభాజ్యమైన భారతదేశం, సాంస్కృతిక వారసత్వానికి సంబంధించినది. అయితే నేను దృఢీకరించేదేమంటే విస్తృతార్థంలో సాంస్కృతికంగా ఉపఖండమంతా ఒక్కటే. ఉన్న రెండు భాగాలు ఒక దాంతో ఒకటి పెనవేసుకున్నాయి. ఒకే రకమైన చరిత్ర, భౌగోళిక పరిస్థితులు కలవి మాత్రమే కాదు. వేయికి పైబడ్డ అంతర్గత సంబంధాలున్నాయి. పూర్తిగా ఒకదానికొకటి శత్రుత్వంగా ఉండడమనేది ఎక్కువ కాలం ఉండదు. అమెరికా, కెనడాల్లో లాగా సమ్మేళనాలు మారచ్చు లేదా ఒకవేళ కెనడా రెండు భాగాలుగా సమాఖ్య రాజ్యం కాకపోవచ్చు.

ఏ విధమైన వ్యక్తిగత, ఇతరత్రా చికాకులు లేకుండా, భౌతికంగా ఉత్సాహంగా, మానసికంగా ఉత్తేజకరమైన వాతావరణంలో జర్మనీలోని ట్యూబిన్జన్ పట్టణంలో ఉండి ఈ గ్రంథాన్ని రాయడానికి సహాయపడ్డ రాక్

ఫెల్లర్ ఫౌండేషన్‌కు నా గాఢమైన కృతజ్ఞతను తెలియజెయ్యాలి. టైపులిపిలో తప్పులు దిద్దిన డాక్టర్ తారాచంద్‌గారికి నా కృతజ్ఞతలు. ఆయన గ్రంథాన్ని మెరుగుపరచడానికి ఎన్నో సూచనలిచ్చారు. ముందుమాట రాసినందుకు డాక్టర్ రాధాకృష్ణన్‌గారికి నా కృతజ్ఞతలు.

**ఎస్. ఆబిద్ హుస్సేన్**

జామియానగర్,

మే, 1956

# రెండవ ముద్రణకు పీఠిక

ఈ గ్రంథ మొదటి ప్రచురణ, ఉర్దూలో 1946లో ప్రకటించిన మూడు సంపుటాలకు సంక్షిప్తరూపం. ఎక్కువగా ఉన్న అధ్యాయాలు కుదించ బడి, మొదటి సంపుటంలో సగానికంటే తగ్గించబడింది.

ఐతే, ప్రాచీన యుగాన్ని గూర్చిన అధ్యాయం, మధ్య, ఆధునిక యుగాల గురించి చర్చించిన దానికంటే పరిమాణంలో చాల తక్కువగా వుంది కాబట్టి, మొదటి ప్రచురణను, రెండో ముద్రణకోసం పరిష్కరిస్తున్నపుడు, అందులోని రెండో అధ్యాయాన్ని ఆరు అధ్యాయాలుగా విస్తరింపచేశాం (రెండు నుండి ఏడవ అధ్యాయం వరకు). ఆఖరి అధ్యాయం పూర్తిగా మార్చబడింది మన జాతీయ ఐక్యత, స్వాతంత్ర్యాలను కాపాడుకొనేందుకు అవసరమైన నూతన సాంస్కృతిక సమన్వయాన్ని సాధించే ముందు మనం ఎదుర్కొంటున్న సమస్యల సమగ్రదృష్టి అవసరమనే భావనతో ఈ మార్పు చేశాం.

ఎస్. ఆబిద్ హుస్సేన్

# మూడవ ముద్రణకు పీఠిక*

నేషనల్ బుక్ ట్రస్ట్‌వారు ప్రచురిస్తున్న ఈ ముద్రణ కోసం ముందు ప్రచురితమైన రెండో ముద్రణను, వాస్తవాలకు సంబంధించిన వివరాల గూర్చి ఇప్పటి వరకు పరిష్కరించి మార్చాం. రాజకీయ, సాంఘిక, విద్యా రంగాల్లో గత ఇరవై సంవత్సరాల్లో జరిగిన విషయాలను నిశితంగా పరిశీలించడం ద్వారా నా భావాల్లో వచ్చిన మార్పులు కూడా ఇందులో చోటు చేసుకున్నాయి

ఎస్. అబిద్ హుస్సేన్

* నేబుట్ర మొదటి ముద్రణ

# విషయ సూచిక

# ఉపోద్ఘాతం

శాస్త్రీయ చర్చలో చాలా ప్రయాసకరమైన పని నిర్వచనం. ముఖ్యంగా మూర్త విషయానికి చెందిన పదాలైతే మరీ కష్టం. సాధారణ భావనను కనుక్కోడం చాలా మందికి కష్టం. కేవలం, హేతుబద్ధంగా తమకు వీలైనంత వరకు ఆలోచిస్తారే కాని, అనిర్ధీత లక్ష్యాలనెన్నిటినో దృష్టిలో పెట్టుకొని, సమగ్రంగా చూడ్డం కష్టం. ప్రాచీన ఎతీనియన్ దేశస్థులు సోక్రటీస్‌ను ఏమి చేయలేకపోయారు. ఆయన ప్రతి ఒక్కరిని మూర్త విషయాలైన న్యాయం, మిత వర్తనం, ప్రేమ అనే అంశాలను నిర్వచించమన్నాడు. వాళ్లు ప్రయత్నించిన నిర్వచనాలనన్నింటిని చీల్చి ముక్కలు చేశాడు. అయితే శాస్త్రీయ సమస్యలను పేర్కొన్నప్పుడు నిర్వచనాలు తప్పని సరి. మీరు, నేను, చర్చలోకి దిగితే, మనం ఏం మాట్లాడుతున్నామో తెలియక ఒకర్నొకరం వ్యతిరేకించుకుంటాం. ఇది సాధారణంగా జరిగేదే. సోక్రటీస్ హాస్యానికి బలైనట్లే, ఒకరికొకరు బలౌతుండడం సహజం. మనం చర్చ ప్రారంభించక ముందే "జాతి", "సంస్కృతి" అనే పదాలను గూర్చి స్పష్టంగా తెలుసుకోవడం న్యాయం. రెండు పదాల మీదనే ఈ పుస్తకం ఆధారపడి ఉంది.

మొట్టమొదటి ప్రజలు, "సంస్కృతి"కి ఏ అర్థం యిచ్చారో చూద్దాం. ఈ పదం విరివిగా వాడిన పద్ధతి మంచి అభిరుచిని, సంస్కారం, మర్యాద, మన్ననలను తెలియజేస్తుంది. అయితే, ఇది భౌతిక పరమైన మంచి అభిరుచిని, సంస్కారవంతమైన మర్యాదలను రూఢి పరుస్తుంది. మొగలాయిల కాలం నాటి భవనాలను, ఉద్యానవనాలను, చిత్రలేఖనాన్ని, ఆనాటి మొగలుల సంస్కృతీ చిహ్నాలుగా మనం పేర్కొంటాం. అంతేగాక, సమిష్టి సంస్థలు, న్యాయ స్మృతులు, పద్ధతులను కూడా సాంస్కృతిక లక్ష్యాలుగా పేర్కొంటాం. గ్రీకుల రాజకీయ, విద్యా విధానం కాని, రోమన్ల న్యాయశాస్త్ర క్రోడీకరణం గాని, వారి వారి సంస్కృతులకు ప్రధానమైన అంశాలుగా పేర్కొంటాం.

చివరగా, సంస్కృతి అంటే ఇంకా సాధారణ, మూర్త్యర్థముంది. అంతిమ లక్ష్యాల పద్ధతి లేక జీవన సరళికి సంబంధించింది. తూర్పు దేశాల సంస్కృతి, పశ్చిమ దేశాల సంస్కృతి కన్నా ఎక్కువ ఆధ్యాత్మిక పర మైందని, ప్రజలు వివాదాస్పదంగా నొక్కి వక్కాణిస్తే, అది కేవలం మామూలుగా, మూర్త్యార్థంలో వాడినట్లు భావించాలి. ఇవన్నీ ఒకే రకమైన అంశాలకు, ఒకే రకమైన మనుగడ పద్ధతులకు ప్రాతినిధ్యం వహిస్తాయన్న విషయం గ్రహించాలి.

"మనుగడ పద్ధతులు" అనే పదాన్ని వివరించాలి. భౌతిక, మానసిక సంబంధమైన మనుగడ పద్ధతులు, రెండూ మనందరకూ తెలుసు. కన్పించే నా శరీరాన్ని, బాహ్యేంద్రియాల ద్వారా నేను కాని, మిగతా వారు కాని తెలుసుకోగల్గుతున్నారు. దీనికి కారణం భౌతిక పరమైన మనుగడయే. నా ఆలోచనలు, స్పందనలు, నాకు మాత్రమే ప్రత్యక్షంగా తెలుస్తాయి. అవి మానసికమైనవి. కాని తత్వవేత్తలు ఇంకో రకమైన మనుగడ పద్ధతులను సూచిస్తారు. అవి మనకు తెలియవు. ఏ భావాలు, నమ్మకాలు, సిద్ధాంతాలు, ఒకే వ్యక్తికి పరిమితం కాక ఎంతో మంది కలసి భాగస్వామ్యం వహిస్తారో, ఆ సమిష్టి సంస్థలను ఒక తరం నుంచి ఇంకో తరానికి అందజేస్తారు. అవే మతం, నైతికత, చట్టం, కళ, రాజ్యం; వాటికి వైయక్తిక దృష్టి, లేక, తాత్కాలిక దృష్టి ఉండవు. శాశ్వత లక్ష్యం కోసం ఏర్పడ్డది. అంటే వస్తు పరతతో కూడిన మానసిక మనుగడ కలవిగా భావించవచ్చు. ఆదర్శవంతమైన మనుగడలో మనుగడ కలవిగా భావించవచ్చు. ఆదర్శవంతమైన మనుగడలో నాల్గో పద్ధతిలో పరిపూర్ణత కోసం రూపొందించినవి. అంటే, అంతిమ నైతిక విలువలకు సంబంధించినవి. వాటిని బట్టి ప్రతి లక్ష్యం, క్రియ, జీవిత సూత్రాలను, జీవితాన్ని కూడా నిర్ణయిస్తాం. అత్యున్నతమైన ఐదో పద్ధతి నిరపేక్షమైన మనుగడకు సంబంధించింది. దాన్నే, మతం దేవుడంటుంది. వీటిల్లో మనకు ఆసక్తికరమైందీ, సంస్కృతి అంటే నిర్వచనం ఏర్పర్చ గలిగింది, ఆదర్శవంతమైన మనుగడ. దాన్ని విపులంగా పరిశీలించాల్సి ఉంది.

మనుగడ అనే భావనలో ఆది భౌతిక సిద్ధాంతాలు ఒక దాంతొ నొకటి భేదిస్తాయి. కొంత మంది తత్వ శాస్త్రజ్ఞులకు భౌతిక పదార్థం ముఖ్యం. ఇతరుల కది అప్రధానమైన సారాంశం. దాన్నే వాళ్లు ఆత్మ లేక

మనస్సు అంటారు. అదొక్కటే ప్రధానమైన అస్థిత్వం. ప్రపంచంలో అది విభిన్న వస్తువులలో ప్రతిబింబిస్తుంది. దీనిని ప్రపంచమంటాం. మనుగడ స్థాయిల్లో తేడాలను మననం చేయాల్సి ఉంటుంది. అవి ప్రత్యేకమైనవి కాక పోయినా వాటిని గమనించాలి. ఈ భావనలో కొద్దో గొప్పో, దృగ్గో చరం కాని విలువలుంటాయి. వాటికి శాశ్వతత్వం ఉంటుంది. వస్తుపరత అన్నది తత్వ శాస్త్రజ్ఞుల్లో ఎక్కువ. దాన్నే మనం ప్రపంచమంటాం. వాస్త విక స్వభావానికి, అంతిమ నైతిక విలువల పరిస్థితికి ఎంతో తేడా ఉండక తప్పదు. అయితే మనకు దాంతో పనిలేదు. మనకు సంబంధించిందే మంటే, ఆలోచనా పరులంతా అంతిమ ప్రమాణాలను గుర్తించడమే. వాటిలో ఏ ఒక్కటైనా ప్రతి నైతిక క్రియకు లక్ష్యమనీ, ప్రతి నైతిక నిర్ణయానికి మూలమనే విషయం స్పష్టం.

ప్రస్తుతం, సంస్కృతికి ఇంతకు ముందే ఇచ్చిన నాలుగు అర్థాలను గమనిస్తే, సంస్కృతి అనే భావన అంతిమ విలువలకు సంబంధించినదనే విషయం తెలుస్తుంది. సంస్కృతిని సాధారణంగా వివరించే పద్ధతి ఇది: "ఒక సమాజం అంతిమ విలువలను గూర్చిన జ్ఞానం గలిగి ఆ విలువల ప్రకారం జీవితాన్ని మలచుకోడానికి ఉపయోగించేది."

ఈ ప్రాథమిక వివరణ సంస్కృతికి సంబంధించిన ఆదర్శాంశాన్ని వివ రిస్తుంది. ప్రస్తుత సమిష్టి సంశ్లిష్టాలే (రాజ్యం, సమాజం, కళ, విజ్ఞాన శాస్త్రం) అంతిమ విలువల కోసం ప్రయత్నించే శాశ్వత ఫలితాలు. వీటినే, వస్తు పరతతో కూడిన మానసిక అంశమనీ, వ్యక్తుల గుణగణాలు, దృక్ప ధాలుగా భావించవచ్చు. వాటికి సంబంధించిన 'నా' అనే అంశం, భౌతిక లక్ష్యాలే భవనాలు, చిత్ర లేఖనాలు మొదలైనవి. ఈ విలువలను ప్రతిబిం బించేవే భౌతిక అంశంగా పేర్కొనవచ్చు.

ప్రాథమిక చర్చ తరవాత, సంస్కృతిని గురించి నిర్వచించడం, ఇంతకు ముందు కన్నా చాలా సులభం. ఇప్పుడు చెప్పుకోవచ్చు - "సంస్కృతి" అంతిమ విలువలకు సంబంధించిందని. ఒక ప్రత్యేక సమాజానికి, దాని సమిష్టి సంస్థలకు సంబంధించిందని. అందులో సభ్యులైన వ్యక్తుల స్వభావాల్లో, భావాల్లో, దృక్పధాల్లో, పద్ధతుల్లో తేడా ఉంటుందని, అట్లే ప్రాముఖ్యం గల విభా గాల్లో అంటే వాళ్ల పద్ధతుల్లో భౌతిక విషయాలకిచ్చే ప్రాముఖ్యంలో మార్పు ఉంటుందని. ఈ నిర్వచనం సోక్రటీస్‌కు అడ్డు సవాలుగా నిలవదు. అయితే,

ఈ "సంస్కృతి"ని ఎన్ని అర్థాల్లో ఉపయోగించడం జరిగిందో, దాన్ని గూర్చిన సమగ్రమైన భావాన్నిస్తుంది. ఈ భావన స్పష్టం చెయ్యడానికి దాన్ని వేర్వేరు చేయడానికి, రెండు సన్నిహితమైన భావనలను తీసుకు రావాలి. అవే మతం, నాగరికత.

మతం విస్తృతార్థంలో ఏకీభవిస్తుంది. సంస్కృతిని దాటి పోతుంది. సంకుచితార్థంలో సంస్కృతిలో ముఖ్యమైన భాగం అవుతుంది. మతం అంతర్గత అనుభవాన్ని తెలుపుతుంది. మనస్సుకు నిజమైన అర్థాన్ని, జీవిత పరమార్థాన్ని తెలియజేస్తుంది. అదే సంస్కృతికి ప్రధానమైంది. అది బాహ్య పద్ధతికి సంబంధించింది. అందులో అంతర్గత అనుభవం స్పష్టమౌతుంది. అది ఒక భాగం మాత్రమే. మతం అత్యున్నత సత్యాన్ని సాధించేది కాబట్టి, సంస్కృతికి వ్యతిరేకం కాదు. అయితే రూఢియైన మతం విషయం లేక కేవలం పద్ధతికి మాత్రమే దిగజారితే, చాలా మటుకు సాంస్కృతిక జీవితంతో ఘర్షణ పడుతుంది.

నాగరికతను, సంస్కృతికి పర్యాయ పదంగా వాడతారు. అయితే అది సాధారణంగా అత్యున్నతస్థాయిలో ఉన్న సంస్కృతికి సంబంధించినంత వరకు మాత్రమే. నాగరికత అనే స్థాయిలోనే, సాంస్కృతిక అభివృద్ధి కొన సాగుతుంది. పట్టణాల్లో నివసించడం, భౌతిక జీవితంలో అత్యున్నత స్థాయి లేక అధికతరమైన జీవన ప్రమాణాన్ని పొందడం. భౌతిక జీవితంలో అత్యున్నతమైన ప్రమాణికత చేకూరడానికి సాంస్కృతిక అంశం ఉంటుంది. అది అందులో కలసిపోయినప్పుడు లేక అంతిమ నైతిక విలువలను సాధించడానికి ఒక సాధనమైనప్పుడు మాత్రమే విలువైంది. ఏ జీవితం నైతిక విలువలతో సంఘర్షణపడ్తుందో లేక అటువంటి విలువలు లేనప్పుడు సాంస్కృతిక అభివృద్ధి అడ్డుపడుతుందని ఋజువౌతుంది. అందువల్ల నాగరికత అనేది మైత్రి మాత్రమే కాక, సంస్కృతికి ఒక్కొక్కప్పుడు శత్రువు అవుతుంది. చరిత్రలో ఎన్నో ఉదాహరణలున్నాయి. వాటి మూలంగా దిగజారిపోతున్న పాత నాగరకత అస్తమించి, నిజమైన సంస్కృతి కొత్తపుంతలు తొక్కుతుంది.

## II

సంస్కృతి మానవ సముదాయంలో జీవిస్తుంది. దాన్ని సమాజమంటాం. ఏ సమాజానికి రాజకీయ, సాంస్కృతిక సమైక్యత ఉంటుందో, ఆ సమా

జాన్ని జాతీయ రాజ్యమని పేర్కొంటాం. జాతీయ రాజ్యమంటే మనం ఇంకా సంక్షిప్తమైన భావాన్ని ఇవ్వాల్సి ఉంటుంది.

రాజకీయ భావనగా జాతీయత కొత్తదేమీ కాదు. ఆధునిక ఐరోపా దేశంలో నూతన అర్థాన్ని పుణికిపుచ్చుకొంది. రాజ్యం ప్రజలందరినీ ఒక తాటి మీద నడపడానికి ఏర్పడ్డ సముదాయం. రాజ్యంతోపాటే మతం, జాతి, సంస్కృతి మొదలగు శక్తులుంటాయి. ఐరోపాలో ప్రజా మనస్సులపై మత ప్రభావం తొలగిన తరువాత, అంతకుముందు ప్రజలందరినీ నడిపించిన మతం, దాని ప్రాముఖ్యాన్ని కోల్పోయింది. రాజ్యమే వాస్తవికమైన సమైక్యతా కారకంగా, జాతీయతా భావనకు ప్రధానమైన అంశంగా ఏర్పడింది. రాజ్యంలోని పౌరులందరూ ఒక్కటే, వీరిని సమైక్యపరచటంలో రాజ్యమే శక్తివంతమైన సాధనం.

జాతీయత అనే భావనలో, మానవ సముదాయం ఒకే రాజకీయ వ్యవస్థ కింద ఒకే రాజ్యంలో నివసించడం. అయితే ఇది సంపూర్ణమైన నిర్వచనం కాదు. వివిధ సముదాయాలకు చెందిన ప్రజలు, చారిత్రక కారణాలవల్ల గానీ, పరిస్థితుల ప్రాబల్యం వల్లగానీ ఒకే రాజ్యంలో నివసిస్తే, దాన్ని జాతీయతగా పేర్కొనడం సమంజసం కాదు. వాస్తవానికి ఒక రాజకీయ వ్యవస్థను, ఏదో రూపంలో అంగీకరించిన ప్రజలు కలిసి నివసించడమే ఆధునిక జాతీయతా భావానికి ఆధారం. అందువల్ల జాతీయ రాజ్యమంటే స్వేచ్ఛగా ప్రజా సముదాయాలు నివసించడం లేక ఒకే రాజ్యంలో రాజకీయ వ్యవస్థ కింద నివసించడం. ఈ నిర్వచనంలో జాతీయతకు రెండు ముఖ్యమైన షరతులున్నాయి. ఈనాడు మనుగడలోనున్న దేశాలన్నిటిలోని ముఖ్య లక్షణాలను పరిశీలిస్తే జాతీయ రాజ్యం ఏర్పడటానికి ముందున్న షరతులుగా వాటిని భావించవచ్చు.

ఆదర్శవంతమైన జాతీయ రాజ్యం ఏర్పడటానికి ముందు యీ షరతులు ఉండాలి. భౌగోళిక ప్రదేశంలో నివాసం, జాతి (race) సమైక్యత, మతం, భాష, సామాన్య చరిత్ర అనేవి ఉండాలి. ఈ లక్షణాలన్నీ ఉన్న మానవ సముదాయం జాతీయ రాజ్యమవుతుంది. వీరిలో జాతీయతాభావం దృఢమైంది. ఎక్కువకాలం నిలుస్తుంది. ప్రపంచంలో ఏ దేశంలో కూడా ఈ లక్షణాలన్నీ కలిగిన జాతీయ రాజ్యం, కనీసం పశ్చిమ దేశాల్లో కూడా లేదు. మొట్టమొదట జాతిని (race) గురించి చూద్దాం. ప్రపంచంలో జాతులు

సమ్మిశ్రితమైనాయని మానవ శాస్త్రజ్ఞులు తెల్పుతున్నారు. ఈ జాతి సాంకర్యం పశ్చిమ దేశాల్లో ఎక్కువ. ఏ దేశంలోనైనా, ఏ జాతిలోనైనా, తామంతా ఒకే పవిత్రమైన జాతికి సంబంధించిన వారమని చెప్పుకోవడం మిథ్య మాత్రమే. మతం విషయంలో కూడా దీన్ని గమనించవచ్చు. ఏవో కొన్ని అల్ప సంఖ్యాక జాతుల్లో రాజకీయ సమైక్యత ఉంటుంది. ప్రతి జాతీయ రాజ్యంలో, విభిన్నమైన ఒప్పందాలు, నమ్మకాలు సమ్మిశ్రితమై ఉంటా యనే విషయాన్ని గమనించవచ్చు. కొంతమందికి ఏ నమ్మకమూ, అంగీ కారమూ కూడా లేకుండా ఉండవచ్చు. చాలా దేశాల్లో భౌగోళిక, సాంస్కృ తిక, భాషా సంబంధమైన సమైక్యత, సామాన్యమైన చరిత్ర లక్షణాలుగా ఉండవచ్చు. స్విట్జర్లాండ్, కెనడా మొదలైన దేశాల్లో అధిక సంఖ్యాక భాషలున్నాయి. అమెరికాలాంటి దేశంలో విభిన్న జాతులు, సంస్కృతులు ఉన్నాయే కాని సామాన్య చరిత్ర లేదు. ఒకే భాష మాట్లాడుతూ, అందరూ కలిసి మెలసి ఒకే ప్రదేశంలో నివసించడమే దీని లక్షణం. జాతీయ రాజ్యాలు ఏర్పడ్డ పరిస్థితులను అధ్యయనం చేస్తే, భౌగోళిక సమైక్యత, సామాన్య సాంస్కృతిక జీవితంలో సమైక్యత జాతీయతకు సమానమైన లక్షణాలని తెలుస్తున్నది. జాతుల సమైక్యత, మతం, భాష ఒకే రకమైన చరిత్ర యివి చాలా ప్రధానమైనవే కాని యివి లేకుంటే జరగదనేది లేదు.

ఈ చర్చ ముగించేటప్పుడు కొన్ని అంశాలను గుర్తించాలి. ఒక భౌగో ళిక ప్రదేశంలో నివసించే ప్రజలకు, సామాన్య సాంస్కృతిక సమైక్యత ఉండాలి. ఇవి జాతీయ భావానికి కనీస లక్షణాలు. అయితే, జాతీయ రాజ్యమేర్పడా లంటే ఒక ప్రత్యేకమైన రాజకీయ వ్యవస్థ అవసరం. ప్రస్తుతం ఎన్నో అధికత రమైన కారకాలు అందరికీ సమానంగా ఉండవచ్చు. భాష, జాతి, మతం, చరిత్ర ఎంత దృఢంగా ఉంటే జాతీయతాభావం అంత ధృఢతరమౌతుంది. చాలాకాలంగా, రాజకీయ సమాజంగా ఏర్పడి పై జెప్పిన అధికతర కారకా లతో సహజసిద్ధంగా రాజ్యంగా ఏర్పడుతుంది. ఉదాహరణకు, అమెరికా దేశం రాజ్యంగా ఏర్పడ్డప్పుడు వారికి ఒకే రకమైన చరిత్రలేదు. మూడున్నర శతా బ్దాలు సన్నిహితంగా కలిసి ఉన్న తరువాత, ప్రాచీన ఐరోపా రాజ్యాల్లాగే జాతీ యతా భావం వీరిలో కూడా ఏర్పడింది. అట్లే భావ సమైక్యత గ్రేట్ బ్రిటన్‌లో గాని, ఫ్రాన్స్‌లోగాని జాతీయ రాజ్యాలు ఏర్పడినప్పుడు లేదు. కాలక్ర మేణా యీ భావం అభివృద్ధి చెందింది. అప్పుడప్పుడూ బలవంతంగా

రుద్దడం వల్ల కూడా కొన్ని సామాన్య కారకాలు ఏర్పడవచ్చు. 16, 17 శతాబ్దాల్లో ఐరోపా రాజ్యాల పాలకులు, మత నమ్మకాల విషయంలో ఏకతాభావాన్ని వాళ్ళ ప్రజల్లో ఏర్పరచాలని ప్రయత్నించారు. ఇటువంటి ప్రయత్నాలు సాధారణంగా విజయవంతం కావు. ఎన్నో విపత్కర పరిణామాలకు దారితీస్తాయి.

## III

ప్రస్తుతం భారతదేశంలో జాతీయ రాజ్య పుట్టుకకు ఏ షరతులు కారణమైనాయి? పై చెప్పిన కారణాలలో కాలక్రమేణా ఏ కారణాలు ఏర్పడ్డాయి?

మొట్టమొదటి ప్రధానమైన షరతు భారతదేశంలో భౌగోళిక సమైక్యత. ఈ లక్షణం చాలా దేశాల్లో ఉండకపోవచ్చు. దేశపటం వైపు ఒక్కసారి పరికిస్తే, ఉత్తర హిందూ స్థానంలో దుర్గమమైన పర్వతాలు, దక్షిణాన సముద్రం, నైరుతి, ఈశాన్య దిక్కుల్లో సహజసిద్ధమైన ఎల్లలు ఉన్నాయి. వాయవ్య, ఈశాన్య ప్రాంతాల్లో కృత్రిమంగా ఏర్పడ్డ ఎల్లలు భారత, పాకిస్తాన్‌ల విభాగాలుగా ఉన్నాయి. ఈ సహజసిద్ధమైన ఎల్లలు తక్కువైనవేమీ కాదు. ప్రకృతే యీ మొత్తం ప్రాంతాన్ని 'దేశం' అనే భౌగోళికపదంగా ఏర్పరిచినట్లు ఉదాహరణ కన్పిస్తున్నది. అంతేకాక, విభజితం కాని భారతదేశం స్వయం సమృద్ధికల ఆర్థిక విభాగంగా ఉండింది. విభజన తరువాత కూడా, సమతుల్యమైన ఆర్థిక విధానంతో, ప్రకృతిసిద్ధమైన వనరులతో ఒప్పారుతూ ఉంది. ఐతే వాటిని అభివృద్ధిపరచాల్సిన అవసరమెంతైనా ఉంది.

భౌగోళిక, ఆర్థిక సమైక్యత ఉన్నంత మేరకు, కొంతవరకు ప్రకృతిసిద్ధమైన సాంస్కృతిక సమైక్యత ఉందనే భావించాలి. సాంస్కృతిక జీవన విధానాన్ని మలచడానికి భౌతిక, ఆర్థిక అంశాలు ప్రధానమైనవి. ఇవి మాత్రమే చాలవు. భారత దేశ సాంస్కృతిక చరిత్రను చూసినప్పుడు, ఎన్నో భేదాలున్నా, ఆలోచనా సరళిలో, భావనలో, జీవన విధానంలో మౌలికమైన సమైక్యతాభావం ఉంది. మారుతున్న రాజకీయ పరిస్థితులకనుగుణంగా, కాస్తో, కూస్తో మారుతుంది. కాని పూర్తిగా మారదు. చాలాసార్లు, అనైక్యతా శక్తులు - బాహ్య, అంతర్గతమైనవి, భారతదేశ సమైక్యతను పెకిలించాలని ప్రయత్నిస్తే, భారతదేశంలోని మనమంతా ఒకటేనన్న భావం, వ్యతిరేక ధోర

ణులను, ఉద్యమాల జోరును తగ్గించి, నూతన, సామరస్యపూరిత సంస్కృతిగా మార్చగలిగింది. ఈనాడు సాంస్కృతికంగా గందరగోళ పరిస్థితుల్లో ఉన్నప్పుడు వేర్పాటు భావం పొడసూపినప్పటికీ సమైక్య సమైక్యత యింకా నిలిచే వుంది. ఈ వేర్పాటుభావం దేశంలో ఎక్కువైంది. దాన్ని పటిష్టమైన విధానాల ద్వారా ఆంతరంగిక చట్టాల ద్వారా నిర్మూలించాలి. సాంస్కృతిక సమైక్యతను భంగపరచిన ప్రధాన కారణం జాతీయ భాష. ఇది కొంత విభేదాన్ని తెచ్చింది. ఆఖరి అధ్యాయంలో మనం చూచినట్లు, భాషా సమస్యను అవగాహనతో, ఆలోచనతో గమనిస్తే సాంస్కృతిక సమైక్యత కోసం మనం పడే ఆరాటం తగ్గుతుంది. ఇది మన రక్తనాళాలలోనే వుంది. ప్రత్యేక ధోరణులను పోగొట్టుకొని, రాజకీయ సమైక్యతా పునాదులను బలపరచుకోగలుగుతాం.

అందరికీ ఒకే చరిత్ర వుండడం భారతదేశాన్ని సమైక్యపరచే ఒక బలమైన అంశం. వేల సంవత్సరాలుగా, ఇతర దేశాల నుంచి భారతదేశానికి వచ్చినవారంతా, భారతీయులతో కలసిమెలసి జీవించగలుగుతున్నారు. వీరిలో చివరగా వాయవ్య సరిహద్దు నుంచి వచ్చిన ముస్లింలు దాదాపు 8 లేక 12వ శతాబ్దాల కాలం నుంచి మన దేశంలో ఉంటున్నారు. మొదట్లో వాళ్ళ జీవిత కథనం వేరుగా ఉన్నా, దాదాపు స్వాతంత్ర్యానికి పూర్వం 200 సంవత్సరాల నుంచి ఇతరులతో సమానంగా జీవిస్తున్నారు. వాళ్ళు కూడా ఒక రకమైన రాజకీయ, ఆర్థిక వత్తిడులకు, దోపిడీలకు అదే (ఆంగ్లేయ) విదేశ శక్తికి గురయ్యారు.

మనల్ని కలిపిన అంశాలను పరిశీలిస్తున్నప్పుడు మన దేశంలో ఏవి వేర్పాటు ధోరణులకు దారితీశాయి? ముఖ్యంగా జాతి (race), మతం అనే అంశాల గూర్చి పరిశీలించాలి.

మానవ సమాజ పరిణామ క్రమంలో, జాతి (race), సాంఘిక, సాంస్కృతిక సమైక్యతా భావానికి సంబంధించిన ప్రముఖపాత్ర వహించింది. వలసలు పోవడం, దండయాత్రలు, వలస విధానాలు వివిధ జాతులను కలుపుతాయి. ఒకదాన్నుంచి వేరొక దానికి మార్చడం వీలుకాదు. మానవ మనస్సు మూర్ఖుని మనుగడ నుంచి, నాగరిక జీవితం వైపుకు తిరిగితే, ఆ సమాజంలో నైతిక విలువలు రక్త మాంసాలకన్నా బలంగా ఉంటాయి. జాతి (race) తన ప్రాముఖ్యాన్ని కోల్పోతుంది. అయినప్పటికీ సాంస్కృతికంగా దిగజారు

తున్న కాలంలో, ప్రజల నమ్మకాలు, నైతిక విలువలు కదలిపోతాయి. అప్పుడు అది జాతి సంబంధమైన విగ్రహపూజగా మారుతుంది. దాదాపు తెగ జీవితంతో సమానమైన పరిస్థితి ఏర్పడుతుంది. స్వాతంత్ర్యోద్యమానికి ముందు, భారతదేశం అటువంటి దశలోనే పయనిస్తుండింది. దీనిమూలంగా కొత్తయుగం ప్రారంభమైంది. కులవ్యవస్థ శాఖోపశాఖలుగా, దృఢతరంగా, జటిలంగా పరిణమించింది. ప్రాచీన కాలంనాటి వర్ణాశ్రమ ధర్మమే సరళమైంది. ఈ కులతత్వం సాంఘిక, సాంస్కృతిక జీవితంపై ఆధిపత్యం వహిస్తున్నది. ముస్లింల్లో వాళ్ళ మతం ఇస్లాం పూర్వకాలం నాటి అరబ్బుల జాతి ఆరాధన కంటే భిన్నమైంది. ఇది కూడా తెగల విధానంగా దిగజారింది. స్థానిక, శాసనసభల ఎన్నికలప్పుడు ఇది తన స్వభావాన్ని చూపిస్తున్నది. చతుర్వేది లేక శ్రీవాత్సవ, గోష్‌లేక బోసు, అయ్యర్ లేక అయ్యంగార్, కురేషి లేక అన్సారీ 'తెగల' విధేయతకు ప్రధాన అంశాలు. వర్గం, పార్టీ, జాతి, దేశం, కొన్నిసార్లు మతం కూడా నిరుపయోగమే. విభాగిత విధేయత మాత్రం కొంతవరకు నిలిచి ఉంది. అయితే ఇది పోరాడుతూనే, క్రమేణా సమాజం పట్ల, పార్టీ పట్ల, దేశం పట్ల విధేయతలను పోగొట్టుకొంటున్నది.

జాతితోటే, మతానికి కూడా విభజన శక్తి అనే చెడ్డపేరు వచ్చింది. భారతదేశంలో రెండు పెద్ద సమానజాతుల మధ్య ఘర్షణలు తలెత్తడం, హిందువులు, ముస్లింలు భారతదేశ విభజనకు మూల కారకులు కావడం. సమకాలీన చరిత్రను నిష్పాక్షిక అధ్యయనం చేస్తే, మనకు తెలిసేదేమంటే మత భావనే కాక మతంలో కొన్ని విజాతీయమైన అంశాలు చేరాయి. ప్రభావ వర్గాలు తమ స్వప్రయోజనం కోసం, ప్రత్యేక ఉద్యమం ప్రారంభించాయి. ఫలితంగా దేశ విభజన జరిగింది. మత స్వచ్ఛతను చూస్తే, హిందువులు, ముస్లింల ఆధ్యాత్మిక అనుభవంలో మౌలికమైన సామరస్యం ఉంది. మతంలో నిగూఢమైన స్థాయిలో - అంధ విశ్వాసం, కర్మకాండ, మత శాసనం - వీటన్నింటిలో వ్యత్యాసం ఉంది. అదే ఈ సంఘర్షణకు ఎప్పుడూ దారితీస్తుంది. భారతదేశ స్వభావం ముస్లింలకు, హిందువులకు మానసిక వైశాల్యానికి, అద్భుతమైన సాంప్రదాయాలకు, యుద్ధ సన్నద్ధమయ్యే మత వ్యతిరేకత మధ్య యుగంలో ఐరోపాలో ఉండే సాధారణ ప్రాతిపదికగా ఉండేది. భారతదేశ చరిత్రలో ఇది అసాధారణమైంది.

గత 1000 సంవత్సరాల్లో, రెండు విరుద్ధమైన మతాలు - హిందూమతం, ఇస్లాం భారతదేశ భూమిపై ఒకటి అయ్యాయి. ఋషులు, సూఫీలు సహనం మాత్రమే కాక సామరస్యాన్ని ఏర్పర్చారు. హిందూ, ముస్లిం రాజులు అధికారం కోసం పోట్లాడుకుంటూంటే, రెండు మతాలకు చెందిన సామాన్యులు హాయిగా కలసి మెలసి జీవించారు. గత శతాబ్ది వరకు ఈ వాతావరణ పరిస్థితి కొనసాగింది. ఈ శతాబ్ది ప్రారంభంలోనే మతానికి సంబంధించిన ప్రేరణలు, ప్రయోజనాలు సామాన్య మానవునికి, మంత్రంలాగా హిందువు, ముస్లిం ఒకరికొకరు బద్ధశత్రువుల్లాగా అయ్యారు. ఇద్దరి మధ్య భారతదేశంలో పోట్లాటలకు, విభజనకు దారితీశాయి. (సజీవమైన శరీర అవయవాన్ని విభజించేందుకు అదే మాట సరైంది).

ఈ తగాదాలు మత విభేదాల వల్ల ఏర్పడలేదు. స్వప్రయోజనం కోసం కొన్ని పార్టీలు, ముఖ్యంగా మత సంబంధంకాని ప్రయోజనాల వల్ల ఏర్పడ్డాయి. మనకు స్పష్టమయ్యే అంశమేమంటే రాజకీయ ఆందోళన కాలంలో, ఆర్థిక వత్తిడి మూలంగా, మునిసిపల్, పార్లమెంటరీ ఎన్నిక సమయంలో, అదీ ముఖ్యంగా బ్రిటీష్ ప్రభుత్వంలో సన్నిహిత సంబంధం ఉన్నవారి వల్ల ఏర్పడింది. ఈ చర్చను ముగించేటప్పుడు, దేశీయతలో, మూడు పరిస్థితులున్నాయి. అవి భౌగోళిక సంబంధమైనవి, ఆర్థిక సమైక్యత, అందరికీ సమానమైన చరిత్ర. ప్రపంచంలోని ఇతర రాజ్యాలకంటే మిన్నగా ఈ మూడు లక్షణాలు మన దేశంలో ఉన్నాయి. సాంస్కృతిక విభాగంలో, స్థానిక, మత సంబంధమైన, వైవిధ్యమైన ప్రభావాలలో గాఢమైన మౌలిక సమైక్యత ఉంది. ఇందుకు భిన్నంగా "తెగల" విధానం, భాషా సంకుచితత్వం, మతతత్వం విభజన శక్తులుగా ఉన్నాయి.

జాగ్రత్తగా కావాల్సిన పరిస్థితులను పరిశీలించిన తర్వాత మనం ఈ అభిప్రాయానికి వస్తాం. అన్ని వైపుల పటిష్టవంతమైన జాతీయతా భావం, నియోజకవర్గ సముదాయాలను, వ్యక్తులను, ఆదే రాజ్యానికి విధేయత చూపే విధానంలోను, జీవితంలో వివిధ శాఖల్లో ఏకరూపత ఉండటం అనేది భారతదేశంలో జరగవు. భారతదేశంలోనున్న వివిధ సాంస్కృతిక, మత సముదాయాలు, సాధారణ విభాగంలో జీవితంపై సమదృక్పథం ఉంటుంది. ప్రత్యేకంగా జీవించడంలోను, ఆలోచించడంలోను వాళ్లు దేన్నీ వదులుకోదలచుకోడం లేదు. జీవితతత్వంలో రాజకీయ విలువలకు, మత, సాంస్కృతిక విలువలకే

ప్రాధాన్యాన్నిస్తుంది. వివిధ ప్రజా సముదాయాలు తామాశించే సంస్కృతులను జాతీయ సమైక్యత కోసం త్యాగం చెయ్యాలి. అది భారతీయ మనస్తత్వానికి కుదరదు. యూరపులో కూడా మానసిక వాతావరణం తీవ్రతరమైన జాతీయ విధానాలకే పనికి వస్తాయి. వాటిని అంతకంటే బలమైన శక్తి అయిన ప్రజాస్వామ్యం అదుపులో పెడ్తుంది. కొద్ది ప్రాంతాల్లో, కొంత కాలం వరకు మాత్రమే ఫాసిస్టు ప్రభుత్వాలు నిలువగలవు. భారతదేశంలో గత సాంప్రదాయాలు ప్రస్తుత పరిస్థితులు ప్రత్యేక తరహాకు చెందిన జాతీయతను ఆకాంక్షిస్తాయి. అది సమాఖ్య విధానం-రాజకీయ రంగంకన్నా సాంస్కృతిక రంగంలోనే ఎక్కువ. అది సమానమైన జాతీయ సంస్కృతిని అభివృద్ధి పరుస్తుంది. అయితే వివిధ సమాజాలు వారివారి సాంస్కృతిక, మత సాంప్రదాయాల విషయంలో స్వేచ్ఛను అభివృద్ధి పరచుకోవాలి. అయితే అవి జాతీయ సమైక్యతకు, అందరి సంక్షేమానికి అడ్డుకానంతవరకు మాత్రమే.

ఈ విషయం విశదమైన తరువాత, భారతదేశం శాశ్వతమైన జాతీయ సమైక్యతను సాధించగలుగుతుంది. భౌతిక, చారిత్రక శక్తులు సమైక్యత కోసం అవసరమైన పరిస్థితులను ఏర్పరుస్తాయి. ప్రస్తుతం మనకు కావాల్సిందేమంటే సమైక్యతను అభివృద్ధిపరచే గట్టి ప్రయత్నం. దీని మూలంగా విభజనను, అనైక్యతను తగ్గించాలి.

## IV

ముందు చర్చించిన ఈ షరతులన్నీ అవసరమైనా, అవే జాతీయ రాజ్యాన్ని ఏర్పర్చటానికి చాలవు. జాతీయతకు ఉండాల్సిన ముందు షరతులవే. జాతీయ రాజ్యమేర్పడాలంటే ముందు ప్రధానంగా కావాల్సింది ప్రజామోదం. దీనికి ఎదురయ్యే ప్రశ్న ఏమంటే, అలాంటి ప్రజామోదం భారతదేశంలో ఉందా? ఇది కేవలం అలంకారప్రాయమైన ప్రశ్న. ఎందుకంటే రాజ్యాంగ శాసనాన్ని, ప్రాతినిధ్య రాజ్యాంగ సభ ఏర్పర్చాక, సార్వజనీన ఓటింగ్ విధానం మూలంగా ఆరుసార్లు సాధారణ ఎన్నికలు జరిగాక అలాంటి ప్రజామోద విషయంలో. సందేహం లేదు. ఈ రెండు చారిత్రక సంఘటనలు [illegible] పక్షపక్షమైన [illegible] సందేహం లేదు. పాతిక సంవత్సరాలుగా [illegible] ఏమిటంటే

భారత్ (ఇది మన ప్రస్తుత చర్చలో అవసరం) అనే పరిమితార్థంలో భారతీయ ప్రజానీకానికందరికీ అన్వయించే రాజకీయ వ్యవస్థ కావాలి. అది లౌకిక, ప్రజాస్వామ్య వ్యవస్థగా, అందరికీ స్పష్టమయ్యే సామ్యవాద తరహా రాజ్యంగా ఉండాలి. మనం తెలుసుకోవాల్సింది ఏమిటంటే, జాతీయ ఐక్యత దృఢమైన, సామరస్యం అనే రాతిపై ఏర్పడాలి. వివిధ సముదాయాల మధ్య పరస్పరం నమ్మకం ఏర్పడాలి. అప్పుడు అది బలమైన, ఎన్నటికీ మారని, మనం కోరుకున్న వ్యవస్థగా పరిణమిస్తుంది.

చెప్పుకోక తప్పని, రుచించని సత్యమేమంటే భారతదేశంలో కొన్ని అల్పసంఖ్యాక వర్గాలున్నాయి. అవి మత సంబంధమైనవి. జాతి సంబంధమైన లేక సాంస్కృతిక పరమైనవి. అంతేగాక అధిక సంఖ్యాకులుగా వున్న యితర వర్గాల ఆదరణ వారికి సక్రమంగా అందడం లేదని భావిస్తున్నారు. వారిపట్ల ద్వేషపూరిత భేదాన్ని చూపుతున్నారని ఫిర్యాదు చేస్తున్నారు. ఈ వివక్షత వాళ్ల దృష్టిలో మూడు విషయాల్లో అంటే, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతికంగా జరుగుతుందని భావిస్తున్నారు. రాజకీయంగా చెప్పుకోదగ్గ సమర్థత ఉన్నా, రాజకీయ నాయకత్వంలో కాని, శాసనసభ, మంత్రి వర్గాల్లో కానీ అల్పసంఖ్యాక వర్గాలను మినహాయిస్తున్నారు. ఆర్థిక రంగంలో ప్రభుత్వ, ప్రైవేటు రంగాల్లో కాని, వ్యాపారంలో కాని వారి పరిస్థితి చాల కష్టతరంగా ఉంది. సాంస్కృతికంగా, వారి ప్రత్యేకమైన సంస్కృతిని ముఖ్యంగా వాళ్ల భాషను అణచివేస్తున్నారు. న్యాయబద్ధంగా చెప్పాలంటే రాజకీయ, ఆర్థిక రంగాల్లో యీ వ్యత్యాసం సార్వజనీనం కాదు. రెండో అంశం, ప్రజాభిప్రాయ సంబంధమైన బాధ్యతాయుత నాయకుల్లోగాని, ప్రభుత్వ సభ్యుల్లోగాని, బలమైన తిరస్కృతి, వ్యతిరేకత ఉంది. సాంస్కృతిక అసహనంలో మాత్రం దృఢంగా వేళ్లునాటుకొని సర్వవ్యాప్తమైంది. దీన్ని కాదనడానికి చాలామంది నాయకులకు సాధ్యం కావడం లేదు. ఈ అసహనం ఎందుకు? ఇది భారతీయ సాంప్రదాయానికి విరుద్ధం. ఎంతో మంది దీనిమూలంగా బాధితులయ్యారు. దేశభక్తి ముసుగులో ఇది స్పష్టమౌతుంది. దేశంలో ఒకే సంస్కృతి, ఒకే భాష ఉండాలనే భావం ప్రబలింది. అది అధిక సంఖ్యాకుల భాష, సంస్కృతి. ఏకస్వామ్యత ఏర్పడాలంటే కళంకం ఉండరాదు. లేకుంటే కనీసం అధీనంగానైనా అల్ప సంఖ్యాకుల భాషలను, సాంస్కృతిక సాంప్రదాయాలను ఉంచాలి. వారి నిజాయి

తీతో కూడిన దయనీయమైన ఉత్సాహంలో దీన్ని గూర్చి ఆలోచించ లేకున్నారు. అణచివేసిన ఈ సాంస్కృతిక విధానం ప్రజాస్వామ్యానికి, న్యాయానికి విరుద్ధం మాత్రమే కాదు. సాంప్రదాయాల పట్ల భారతీయ సహనశీలతకు కూడా విరుద్ధం. దీనివల్ల మనమనుకున్న దానికంటే, విరుద్ధమైన దాన్ని సాధించాల్సి వస్తుంది.

జాతీయ సమైక్యతను సాధించడానికి, జాతీయ భాషలను సంస్కృతిని నిర్లక్ష్యం చెయ్యడమనేది అల్పసంఖ్యాక వర్గాల వారందరి అసంతృప్తికి, ఆందోళనకు దారి తీస్తుంది. ఇప్పుడున్న సమైక్యత దెబ్బ తింటుంది. దేశశాంతి, స్వేచ్ఛకు, ప్రమాదం వాటిల్లుతుంది. దేశానికంతటికి చెందిన ఒక భాషను ప్రచారం చెయ్యడం అవసరమే. అట్లే, ఆయా ప్రాంతాల్లో వారి వారి ప్రాంతీయ భాషలుండాలి. జీవితంలోను, దృక్పథంలోను ఏకస్వామ్యతను కల్గించడానికి ఇది అవసరమే. సామాన్య భాష, సామాన్య స్థాయిలో సంస్కృతి లేనట్లయితే దేశం బలహీనమై, అస్థిరత ఏర్పడుతుంది. ఇది బలవంతంగా చేయరాదు. పవిత్రమైన యీ సాంస్కృతిక ధ్యేయాన్ని పట్టుదలతో, ఉత్సాహంతో ప్రయత్నపూర్వకంగా సాధించాలి. అందరికీ చెందిన భాషను, సంస్కృతిని ప్రచారం చెయ్యాలంటే ఏ చర్యలు తీసుకోవాలనే విషయం గురించి సరైన సమయంలో చర్చిద్దాం. అల్పసంఖ్యాక వర్గాల భాషలకు, సంస్కృతికి హాని కల్గించకూడదు. ఇక్కడ మనం గట్టిగా చెప్పాల్సిందేమంటే, భారతదేశంలో జాతీయత ఏర్పడ్డానికి ముందు ఉండాల్సిన అవసరమైన షరతులు ఏమిటని నిర్ణయించేటప్పుడు, ప్రజాభిప్రాయం ప్రధానమైంది. ఇది ఒక దృష్టితో చూస్తే బలహీనమేమోనని అనిపిస్తుంది. అల్పసంఖ్యాక వర్గాలకు సాంస్కృతిక, మత సంబంధమైన విషయాల్లో అధిక సంఖ్యాకుల సమర్థతపై పూర్తి విశ్వాసం లేదు రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో రాజ్యాంగ శాసనం రక్షణ కల్పించినప్పటికీ, పై వర్గాలవారు వాటిని గౌరవిస్తారనే నమ్మకం కొరవడింది.

అధిక సంఖ్యాక వర్గాలు తమ తెలివితేటలతో, అల్ప సంఖ్యాకుల వాస్తవిక లేక ఊహాజనిత కష్టాలను గూర్చి సరైన శ్రద్ధ చూపించాలి. నిజాయితీతో ప్రయత్నించి, వాళ్లను సంతృప్తిపరచాలి. అల్పసంఖ్యాక వర్గంలో అసంతృప్తి ఏర్పడితే, ఆ అప్రధాన విభేదం జాతీయ జీవిత సామరస్యాన్నే ఒకనాడు కలతపెడుతుంది, సమైక్యత విలువ, స్వేచ్ఛ విలువలాగే నిత్య

జాగరూకతయే. నిజమైన ప్రజాస్వామ్య రాజ్యాల్లో అధిక సంఖ్యాక వర్గం పాలనాధికారాన్ని పవిత్రమైన ధర్మకర్తృత్వంగా చూస్తున్నది. కాబట్టి జాగరూకత అవసరం. అల్పసంఖ్యాక వర్గాల్లో భయాలనేవి, వాళ్ల చట్టబద్ధమైన హక్కులను గౌరవించడం లేదని. ఇది నిజం కాకపోయినా, దాన్ని పోగొట్టడానికి గట్టి ప్రయత్నం చేయాలి. స్వాతంత్ర్యానంతరం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ముఖ్యంగా గత 10 సంవత్సరాల్లో ఈ మార్గంలో తీసుకన్న చర్యలను గూర్చి మనం చెప్పకపోతే అది కృతఘ్నత అవుతుంది. ఈ విషయంలో ప్రభుత్వాలు, ప్రజల సహకారం లేనిదే ఏమీ చేయలేవు. సాంస్కృతికంగా అధిక సంఖ్యాకులుగా ఉన్నవారు, మనస్సును దృఢపరచుకొని అల్పసంఖ్యాక వర్గాల పట్ల నిజమైన సహనం చూపి వాళ్ల మనస్సుల్లో పరిపూర్ణ రక్షణ భావాన్ని వృద్ధి చెయ్యాలి. సాంస్కృతిక సహనం అంతర్గతంగా ఉండటం భారతదేశానికి ఎంతో బలమైన ఆధారం. అంతేగాక విభిన్న సంస్కృతులున్న ఇతర దేశాలతో కూడా నూతన భారతదేశం ఉండగలదనడానికి ఇదొక పూచీ. అప్పుడు దేశం రాజకీయ వైవిధ్యానికన్నా హీనమైన సాంస్కృతిక అహంకారానికి దిగజారదు.

పై పుటల్లో పాఠకుడికి నూతన భారతీయ జాతీయత దృఢమైన, వాస్తవిక పునాదుల్లో నిర్మించడం ఎంతో అవసరమైన విషయం. అది కొంతవరకైనా అర్థమైయుంటుందని నా ఉద్దేశం. ఈ కార్యం ఎంతో ఓపికతో, కానరాని ప్రేమతో, నిర్విరామ కృషితో నిర్మించాలి. దీంట్లో మహాత్మాగాంధీ ఆదర్శవంతమైన ఉదాహరణని మనముందుంచాడు. దేశంలో సాంస్కృతిక జీవనం వివిధ రంగులతో, నమూనాలతో, సామరస్యంతో విలసిల్లాలి. ఛాయ పోని రంగుతో, చెరగని సమైక్యతను ఏర్పరచాలి. ఓర్మి లేని తొందరపాటుతనంతో కాని, బలవంతంగా కాని దీన్ని సాధించలేం.

అనేక వేల సంవత్సరాల భారతదేశ సాంస్కృతిక చరిత్ర అనంతమైన బహుళత్వం కూడిన దాని జీవితంలో అంతర్లీనంగా, సున్నితమైన, దృఢంగా సాగే ఐక్యత అనే బంధాన్ని కల్గివుంది. ఇది ఒత్తిడుల మూలంగా గాక ద్రష్టల కృషివల్ల జరిగింది. దీన్ని ఋషుల జాగరూకత, తాత్వికుల ఆలోచనల్లో, కవుల. కళాకారుల ఊహలచుట్టూ అల్లుకుపోయింది. వీటిద్వారానే జాతీయ సమైక్యత పూర్ణమై, బలమై, శాశ్వతమౌతుంది. ఈ సామాన్య వాస్తవాన్ని తెలియజెయ్యడానికే ఈ పుస్తకాన్ని రచించడం జరిగింది.

అయితే, ఈ చర్చలో మనకొక అతి ముఖ్యమైన సమస్య ఎదురౌతుంది. ఇవ్వాళ మన మనస్సుల్లో చెలరేగుతున్న పాత, కొత్తల మధ్య పోరాటం. నిజానికి ఈ సమస్యకు న్యాయం చేకూర్చటానికి ఈ పుస్తకంలో సాధ్యం కాదు. దానికి మరో ప్రత్యేక గ్రంథం కావాల్సి ఉంటుంది.

# 1. భారతీయ సంస్కృతీ ప్రాతిపదిక

సంస్కృతీ అవతరణలో రెండు విభిన్నమైన సిద్ధాంతాలున్నాయి. మొదటిది ఆదర్శవంతమైంది, రెండవది భౌతికపరమైంది. తత్వశాస్త్రజ్ఞులు, చరిత్రకారులు ఈ రెండు సిద్ధాంతాల్లో ఏదో ఒకదానివైపు మొగ్గు చూపుతూనే ఉన్నారు. రెండింటినీ సమన్వయపర్చాలని ప్రయత్నిస్తున్నారు. మొదటిదాని మూలంగా, ఒకానొక సాంస్కృతిక పరిణామ స్థాయిలో, ఒక వ్యక్తి గాని, వ్యక్తుల సముదాయం కాని, తమ అతీంద్రియ శక్తుల (intuition) ద్వారా, ప్రేరణద్వారా, లేక అంతర్వాణి ద్వారా. ఉన్నత విలువలను లేక భావాలను ఆకట్టుకోగల్గుతున్నారు. ఈ దార్శనిక శక్తి, ఒక ప్రత్యేక సాంఘిక వాతావరణంలో, ఒక ప్రత్యేకమైన, వస్తుపరతతో కూడిన, మానసిక పద్ధతిగా రూపుదిద్దుకొంటుంది. అదే సాముదాయక ఆదర్శమౌతుంది. ఈ రకంగా ఏర్పడ్డ భావనను, మేధా సంపత్తికి సంబంధించిన గుణగణాలను, అన్వయించుకోడంలోనే సంస్కృతి సాక్షాత్కరిస్తుంది. ఉదాహరణకు, ఆదర్శవాద సిద్ధాంతం ప్రకారం, వేదకాలంలో ఋషులు దైవప్రేరణ వల్లకానీ, తమ అతీంద్రియ శక్తి వల్లకానీ, ఏర్పర్చుకొన్న భావాలే కాలక్రమేణా ఆర్యుల సామాజిక పరిస్థితులకు, మేధా సంపత్తికి సరిపోయాయి. వారు ఈ ఆదర్శాన్ని, సింధూ, గంగానదీ పరివాహక ప్రాంతాల్లో భౌతిక పరిసరాలకు అనుగుణంగా ఆచరించారు. వీటి మూలంగా ఏర్పడ్డ భావాలు, సంస్థలే వేద సంస్కృతికి ప్రధానమైన భావాలుగా, సంస్కృతులుగా పరిణమించాయి. భౌతికవాద సిద్ధాంతం ప్రకారం, సంస్కృతి ప్రారంభించటానికి భౌతిక పరిసరాలే మౌలికమైన అంశంగా పేర్కొనవచ్చు. ఆదిమదశలో, పరిసర వాతావరణం, భౌతిక వనరులు, ప్రజలుపయోగించిన ఉత్పాదక సాధనాలు, మానవ సమిష్టి జీవితంపై చెరగని ముద్రను వేశాయి. తద్వారా జీవితానుభవాల్లో తారసిల్లిన సిద్ధాంతాలకు, విశ్వాసాలకు స్థానం ఏర్పడింది ఈ క్రమాభివృద్ధిలో, వాటికవే అభివృద్ధి చెంది, నూతన సిద్ధాంతా

లుగా, కొన్ని ప్రధానమైన భావాలుగా రూపుదిద్దుకున్నాయి. సహజవాద సిద్ధాంత ప్రతిపాదకులు, వైదిక సంస్కృతి ప్రారంభాన్ని వ్యావసాయిక జీవిత ఆధారంగా నిర్మించుకున్నారని భావించటం జరిగింది. అంటే, సంచారజాతులైన ఆర్యులు, భారతదేశానికి వచ్చినప్పుడు, వారి మతాన్ని సామాజిక జీవన విధానాన్ని ఈ క్రమంలోనే మలచుకున్నారు.

ఈ సిద్ధాంతాలకు, వాదప్రతి వాదాలను, విభిన్నమైన తాత్విక ధోరణులను అనుసంధించి చర్చించడం, నా ఉద్దేశ్యం కాదు. చారిత్రక, పురావస్తు శాస్త్ర అధ్యయనాన్నిబట్టి ఈ రెండు అంశాల సమన్వయ ఫలితంగానే, అంటే భౌతిక పరిసరాలు ఆది భౌతిక సిద్ధాంతాలు, వీటన్నింటినీ బట్టి సంస్కృతి పరిణామం చెందిందనాలి. ఏది ఏమైనా, రెండు సిద్ధాంతాల్లోను, సాంస్కృతిక పరిణామ దశలో భౌతిక పరిసరాలు ముఖ్యపాత్ర వహించాయి. ఈ అంశానికి ప్రాముఖ్యతను చేకూర్చడంలో ఏ సిద్ధాంతానికి ఆ సిద్ధాంతమే ప్రముఖ పాత్ర వహించింది. దీన్ని బట్టి, మనం రూఢిపర్చే అంశమేమంటే, భావాలు, సిద్ధాంతాలు, నమ్మకాలకన్నా భౌతిక పరిసరాలు, సామాజిక పరిస్థితులే ప్రముఖమైన పాత్రను వహించాయనే అంశమే. సంస్కృతికి స్థానికంగా పూసే రంగు ప్రత్యేకమైన జాతీయ అంశం అయింది. భావాలు, సిద్ధాంతాలు, విశ్వాసాలు, ఏ ఒక్క ప్రాంతానికీ చెందినవి కావు. అవి వర్ణ, జాతీయ భౌగోళిక సరిహద్దులనధిగమించి ప్రపంచంలో సుస్థాపితమైనాయి. పైగా సంస్కృతి అనేది ఒక ప్రత్యేకమైన ప్రాంతంలోనే రూపుదిద్దుకుంటుంది. ప్రతి దేశంలోనూ విభిన్నమైన భావాలు, నమ్మకాలు ఉన్నప్పటికీ, ఆ ప్రాంతీయ సంస్కృతి మాత్రం అక్కడి భౌగోళిక, సామాజిక పరిస్థితులను బట్టి ఉంటుంది. ఒక దేశ ప్రత్యేకమైన సంస్కృతిలో అక్కడి భౌగోళికాంశాలు ప్రధానమైనవి. ఇవి, భౌతిక రూపాలను ఏర్పర్చడమే కాక, మానసిక వాతావరణం ఏర్పడటానికి కూడా దోహదం చేస్తాయి. విభిన్న మతాలు, విభిన్నమైన తాత్విక భావాలు ఉన్నప్పటికీ, ఆ వాతావరణం, ప్రజల మధ్య సమాన దృష్టిని, సమాన దృక్పథాన్ని ఏర్పరుస్తుంది. ఈ జాతీయ మనస్తత్వం, మేధోసంపత్తి జాతీయ సంస్కృతికి పట్టుగొమ్మ. మిగిలిన ఆధారాల్లో, నూతన మత, తాత్వికోద్యమాలు దేశంలో కాలానుగుణ్యంగా ఏర్పడుతుంటాయి. అంతేకాక, యుద్ధాలవల్లా, వ్యాపారంవల్లా, వాణిజ్యం మూలంగా కాని,

విదేశీయులు మరో దేశానికి వచ్చి స్థిర నివాసాన్ని ఏర్పర్చుకున్నప్పుడు, వారి సంస్కృతులను బట్టి కొన్ని మార్పులు రావడం సహజం. ఈ విభిన్న సంస్కృతులను జాతీయ సంస్కృతిలో భాగాలుగా మనం అర్థం చేసుకోవాలి. ప్రజలందరూ, అంటే వారు ఏ విభాగాలకు చెందినా, ఏ సమాజానికి చెందినా, ఈ సమ్మిశ్రిత సంస్కృతిని తమదిగా భావించుకోవాలి. ఈ సమ్మిశ్రిత అంశాల కలయికయే జాతీయ సంస్కృతి.

భారత జాతీయ సంస్కృతిలో కూడా రెండు అంశాలు ఉన్నాయి. ఒకే రకమైన మనస్తత్వం, దృష్టి ఇందులో ప్రధానమైనవి. భారతీయ సంస్కృతి ఆవిర్భవించడానికి కారణాలు భారత ప్రజల మేధా సంపత్తి, వివిధ ఉద్యమాల వైజ్ఞానిక ప్రభావం, వివిధ సంస్కృతుల సమ్మేళన ఫలితమని భావించాలి. భారతదేశంలో నెలకొన్న చారిత్రక పూర్వయుగంలోను, ఈ దేశంతో ఏర్పడ్డ తాత్కాలిక సంబంధ బాంధవ్యాల వల్లనూ, విదేశీయులు ఈ దేశానికి విచ్చేసి తమ దేశంగా భావించడం వల్లనూ, విప్లవాత్మక, వైజ్ఞానిక ఉద్యమాలు కాలానుగుణ్యంగా అభివృద్ధి చెందటం వల్లా ఈ సంస్కృతి ఏర్పడిందని చెప్పవచ్చు.

భారతదేశ భౌగోళిక రూపురేఖలను పరిశీలిస్తే, ప్రధానమైన అంశం దేశమంతా వ్యాపించిన మైదాన ప్రాంతాలు. వీటిలో ఉత్తర, పశ్చిమ కనుమలను మినహాయించవచ్చు. వీటిలో పెద్ద పెద్ద నదులు ప్రవహిస్తున్నాయి. కొన్ని శీతల ప్రాంతాలను మినహాయిస్తే, దేశం మొత్తంలో కొన్నాళ్లు వేడిగాను, కొన్నాళ్లు చల్లగాను ఉంటుంది. బెంగాల్, దాని పరిసర ప్రాంతాల్లో వర్షపాతం అధికం. మిగతా ప్రాంతాల్లో వర్షాలు మితంగా ఉంటాయి. ప్రత్యేక కాలాల్లో మాత్రమే వర్షం కురుస్తుంది. దేశంలో కొన్ని ప్రాంతాల్లో వర్షమే ఉండదు. దేశంలో అధిక భాగంలో సమానమైన వాతావరణం ఉంది. నిజానికి కొన్ని ప్రదేశాల్లో విపరీతమైన చలి, కొన్ని ప్రాంతాల్లో ఎండ, ఉక్క, కొన్నింటిలో పొడి వాతావరణాన్ని గమనించవచ్చు. అట్లే, భూమి విషయంలో కూడా ఆయా ప్రాంతాలను బట్టి తేడా ఉంటుంది. ఫలితంగా, విభిన్నమైన కూరగాయలు, ఖనిజాలు లభ్యమౌతున్నాయి.

మైదాన ప్రాంతాలు నీటి పారుదలకు అనుగుణ్యమైనవి. సంవత్సరంలో అధికకాలం సూర్యరశ్మి ప్రసరిస్తున్నందు వల్ల, వ్యవసాయానికి ఇవి అనువైన ప్రాంతాలు. అనాదినుంచి భారతదేశంలో వ్యవసాయమే ప్రధానవృత్తి. దేశంలోని విభిన్నమైన ప్రాంతాల్లో, విభిన్నమైన ఉత్ప

త్తులు లభిస్తాయి. వీటిని నీటిద్వారాకానీ, రహదారుల ద్వారా కానీ చాలా వరకు అంతర్గత వ్యాపారాన్ని అభివృద్ధి పర్చడానికి పరిస్థితులు అనుకూలించాయి. విదేశాలతో వ్యాపారం భూమార్గాలు, సముద్ర మార్గాల ద్వారా ఎక్కువగా జరిగింది. ఎన్నో శతాబ్దాలుగా ఈ విధానం కొనసాగింది. విదేశీయులే ఈ వాణిజ్య సంబంధాలను అభివృద్ధి పరిచారు. భారతీయుల పాత్ర అతిస్వల్పం. అనేక మంది భారతీయులు ఈ సముద్రయానం ద్వారా వ్యాపారాన్ని అభివృద్ధి పరచలేక పోయారు. వారు సముద్ర తీర ప్రాంతవాసులు కారు. తీర ప్రాంతాల వారు మాత్రమే అభినందించదగ్గ రీతిలో వ్యాపారాన్ని చేపట్టారు. భౌతిక పరిస్థితులను, భౌతిక, శక్తుల ప్రభావాలను గమనిస్తే, భారతదేశ ఆర్థిక విధానం వ్యవసాయ సంబంధమైందని తెలుసుకోవచ్చు. జాతీయ సంస్కృతి మొత్తం మీద ఈ ప్రభావం ఉంది. అందువల్లనే శాంతియుతమైన, నిర్మాణాత్మకమైన కార్యక్రమాలను ప్రోత్సహించిందే కాని, యుద్ధం, మొదలైన విచ్ఛిన్నకర పరిస్థితులకు దారి తీయలేదు. ఈ చైతన్యమే భారతదేశ సాంస్కృతిక చరిత్రలో ప్రతిబింబిస్తుంది.

భారతదేశ ఆర్థిక విధానంలో గమనించదగ్గ ముఖ్య అంశం, ఉష్ణవాతావరణంలో ఉండే ప్రజల మౌలిక అవసరాలు, శీతల దేశాల ప్రజలకంటే చాలా తక్కువ. వనరులు సంతృప్తికరంగానే లభ్యమౌతున్నాయి. ప్రజల మౌలిక అవసరాలు, అంటే, ఆహారం, వస్త్రాలు, వంట చెరకు పరిమితాలే కాక, సులభంగా అవసరాల మేరకు ఉత్పత్తి చేసుకోవచ్చు. అయినప్పటికీ, మన దేశస్థుల్లో పేరుకుపోయిన అసమర్థతవల్లా, విదేశీ ప్రభుత్వాల నిర్లక్ష్యంవల్లా కోటానకోట్ల ప్రజానీకం దారిద్ర్యంలో కూరుకుపోయి ఉన్నారు. చరిత్రలో అన్ని కాలాల్లో ఈ విధంగా ఉందని కాదు. దేశంలో అననుకూల పరిస్థితుల్లో, అంటే విభిన్న ప్రాంతాల్లో ఏర్పడ్డ కరువుల వల్ల అప్పుడప్పుడూ దరిద్ర దేవత తాండవమాడి ఉండొచ్చు. నిజానికి బ్రిటీష్ వారు రాక పూర్వం ఇంత నికృష్ట పరిస్థితి ఏర్పడలేదు. ఇది చాలా ప్రధానమైన అంశం. మానవ జీవితంలో ఆర్థిక పరిస్థితులు అత్యంత ప్రధానాలు. మానవుని మనస్సును, అతని జీవన సరళిని, కార్యక్రమాలను, నిత్యావసరాలు లభ్యం కానట్లైతే, పూర్తిగా దహించి వేస్తాయి. ఈ సత్యానికి ఎన్నో దృష్టాంతాలను చూపవచ్చు. శీతల దేశాల్లో. ప్రాచీన నాగరకతల ప్రారంభ దశలో, మానవుడు తన యావత్ దృష్టినే, శక్తినీ భౌతికావసరాల అన్వేషణ కోసం

వెచ్చించాడు. ఉష్ణ దేశాలైన భారతదేశంలాంటి దేశాల్లో ఆర్థిక పరిస్థితుల మెరుగుదల కోసం అంత ముఖ్యమైన భూమికను వహించలేదు. ఈ అంశాన్ని భారతీయ సంస్కృతిలో గమనించవచ్చు.

కూడు, గూడు, బట్ట, జీవిత విధానం సాంస్కృతికి జీవితంలో ప్రధానమైన అంశాలు. వీటిపై వాతావరణం, ఆర్థిక వనరుల ప్రభావం మిక్కుటంగా ఉంది. ఈ అంశాన్ని గూర్చి చర్చించాల్సిన అవసరం కూడా ఎంతో ఉంది. భారతీయ సంస్కృతిలో భౌతికాంశాల, భౌతిక ఆర్థిక పరిసరాల ప్రభావం ఎంతో ఉందన్న విషయాన్ని ఎవ్వరూ కాదనలేరు. మనుష్యుల జీవన విధానాన్ని గమనిస్తే, వివిధ ప్రాంతాల్లో విభిన్నత కన్పిస్తుంది. విద్యావంతులైన భారతీయుల్లో కొన్ని సమానమైన లక్షణాలు కన్పిస్తున్నాయి. అట్లే భారతీయ నాగరికతలో కూడా ఎన్నో సమాన లక్షణాలున్నాయన్న విషయం తేటతెల్లం. మనం పరిశీలించినట్లైతే, ఎన్ని విదేశీ దండయాత్రలకు గురైనా, ఎన్నో విధాల అనైక్యతలేర్పడ్డా, భారతీయుల్లో ఎన్నో సమానాంశాలున్నాయి. అవి ఈనాటికి కూడా ద్యోతకమౌతూనే ఉన్నాయి.

భౌతిక సంస్కృతితో పాటు, భౌతిక పరిసరాలు ప్రజా జీవితాన్ని, లక్షణాలను రూపుదిద్దుతాయి. వీటిలో ఎన్ని వ్యత్యాసాలున్నా, భారతీయుల్లో ఇతర దేశాలకంటే భిన్నమైన సాధారణ గుణగణాలెన్నో వీరికున్నాయి. భౌతిక పరిసరాల ప్రభావం, వారి భౌతికాభివృద్ధి మీద పనిచేసిందన్న మాట వాస్తవమే. అయితే, దీని పరోక్ష ప్రభావం వారి గుణగణాలు, నడవడి మీద మానసిక, సామాజిక, నైతిక జీవనం మీద మాత్రం కన్పించదు. ఈ భౌగోళిక లక్షణాలు ముఖ్యంగా ఈ దేశ వాతావరణం భారతీయులందరికీ సాధారణ దృక్పథాన్నీ, స్వభావాన్ని ఏర్పరచింది. దీని మూలంగా వారి ఆలోచనలను, కార్యక్రమాన్ని మలచుకోడం జరుగుతుంది.

ఒక్కసారి భారతదేశం వైపుకు దృష్టి మళ్లిస్తే, ఆధునిక, పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన కొన్ని పట్టణాలు, విశాలమైన ప్రదేశం, ఎండాకాలంలో కూడా ప్రకాశవంతమైన చల్లని చల్లదనంతో అత్యద్భుతమైన నిశ్శబ్దంలో మునిగి ఉండే ప్రాంతాలను మనం ఊహించవచ్చు. కొందరు రోజంతా కష్టపడి పనిచేసి, రాత్రి హాయిగా విశ్రాంతి తీసుకొనే సమయంలో మరి కొందరు పగలు కునుకు తీసినందు వల్ల రాత్రి కన్ను పొడుచుకున్నా నిద్ర రాక బాధ పడేవారున్నారు. ఒంటరిగా ఉండి భారతదేశంలోని ఎండాకా

లపు భారమైన వాతావరణంలో విపరీతమైన ఒంటరితనాన్ని అనుభవిస్తాం. అనంతమైన ఈ విశ్వంలో నక్షత్రాలతో నిండిన ఆకాశం తప్ప మరేమీ లేవనే భావన నీకప్పుడప్పుడు ఏర్పడుతుంది. ఒక్క నిమిషంలో మీయొక్క భావాలు, కోరికలు, మనుగడ, నిశ్చయం. ఇంతెందుకు, మీరు కూడా పూర్తిగా ధ్యానముద్రలో మునిగిపోవడం జరుగుతుంది. అంతకంటే ఇంకేమి చెప్పలేం. అటువంటి పరిస్థితుల్లో స్పర్శజ్ఞానం కూడా ఉండదు. విషయ పూర్వక అనుభవంలోని ఏక రూపతా భావం, మనకు తెలియకుండానే మనల్ని వేరే ప్రపంచంలోకి తీసుకెళ్తుంది. బౌద్ధిక జీవి మన ఆలోచనల్లో ఐక్యతను చేకూర్చి, సృష్టి అంతా ఒక్కటేనన్న భావన కలిగిస్తుంది. ఆ ఊహ భావనలో స్పర్శజ్ఞానం అనే శృంఖలాల నుంచి స్వేచ్ఛను పొంది ఏకతాభావాన్ని ఊహించుకుంటుంది. ఈ వాతావరణంలోనే భారతీయ మేధా సంపత్తి పెరిగిందీ, అభివృద్ధి చెందింది కూడా. దానికి రెండు గుణాలు న్నాయి. అవి మానసిక శక్తులన్నింటినీ ఏకం చేసి ధ్యానముద్రలో లీనమ వడం, అట్లే ఏకత్వంలో భిన్నత్వాన్ని సాధించగలగడం. భారతదేశ సాంస్కృతిక చరిత్రను చదివే విద్యార్థులు, ఆలోచన అనేదే అన్ని విలువలకంటే విలువైందని తెలుసుకుంటారు.

ఇది ఊహాజన్యమైన ఆలోచనేకాక ఉద్రేక పూరితమైన ఆలోచనే. ప్రపంచమంటే ఏమిటి అనే భావన, తరువాత ఏం జరుగుతుందనే భయాందోళనతో సతమతమై, తన ఆలోచనల్లో ప్రేమ, భక్తి నింపుకుంటాడు. ఇటువంటి ఆలోచన మత సంబంధమైనదేకాని తాత్విక సంబంధి కాదు. అందుచేతనే మత సంబంధమైన తాత్విక విధానం, భారతదేశ సాంస్కృతిక జీవన విధానంలో కీలకమయింది. అలాగే మనం పేర్కొన్న రెండో లక్షణం మూలంగా భారతీయ మనస్తత్వం ప్రపంచాన్ని వ్యాఖ్యానించడంలోను, ఆలోచించడంలోను విభిన్నత్వాన్ని ఏకత్వరూపంలో మార్చుకోగలిగింది. మనం పైన చెప్పిన విషయాన్ని అర్థం చేసుకోడంలో ఇబ్బంది పడాల్సిన అవసరం లేదు. భారతీయ మనస్తత్వానికి సంబంధించిన ఈ లక్షణాలు కానీ, తరవాత చెప్పబోయే లక్షణాలు కానీ చాలా విలువైన వనీ, వాటికి సంబంధించిన హానికరమైన పరిస్థితులు ఏమీ లేవని అనుకో కూడదు. వ్యక్తులకు, సముదాయాలకు సంబంధించిన సహజమైన కోరికలు అన్నీ ఒక ఎత్తు కాగా, మరోవైపు వ్యక్తి జాతి అభివృద్ధికి ప్రోత్సాహం,

నియంత్రణలు అవసరం. అదే విధంగా వ్యక్తులను, దేశాలను మౌలికంగా మార్చడానికి వీలుకాదు. కొన్ని పరిమితులకు లోబడి మాత్రమే మార్చ వచ్చు. దానికి సంబంధించిన సహజమైన శక్తియుక్తులు అవసరం. ఈ భావం భారతీయుల మనస్తత్వంపై ఎక్కువ ప్రభావాన్ని చూపింది. దీని మూలంగా కృషి చేసే శక్తులు బలహీనపడ్డాయి. కొంతమంది ఆలోచనా పరులు దీన్ని ప్రతిఘటించారు. కాని, ఈ సమైక్యత మీద ఉన్న ఇష్టం, దీని కోసం చేసిన పరిశోధన ఎంత దూరంపోయిందంటే భౌతిక ప్రపంచానికి అవసరమైన సత్యాన్ని కూడా శోధించలేని స్థితికి వెళ్లింది. అటువంట ప్పుడు, ఈ సమతుల్య సాధనకు, సత్యాన్వేషణకు పూర్తిగా భౌతిక సంపద విధానంపై ఆధారపడాలి. కానీ, మొత్తం మీద ఆలోచనలోని ఔన్నత్యం, భిన్నత్వంలోని ఏకత్వమనే భావనలు భారతీయ మేధా సంపత్తి యొక్క విలువైన లక్షణాలు. భారత దేశాభివృద్ధిలో అన్ని ప్రాంతీయ సంస్కృ తుల్లో ఇవి స్పష్టంగా ప్రతిబింబిస్తున్నాయి.

భారతీయుల్లోని ఈ గుణగణాలు, ప్రజల నైతిక విలువలపై ప్రభా వాన్ని చూపాయి. మనం ముందు పేర్కొన్నట్లుగానే, ప్రత్యేకంగా వైజ్ఞానిక దృక్పథంతో చూసినట్లైతే, అన్ని విలువల్లోకి ప్రధానమైంది అత్యున్నత మైన సత్యాన్వేషణ. ఆచరణలోని విలువలకు ఈ విధమైన దృష్టి తక్కువ స్థానాన్ని ఇస్తుంది. అట్లే, జీవితంలోని ప్రధాన సూత్రం ఏకత్వమనే భావన, సంఘర్షణ కన్నా సామరస్యంవైపే మొగ్గు చూపుతుంది. ఇదే నైతిక విధా నంలో ప్రధానమైంది. ఈ విషయంలో భారతీయులకు, ఆధునిక పాశ్చా త్యులకు ఉన్న తేడా స్పష్టంగా తెలుస్తుంది. పాశ్చాత్య మేధా సంపత్తి ప్రకారం మనిషికి, అతని భౌతిక పరిసరాలకు మధ్య జరుగుతున్న పోరా టంలో నైతిక విలువలకే ప్రాముఖ్యతనివ్వడం జరిగింది. సాంస్కృతిక అభివృద్ధికి మూలకారణం ప్రకృతిని జయించడమే. భారతీయ మేధా సంపత్తి ప్రకారం, పరిసరాల్లో వెచ్చని వాతావరణం, సారవంతమైన భూమి, అధి కోత్పత్తి, సులువైన రాకపోకల విధానం ప్రధానమైనవి. వీటిలోనున్న సంబంధం సంఘర్షణకు కాక సామరస్యానికే దారితీస్తుంది. దీనిలోని మౌలికమైన నైతిక స్వరూపాన్ని చూచినప్పుడు. ప్రపంచంలో పూర్తిగా దుర్మార్గమనేది లేదు. మనిషి వాటితో పోరాడ [illegible] సామరస్యం ప్రధానమైనది. [illegible] జీవితాన్ని [illegible]

ప్రాపంచికమైన ఈ సామరస్యపూర్వక భావనే మానవ జీవితంలో ప్రధానమైన ఆదర్శం, లేకుంటే దైవ నిర్ణయవాదానికి, నిష్క్రియకు దారితీస్తుంది.

ఎవరైనా భావించేదేమంటే, మేధా సంపత్తిలో ధ్యానమనేది చోటు చేసుకుంటే, అక్కడ కాంక్షలు, కోరికలు బలవత్తరాలు కావు. భారతీయ మనస్తత్వానికి సంబంధించి ఇది సరైంది కాదు. ఎందుకంటే అది ఉద్వేగ పూరితమైంది, ఊహాజనితమైంది కూడా. ఉద్వేగం, స్ఫూర్తిజనితం భారతీయునికి ముఖ్య లక్షణాలు. వాటిని అణచివెయ్యడానికి గట్టి ప్రయత్నమే జరిగింది. ఈ ఆటుపోట్లు, తృణీకారం, అణచివేత, స్వార్థపూరిత సంతృప్తి, స్వయం నిరాకరణ అనే అంశాలను భారతీయ సాంస్కృతిక చరిత్రలో అక్కడక్కడా చూడవచ్చు. కొన్ని కొన్ని దురదృష్టకర పరిస్థితుల్లో, ఈ స్వార్థపూరిత సంతృప్తి మానవ జీవితంపై పెత్తనం చెలాయిస్తుంది. వీటిని సహజసిద్ధమైన ప్రతిచర్యలు వెంటాడతాయి. ఆత్మ తృణీకారం అనేది విసర్జనలా పనిచేస్తుంది. పేరుకుపోయిన ఈ అవకతవకలను క్షాళితం చెయ్యడానికి ఆత్మ తృణీకారమే పనికివస్తుంది. అలాగే దీన్ని సాధారణ పరిస్థితికి తీసుకు రావడానికి కారణమైంది.

ముందు పేర్కొన్నట్లుగా, దేశంలోని వివిధ ప్రాంతాల్లో వాతావరణ మార్పుల మూలంగా వచ్చిన క్రమబద్ధత, మితంగా ఉండడం అనేవి ముఖ్యం. వర్షపాతంలో సంవత్సరానికి, మరో సంవత్సరానికి మార్పు కన్పిస్తుంది. కాని, వాతావరణ పరిస్థితుల్లో ఎక్కువ మార్పురాదు. ప్రతి ఋతువూ ఒక నిర్ణీత కాలంలో వస్తుంది. నిర్ణీత పరిమితుల్లో దాని ఉధృతం ఉంటుంది. ప్రకృతి వైపరీత్యాలు చాలా అరుదుగా వస్తుంటాయి. అగ్ని పర్వతాలు బద్దలవడం, భూకంపాలు రావడం అరుదు. సహజసిద్ధమైన విపత్తులు ఎక్కువగా సంభవించవు. తుఫానులు, ప్రళయాలు అప్పుడప్పుడు ప్రజల అనుభవంలో గోచరిస్తాయి. క్రమపద్ధతి, అనిరతరతో అనేవి భారతీయ మనస్సుపై ఏ విధంగా పనిచేశాయనేది పరిశీలించాల్సి ఉంది. ప్రధాన అంశం నైతికత, ప్రకృతి శాసనంలాగే భారతదేశంలో పనిచేసింది. ఆటవికదశలో మానవుడు నైతిక, భౌతిక ప్రపంచాల మధ్య వ్యత్యాసాన్ని చూడలేదు. మొదటినుంచి, ప్రతి పనికి నైతిక పర్యవసానమనేది నిర్ణీతమైంది. ఇది తప్పనిసరి. ఋతువులు ఎలాగో ఇవి కూడా అంతే. భవి

ష్యత్‌ద్దర్శన సిద్ధాంతాలు, కర్మ సిద్ధాంతంలోకి దిగజారుతుంది. దీన్నే భారతీయులు నైతిక న్యాయానికి, సహజ న్యాయానికి సంధానంగా భావిస్తారు. మానవుడి పనులు భౌతిక ప్రపంచంలో జరుగుతాయి. అవి ప్రకృతి శాసనాలకు అనుగుణ్యాలు. మనిషికి వీటిపై నియంత్రణలేదు. ఈ సిద్ధాంతాన్ని తిరస్కరించాల్సిన అవసరం లేదు. భారతీయుల్లో నిదానం ఎక్కువ. విచ్ఛిన్నకర పరిస్థితుల్లో ఇది నిష్క్రియకు దారితీస్తుంది. అందువల్లనే భవిష్యద్దర్శనమనేది కర్మ సిద్ధాంతంలోకి దిగజారుతుందని చెప్పడం.

భారతీయ మేధా సంపత్తి విషయంలో మరో లక్షణం ఉంది - ఇది క్రమబద్ధత. అది తరతరాల మూలంగా వచ్చిందే. ఈ ప్రకృతిన్యాయం సహజమైంది. మానవుని ఆలోచనలు, అలవాట్లు, క్రియలు కాలక్రమేణా జరిగేవే కానీ, ఒక్కసారి వచ్చేవి కావు. మార్పనేది విప్లవాత్మకం కాదు, క్రమానుగతం. అంటే భారతీయులు పెద్ద పెద్ద మార్పులను తీసుకురాలేరని కాదు. ఈ మార్పు రావాలంటే చాలా కాలం పడుతుంది. ఈ మార్పు ప్రతిస్థాయిలో జరుగుతుందనే విషయాన్ని గమనించవచ్చు. కాలక్రమేణా వచ్చే మార్పుకు, విప్లవాకత్మకంగా వచ్చే మార్పుకు తేడా ఏమంటే మొదటి దాంట్లో గొలుసులోని కొక్కాలు ఒక దాంతో నొకటి జత పరచి ఉంటాయి. రెండో దాంట్లో ఈ కొక్కాలు కన్పించవు. అందువల్ల గొలుసు త్వరితమైన, ఉధృతమైన విఘాతాలకు గురౌతుంది. ప్రతి భారతీయ మేథ ఇటువంటి బలవంతమైన కుదింపులకు తట్టుకోగలదు. కారణమేమంటే, నూతన భావాలకు, ఉద్యమాలకు వ్యతిరేకత ఉంటుంది. ఇది ప్రయత్నపూర్వకంగా, నిదానంగా వస్తుంది.

మనం ఇంత వరకు వెచ్చనైన, కొన్ని ప్రాంతాల్లో మితమైన వాతావరణాన్ని గూర్చి తెలుసుకున్నాం. సారవంతమైన భూమి, నీరు, వ్యవసాయానికి అనుకూలమైన వాతావరణం ఉన్నాయనే విషయాన్ని గ్రహించాం. ఆటవిక దశలో రాతి పనిముట్లను కనుగొని, భూమిని దున్ని వ్యవసాయాన్ని ప్రారంభించారు. ఈ వ్యవసాయాన్ని ప్రారంభించిన కుటుంబాలు ప్రథమంలో మాతృస్వామిక కుటుంబాలు. కుటుంబం అన్నా, సాంఘిక జీవనమన్నా ఎక్కువ ఇష్టం. సాంస్కృతికాభివృద్ధికి కావాల్సిన నిర్మాణాత్మక గుణగణాలు వీరిలో ఎక్కువ. మొదట వీరు సంచారజాతులు, శాంతి కాముకులు, మానవత్వం ఉట్టిపడేట్లుండేవారు. ఉదాహరణకు, సింధూ

నాగరకత ప్రాంతం నుంచి సంస్కృతి, ఆటవిక దశ నుంచి రెండో స్థాయికి అభివృద్ధి చెందింది. ఆర్యుల రాకపూర్వం రెండువేల సంవత్సరాలకు ముందే ఇది జరిగింది. తర్వాత చాలా మంది సంచారజాతులు, యుద్ధ ప్రియులు దేశానికి వచ్చి, వారు ఆర్యులతో కలసి మార్పు చెందినందు వల్ల జాతీయ స్వభావం కూడా మారింది. కుటుంబం పట్ల ఇష్టం, శాంతి కాముకత, దయాధర్మ గుణగణాలు మాత్రం ఇంకా కొనసాగుతున్నాయి. ఈ ప్రధానమైన అంశాలే భారత గుణగణాల్లోని ముఖ్యమైన అంశాలు.

వ్యవసాయ జీవన విధానం, భౌగోళిక పరిస్థితులు ఈ దేశ రాజకీయ నిర్మాణాన్ని, దేశాభివృద్ధిని మలచడంలో ముఖ్య పాత్ర వహించాయి. వ్యావ సాయిక దేశంలో జనాభా పట్టణాల్లో కాక గ్రామాల్లో ఉంటుంది. ఈనాటికీ, భారత దేశంలో పట్టణాల సంఖ్య తక్కువ. 80 శాతం ప్రజలు ఇప్పటికీ గ్రామీణవాసులే. ప్రాచీన యుగం సమాప్తమయ్యే సరికి జనాభా చారిత్రకా రుల దృష్టిలో 10 కోట్లు మాత్రమే. అందుచేత వీళ్లు దూరదూరంగా ఉండే గ్రామాల్లో నివసించారనే విషయం స్పష్టమౌతుంది. ఆ పరిస్థితుల్లో రాజ కీయాభివృద్ధి, వికేంద్రీకరణ వేపే మొగ్గు చూపుతుంది. అనాది నుంచీ బ్రిటీష్‌వారి రాకకు పూర్వం, భారతదేశంలో మౌలిక రాజకీయ విభాగం గ్రామమే. గ్రామీణ సమాజంలో గ్రామ సభ లేక పంచాయతీలున్నందువల్ల ప్రజాస్వామ్య లక్షణాలు మనకు ప్రస్ఫుటమౌతాయి. ఇతర కారణాల వల్ల కూడా ప్రజాస్వామ్యం స్థానిక స్థాయికి మాత్రమే పరిమితమైంది.

ప్రజాస్వామ్యం భారతదేశంలో అనాది నుంచీ ఉంది. కాని ఆశించి నంత అభివృద్ధి చెందలేదు. ఇక్కడ గమనించాల్సిన మరో అంశమేమంటే, దేశమంతా చిన్న చిన్న రాజ్యాలుగా విభజితమై అభివృద్ధి చెందింది. కాల క్రమంలో కొన్ని సామ్రాజ్యాలు కూడా ఏర్పడ్డాయి. అయితే ఇవి సమా ఖ్యగా పరిణమించినా, పటిష్టత లోపించింది. రాజకీయ సమైక్యత అనే భావం భారతీయులకు చాలా ప్రధానమైన భావన. అయితే ఇది ఒకే ఒక సామాన్య భావన మాత్రం కాదు. కౌటిల్యుడు, మనువు, విష్ణువు, యాజ్ఞ వల్క్యుడు మొదలైన రాజకీయ, విజ్ఞానవేత్తలు వారి వారి సిద్ధాంతాలను రూపొందించారు. ఆదర్శవంతుడైన ఏకైక పాలకుడు యావద్దేశాన్ని ఒకే తాటి కిందికి తీసుకు రావాల్సిన ఆవశ్యకతను గుర్తించారు. ఆ విధంగా జయించిన రాజ్యాన్ని, రాజు తన కుటుంబ సభ్యులకు పంచిపెడితే,

వారు తమ పాలన ప్రాంతాల్లో ప్రాచీన శాసనాలను, ఆచారాలను అమలు జరప గలుగుతారు. రాజకీయ వ్యవస్థ దృష్ట్యా ఇది అవసరం. తద్వారా భిన్నత్వంలో ఏకత్వమనే భావన భారతీయులకు అవగతమౌతుంది.

భారతీయ మనస్తత్వం, గుణగణాలు, భౌతిక, ఆర్థిక వాతావరణ ప్రభావం వల్ల ఏ విధంగా అభివృద్ధి చెందాయో కొన్ని ఉదాహరణల మూలంగా తెలుసుకోడం అవసరమనుకుంటాను. శాశ్వతమైన, అందరికీ సాధారణ మైన అంశాలు, ఇక్కడే ఉద్భవించినా లేదా మరెక్కడ నుంచి తెచ్చు కొన్నా, అవి అందరి ప్రజల్లోను పరివ్యాప్తమైన ఈ దేశంలోనే అభివృద్ధి చెందాయి. ఈ సామాన్య లక్షణాలు, జాతీయ దృక్పథానికీ, వ్యక్తి జీవితా నికి కూడా వర్తిస్తాయి. వీటిని ప్రోది చేయవచ్చు, అభివృద్ధి పరచవచ్చు, అవసరమైతే మార్చవచ్చు. కాని పూర్తిగా రద్దు చెయ్యడానికి గానీ, అణచి వెయ్యడానికి గానీ, పూర్తిగా మార్చడానికి వీలులేదు.

భౌతిక, సామాజిక పరిసర ప్రభావం ఇందులో ఒక అంశమే అయినా అది నిజమైంది. అది సంస్కృతీ నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహిస్తుంది. ఇవి కాక, మరో ముఖ్యమైన భావకల్పనకు ప్రధానమైన అంశం ఆలోచ నలు, విశ్వాసాలు, సిద్ధాంతాలు. ఉన్నత విలువల గూర్చి స్పృహ కల్గించ డంలో ఇవి అంకురించాయి. ఈ రెండో అంశం మనం ముందే గమనించి నట్లు, ఒక ప్రత్యేక ప్రదేశంలో ఏర్పడలేదు. ఒక దేశంలో కొంత వరకు కొద్దిమంది ప్రజల్లో కన్పిస్తుంది. ప్రపంచ చరిత్రను పరిశీలిస్తే, మనకు దీనికి సంబంధించి ఎన్నో ఉదాహరణలు దొరుకుతాయి. మతం, తాత్విక చింతన, రాజకీయ, ఆర్థిక సిద్ధాంతాలు ప్రపంచంలో ఎక్కడో ఒక ప్రాంతంలో పుట్టి, మిగతా ప్రాంతాలకు కాలగమనంలో వ్యాప్తి చెందుతాయి. విభిన్న సంస్కృతులు, విభిన్న భౌగోళిక పరిసరాలు, వాటి వాటి అవసరాలను, పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని వీటిని అంగీకరించడం జరుగుతుంది.

పై విధంగా భారతీయ మనస్తత్వాన్ని పరికిస్తే, ఇది ఏర్పడ్డానికి కార ణమైన భావజాలమంతా మనదేశంలో పుట్టిందని కాదు. ఇతర ప్రాంతాల నుంచి కూడా సంక్రమించి ఉండవచ్చు. రెండో అంశం, వాటి ప్రభావం వివిధ సముదాయాల మీద, వర్గాల మీద కొంత వరకు చూపి ఉండబట్టే, వివిధ మతాలు, సంస్కృతులు భారతదేశంలో ఏర్పడ్డాయి. అయినప్ప టికీ, అందరూ జీర్ణించుకోగల సాధారణ అంశాలు వీటిలో ఎన్నో ఉన్నాయి.

ఇవి అన్ని వర్గాల వారికీ సమానమే. భారతదేశ సాంస్కృతిక చరిత్రను అధ్యయనం చేసినప్పుడు, కొత్త ఆలోచనలు ఏవి ఇక్కడ పుట్టాయో, ఏవేవి ఇతర ప్రాంతాల నుంచీ వచ్చాయో తెలుసుకొని, దాని ఫలితంగా ఇవాళున్న భేదాలకు కారణమేమిటన్న విషయం విశదంగా తెలుస్తుంది. అయితే, ఆ తర్వాత భారతీయ మనస్తత్వం భిన్నత్వంలో ఏకత్వ సాధనకు ఉపక్రమించింది. మరికొంత కాలం అయ్యాక సంఘర్షిత అంశాలన్నీ సామరస్యాన్ని సాధించి నూతన సంస్కృతికి పునాది వేశాయి. ప్రస్తుత సాధారణ, సాంస్కృతిక సమస్యను అర్థం చేసుకోవాలంటే, గతంలో ఏ పరిస్థితుల్లో ఈ సమస్య పరిష్కృతమైందో ఆలోచించాల్సి ఉంది.

భారతదేశ సాంస్కృతిక చరిత్రను మిగిలిన దేశాల చరిత్రల వలె మూడు భాగాలుగా విభజించవచ్చు. ఇవి ప్రాచీన, మధ్యయుగ, ఆధునిక చారిత్రక దశలు. అయితే ఈ విభజన బ్రిటీష్ చరిత్ర విభజనతో సమానం కాదు. భారతదేశంలో ప్రాచీనయుగం దాదాపు క్రీ.పూ. 5000 సంవత్సరాల్లో ప్రారంభమై, క్రీస్తు శకం పదో శతాబ్దం వరకు, మధ్య యుగం పద్దెనిమిదో శతాబ్ద ప్రారంభం వరకు ఆధునిక యుగం ఆ తర్వాత రెండు, మూడు శతాబ్దాల వరకు పరిమితమైనదిగా పేర్కొనవచ్చు.

ప్రాచీన యుగం ప్రారంభమైన తర్వాత దాదాపు వెయ్యి సంవత్సరాల కాలంలో భారతదేశంలో మొట్టమొదటి సారిగా జాతీయ సంస్కృతి ఏర్పడింది. ఇదే వేద కాలంనాటి హైందవ సంస్కృతి. వేద కాలంనాటి ఆర్యుల సంస్కృతీ, అంతకు ముందున్న సంస్కృతుల సమ్మేళనం మూలంగా ఈ సంస్కృతి ఏర్పడింది. దీనిపై కొంతకాలానికి వచ్చిన నిరసన భావమే బౌద్ధమతం. ఇది నూతన సంస్కృతికి పునాది అయింది. భారతీయ మనస్తత్వంపై బౌద్ధమత ప్రభావం గాఢంగా ఉన్నప్పటికీ అది జాతీయ సంస్కృతిగా ఎక్కువ కాలం మనలేక పోయింది. ఎన్నో సంఘర్షణలను తట్టుకొని భారతదేశ సాంస్కృతిక జీవన విధానం మళ్లీ హిందూ సంస్కృతిగా పునరావృతమైంది. దీనిమూలంగా బౌద్ధ మతానికి వచ్చిన వినాశన పరిస్థితులను గమనించవచ్చు. ప్రాచీన హైందవ వైదిక సంస్కృతి తర్వాత వచ్చిన ఈ సంస్కృతిని పురాణ సంస్కృతిగా పేర్కొనవచ్చు. ప్రాచీన యుగం పూర్తి అయిన తర్వాత, ముస్లింలు భారతదేశానికి రాక పూర్వం, భారతదేశ సాంస్కృతిక జీవన విధానం అస్తవ్యస్తంగా ఉండేది. ఢిల్లీ సుల్తానులు

సామ్రాజ్యానికి వచ్చిన తర్వాత, నూతనంగా హిందూ ముస్లింల కలయిక ప్రారంభమైంది. మొగలాయిల కాలంలో హిందూ ముస్లిం సంస్కృతీ భవన నిర్మాణం జరిగింది. ఈ కాలంలో జరిగిన మార్పు నిత్య నూతనమైంది, ప్రధానమైంది కూడా. హిందూస్థానీ సంస్కృతికి మతం కంటే, రాజకీయ మైన జాతీయతా భావన ఎక్కువ.

ఈ గ్రంథంలో జాతీయ సంస్కృతి ఆర్యుల నుంచి మొగలాయిల కాలం వరకు ఏ విధంగా అభివృద్ధి చెందిందీ సంక్షిప్త సర్వే మూలంగా విశదమౌతుంది. అక్కడి నుంచి, బ్రిటీష్ వారు వచ్చిన తర్వాత పాశ్చాత్య నాగరికత, జాతీయ సంస్కృతిని ఏ విధంగా వెనక్కు నెట్టిందోనన్న విషయం తెలుస్తుంది. అంతేకాక, పాశ్చాత్య నాగరికత ఏ విధంగా తన జాతీయ సంస్కృతిని ఏర్పరచడానికి కృషి చేయలేక పోయిందన్న విషయం కూడా స్పష్టంగా చెప్పడం జరిగింది. ఆ తర్వాత ఈనాటి భారత దేశంలో తలెత్తిన సాంస్కృతిక ఉద్యమాలను గురించి విపులీకరించి, మరొకసారి పుష్టికరమైన, సామరస్యపూరితమైన జాతీయ సంస్కృతి కాలక్రమేణా ఏ విధంగా అభివృద్ధి చెందిందో తెలియజేస్తాను.

# 2. సింధు నాగరికత

## (క్రీ.పూ. 3250-2000)

ఇరవైయవ శతాబ్దం ప్రారంభమయేంత వరకు చరిత్రకారుల్లో భారతీయ సంస్కృతిలోని రెండో దశ ఆర్యుల రాకతో అనగా క్రీ.పూ. 1500 సం.లో మొదలైందని భావన ఉండేది. భారతీయ సంస్కృతి అన్ని ప్రాచీన సంస్కృతుల కంటే చిట్ట చివరిదనే భావన ఉండేది. భారతదేశంలో పురావస్తు శాఖవారు తవ్విన తవ్వకాలను బట్టి, పశ్చిమ పంజాబులోని హరప్పా, సింధులోని మొహంజోదార్‌లో, కంచు యుగం దశలోనే, సింధూ నాగరికత కాలంలో అభ్యున్నతి గాంచిన పట్టణ నాగరకత ఉందన్న విషయం స్పష్టమైంది. తర్వాత జరిగిన తవ్వకాల మూలంగా, దేశంలో నలుమూలల్లో ఈ సంస్కృతి వ్యాపించిందని చెప్పాలి. ఇది పంజాబు, సింధు, బెలూచిస్తాన్‌లలో, కథియవాడలోను బయల్పడింది. ఒక వైపు ఉత్తరప్రదేశ్‌లోని పశ్చిమ ప్రాంతాల్లోను, ఇంకోవైపు దక్షిణభారతదేశంలోని కోస్తా ప్రాంతాల వరకు వ్యాపించిందని చెప్పాలి. క్రీ.పూ. 3000 నాటికీ ఈ సంస్కృతి అత్యున్నత దశను చేరుకుంది. అంటే అంతకు క్రితం 2500 సంవత్సరాల ముందే ఇది వచ్చి ఉండాలి. కీ.పూ. 2000 సంవత్సరాల వరకు కొనసాగి ఉండాలి. పశ్చిమ ప్రాంతాల నుంచి వచ్చిన మొరటు జాతి వారు దీన్ని నాశనం చేసి ఉండవచ్చు. అతి ప్రాచీన నాగరికతలైన ఈ లీమ్, సుమేరియా, బాబిలోనియా, ప్రాచీన ఈజిప్టు, ప్రాచీన చైనా నాగరికతలతో దీన్ని సమానమైనదిగా నిర్ధారించారు. దక్షిణ భారతదేశంలోని ద్రావిడులకు సింధు నాగరికతతో సన్నిహిత సంబంధం ఉంది. క్రీ.పూ. 2000 సంవత్సరాల నాటికి వారు సాంస్కృతిక జీవన విధానంలో అత్యున్నత దశను చేరుకున్నారు. ఆర్యుల రాకపూర్వం ఉత్తర హిందూస్థానం ఎంతో గాఢాంధకారంలో మునిగినప్పుడు వీరే నాగరికతా జ్యోతిని ఎన్నో

శతాబ్దాల వరకు వెలిగించారు. దీన్ని బట్టి భారతదేశం, 5000 సంవత్స రాల పూర్వమే అత్యున్నతమైన సాంస్కృతిక జీవనాన్ని అనుభవించిం దని పేర్కొనాలి. చైనా తప్ప, ప్రపంచంలోని ఇంకే దేశంలోను ఇంత కాలం అవిచ్ఛిన్నమైన నాగరికత అభివృద్ధి చెందలేదు.

సర్‌జీన్ మార్షల్ పేర్కొన్నట్లు, ప్రాచీన పట్టణాలైన మొహంజోదారో, హరప్పాలో ఉండిన నాగరక ప్రజా జీవన విధానం, ప్రాచీన బాబిలో నియా, ఈజిప్ట్ దేశాల్లోని నాగరికత కన్నా విశిష్టమైంది. సుమేరియన్ నాగరికతతో సమానమైంది. పెద్ద పెద్ద పట్టణాలు, వాటిలో విస్తారమైన దారులు, నీటి పారుదల సౌకర్యాలే కాక, మురికి నీటిని తీసుకుపోయే కాలువలు నాటి ఔన్నత్యానికి ప్రతీకలు. దీన్నిబట్టి సివిల్ ఇంజనీరింగ్‌లో మంచి ప్రగతి ఉండేదని తెలుస్తుంది. పట్టణ ప్రణాళీకరణ వారికి తెలుసు. అంతేకాక మున్సిపాలిటీలే కాక స్థానిక పౌరపాలన వ్యవస్థ ఉండేది. మట్టి, రాగి, కంచులతో చేసిన ఎన్నో సాధనాలు, ఆయుధాలు, పాత్రలు ఇక్కడ లభ్యమయ్యాయి. మట్టి పాత్రలపై అందమైన చిత్రలేఖనాన్ని చిత్రించారు. మానవుల, జంతువుల మృత కళేబరాలు, కాల్చిన బంకమట్టితో చేసిన బొమ్మలు ఎన్నో దొరికాయి. వీటిలో విసరకర్ర రూపంలో ఉండే టోపీని ధరించిన అర్ధనగ్న స్త్రీ ఎంతో ముఖ్యమైనది. మాతృ దేవతారాధనకిది చిహ్నం కావచ్చు. ఆనాటి కళారూపాల్లో ఎన్నో ముద్రలు లభించాయి. వాటిపై బ్రాహ్మనీ ఎద్దులు, ఏనుగులు, గేదెలు, పులుల బొమ్మలు పొందు పరచడం జరిగింది. బంగారు నగలు, రకరకాల పూసలు, దంతపు పాచి కలు, తలపిన్నులు ఆనాటి పారిశ్రామిక ప్రగతికి నిదర్శనాలుగా పేర్కొన వచ్చు. 'బంగారు, వెండి నగలు ప్రత్యేకంగా నాజూకులో కాని, మెరుగు దిద్దడంలో కాని ఈనాటి బంగారు వర్తకుల బాండు వీధి నుంచి లభించిన ట్లుండే కాని, 5000 సంవత్సరాల కాలంనాటి చరిత్రకు సంబంధించిన పూర్వయుగంలో చేసినట్లు లేవు' అని జాన్ మార్షల్ చెప్పారు. అన్నిటి కన్నా ముఖ్యమైన విషయమేమంటే, సింధూ నాగరికత కాలంలో ప్రజలు ప్రత్తిని పండించి, నేత పరిశ్రమను అభివృద్ధి పరచారు. శతాబ్దాల తరవాత కూడ వాటి ఔన్నత్యం ఇతర దేశాల్లో తెలియక పోవడం గమనించవచ్చు. సింధు నాగరకత ముద్రలు మెసొపొటేమియా, అరేబియా, పశ్చిమ ఆసియా రాజ్యాల్లో కన్పించడం. ఆ దేశాలకు భారతదేశంతో ఉన్న వర్తక, సాంస్కృ

తిక సంబంధాలను చాటుతున్నాయి.

మొహంజోదారో, హరప్పాల్లో లభ్యమైన ఆనాటి వర్ణచిత్రాలు ఇంకా, మాసిపోలేదు. సింధు నాగరికతకు చెందిన ప్రజల బౌద్ధిక, ఆధ్యాత్మిక జీవితాల గురించి మనకింకా తెలియదు. మనకు లభ్యమైన సమాచారాన్నిబట్టి వారి మత నమ్మకాలు, ఆచరణలు హిందూ మతంలో ప్రతిబింబిస్తున్నాయని చెప్పవచ్చు. ముద్రలపైనున్న బొమ్మలను బట్టి వారు శక్తిని, లేదా మాతృ దేవతను పూజించేవారని, మేకలు మొదలైన జంతువులను దేవతకు బలి ఇచ్చేవారనే విషయం విశదమవుతుంది. వీరి మూలంగానే ఈ సాంప్రదాయాలు హిందువులకు లభ్యమైనాయి. కొన్ని ముద్రలు శివునికి సంబంధించినవిగా ఉన్నాయి. ఒక దానిలో మూడు ముఖాలతోను, కొమ్ములతో ఉన్న తలపాగాను ధరించినట్లుగా మనం గుర్తించవచ్చు. కాలక్రమేణా దాన్నే హిందువులు త్రిశూలంగా మార్చివేశారు. జంతువులను, నదులను, రావి చెట్లను పూజించేవారు. జంతువుల్లో ఎద్దు, గేదె, పులి, ఏనుగు చాల పవిత్రమైనవి. హిందువుల పురాణగాథల్లో శివుడి వాహనం నంది అయింది. స్వస్థిక, చక్రం సూర్యుని చిహ్నాలు ఆ కాలానికి చెందినవే. దయ్యాలమీద, తంత్రంమీద నమ్మకం యజుర్వేదంలోను, అధర్వణ వేదంలోను ఉన్నట్లు కొందరు పండితులు తెలియచేశారు. వారు సింధు నాగరికత సాంప్రదాయాల ప్రభావం ఉన్న ఋగ్వేదం జోలికి పోలేదు.

ఈ నాగరికత నిర్మాతలెవరన్న అభిప్రాయంపై విభేదాలున్నాయి. కొంతమంది వీరిని వలస వచ్చిన ఆర్యులని లేక సుమేరియనులనీ, మరి కొందరు ద్రావిడులని పేర్కొంటున్నారు. చాల మంది మేధావులు ప్రాచీన ఆస్ట్రిక్ జాతికి, అంటే మధ్యదరా సముద్రప్రాంతం నుంచి వచ్చిన జాతుల మిశ్రమంగా భావిస్తున్నారు. పట్టణ నాగరికత దశకు చేరక ముందు వీరు శతాబ్దాలుగా భారతదేశ వాసులనీ, సుమేరియన్లలతో వీరికి కొన్ని పోలికలున్నాయని, అయినా వీరు భారతీయులే అని చెప్పవచ్చు. ఇంకా లోతుకు పోయి పరిశీలిస్తే, సింధు నాగరికత లక్షణాలే తరువాత భారతదేశ నాగరికతలో ముఖ్య లక్షణాలు అయినాయనే విషయం విశదమవుతుంది.

సింధూ లోయ నాగరికత చిట్టచివరి దశలో, అది పూర్తిగా ద్రావిడ నాగరకతతో మిళితమైందన్న సత్యానికి గట్టి నిదర్శనాలు ఇప్పటికీ కనిపిస్తాయి. ఒక దానిపై ఇంకో దానికి పరస్పరం గాఢమైన ప్రభావం ఉంది.

ద్రావిడులు భారత జాతీయ సంస్కృతికి దోహదం చేశారనే విషయం దీని వల్ల తెలుస్తుంది. ఆనాటి సింధూ నాగరికత నేటి భారతదేశ సంస్కృతిపై ప్రత్యక్ష ప్రభావాన్ని చూపలేక పోయినా, ద్రావిడ సంస్కృతి మూలంగా పరోక్ష ప్రభావాన్ని చూపగలిగింది.

# 3. ద్రవిడ సంస్కృతి, ఆర్యుల వైదిక సంస్కృతి - రెండు ప్రవాహాలు
## (క్రీ.పూ. 2000 - 1000)

సుమారుగా క్రీ.పూ. 2000 సంవత్సరాల క్రితం, భారతదేశపు వాయవ్య ప్రాంతాన్ని కొల్లగొట్టిన దండయాత్రకారులు, సింధూలోయ నాగరకతను ధ్వంసం చేసినపుడు, దక్షిణ భారతదేశంలో తమిళుల సంస్కృతి అభివృద్ధిలో ఉండేది. పురావస్తు శాస్త్రజ్ఞులు, సింధూ నాగరకతకు, తమిళ సంస్కృతికి ఎంతో కాలంగా వ్యాపార సంబంధమైన, సాంస్కృతిక సంబంధమైన సంబంధాలు ఉండేవని తెలిపారు. మొహంజదారో, హరప్పాల్లో లభ్యమైన అస్తికల శాలలు, కుండపెంకులు దక్షిణ భారతదేశంలో కూడా దొరికాయని వారు తెలియజేశారు. సింధూ నది పారివాహక ప్రాంతంలోని తవ్వకాల్లో లభ్యమైన గవ్వలు, ముత్యాలు దక్షిణ భారతదేశానికి చెందినవే. బెలూచీస్థాన్‌లో మాట్లాడే "బ్రాహుణ" భాషలో సుమారు యాభై శాతం ద్రావిడ పదాలున్నాయి. చారిత్రక పూర్వ దశలో దక్షిణ భారతదేశానికి ఉన్న సాంస్కృతిక సంబంధాన్ని తెలిపేందుకు ఇది మంచి సూచన. నిజానికి ఈ స్థితి సింధూలోయ నాగరికత వికాసానికి ముందున్న కాలానికి చెందింది. అంటే క్రీ.పూ. 2000 సంవత్సరాల నాటిది. అప్పటికే ద్రవిడ సంస్కృతి అత్యున్నత దశలో ఉండి ఉండాలి. లేకుంటే అభివృద్ధి చెందిన పట్టణ నాగరకతపై అంతలోతైన, గాఢమైన ప్రభావాన్ని చూపి ఉండదు.

సంప్రదాయాన్ననుసరించి, ప్రాచీన తమిళ వాఙ్మయాన్ని, క్రీ.పూ. 2500 సంవత్సరాల నాటిదిగా భావించవచ్చు. క్రీ.పూ. 1000 సంవత్సరాలకు ముందే, దక్షిణ భారతంలో మూడు సంఘాలుండేవన్న విషయంలో రూఢియైన సాక్ష్యముంది. అవి ప్రాచీన మధుర, కాపడాపురం, ఆధునిక

మధురై, ప్రథమ వైయాకరణుడైన అగస్త్యుడు, "ఆగాతియం" అనే గ్రంధాన్ని రాశాడు. మొదట సంఘంలో ప్రముఖుడైన వ్యక్తి ఇతడు. ఇతను ఆర్య మత ప్రచారకుడనీ, ఉత్తరాన్నుండి, దక్షిణ హిందూస్థానానికి వచ్చి వైదిక మతాన్ని బోధించాడనీ ఇతిహాసంలో ఉంది. ఇతని పన్నెండు మంది శిష్యులు, వ్యాకరణం, సారస్వతం, సంగీతం, నాట్యశాస్త్రాల్లో అనేక సిద్ధాంత గ్రంధాలు రాశారు. వాటిలో "తొల్కాప్పియమ్" క్రీ.పూ. 1000 సంవత్సరాలనాడు రాసింది. అదింకా వ్యవహారికంలో ఉంది. అది తమిళ వ్యాకరణానికి సంబంధించిన గ్రంథం. ప్రాచీన ద్రావిడుల సాంస్కృతిక జీవనాన్ని గూర్చి విలువైన విషయాలను తెలియజేస్తుంది.

ప్రస్తుత ద్రవిడ సంస్కృతికి నిలయమైన దక్షిణ భారతదేశం, చారిత్రక పూర్వయుగంలో, ద్వీపకల్పం వరకు దక్షిణాన వ్యాప్తిచెందింది. కాలానుగుణంగా అనేక తీవ్రమైన తుఫానుల్లో, నీటి ప్రవాహంలో ఎంతో భాగం కలిసిపోయింది. ఒక ద్రావిడ సమాజంలో మాతృస్వామిక విధానం అమల్లో ఉండేది. మామూలుగా, ద్రావిడ సమాజంలో తల్లి ప్రతిపత్తి చాలా ఎక్కువ. కరుడుగట్టిన కులవ్యవస్థ అమల్లో లేదు. తర్వాత కాలంలో ఈ వ్యవస్థ ఎన్నో వర్గాలు, జన్మనుబట్టి, వృత్తిని బట్టి అభివృద్ధి చెందింది. ఆనాడు అమల్లో వున్న మత విధానం మాతృ దేవతా విధానం. వృక్షాలు, రాక్షసులు, దయ్యాలు, పాములు మొదలైనవాటిని పూజించేవారు.

ద్రావిడ నాగరికత విశిష్టమైంది. వ్యవసాయ, సాంకేతిక రంగాల్లో వారు ప్రగతిని సాధించారు. నదులపై ఆనకట్టలు కట్టారు. నగరాల చుట్టూ కంచు కాలను నిర్మించారు. పరిశ్రమలు బాగా అభివృద్ధి చెందాయి. ముఖ్యంగా చేనేత పరిశ్రమ, ఉన్ని పరిశ్రమ, అద్దకం, బంగారు నగలు, నగల్లో విలువైన రాళ్లను తాపితం చెయ్యడంలో అందెవేసిన చెయ్యి వీరిది. తూర్పు, పశ్చిమ ఆసియా రాజ్యాలతో భూమార్గాల ద్వారా, సముద్ర మార్గాల ద్వారా వ్యాపారం చేశారు. క్రీ.పూ. 2000 సంవత్సరాల నాటికే దక్షిణ భారతదేశానికి, ఈజిప్టుతో సాంస్కృతిక సంబంధం ఉన్నట్లు సాక్ష్యం ఉంది. ద్రావిడులకు వాళ్ల లిపి, సంఖ్యా విధానం, క్యాలెండరు ఉన్నాయి. విజ్ఞాన శాస్త్రంలో, సారస్వతంలో వాళ్ల కృషిని ఆ కాలంలోని మూడు అకాడమీలను బట్టి నిర్ణయించవచ్చు. అప్పటికి ప్రపంచంలో ఎక్కడా ఆ సంస్థలను గూర్చిన భావన కూడా లేదు.

క్రీ.పూ. దాదాపు 1500 సంవత్సరములో ద్రావిడ సంస్కృతి అవిచ్ఛిన్నంగా దక్షిణ భారతదేశంలో అభివృద్ధి చెందుతుంటే, ఉత్తరాన వాయవ్య దిశలో ఉన్న సింధూ నాగరకతకు క్షీణ దశ ప్రాప్తించింది. ఆర్యులు వలస వచ్చి, ప్రబల శక్తితో నూతన సంస్కృతికి అంకురార్పణ చేశారు. ఆర్యుల జన్మ స్థలాన్ని గూర్చి ఎన్నో భేదాభిప్రాయాలున్నాయి. పూర్వం వాళ్లు మధ్య ఆసియాలో నివసించే వారనే అభిప్రాయం ఉంది. తర్వాత జరిగిన పరిశోధనల్లో, చరిత్రకారులు వాళ్లు స్కాండినేవియాకు చెందిన వారనీ, మరి కొందరు ఆసియా - రష్యాకు ఉరల కొండల తూర్పు భాగానికి చెందిన వారనీ తెల్పుతున్నారు. వారు వాయువ్య దిశనుంచి భారతదేశంలో ప్రవేశించారనే మాట స్పష్టం. దేవతలను గూర్చిన వారి శ్లోకాలు బహుశా భారతదేశానికి వచ్చిన తర్వాత వ్రాసినవనుకోవచ్చు. అవి ఋగ్వేదంలో ఉన్నాయి. ఋగ్వేదం హిందువుల మత గ్రంథం మాత్రమే కాదు, భారతదేశ చరిత్రకు మొట్టమొదటి ఆధార పత్రం కూడా. చాలామంది చరిత్రకారులు ఋగ్వేదంలోని శ్లోకాలను క్రీ.పూ. 1500-1000 మధ్యకాలంలో రాశారంటారు. ఐదువందల సంవత్సరాలకు చెందిన ఆర్యుల సాంస్కృతిక జీవితంపై ఋగ్వేద ప్రభావం ఎంతో వుంది. ఆ కాలంనాటి ఆధార గ్రంథం అదే. ఆ కాలాన్ని వేదకాల సంస్కృతిగా పరిగణించవచ్చు.

ఈ సంస్కృతికి కేంద్రం, అప్పటి తూర్పు పంజాబ్‌లోని సట్లెజ్, యమునా నదుల మధ్యనున్న ప్రదేశం. ఈ సంస్కృతి తూర్పున యమున, గంగా నదుల మధ్యనున్న డెల్టా ప్రాంతాలకు పాకింది. ఆర్యులు అప్పటికి పూర్తిగా ఆటవిక తెగలను వశం చేసుకోలేదు. వాళ్ళను దాస్యులని పిలిచేవారు. వాళ్లతో ఎడతెగని యుద్ధాలు చేసేవారు. ఆర్యులు ఆటవిక సంచార జీవిత సంస్కృతిని తెచ్చారు. అయితే, వాళ్ల మత భావాలు, ఆచరణలు, యుద్ధ కళ, వాటితోపాటు కవిత్వం బాగా అభివృద్ధి చెందింది. భారతదేశంలో రైతుల్లాగే వాళ్లు స్థిర నివాసాన్ని ఏర్పరచుకొన్నారు. అనేక తెగలు చిన్న చిన్న గ్రామీణ ప్రజాస్వామ్యాలను నెలకొల్పుకున్నారు.

తెగల అధికారులు ప్రాతినిధ్య వ్యవస్థలను ఏర్పరచుకొన్నారు. వాటినే సభలు, సమితులంటారు. వాటిపై ఆనాటి రాజులకు ఆధిపత్యం ఉండేది. రాజరికం వంశపారంపర్యం. యుద్ధంలో సైన్యంపై ఆధిపత్యాన్ని చెలాయించడమే అతని ముఖ్య కర్తవ్యం. సర్వ సైన్యాధికారి అతనికి సహా

యంగా ఉండేవాడు. ఆ తర్వాత పురోహితుడు చాలా ముఖ్యమైన పాత్ర వహించే వాడు. యజ్ఞయాగాదులను నిర్వహించడం, అప్పుడప్పుడు మంత్రాలుచ్ఛరించి, ఎన్నో వ్యాధుల నివారణ కూడా పురోహితుడు చేసేవాడు.

మొదట ఆర్య సంఘంలో రెండు వర్గాలుండేవి. రాజులు, మామూలు ప్రజలు, వంశపారంపర్యమైన కులాలుండేవి కాదు. భారతదేశంలో శాంతి యుత వాతావరణం నెలకొన్న తర్వాత, యుద్ధాలు ముగిశాక, వ్యవసాయ జీవితం ఆర్యులను మచ్చిక చేసింది. వారు ఆటవిక తెగలతో యుద్ధం విరమించారు. వాళ్లను, ఆర్యులు సాంఘిక విధానంలో కలుపుకోవాలనుకున్నారు. వారి రక్తం, దాస్యులతో కలసిపోతుందేమోనన్న దురాభిమానంతో జాగ్రత్తలు తీసుకొన్నారు. అందువల్ల దాస్యులనే వారు ప్రత్యేక కులంగా శూద్రులనే పేరుతో ఏర్పడ్డారు. సమాజంలో ఇది చివరి వర్గం. ఆర్యులకు వాళ్లతో వివాహ సంబంధాలు లేవు. తర్వాత సాంఘిక వ్యత్యాసాలు ఎక్కువగా ప్రకటితాలై దృఢతరమయ్యాయి. ఆర్యుల్లో కూడా యుద్ధం చేసేవారు క్షత్రియులు. బ్రాహ్మణులు, పురోహితులు, వైశ్యులు, రైతులు, వ్యాపారస్తులు ప్రత్యేక కులాలుగా తయారైనారు. వారి మధ్య వైవాహిక సంబంధాలు లేవు. ఈ సాంఘిక విభజనకు మతానుమతి ఇవ్వడం జరిగింది. ఋగ్వేదం నుండి ఒక శ్లోకాన్ని తీసికొని, బ్రహ్మముఖం నుంచి - బ్రాహ్మణులు, చేతులనుండి క్షత్రియులు, తొడలనుండి వైశ్యులు, కాళ్లనుండి శూద్రులు జన్మించారనే అర్థాన్ని చెప్పారు.

సమాజంలో మౌలిక విభాగం కుటుంబం. పితృస్వామిక విధానం అమల్లో ఉండేది. కుటుంబానికి పెద్ద తండ్రి. వారసత్వానికి అధిపతి అతడే. తండ్రి నుంచి కొడుకుకు ఈ వారసత్వం సంక్రమించింది. తల్లికి కుటుంబంలో గౌరవస్థానం ఉన్నా, తండ్రికన్నా తక్కువ స్థానంలో ఉండేది. వివాహ విషయంలో ఏక పత్నీ విధానం అమల్లో ఉండేది.

ఆర్యులు వ్యవసాయాన్ని ప్రధానంగా చేపట్టినా, వాళ్ల ఆర్థిక విధానంలో, పశుపాలన అంతకంటే ముఖ్యమైన స్థానంలో ఉండేది. భూమిని సాగుచేయడం కంటే పశుపాలనకే ఎక్కువ ప్రాధాన్యత. పశువుల ధరలు ఎక్కువ. అవి విలువైనవి ఇంకా వినిమయ మాధ్యమంగా వాడేవారు. వాటి మాంసాన్ని ప్రజలు తినేవారు. గొర్రెలను, మేకలను పెంచేవారు. యుద్ధాల్లో రథాలను తోలడానికి గుర్రాలను ఉపయోగించేవారు. మట్టితో గృహనిర్మాణం చేసే

వారు. కంచుపాత్రలను, ఆయుధాలను తయారుచేసే కళ అభివృద్ధిలో ఉండేది. దారం వడకటం, చేనేత, అద్దకం, వడ్రంగి, బంగారు నగల వ్యాపారం అమల్లో ఉండేది.

సంగీత, నృత్యాలు ఆదరణలో ఉండేవి. అయితే చాలా ముఖ్యమైన వినోదం జూదం. ప్రజలు మత్తుపానీయాలను ఎక్కువగా తాగేవారు. సామ వేదంలో మత ప్రాధాన్యం లభించిన సోమరసాన్ని ఎక్కువగా సేవించేవారు.

అయినప్పటికీ ఆర్యులు భౌతిక సంబంధమైన నాగరకతను ఎక్కువ స్థాయిలో సాధించలేదు. పట్టణాలు నిర్మించడం వీళ్లకు తెలియదు. ఇతర ప్రాచీన ప్రజలందరికన్నా మత చైతన్యం వీరికి ఎక్కువగా ఉండేది. దేవాలయాలను నిర్మించలేదు. విగ్రహాలను కొలవలేదు. వాళ్ల భక్తి, అగ్నిహోత్రాల్లో, అగ్నిని కొలవడంలో, దేవుళ్లను గురించి పాటలు పాడ్డంలో, అన్నం పాలు సోమరసాన్ని వారికి అర్పించడంలో, జంతు బలుల నివ్వడంలో యిమిడి ఉండేది. పౌరహితులు ఈ విధానంలో వాళ్లకు మార్గదర్శకులు. వీరు భారతదేశానికి రాక పూర్వం, ప్రకృతిని ఆరాధిస్తూ ఉండేవారు. వాళ్ల ప్రధాన దేవతలు ఇంద్రుడు, వరుణుడు, మిత్రుడు, సూర్యుడు, సవిత్ర, పుష్పన, విష్ణు, ఉష, అర్తి, వాయువు, అగ్ని. సోమవృక్షం పవిత్రమైంది. సోమపానీయం వారికి ఉల్లాసాన్నిచ్చేది. దాన్ని ఆధ్యాత్మికానందానికి పర మావధిగా భావించేవారు.

భారతదేశానికి వచ్చిన తర్వాత కూడ ఈ దేవుళ్లనే ఆరాధించేవారు. దేశ వాతావరణంలో ఏకత్వ విధానం ఉండడంతో, వాస్తవానికి, భిన్నత్వంలో ఏక రూపతను సాధించాలన్న ధ్యేయం స్పష్టమైంది. కనిపించే ప్రపంచ ప్రకృతిని దాటి ప్రకృతి దేవతను ఆరాధించే వారు. ఋగ్వేద శ్లోకంలో ఈ క్రింది విధంగాఉంది:

ప్రపంచమంతా వెదికి చూచినా నీరు తప్ప ఇంకేమీ లేదు.
నీటిలోనే అగ్ని ఉంది,
అదే దేవుళ్ళందరి ఆత్మగా మిణుకు, మిణుకు మంటుంది.
మనం భక్తిని సమర్పించేది ఎవరికి,
ఎవరు తమ అత్యున్నత శక్తితో,
నీటిని మథించి శక్తిని సృజించారో,

వాళ్లకే మనం అర్పిస్తాం, భక్తిని ప్రకటిస్తాం,
భూమ్యాకాశాల సృష్టికర్త అతడే,
పరవశత్వాన్నిచ్చే శక్తివంతమైన సముదాన్ని సృజించిందతడే,
అతని ఆగ్రహం మనపై చూపకుండా పూజిస్తాం,
అతనికే మనం అర్పిస్తాం, భక్తిని ప్రకటిస్తాం,
విశ్వ ప్రపంచాధినేతా!
నీవుకాక మరెవ్వరు సృజిస్తారీ విశ్వాన్ని,
మా ఆరాధనలు గైకొని మా లక్ష్యాలను ప్రసాదించు
మాకు భోగ భాగ్యాలను, సుఖ సంతోషాలను ప్రసాదించు.

ఆ రోజుల్లో దక్షిణ భారతదేశంలోని ద్రవిడ సంస్కృతి, వాయువ్య భారతదేశంలోని ఆర్యుల వైదిక సంస్కృతి, రెండూ విడివిడిగా ప్రవహించాయి. వాటి రెండింటి కలయికయే భారత దేశంలో ప్రథమ భారతదేశ జాతీయ సంస్కృతి ఆవిర్భావానికి నాంది పలికింది.

# 4. ప్రథమ సంగమం: వేదకాలంనాటి హిందూ సంస్కృతి

## (క్రీ.పూ.1000 - 600)

తర్వాతి నాలుగు శతాబ్దాల్లో నిరాడంబరమైన వైదిక సంస్కృతి అత్యున్నత దశను చేరుకొంది. మౌలికమైన మార్పు ఏమంటే, ఒక వైపు ఋగ్వేద కాలం నుంచి ఈగిసలాటంలో నుండిన ఏకత్వ భావన ఆర్యుల తాత్విక చింతనల్లో లోతుకు పాతుకు పోయింది. మరోవైపు ద్రావిడుల నుంచి తీసుకొన్న ప్రాచీన భారతీయ సాంప్రదాయం, మతంలో ఒక భాగం అయింది. నూతనమైన ఈ మతం వైదిక హిందూ మతంగా భాసిల్లింది. నూతన సంస్కృతికి ఇదే పునాది. దీన్నే వైదిక హిందూ సంస్కృతిగా పేర్కొనవచ్చు. ఈ నాలుగు వందల సంవత్సరాల కాలంలో మనకు, యజుర్, అధర్వణ, సామ వేదాలు మరికొన్ని సారస్వతాంశాలు వచ్చాయి. నాలుగు వేదాలు, వేదాంగాలు, బ్రాహ్మణాలు, వాటి అనుబంధాలైన అరణ్యకాలు, ఉపనిషత్తులు హిందువుల మత గ్రంథాలైనాయి. వైదిక కాలాన్ని గూర్చి, వైదిక హిందూ సంస్కృతిని గూర్చి తెలుసుకోడానికి చరిత్రకారులకు ఇవే ప్రధానమైన గ్రంథాలైనాయి.

సాంప్రదాయానుసారం, ఈ కాలంలో మహాభారత యుద్ధం జరిగింది. అప్పటి భారత రాజ్యాల్లోని రెండిటి మధ్య, అంటే పక్కపక్కల నుండే రెండు ఆర్య తెగల మధ్య యుద్ధం జరిగింది. వారే కురు, పాండవులు. ఇది వేదాల్లో పేర్కొలేదు. అక్కడ కూడ పేర్కొన్న విషయాలను బట్టి క్రీ.పూ. 900 ప్రాంతంలో బ్రహ్మాండమైన విపత్తు సంభవించిందనీ, దాని మూలంగా ఆర్యుల రాజకీయ, సాంస్కృతిక కేంద్రాలను తూర్పు పంజాబ్ నుంచి హస్తినాపురానికి తరలించడం జరిగిందనే విషయం తెలుతున్నది. హస్తినా

పురమే గంగానదీ డెల్టా ప్రాంతంలోని కౌరవుల రాజధాని. తర్వాత, ఆర్యులు ఇంకా తూర్పు ప్రాంతాలకు వెళ్ళి కోసల (Oudh), కాశీ (Banaras), వత్స (అలహాబాద్ సామీప్యంలో), విదీశ, మగధ (బీహార్)లలో రాజ్యాలను ఏర్ప రచుకొన్నారు. అదే విధంగా దక్షిణాదికి కూడా రాసాగారు. అల్లే అయోధ్య రాజపుత్రుడైన శ్రీరామచంద్రుడు, ద్రావిడుల సహాయంతో లంకాధిపతిని జయించాడు. ఇదే రామాయణంలోని కధాంశం. అగస్త్య పురాణంలోని చిట్ట చివరి అధ్యాయంలో, ఆర్యులు, ద్రావిడుల్లో తమ మతాన్ని ఏ రకంగా ప్రచారం చేశారనే విషయం స్పష్టంగా తెలుస్తున్నది.

ఇటీవలి సిద్ధాంతాల్లో రామాయణాన్ని భారతం కంటే ముందే రాశా రనీ, ఇంకో సిద్ధాంతంలో రామాయణంలో జరిగిన యుద్ధం ఆర్యులకు, ద్రావిడులకు మధ్య జరిగింది కాదని, కేవలం రెండు ఆర్య జాతుల మధ్య జరిగిందని; లంక అంటే శ్రీలంక కాదు మధ్యప్రదేశ్‌లోని లంక అనే పట్ట ణమని రకరకాల సిద్ధాంతాలు బయలుదేరినా, వాటిని ఇదమిద్ధంగా నిగ్గు తేల్చలేదు.

ఈ కాలంలో, రాజకీయ ఆర్థిక వ్యవస్థల్లో భౌతిక నాగరకతలో ఎంతో అభివృద్ధి జరిగింది. ప్రాచీన తెగల కాలంనాటి ప్రజాస్వామ్యం కన్నా భిన్నమైన రాజరిక వ్యవస్థ ఏర్పడింది. రాజే సార్వభౌమాధికారి. అతడు నిరంకుశుడు కాడు. బ్రాహ్మణుల సలహాలు, ప్రాచీన సాంప్రదాయాలు, ప్రజాభిప్రాయాన్ననుసరించి రాజ్యం ఏలేవారు. రాజుల రాజధానులే నగ రాలైనాయి. అవే రాజకీయ కేంద్రాలు. అందువల్ల గ్రామాల కంటే పట్టణా లకు ప్రాముఖ్యం పెరిగింది. సభ, సమితులు వాటి ప్రాముఖ్యాన్ని కోల్పో యాయి. ప్రభు వర్గం వారు ఆస్థానం చుట్టూ తిరుగుతూ, ఉన్నత పదవుల్లో నియమితులయ్యేవారు. రాజ్య పట్టాభిషేకం, ఇతరత్రా యజ్ఞ యాగాదులు జరిగేవి. వీటిలో అశ్వమేధ యాగం ప్రధానమైంది. మిగిలిన రాజులందరు చక్రవర్తి సార్వభౌమాధికారానికి తల వంచేవారు. తనకంటే ధీటైన చక్ర వర్తి లేడనిపించుకోడానికి ఈ క్రతువు నాచరించేవారు. దేవుడికి అంకితం ఇవ్వడానికి ఒక అశ్వాన్ని వదిలి పెట్టేవాళ్ళు. దాని వెనక రాజు సైన్యం తరలి వెళ్ళేది. రాజులు, ప్రభువులు ఎవరి రాజ్యంలో అశ్వం అడుగు పెడ్తుందో, ఆ రాజు ఈతని సార్వభౌమత్వాన్ని అంగీకరించాలి. లేకుంటే యుద్ధానికి సంసిద్ధులవాలి. ఒక సంవత్సర కాలం తరువాత ఆ అశ్వం

రాజధానిలో అడుగుపెడుతుంది. అశ్వమేధ యాగం ఎంతో వైభవంగా చేసి, అశ్వాన్ని బలి ఇస్తారు.

ఆర్యుల భౌతిక పరిస్థితులను చూస్తే, వారు తగరం, జింకును వాడే వారు. ఈ యుగాంతంలో అన్ని లోహాల్లోను మిక్కిలి ఉపయోగకరమైన ఇనుమును వాడ్డం ప్రారంభించారు. ఏనుగును మచ్చిక చేసి, వ్యాపార వస్తువులను చేరవేయడానికి రవాణా సాధనంగా వాడుకున్నారు. వ్యవసాయం అభివృద్ధి చెందింది. పొలాలకు ఎరువులు వేసి, నీటి పారుదల సౌకర్యాలతో వ్యవసాయం చేసేవారు. బంగారు, కంచు, ఇనుము లోహాలకు సంబంధించిన వృత్తులు, బుట్టలల్లడం, తాళ్లు పేనడం, నేత నేయడం, రంగులు వెయ్యడం; వడ్రంగి, కుమ్మరి వృత్తులు బాగా అభివృద్ధి చెందాయి. తాడుపై నడిచేవారు, గారడీలు, సోది చెప్పేవారు, పిల్లనగ్రోవి ఊదేవారు, నృత్యకారులు నాట్యం చేసేవారు కూడా అభివృద్ధి చెందారు. వాణిజ్యం అభివృద్ధిలో ఉండేది. ఆంతరంగిక వ్యాపారమేగాక, మెసపటేమియాలో కూడా వాణిజ్యం నిరాఘాటంగా సాగేది. సింధు లోయ నాగరికత కాలానంతరం విచ్ఛిన్నం చెందిన వ్యాపారం తిరిగి ప్రారంభమైంది. వేద సారస్వతంలో లోహ నాణ్యాలను గూర్చి పేర్కొనలేదు.

మతం, ఉపనిషత్తుల్లో కన్పించే తాత్వికచింతన ఈ కాలంలో అభివృద్ధిలో ఉండేది. వేదకాల సారస్వతాన్ని బ్రాహ్మణులు తమ 'జ్ఞాపక శక్తితో' నేర్చుకొని తర్వాత తరాలకు మౌఖికంగా అందజేశారు. రాయడమనేది ఉన్నట్లు ఎక్కడా సాక్ష్యాధారాలు లేవు. మెసపటేమియాతో వర్తకం చేసినందువల్ల మనకు లిపి సంక్రమించింది. ఈ లిపిని మన శబ్దాలకు అనుగుణంగా మార్చుకొన్నాం. మౌర్యుల కాలానికి అది బ్రాహ్మి లిపిగా రూపొందింది. మతం రెండు రకాలుగా అభివృద్ధి చెందింది. ఒకటేమంటే, కర్మకాండలు, భక్తి తత్పరత, వీటి మూలంగా భౌతిక సంక్షేమం, ఆధ్యాత్మికంగా నిర్వాణం చేకూరడానికి ఏర్పడ్డాయి. రెండో మార్గంలో, సన్యాసత్వం, తపస్సు, సత్యాన్వేషణకు సాధనాలుగా వాడటం జరిగింది. దీనిలోనే ఎంతో ఆలోచనా తత్పరత కొనసాగేది.

మొదటి మార్గంలో ఆర్యులు యజ్ఞయాగాదులు చేసుకొంటూ, పూజా పునస్కారాలు ఆచరించే వారు. అనార్యులు దేవునిపై భక్తి ప్రపత్తులు చూపేవారు. ఈ రెండూ విధానాలు కలిసే నేటి యజ్ఞసంబంధమైన పూజా

విధానంగా తయారైంది. మత కర్మకాండలు, పూజా పునస్కారాలు భారతీయుల జీవితంలో చాలా ప్రధానమైనాయి. కర్మకాండలు, వేదాలపై వ్యాఖ్యానాలైన బ్రాహ్మణికాల్లోను, అరణ్యకాల్లోను ద్యోతకమౌతున్నాయి. ఇంకో ప్రధానమైన అంశమేమంటే, ప్రాచీన ఆర్య దేవతలు తమ ప్రాముఖ్యాన్ని పోగొట్టుకొన్నారు. ఆర్యుల, అనార్యుల సంక్రమణతో కొత్త దేవుళ్ళు ఏర్పడి పూజలందుకున్నారు. వీరిలో ముఖ్యులు మహాదేవుడు, విష్ణుమూర్తి. మహాదేవునిలో, ఆర్య దేవుడైన రుద్రుని, సింధు నాగరకత కాలంనాటి శివుని, దక్షిణ భారతీయ దైవమైన పశుపతి లక్షణాలు మిళితమై ఉన్నాయి. విష్ణుమూర్తి ఆర్యుల సూర్యదేవుడి భావనలోంచి వచ్చినప్పటికీ, సృష్టి, స్థితి, లయ లనేవి మాత్రం భారతీయుల భావనయే. చిల్లర దేవుళ్లలో నాగరాజు, ఇంకా కొంత మంది దేవుళ్లు సర్వ దేవతాలయంలో ఉండేవారు.

రెండో మార్గంలో, ఆర్యులు భారతీయ పరిసరాల ననుసరించి తపస్సు చెయ్యడమనే ప్రక్రియ నూతనమైంది. ఋగ్వేదకాలం నాటికే ప్రకృతిని ఆరాధించడమనేది ఉన్నప్పటికీ, ఆ చివరి కాలానికి ప్రకృతి ఆరాధనలో కూడా సృష్టికర్త అయిన ఒకే దేవుని ఆరాధించే పద్ధతి వచ్చింది. వేదకాలం నాటి హిందూ యుగంలో ఋగ్వేదం నుంచి కొన్ని అంశాలను గ్రహించినా, విశ్వాన్ని గూర్చి, భగవంతుడు, మనిషికి సంబంధించిన అనేక విషయాల్లో సత్యాన్వేషణ చేసుకుంటూ, ఏకత్వ చింతనకు దారి తీసింది. ఉపనిషత్తుల సారాంశం దైవత్వంలో ఏకత్వమే. దేవుని ఆత్మ ప్రపంచమంతా వ్యాపించి ఉంది. వివిధ దేవుళ్లపై నమ్మకంతో ఎన్నో యజ్ఞయాగాదులను చేసినప్పటికీ, వారంతా ఒకే దేవుని బహుముఖ రూపాలని భావించేవారు. దేవుళ్లను ప్రపంచానికి సంబంధించిన వివిధ గుణగణాల ప్రత్యక్ష రూపాలుగా భావించడం జరిగింది త్యాగమనేది పరిత్యాగంలోను, ఆత్మ త్యాగంలోను ప్రధానమైంది. ఇది లేనట్లైతే ఆధ్యాత్మికాభివృద్ధి జరగదు.

మూడువేల సంవత్సరాల క్రితం భారతీయ మేధా సంపత్తి ప్రవచించిన భావం ఏకత్వ సిద్ధాంతమే యిది. దీనిపై హెగెల్ కాలం దాకా ఎన్నో మత, తాత్విక చింతనలు వాదోపవాదాలు జరిగాయి. తరవాత వచ్చిన వాటిలో ఉపనిషత్తుల వంటి సులభమైన స్పష్టమైన, విశ్వసనీయమైన వ్యాఖ్యానం మరొకటి లేదు. అందువల్లనే, తెలిసో, తెలియకో ఏకత్వ సిద్ధాంతమే భారతీయుల భావ పరంపరలో ఆచరణలో ముఖ్యపాత్ర వహించింది.

ఉపనిషత్తుల్లో మౌలికాంశాలున్నాయి. మానవుని మేధస్సులో పుట్టిన నైతిక, మత చైతన్యమనేది వీటి మూలంగా ఏర్పడ్డదే. మారుతున్న దృగ్గోచర ప్రపంచంలో జీవిత లోతులను చూడ్డం, తనలో తాను ఆలోచించుకోడం, లేక బాహ్యంగా ఆలోచించుకోవడమనే సత్యాన్ని గూర్చిన స్పష్టత ఏర్పడింది. నా జీవితంలో ప్రధాన ధ్యేయమేమిటి? నా నడవడిక ప్రధాన లక్ష్యమేమిటి? అని నిర్ణయించుకోవాలి. మొదటి ప్రశ్నకు ఋగ్వేదమిచ్చిన సమాధానం సులభతరమైంది, సంక్షిప్తమైంది. మనిషి ఆత్మకు, బ్రహ్మకు సంబంధించిన సత్యాన్ని స్పష్టీకరించింది. హేతుబద్ధంగా ఈ రెండింటి సంబంధాన్ని గూర్చి ఉపనిషత్తులు చర్చించాయి.

చందోగ్యోపనిషత్తులో, ప్రజాపతి ఇంద్రుని ప్రశ్నకు సమాధానమిస్తూ, ఆత్మను గుర్తించడమెట్లో, ఆ లక్షణాలేమిటో వివరించాడు. తప్పు, వృద్ధాప్యం, మరణం, బాధ, ఆకలిదప్పులు లేకుండా ఉండాలంటే, తానేం చెయ్యాలో, ఏమి ఆలోచించుకోవాలో అనేది తెలుసుకోగల ఆత్మ ఉండాలి.

ప్రజాపతి ఇంద్రుని తెలివి తేటలను పరీక్షించాలని ఆత్మకు, శరీరానికి ఉన్న సంబంధమేమిటి? కలలో వచ్చే స్ఫూర్తి ఏమిటి? నిద్రలేమిలో ఉండే చైతన్యరాహిత్య పరిస్థితి ఏమిటి? ఇంద్రుడు ఈ ప్రశ్నలకు సమాధానమివ్వనన్నాడు. శరీరం మార్పులకు గురౌతుంటుంది. పై చెప్పిన ఆత్మకు సంబంధించిన లక్షణాలేమి ఉండవు. కలలో ఏర్పడే స్పందన, అనేక మారుతున్న పరిస్థితుల మూలంగా ఏర్పడింది. అందువల్ల అది ఆత్మ కానేరదు. నిద్ర లేమి కారణంగా ఏర్పడ్డ అచైతన్య పరిస్థితి, ఆత్మకు అంటగట్టే నిషేధాత్మకమైన గుణగణాలే కాని వాస్తవికమైన గుణగణాలు కావు. ఆత్మ అనేది సార్వజనీనమైన చైతన్యం. ప్రతి ఒక్కరిలో ఉంటుంది. దానిని అంతర్వాణి మూలంగా తెలుసుకోవచ్చు. దీనికి వైజ్ఞానికపరమైన సిద్ధాంత సమర్థన అవసరం లేదు.

ప్రశ్నలోని రెండో భాగం "బ్రహ్మ అంటే ఏమిటి?" తైత్రీయ ఉపనిషత్తులో తండ్రి కొడుకుకు జరిగిన సంభాషణలో ఇది తెలుస్తుంది. కొడుకు తండ్రిని బ్రహ్మ స్వభావం తెలియజేయమని కోరతాడు. తండ్రి కింద పేర్కొన్న గుణగణాలను వివరిస్తాడు. "దాన్నుంచి సృష్టి జరుగుతుంది. మరణం తర్వాత అందరూ అక్కడికే చేరుకుంటారు. అదే బ్రహ్మం." ఈ గుణగణాలున్న విషయాన్ని ఆలోచించమని కొడుక్కు తండ్రి చెప్తాడు.

మరో మాటలో చెప్పాలంటే తండ్రీ, కొడుకులిద్దరూ శాశ్వతత్వాన్ని గూర్చి, ఏ మాత్రం మార్పు చెందడానికి వీలుకాని స్థాయికి చేరుకున్న దాన్ని గురించీ, వీటి అన్నింటిలోని సత్యాన్ని గురించి అన్వేషించ ప్రయత్నిస్తారు. కొడుకు పదార్థాన్ని గూర్చి ఆలోచించి, వృక్ష జంతు సంబంధ ప్రపంచంలో సంతృప్తికరమైన జవాబు దొరకదన్నాడు. బ్రహ్మయే ప్రాణం, జీవిత సిద్ధాంతం. అది కూడా అతనికి సంతృప్తినివ్వదు. మనిషిలోని చైతన్యాన్ని పూర్తిగా జీవితం ఇవ్వలేదు. గ్రహణశక్తినిచ్చే ఆ పదార్థాన్ని కొడుకు బ్రహ్మగా భావించాడు. హేతువాదం, గ్రహణశక్తికంటే మిన్న. ఏది సత్యం అనే అన్వేషణ జరుగుతుంది. ఇదే తాత్వికునికి అవసరమైన భావన. అద్భుతశక్తి కలదానికి ఇది సంతృప్తి నివ్వలేదు. స్వచ్ఛమైన హేతువుగా అందులో కూడా అనుకూల, ప్రతికూలాలుంటాయి. కొడుకును తైత్రీయ ఉపనిషత్తు ఇంకా ముందుకు తీసుకెళ్తుంది. సత్యాన్వేషణలో బ్రహ్మకు ఆనందంతో ఉన్న సంబంధాన్ని శోధన చేస్తాడు. మానవ మేధస్సు కనుక్కోవాల్సిన తుది సత్యం ఇదే. దీనికి గుణం లేదు. మార్మికుడు అంతర్వాణి మూలంగా తెలుసుకుంటాడే కాని, తత్త్వవేత్త కనుగొనలేడు. దీనికి సంబంధించిన తన అనుభవాన్ని ఇతరులకు తెలపాలంటే, పేరులేని ఈ అనుభవానికి పేరుపెట్టాలి. వర్ణించవీలుకాని దాన్ని వర్ణించాలి. ఉపనిషత్తులు ఆనందం అనే పదార్థాన్ని మనకర్థం అయ్యే విధంగా సత్యాన్వేషణ కోసం ప్రయోగించాయి. అంటే ధ్యానంలోనే పూర్తిగా నిమగ్నమవడం. ఈ దృష్టితోనే ఆత్మ, బ్రహ్మ అనే పదాలను అర్థం చేసుకోవచ్చు. ఇవే ఉపనిషత్తుల సారాంశం. అందులో ఉన్న సూక్తులు "ఆత్మేబ్రహ్మ" లేక "అదే ఇది." అంటే సార్వజనీనమైన జీవియే భౌతిక ప్రపంచంలో ఉన్న సత్యం. అదే సార్వజనీన చైతన్యం. అదే మానవ మేధస్సుకు అందాల్సింది కూడా.

ఉపనిషత్తులోని మొదటి మౌలిక ప్రశ్నకు జవాబు ఇదే. ఇప్పుడు రెండో ప్రశ్నకు కూడా జవాబు చెప్పవచ్చు. మానవ జీవిత లక్ష్య పరమావధి, మానవ నడవడిక పరమావధి ఆత్మను తెలుసుకోడమే. అప్పుడే సార్వజనీనమైన జీవాత్మను అర్థం చేసుకోవచ్చు.

ఆత్మ అంటే అవసరాలు, కోరికల కోసం పరితపించే ఆత్మ కాదు. ఆత్మ అంటే నిజమైన మేథస్సు. "ఈ విషయాన్ని తెలుసుకో. శరీరమనే రథంలో కూర్చున్న యజమాని ఆత్మ; కారణం నడిపేవాడు. విజ్ఞానం

కళ్లెం; ఇంద్రియాలు గుర్రాలు. ఇవన్నీ రథాన్ని నడుపుతాయి. మేథా సంపత్తి లేక విజ్ఞానాన్ని ఇంద్రియాలతో జోడిస్తే వచ్చే 'ఆనందమే' సూక్ష్మబుద్ధి గలవాడు తెలుసుకుంటాడు. అవగాహన లేక, ఆలోచించలేక, ఇంద్రియ సుఖాలను నియంత్రణ చేయలేక పోవడమనేది అటవీ గుర్రాలు రథాన్ని నడిపినట్లుంటుంది. తన ఇంద్రియాలను అర్థం చేసుకున్నవాడు సుశిక్షిత మైన గుర్రాలు రథాన్ని తోలినట్లుగా అర్థం చేసుకుంటాడు. తెలివిలేని వారు, అవివేకులు, విచ్చలవిడితనంగా ఉండేవారు శాశ్వతమైన ఆ అమరత్వాన్ని అందుకోలేరు. పునర్జన్మ చక్రంలో చిక్కుకుంటారు. తెలివైనవాళ్ళు, వివే కవంతులు, మితంగా ఉండేవారు ఇంకో ప్రపంచం చేరుకుంటారు. వాళ్ళు మరల ఈ ప్రపంచానికి రాలేరు. ఆత్మలో సంపూర్ణతను సాధించాలంటే ఆత్మనిగ్రహం ఉండాలి. మితంగా ఉండాలి. హేతుబద్ధమైన నియంత్రణ లోనే లైంగిక వాంఛలుండాలి. సత్యాన్వేషణలో మొదటి మార్గమేమంటే కోరికను నిరాకరించడం; ఆత్మ త్యాగం ఉండాలి కాని స్వయం ప్రేరణం (self-indulgence) ఉండకూడదు. ఈ విధంగా మన మనస్సు తుప్పు బట్టకుండా, మనభావాలే ప్రతిబింబించాలి.

ఉపనిషత్తుల ప్రకారం ప్రతి మనిషి జీవితంలో నాలుగు స్థాయిలను అనుభవించాలి. వీటిని బట్టే సత్యాన్వేషణ జరుగుతుంది. మొదటిది బ్రహ్మ చర్యం, తరువాత గృహస్థాశ్రమం, మూడోది వానప్రస్థం (ఆశ్రమవాస జీవితం), నాల్గోది సన్యాసం. జీవిత పయనంలో యాత్రికుడు ఈ నాలుగు దశలను అధిగమించాలి. జీవితంలో విజ్ఞానం, ధన సంపద, ప్రేమ, సేవా పరాయణత అన్న విలువలుండాలి. వీటిని అధిగమించేటప్పుడు పయ నంలో తుట్టతుది గమ్యాన్ని గూర్చి ఆలోచించుకోవాలి. ఈ గమ్యమే మోక్ష సాధన.

ఉపనిషత్తు బోధనలను చూచినట్లైతే, కర్మ సిద్ధాంతానికి, సంసారా నికి ప్రాముఖ్యం ఇవ్వడం జరిగింది. నైతిక ప్రపంచం అనుసరించే మౌలిక న్యాయం కర్మ సిద్ధాంతమే. మనిషి చేసే ప్రతి పని, మంచిదైనా, చెడ్డ దైనా అతని వ్యక్తిత్వంపై ప్రభావం చూపుతుంది. తెలిసి చేసిన పనులు క్రమంగా పెరిగి, తెలియకుండా చేసే అలవాట్లుగా మారతాయి. అవి నడ వడికలో భాగమౌతాయి. నడవడికే, పనిని నిర్ణయిస్తోంది. చేసే ఈ పనికి పర్యవసాన ఫలితాలుంటాయి. మన మనస్సు విష వలయంలో చిక్కు

కుంటుంది. పరిత్యాగం ద్వారా, ఆత్మత్యాగం ద్వారా, పక్కవారికి సేవచెయ్యడం ద్వారా మనిషి ఔన్నత్యాన్ని సాధించాలి. సార్వజనీన మేధా సంపత్తి ఈ క్రమంలో ఏర్పడుతుంది. అలాంటప్పుడు మనిషి కర్మ సిద్ధాంతం నుంచి బయటపడతాడు. కర్మతో పాటు ఆత్మ, నైతిక ధర్మాన్ని కోల్పోవడం, ఈ రెండూ కలిసినప్పుడు సంసార భావనలో తార్కిక పర్యవసానం కన్పిస్తుంది. కర్మ సిద్ధాంతాన్ని అధిగమించలేకపోతే, మరణం తర్వాత ఆత్మ మరల తలెత్తుతుంది. అప్పుడు పని ప్రభావం నడవడిక మీద, నడవడిక ప్రభావం పని మీద ఉండి, మరణం తర్వాత కూడా ఇది కొనసాగుతుంది. ఉపనిషత్తులు భావించినట్లు, మనిషి మరణానంతరం జీవితంలో చేసిన మంచి చెడ్డలను బట్టి స్వర్గానికో, నరకానికో పోతాడు. కొంతకాలం తరవాత పునర్జన్మ నెత్తి ఉన్నతుడుగా గాని, జంతువుగా గానీ, జన్మను పొందుతాడు. ఇది గొలుసు కట్టులాగా కొనసాగుతుంది. వ్యక్తి ఈ పరిధులు దాటగలిగి, అనంత లోకంలో సత్యాన్వేషణ చెయ్యగలిగితే ఈ విష వలయం నుంచీ, అంటే కర్మ, సంసారాల నుంచి తప్పించుకొని మోక్షాన్ని సాధిస్తాడు. ఉపనిషత్తులలోని ఏకత్వం వేదాంతం నుంచి వచ్చిందే. ఇది వైదిక హిందూ యుగం నుంచి సంప్రాప్తించిన వారసత్వం. అంతేకాక నాలుగు దశల్లోని జీవితం, కర్మ, సంసారం ఇవన్నీ హిందువుల మత నమ్మకాల్లో భాగాలే. భారతీయ కవిత్వంలో, సారస్వతంలో ఇవి కన్పిస్తున్నాయి.

ఈ కాలంలో ఏర్పడ్డ మత ప్రభావం, నైతిక ఆలోచన, క్రీ.పూ. 6వ శతాబ్దంలో ఎక్కువగా ఉండేది. (సృజనాత్మక ఆలోచన, నాగరిక ప్రపంచంలో చోటు చేసుకున్నప్పుడు - ముఖ్యంగా చైనా, గ్రీసు దేశాల్లో). ఇవి శాస్త్రీయ, సాహిత్య, మత ఉద్యమాలకు దారితీశాయి. ఇది దేశ సాంస్కృతిక సమైక్యతను కలచి వేసింది. కానీ భారతీయ మేధస్సుకు నూతనమైన, విభిన్నమైన భావాలను అందించింది.

# 5. బౌద్ధమతం - జైనమతం - రెండు దృక్పధాలు - ప్రధాన ఇతిహాసాలు

## (క్రీ.పూ. 600 - 200)

సాంస్కృతిక జీవన విధానంలో, అంతకుముందున్న జాతీయ సంస్కృతి నిరవధికంగా సాగింది. తర్వాత ఎనిమిది శతాబ్దాల వరకు కొత్త మతాలు, తాత్విక చింతనలు బయలుదేరాయి. అవే జైన, బౌద్ధమతాలు. హిందూ మతంలోని ఆరు తాత్విక చింతనలు. వీటిని ఇక్కడ పేర్కొనాల్సి ఉంది. బౌద్ధ మతం మానవ జీవితంలోనూ, ఆలోచనా విధానాల్లోనూ ఎంతో మార్పు తెచ్చింది. హిందూ సంస్కృతికి ఇది వ్యతిరేకి. సాంస్కృతిక చరిత్ర దృష్టితో పరిశీలిస్తే, హిందూమతం, జైన, బౌద్ధమతాలు వేటికవే తమ ముద్రను భారత సాంస్కృతిక జీవితంపై గాఢంగా ముద్రించాలని ప్రయత్నించాయి. చిట్టచివరకు హిందుమతమే విజయాన్ని సాధించింది. బౌద్ధమతం దేశ పొలిమేరలే దాటిపోయింది. అయినప్పటికీ, భారతీయుల మనస్సులపై, జీవితంపై గట్టి ముద్రనే వేసింది.

ఈ కాలాన్ని భారత దేశ చరిత్రలో గుర్తించాల్సిన అవసరం ఉంది. గతించిన కాలాన్ని గూర్చి మన విజ్ఞానం సగం మాత్రమే చారిత్రకం. మనకు మిగిలిన ప్రధాన ఆధారం వైదిక వాఙ్మయమే. అది మనకు చెదు రుమదురుగా సామాజిక, సాంస్కృతిక పరిస్థితులను తెలియజేస్తుంది. లభ్యమైన కొద్ది సమాచారం ఆధారంగా, క్రమానుగతంగా వివిధాంశాలను పొందుపరిచినప్పటికీ, ఎక్కువ విషయాలు లభ్యం కావటం లేదు. మనం చర్చించుకొనే కాలాన్ని బట్టి హిందూ, బౌద్ధ, జైన వాఙ్మయాలే కాక, గ్రీకులు రాసిన రచనలున్నాయి. ఆ కాలంలో గ్రీకులకు మన దేశంతో సంబంధం ఉండేది. లభించిన అన్ని ఆధారాల నుంచి విషయాన్ని సేక రించి, క్రోడీకరించి వీలైనంత వరకు చారిత్రక విషయాలను తెలుసుకోవచ్చు.

ఆరవ శతాబ్దంలోని మొదటి భాగంలో, కోసల, మగధ, వత్స రాజ్యాలు అభివృద్ధి చెందాయి. అవి నేటి మధ్యప్రదేశ్, బీహార్ రాష్ట్రాల్లో ఉండేవి. ఇవి కాక అవంతి (మాళవం) అనే కొత్త రాజ్యం తల ఎత్తింది. వీటిలో మగధ రాజ్యం విస్తృతమైంది, ప్రధానమైంది కూడా. ఆ కాలానికే అలగ్జాం డర్ భారతదేశంపై దండయాత్ర జరిపాడు (క్రీ.పూ. 326). మగధ రాజ్యం క్రమేపి చుట్టుపక్కల రాజ్యాలనన్నిటినీ కైవసం చేసుకొని పెద్ద సామ్రా జ్యంగా మారింది. మౌర్య చక్రవర్తులైన చంద్రగుప్త మౌర్యుడు, ఆయన మనుమడు అశోకుని పాలన కాలంలో, దక్షిణ భారత దేశంలో కొద్ది ప్రదేశం తప్ప తక్కిన ప్రాంతమంతా మౌర్య సామ్రాజ్యం విస్తరించింది. అశోకుడు బౌద్ధమతావలంబి, బౌద్ధమత వ్యాప్తి కోసం ఎంతో కృషి చేశాడు. ఆయన పోషణలో, అంతకు మున్నెన్నడు పైకి రాని నూతన సిద్ధాంతం తల ఎత్తింది. ఆయన తర్వాత కూడా మగధ రాజధానిగానే ఉండింది. పుష్య మిత్ర శుంగుడు మౌర్యరాజును (క్రీ.పూ.183)లో ఓడించి శుంగరాజ్యాన్ని ఏర్పరచాడు. ఆ తర్వాత రాజధాని మాళవానికి మారింది. ఆ రాజ్యంలో ఎన్నో సామంత రాజ్యాలుండేవి. అవి స్వల్పమైన కప్పం కట్టేవి. ఒక దాంతో ఇంకోటి ఎప్పుడూ యుద్ధం చేసుకొనేవి. మౌర్య సామ్రాజ్యం లాంటి సామ్రాజ్యం మరల ఏర్పడనే లేదు.

మౌర్య సామ్రాజ్య పతనానంతరం, బాక్ట్రియాలో చాలాకాలం చిన్న చిన్న రాజ్యాలను పాలిస్తుండిన గ్రీకులు భారతదేశంపై దండెత్తారు. వారు తూర్పు-పశ్చిమ దిశలనుంచి, క్రీ.పూ. 190 ప్రాంతంలో, భారతదేశానికి వచ్చి, సింధూ-పంజాబ్ ప్రాంతాలను ఆక్రమించుకొని తూర్పుభాగంలో చుట్టుపక్కల రాజ్యాలను జయించారు. మినాండర్ కాలంలో వారు పాటలీ పుత్రం వరకు వచ్చారు. మొదట వారిని యవనులని పిలిచేవారు. వారు విదేశీయులైనా, హైందవ సమాజంలో కలసిపోయి క్షత్రియులుగా పేరు పొందారు. గ్రీకుల తర్వాత స్కితియన్లు వచ్చారు. భారత దేశంలో వారిని "శకు"లని పిలుస్తారు. వారి రాజ్యం క్రీ.పూ. 90లో పంజాబ్, మధ్యప్రదేశ్ నుంచి మధుర వరకు వ్యాపించింది. ఆ తర్వాత కొద్ది కాలానికే పల్లవులు వచ్చారు. వారి పేరును బట్టి వారి జన్మ స్థలం పర్షియాగా సూచించడ మైంది. పశ్చిమోత్తర భారతదేశంలో వారు పాలకులుగా ఉండగా యు-ఛీ వంశానికి చెందిన కుషానులు వారిని ఓడించారు. కుషాను రాజుల్లో కని

ష్కుడు గొప్పవాడు. అతడి సామ్రాజ్యం మధ్య ఆసియా నుంచి కాశీని దాటి విస్తరించింది. అతని సామ్రాజ్య ప్రారంభాన్ని గుర్చి ఇతమిద్ధమైన అభిప్రాయం లేదు. బహుశా క్రీ.శ.78లో శకుల ప్రారంభదశలో రాజ్యాభిషిక్తుడయాడని చెప్పవచ్చు. కనిష్కుడు బౌద్ధ మతావలంబి. ఈయన కాలంలో బౌద్ధ మతంలో ఒక నూతన శాఖ, మహాయాన బౌద్ధ మత శాఖ, ఏర్పడింది. గాంధార శిల్పం ఈతని కాలంలోనిదే. ఇతని కన్నా వంద సంవత్సరాలకు ముందే ఒరిస్సాలో ఖారవేలుడు పెద్ద సామ్రాజ్యాన్ని పాలించాడు. అది ఎక్కువ కాలం కొనసాగలేదు. అతడు జైనమతావలంబి. ఇదే కాలంలో శాతవాహన రాజులు మౌర్య వంశ శిధిలాలపై తమ సామ్రాజ్యాన్నేర్పర్చు కొన్నారు. శాతవాహనుల పరిపాలన నాల్గువందల సంవత్సరాలపాటు సాగింది.

ఈ ఎనిమిది వందల సంవత్సరాల కాలపరిమితిలో కొత్త ఉద్యమాలు, మత, విజ్ఞాన రంగాల్లో తలెత్తి ప్రజల్ని ఉక్కిరి బిక్కిరి చేశాయి. జాతీయ ఐక్యత నశిస్తుందేమోననే భయం కూడా ఉండేది. వైదిక హిందూ సంస్కృతి నాశనమై, దేశ సంస్కృతి విచ్ఛిన్నమై, విడిపోతుందేమోనన్న భావం ఏర్పడింది. ఈ ఉద్రేకం ఎంతో ఉపయోగమైంది. భారతీయుల మనస్సుపై గాఢమైన ముద్రవేసి, నూతన భావాలను ప్రోది చేసింది. ఆ తర్వాత, వివిధ భావాల కలయికతో ఒక నూతన సంస్కృతి గట్టి పునాదులతో దృఢంగా నాటుకొంది.

వైదిక హైందవ సంస్కృతి చివరి దశలో, దేశంలో మత జీవన విధానంలో సమతౌల్యత లోపించింది. ఒక వైపున బాహ్మణులు కర్మకాండలను, యజ్ఞయాగాదులను చేస్తుంటే, ఇంకోవైపు ఉపనిషత్తుల ప్రబోధనల కర్మకాండలను నిషేధించమని ప్రోత్సహించింది. దీనివల్ల ఆదర్శతత్వం ఆధారంగా, నూతన మతం ఏర్పడింది. ఈ తత్వాన్ని అర్థం చేసుకోడానికి సమర్థత ఉన్న ఉన్నత వర్గాలు యోగుల జీవితాన్ని గడపడమే ఉత్తమమని భావించడమే కాక, తాము ఆ జీవితాన్నే చేపట్టారు. కులతత్వం వేళ్లూనింది. ఉన్నత, వెనుకబడ్డ వారిమధ్య అగాధం పటిష్టమైంది. వారి వారి సంస్కృతుల్లో భేదాలు పొడచూపాయి. వీళ్లు వేదాధ్యయానికి అనర్హుల నేది స్పష్టమైంది.

ఈ కాలంలోనే గౌతమ బుద్ధుడు (క్రీ.పూ. 563 - 482) ప్రజల కర్మ

కాండలను, ఉన్నత వర్గాల సన్యాసాన్ని నిరసించాడు. వర్ణభేదాన్ని, సామాజిక వ్యత్యాసాలకు విరుద్ధంగా పోరాటం సల్పాడు. ప్రపంచానికి తన సందేశంలో ఓర్పు, ప్రేమ, ఆత్మ త్యాగాలను గూర్చి ఎలుగెత్తి చాటాడు. తాను మహాత్ముడైన తర్వాత, కాశీలో ఎన్నో ప్రబోధాలను చేశాడు. బౌద్ధ బిక్షువులు మితం తప్పరాదనీ, అతిగా ఏ పని చేయరాదనీ, అప్పుడే వారికి ప్రపంచాన్నుంచి నిష్కృతి కలుగతుందనీ చాటాడు. ఉద్రేకపూరితమైన ఏ పనీ, శారీరక వాంఛలకోసం చేయరాదు. అలాచేస్తే జీవితం బాధామయమౌతుంది. అంతేగాక తుచ్ఛమైందిగా భాసిస్తుంది. బుద్ధుడు కన్గొన్న మధ్య మార్గం వేరే ఉంది. అదే అందరికి కళ్లను తెరిపిస్తుంది. మేధస్సును పెంచుతుంది. మానవులకు దీని మూలంగా శాంతి, ఔన్నత్యం లభించి, నిర్వాణానికి దారి చూపుతుంది.

బుద్ధుడు మానవుని మనస్సును గూర్చి, బాధను గూర్చి తీవ్రంగా ఆలోచించాడు. బాధలన్నిటికి మూలం కోరికలే. ఆత్మ నియంత్రణే దీనికి నివారణోపాయం. పరిశుద్ధ భావాలతో నైతిక జీవితాన్ని గడపి, ఆధ్యాత్మిక చింతనలు చెయ్యాలి. లక్ష్య సాధనకోసం కోరికలను చంపుకోవాలి. జీవితంలో మోక్ష సాధనకంటే మించింది లేదు. దాన్నే బుద్ధుడు 'నిర్వాణం' అన్నాడు. "ఎవరైతే సత్యాన్వేషణ భావనను మాటలో, పనిలో చూపగలుగుతారో, వారికే శాంతి లభిస్తుంది." కాశీలో ఇచ్చిన ఉపన్యాసంలో బుద్ధుడు, సత్యం మూలంగా బాధ ఏమిటి? బాధల నుంచి ఎలా బయట పడాలి? అనే విషయాలను తన అనుభవాలతో విశ్లేషిస్తాడు. బాధను పోగొట్టుకోవాలంటే తరుణోపాయం ఏమిటి? తన ఉపన్యాస సారాంశాన్ని ఈ కింది విధంగా తెలియజేస్తాడు. మంచిమార్గం మూలంగా సత్యాన్వేషణను సాధించవచ్చు. ఇది ఎనిమిది విధాలు - (1) మంచి నమ్మకం, (2) మంచి కోరికలు, (3) మంచి మాట, (4) మంచి నడవడిక (5) మంచి జీవితం, (6) మంచి ఆలోచనలు (7) మంచి ప్రయత్నం, (8) మంచి ఆనందం.

బుద్ధుడు ఆత్మ నిగ్రహం మంచిదనీ సోమరిపోతుగా ఉండడం కంటే కష్టపడి పనిచెయ్యడం అవసరమన్నాడు. ప్రపంచం నుంచి దూరమవడమంటే మానవత్వం మీద ఆశ వదులుకొమ్మని కాదు. సర్వ మానవత్వమే శాంతికి మూలం. ద్వేషం మూలంగాకాక ప్రేమ మూలంగా దేన్నైనా

సాధించవచ్చు. సంతోషదాయకమైన జీవితం గడపాలంటే శత్రువును కూడా ప్రేమించగలగాలి. ప్రేమతో కోపాన్ని, మంచితనంతో చెడ్డను, ఔదార్యంతో స్వార్థాన్ని, సత్యంతో అసత్యాన్ని జయించాలి.

గౌతమ బుద్ధుడు తన శేష జీవితమంతా బౌద్ధమత ప్రచారంతో గడిపాడు. దేశ దేశాలు తిరిగాడు. అతని తర్వాత అతని అనుయాయిలు ఆ మార్గాన్నే అనుసరించారు. అయినప్పటికీ మొదటి వంద సంవత్సరాలు ఇతని సిద్ధాంతాన్ని ఎవరూ ఆచరించలేదు. కోసల, మగధ రాజ్యాల వరకే పరిమితమైంది. బౌద్ధమతం అశోకుని కాలంలో భారతదేశంలోనే కాక, విదేశాలకు కూడా వ్యాపించింది.

బౌద్ధమతం విపరీతంగా వ్యాప్తినొందినందువల్ల, ఈ వ్యవస్థలో సమగ్రత, సమన్వయం కుదరలేదు. బౌద్ధమతం రెండు శాఖలుగా విభజితమైంది. వీటిలో హీనయానం మొదటిది. అతి ఛాందసమైంది. మహాయానం హీనయానం కంటే అర్వాచీనమైంది. ఛాందసం పాలు తక్కువ. కనిష్కుడు మహాయాన మతాన్నే భారతదేశంలోను, విదేశాల్లోను ప్రచారం చేయించాడు. దేవుడంటే నమ్మకంతో, బుద్ధుడే దేవుళ్ళలో గొప్పవాడుగా భావించాడు. పూజా పునస్కారాలతో దేవుని పూజించాలన్నాడు. భక్తి, పూజ, దానధర్మాలతో లక్ష్య సాధన చేకూరాలే కాని, ఆత్మనిగ్రహం వల్ల, ఆత్మ సంస్కారం వల్ల అది చేకూరదని భావించాడు.

కొంత కాలానికి భారతదేశంలో బౌద్ధమతం క్షీణించింది. దానికి కారణం వివిధ శాఖల్లో ఏర్పడ్డ వ్యత్యాసాలు, విభేదాలే. పైగా, బౌద్ధ మత విరాళాలతో, బౌద్ధ బిక్షువులు ఆడంబర జీవితాన్ని గడపటం, నైతికంగా పతనమవడం ముఖ్య కారణాలు.

ఈ కాలంలోనే బుద్ధునికి సమకాలికుడైన మహా వీరుడు (క్రీ.పూ. 522 - 480) జైనమతం అనే పేరుతో నూతన మతాన్ని ప్రారంభించాడు. ఆయన బోధనల్లో ప్రధానంగా మనిషి కోపం, ఆత్మ వంచన, అత్యాశ, గుడ్డి ఆరాధన ఉండరాదని చెప్పాడు. ఆత్మ సర్వవ్యాప్తమైంది. అయితే బంధాలవల్ల కదల లేకున్నాడు. ఆత్మకు స్వేచ్ఛ లభించాలంటే, ఈ బంధాలనుంచి నిష్కృతిని పొందాలి.

ఈయన సిద్ధాంతాలను "త్రిరత్నాలు" (Three Jewels) అంటారు. అవి మంచి నమ్మకం, మంచి విజ్ఞానం, మంచి నడవడిక. సర్వజ్ఞులైన

త్రిరత్నకారులు చెప్పిన బోధనలే మంచి విజ్ఞానంగా పేర్కోవచ్చు. మంచి నమ్మకమంటే తప్పు చెయ్యరాదనే నమ్మకం, బోధకుల పై దృఢ నమ్మకం విశ్వాసం ఉండాలి. దయాదాక్షిణ్యాలు, శీలం, ప్రాపంచిక విషయాలపై చింతన లేకుండడం, గౌరవ ప్రదమైన నడవడిక లుండాలి. అంటే దొంగ తనం చేయరాదు. అసత్యం పలుకరాదు. అహింసయే పరమ ధర్మం. అన్ని జీవులను ప్రేమతో చూడాలి.

కర్మ సిద్ధాంతం పట్ల, హిందువుల్లాగే జైనులకు నమ్మకం ఉంది. నిష్ఠతో ఆచరించినట్లైతే, ఆత్మత్యాగానికైనా జైనులు అంగీకరిస్తారు. సంపూర్ణ మానవుడు కావాలంటే త్రిరత్నాలను ఆచరించి తీరాలి. అప్పుడే అతనికి పరిపూర్ణ జ్ఞానం, మోక్ష ప్రాప్తి సిద్ధిస్తుంది. జైనులకు దేవునిపట్ల నమ్మకం లేదు. హిందూమతంలో భగవంతుడు ఎలాగో, జైనమతంలో అరహాట్ అనే భావన కూడా అలాంటిదే. సంపూర్ణ మానవుడు, అతను చేసే పూజల్నిబట్టి కాక, సంపూర్ణత్వానికే మార్గదర్శకుడిగా పరిగణిస్తాడు. పూజించడమంటే ఆయన సలహాను పొందటమే. ఆధ్యాత్మికంగా లబ్ధి పొందాలని కాదు.

బౌద్ధమతంలో లాగే జైనమతంలో కూడా క్షీణదశ ప్రారంభమైంది. అయితే, ఇది ఈ దేశంలో పూర్తిగా తుడిచిపెట్టుకుపోలేదు. హిందూమతంలో కలిసిపోయింది. కొంతవరకు దానికి విరుద్ధంగా నడిచే శాఖగా కూడా పరిణమించింది.

బౌద్ధ, జైనాలు రెండూ హిందూ మతంపై సవాళ్లు విసిరాయి. హిందూ మత ఆలోచనాపరుల్లో కొత్త ప్రేరణను కల్గించాయి. పాత ఫక్కీని వదలి నూతన మార్గంలో పయనించడానికి దోహదం చేశాయి.

ఛాందసులైన హిందువులు మాత్రం వేదాలను వల్లించటం మాన లేదు. వాళ్లదృష్టిలో జీవితమంటే, (1) బ్రాహ్మణుల ఆధ్వర్యంలో కర్మకాండలను, యజ్ఞయాగాదులను చెయ్యడం. (2) కులవ్యవస్థ నిర్దేశించిన నియమాలను పాటించడం, చిన్న చిన్న వాక్యాల్లో వేదాల వ్యాఖ్యానాలను చెయ్యడం, సూత్రాలను వల్లించడం, వాటిని అనుసరించడమే తరుణోపాయంగా భావించారు. ఈ కర్మకాండను, పూజా విధానాన్ని, నైతిక పద్ధతులను గూర్చి ధర్మ శాస్త్రాల్లో వివరించడం జరిగింది. ప్రభుత్వం, రాజకీయ సంస్థలగూర్చి మౌర్య చంద్రగుప్తుని కాలంనాటి రాజకీయ, ఆర్థిక పరిస్థితులను కౌటిల్యుడు, తన "అర్థశాస్త్రం"లో వివరించాడు. ఇది ఉద్గ్రంథం.

మనువు, మనుధర్మ శాస్త్రాన్ని, బహుశా శుంగవంశ రాజు (క్రీ.పూ. 200-100) కాలంలో రాశాడు. ధర్మ శాస్త్రాలన్నింటిలో యిది ప్రాచుర్యం పొందింది.

వీటికితోడు, తాత్వికులు ఆధ్యాత్మిక రంగంలో ఎన్నో ఊహాచింతనలు చేశారు. ఆరు వ్యవస్థల హిందూ తత్వాన్ని కనుగొన్నారు. వీటిలో సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషికాలు ప్రధానమైనవి. వేదాల ప్రభావం వాటిపై లేదు. అయితే పూర్వమీమాంస, ఉత్తర మీమాంసలు ఉపనిషత్తు బోధనలపై ఆధారపడ్డవే.

సాంఖ్య సిద్ధాంతం ఉపనిషత్తుల్లాగే, బ్రాహ్మణులు జరిపే కర్మకాండలపై నమ్మకం చూపలేదు. శాంతి, మోక్షం కోసం ఇంకొన్ని పద్ధతులను స్వీకరించింది. జీవాత్మపై నమ్మకం ఉంది కాని, పరమాత్మపై పూర్తి నమ్మకం లేదు. ఆత్మ, శరీరంతో సంబంధం ఉన్నంత వరకూ ఉద్రేక పూరితంగానే ఉంటుంది. బాధలను భరించక తప్పదు. మరణానంతరం ఆత్మ ఇంకో శరీరంలో ప్రవేశిస్తుంది. అంటే ఆత్మకు మరణం లేదు. పునర్జన్మ సిద్ధాంతంపై నమ్మకం ఉంది. బాధలు శరీరానికేగాని, ఆత్మకు లేవు.

తత్వ శాస్త్రంలో సాంఖ్యకు సముచితమైన స్థానం ఉంది. మనస్తత్వ విజ్ఞానశాస్త్రాలకు ఇది ఎక్కువ కృషి చేసింది. సామాన్య మానవులకు అవసరమైన మోక్ష ప్రాప్తిని గూర్చి ఇది పేర్కొలేదు. ఈ లోపాన్ని, పతంజలి యోగంలో సవరించడం జరిగింది.

సిద్ధాంతరీత్యా, పతంజలి యోగ శాస్త్రానికి స్వతంత్రస్థానం లేదు. సాంఖ్యతత్వానికిది అనుబంధం మాత్రమే. పతంజలిలోని మనస్తత్వ శాస్త్రానికి చెందిన భావాలు, విజ్ఞాన శాస్త్ర సిద్ధాంతం సాంఖ్యయోగం నుంచి గ్రహించినవే. ఆయన భావన, సాంఖ్య భావనయే. ఆత్మ ప్రకృతి బంధాలనుంచి, శరీరం నుంచి, కర్మ సిద్ధాంతం నుంచి, కర్మ బంధాలనుంచి వేరయి తానే సత్యాన్ని అన్వేషిస్తుంది. దీన్ని ఆయన 'యోగం' అన్నాడు. పూజ, పునస్కారాలు మూలంగా, ఆధ్యాత్మిక శిక్షణ వల్ల దీన్ని సాధించవచ్చు. ఇందులో ఒక స్థాయికి చేరేసరికి, యోగంలో అద్భుతశక్తులు వస్తాయి. భూమ్యాకాశాలను, భూత భవిష్యద్వ ర్తమానాలను తెలుసు కోగలుగుతాడు. ఆకాశంలో విహరించగలడు, నీటిపై తేలగలడు. అయితే అతను కోరుకునేది పూర్తి బంధాలను నుంచి విముక్తుడై, బ్రహ్మానంద లోకాన్ని చేరుకోవడమే. న్యాయ, వైశేషిక వ్యవస్థల మోక్షప్రాప్తినే సూచిస్తుంది. అన్ని భార

తీయ తాత్విక వ్యవస్థలకు ఇదే గమ్యం. ఈ మోక్షం సత్యం లేక వాస్తవిక విజ్ఞానం ద్వారా సంప్రాప్తమవుతుంది. ప్రేరణతో (intuitive) పలికేది కాదు విజ్ఞానమంటే. పరిశీలన, హేతుబద్ధత, ప్రయోగాలపై సత్యాన్వేషణ ఆధారపడి ఉంటుంది. న్యాయ వ్యవస్థ ప్రమాణ, ప్రమేయాలపై ఆధారపడి ఉంటుంది. న్యాయ స్థానంలో వీటిని రుజువు పర్చవచ్చు. మొదటి దానిలో తర్కం, విజ్ఞానపరమైన సిద్ధాంతం ఉంటే, రెండోది భౌతికపరమైన, అంటే విజ్ఞాన శాస్త్రాల ద్వారా సంక్రమించింది. 2500 సంవత్సరాలనాటిది. పరిపూర్ణత, ఆలోచనా విధానంలో సూక్ష్మత విషయంలో ప్రాచీన గ్రీకులదే పైచెయ్యి.

హైందవతత్వంలో మిగిలిన రెండు వ్యవస్థలు పూర్వమీమాంస, ఉత్తర మీమాంసలు. పై నాల్గింటికన్నా భిన్నమైన వాటికి ప్రేరణ వేదాలనుంచి లభించింది. వీటిలో విజ్ఞానమంటే అంతర్‌దృష్టికి సంబంధించింది కాక శాస్త్రీయ సంబంధమైంది. పరిశీలన, హేతువాదం, ప్రయోగాలతో సత్యాన్వేషణ చేయడం జరిగింది. పూర్వమీమాంస, ఉత్తర మీమాంసలు రెండూ వేదాధ్యయనం ద్వారా ప్రేరణ పొందినవే. పూర్వమీమాంస, వేదాలు స్పష్టమైనవి. వాటి ఆదేశాలను అనుసరించి తీరాలి. వేదాలకు మత సిద్ధాంతంతో కాని, నీతితో గాని సంబంధం లేదు. అయితే కర్మకాండలు పండుగలు యజ్ఞాలు, ఉపవాసాలు, పూజా కార్యక్రమాలతో సంబంధం ఉంది. ఒకే వైపున్న ఈ దృక్పథం, బహుశా ఆనాటి మతతత్వానికి విరుద్ధం. పూజా విధానాన్ని, ఆ కర్మకాండలను పూర్తిగా తిరస్కరించింది. పూర్వమీమాంస వేదాల్లో ఒక అంశానికి ప్రాధాన్యమిస్తే, ఉత్తర మీమాంస ఇంకో విషయానికి ప్రాధాన్యమిచ్చింది. అదే ఏకత్వ సాధన. ఈ రెండు దృక్పధాలు మతతత్వానికి కూడా ప్రతిబింబాలు. బౌద్ధ, జైన మతాలకు విరుద్ధంగా వైదిక హిందూ మతాన్నీ ప్రమాణీకరించడమే వీటి లక్ష్యం.

ఇదే కాలానికి చెందిన మరో ముఖ్యమైన తత్వశాస్త్రం భగవద్గీత. గీత ఒక ప్రత్యేక గ్రంథం కాదు. మహాభారతంలో ఇది ఒక భాగం.

భగవంతుడి సృష్టిలోని మానవులను వధించడం ఎంతవరకు సమంజసమన్న ప్రశ్న అర్జునుడు కృష్ణుడిని వేస్తాడు. అందులోను తన సొంత అన్నదమ్ములను చంపడం సమంజసమా? ఒక వైపున క్షత్రియునిగా సత్యాన్ని, న్యాయాన్ని సంరక్షించడానికి పోరాడడం తన విధ్యుక్త ధర్మమే.

అయితే ప్రేమ, సౌభ్రాతృత్వమున్న సోదరులను చంపడం ఎంతవరకు సమంజసం. ఈ రకంగా మానసిక సంక్షోభానికి గురైన అర్జునుని, విష్ణు రూపుడైన శ్రీకృష్ణుడు రధసారధిగా ఉండి ఆధ్యాత్మిక బోధతో అతని రక్ష ణకు వస్తాడు.

అర్జునుడి బాధ ఏమంటే, నైతికంగా తన విద్యుక్త ధర్మాన్ని నిర్వ ర్తించాలి. కాని, ఈ పని చేయటం వల్ల నైతిక ధర్మాన్ని కోల్పోయినట్లే. అప్పుడు శ్రీకృష్ణుడు ఉపనిషత్తుల మూలంగా, తత్వశాస్త్రంలోని మౌలిక మైన సిద్ధాంతాలను అర్జునిడికి చెప్తాడు. ఆయనచెప్పిన విషయమేమంటే, నైతికంగా కార్యక్రమాన్ని నిర్వర్తించాలంటే దీన్ని మత సంబంధమైందిగా చూడాలి. వ్యక్తిగత చర్యలనైనా మత దృష్టితోనే పరిశీలించాల్సి ఉంది. ఉపనిషత్తుల ప్రకారం మత ఆదర్శం ఏమంటే మానవుల ఐకమత్యాన్ని కాపాడమే. ఇందులో మనకు కావాల్సింది కేవలం విజ్ఞానం కాదు. బ్రహ్మ భావించినట్లుగా చేయాల్సి ఉంది. అన్వేషణను అనుభవించే ఇద్దరూ ఏకీ భవించేంత వరకు ఇది కొనసాగాలి. ఈ స్థాయికి మనిషి కార్యక్రమం మారుతూ ఉంటుంది. సాధారణంగా తన కోసమే తాను పనిచేసుకుం టాడు. విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించడం కోసం, సమాజం కోసం పనిచే యాలి. ఆ విధంగా పనిచేసేటప్పుడు మనం ఇలా చేస్తే ఫలితాలు ఏమిటి అని ఆలోచించరాదు. అర్జునుడికి శ్రీకృష్ణుని సలహా ఏమిటంటే క్షత్రియు డిగా సమాజంలో తన భాధ్యతలను నిర్వహించాలి. ఆ చేసే పనిలో ఆధ్యాత్మికంగా ఆలోచించి నాకు సంబంధం లేదని చేయాలి. కేవలం కోరికలను మాత్రమే తీసుకున్నట్లయితే ఇది జరగదు. పర్యవసానం గురించి ఆలోచించరాదు. తను పనిచేస్తున్నాననే భావన కూడా ఉండరాదు. సృష్టి కర్త బ్రహ్మకు తాను ప్రతినిధిననుకొని పనిచేయాలి. తన పనిగాని, తన వ్యక్తిగత మనుగడ కానీ కేవలం నిమిత్త మాత్రమేనన్న విషయాన్ని గుర్తిం చాలి.

భగవద్గీత కేవలం ఒక వ్యాఖ్యానం కాదు. ఇది ఉపనిషత్తులకు అను బంధం కూడా. ఉపనిషత్తుల్లో మత సిద్ధాంతాలను గురించిన ప్రాధాన్యత ఉంటుంది. బ్రహ్మ, ఆత్మ రెండూ సమానమే. బ్రహ్మను తెల్సుకోవాలంటే మోక్షాన్ని పొందాలి. ఈ విషయంలో గీత ఆచరణాత్మకమైన దృక్పధాన్ని చూపుతుంది. గీత మోక్ష సాధనకు మూడు మార్గాలను సూచించింది -

(1) విచారణ. సన్యాసాన్ని క్రమశిక్షణ ద్వారా అనుసరించడం, (2) నమ్మకం. భక్తి ద్వారా సాధించడం, (3) చేసేపని ద్వారా చూపడం. ఈ మూడు విషయాలను ఉపనిషత్తులు పేర్కొంటున్నాయి. అయితే స్వచ్ఛమైన పరిజ్ఞానానికి ప్రాముఖ్యత ఇవ్వడం జరిగింది. భక్తి మార్గానికి అంత ప్రాముఖ్యం లేదు. సత్యాన్వేషణలో ప్రధానమైన అంశం వైజ్ఞానిక పరమైనది. ఇందులో ప్రేమకు భక్తికి సంబంధం లేదు. పని అనేది పరిజ్ఞానం కంటే తక్కువగా గుర్తింపు పొందింది. ఉపనిషత్తులు ఏ పనినైనా సత్యాన్వేషణకు సంకెళ్ళ వంటివని భావిస్తాయి. దాని తరువాత స్థానం పరిజ్ఞానం. వీటి అన్నింటి మూలంగా మోక్షాన్ని సాధించవచ్చు. అయితే గీత ఈ అపార్థాన్ని తొలగించి సరియైన అర్థాన్ని ఇచ్చింది ఉపనిషత్తుల్లో ఆత్మ, పరమాత్మల సంబంధం గురించి తెలుస్తుంది. ఇది అస్పష్టమైన భావన కాదు. ఇది ఆధ్యాత్మిక చింతనతో కూడినది. ప్రేమ భక్తి ద్వారా భక్తుడు భగవంతునిలో విలీనం కావాలి. విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చటానికోసం చేసిన ధర్మం ఒక అడ్డుగోడ కాదు. ఇది లక్ష్య సాధనకు చాలా మంచి సాధనం. హిందూమతంలోని ఆలోచనా పరులు ఆ మతాన్ని సంస్కరించాలని, దానికి నైతిక ఆధ్యాత్మిక బలాన్ని చేకూర్చాలని, బౌద్ధమతానికి వ్యతిరేకంగా జాతీయ మతంగా తీర్చిదిద్దాలని ప్రయత్నిస్తున్నారు. ఈ ఉద్యమం మతానికి, తత్వానికి మాత్రమే చెందక వైజ్ఞానిక స్థాయికంటే దిగువనున్న భావనలో అంటే ఇతిహాసాల్లో, వీరగాధా కవిత్వంలో ద్యోతకమౌతుంది. మహాభారత, రామాయణాల్లో, ప్రజల జానపదాల్లో యిది తరతరాలుగా వినిపిస్తూనే ఉంది. ఈ మధ్య కాలంలో అంటే క్రీ.పూ. 2వ శతాబ్దంలో వాటిన్నింటినీ పునర్ముద్రించి, వేదకాలంనాటి హిందూమత వీరులు చేసిన సాహసకృత్యాలను గుర్తుంచుకొంటున్నాము. వీటి మూలంగా ప్రేరణ కలిగి మనం కొత్త జీవితాన్ని గడపటానికి అవకాశముంది. వాస్తవానికి రామాయణం మత సంబంధమైన కవిత కాదు. మత ప్రాధాన్యం లేని కవితకు మొదటి ఉదాహరణగా పేర్కొనవచ్చును. ఇది ఔన్నత్య పాత్రలైన రామ, లక్ష్మణ, సీతల పాత్రలను ఆకర్షణీయంగా, సఫలతా పూర్వకంగా ప్రకటించింది. అందువలన చదివే వారిలో లోతైన మత భావనలైన ప్రేమ, భక్తిని ప్రేరేపించింది. హిందువుల మత సంబంధమైన గ్రంధాలు ఎంత ప్రధానమైనవో, ఇవి కూడా అంతే పవిత్రమైనవి. మహాభారతం ప్రాచీన సాంప్ర

దాయం ప్రకారం యజుర్వేదం తరువాత వచ్చిన వేదం. అందువల్లనే దీన్ని ఐదవ వేదమని, ధర్మ శాస్త్రమని పేర్కొనడం జరిగింది. ఈ గ్రంథానికి ప్రాముఖ్యం కురు, పాండవుల వల్ల రాలేదు. ఎన్నో తాత్విక చింతనల మూలంగా యిది ఏర్పడింది. ప్రధానంగా పైన పేర్కొన్న శ్రీకృష్ణుడు ఇచ్చిన ఉపదేశం ముఖ్యమైంది.

పై నేపథ్యంలో, మతతత్వాన్ని అర్థం చేసుకోవాలి. సంస్కృతిలో విభిన్నమైన అంశాలుంటాయి. మతం అనేది జీవితంలో ఒక భాగం మాత్రం కాదు. జీవితం మొత్తంపై ఆధిపత్యాన్ని వహిస్తుంది. సాంఘిక, రాజకీయ వ్యవస్థలు, విజ్ఞాన శాస్త్రాలు లలిత కళలు, జీవన విధానం, ఆహారం ఇవన్నీ మతచట్రంలో నిబద్ధమై ఉన్నాయి.

రాజ్యం ఎంత నిరంకుశమైనదైనా పరిపాలనలో మాత్రం రాజు మాటే శాసనం. అయితే, న్యాయ విషయాల్లో ధర్మ శాస్త్రాలను అతడు అనుసరించాలి. సాధారణంగా విద్యావంతులు, పండితులు, పరమనిష్ఠా గరిష్ఠులు బ్రాహ్మణులే. వారు రాజుకు సలహాదార్లు. రాజ్య వ్యవహారాల్లో వారికి ప్రాముఖ్యం ఉంటుంది. అందువల్ల రాజ్యం మతానికి లోబడి ఉండాలి. బౌద్ధమతం వచ్చిన తరువాత మౌర్య సామ్రాజ్యంలో ముఖ్యంగా అశోకుని కాలంలో ఈ ధోరణి పూర్తి వ్యతిరేకంగా ఉండేది. రాజు బౌద్ధులందరికీ, మతాధికారి. అయినప్పటికీ హిందువులకు పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుండేవి. నైతిక జీవితాన్ని చూసినట్లయితే హిందువులు, బౌద్ధులు, అందరిపైనా కట్టుబాట్లు ఉండేవి. దీని కోసమే రాజు ధర్మ మహామంత్రులనే ఉన్నతోద్యోగులను నియమించాడు. మిగిలిన రాజ్య విధానం హిందూ రాజుల పాలనలాగే ఉండేది. ఈ రాజ్యంలో ప్రధానమైన అంశం ఏమంటే రాజు, మంత్రివర్గం, సిబ్బంది బృందం ద్వారా పాలించేవాడు. ఆధునిక రాజ్యాల్లో కనిపించే ఉన్నత సిబ్బంది బృందంకంటే వారు ఏమాత్రం తీసిపోరు.

బౌద్ధమతం సామాజిక వ్యవస్థలో తీసుకొచ్చిన ఇంకొక ముఖ్య లక్షణం ఏమంటే కులతత్వాలు పూర్తిగా మాసిపోక పోయినా వాటి ప్రాముఖ్యం కొంతవరకు తగ్గింది. బౌద్ధ సంఘం అన్ని కులాలకు తలుపులు తెరిచినందున మతంపై ఆధారపడిన వర్ణాశ్రమ వ్యవస్థ బలహీనపడింది. సాధారణ సామాజిక జీవితంలో కులాల క్రమానుగత శ్రేణి అలాగే ఉండేది.

బౌద్ధుల్లో, జైనుల్లో కూడా యిది ఉన్నప్పటికీ కొంత మార్పు వచ్చిందని చెప్పాలి. క్షత్రియ కులానికి చెందిన రాజులకు, వైశ్య కులానికి చెందిన వ్యాపారస్తులకు బ్రాహ్మణులకంటే ఔన్నత్యాన్ని ఆపాదించడం జరిగింది.

బౌద్ధ మతోద్యమంలోని ఇంకో ప్రధానమైన విషయమేమంటే అశోకుడు తన పాలనా కాలంలో జంతుబలులను ఆపివేశాడు. హిందూ సమాజంలో కూడా ఈ మార్పు వచ్చింది. కాళీమాతను పూజించే కొద్దిమంది మాత్రమే ఈ ఆచారాన్ని అమల్లో పెట్టారు. జైనమతంలో కూడా జంతుబలులను, మాంసాన్ని భుజించడం ఆగిపోయింది. అహింసా సిద్ధాంతాన్ని భారతీయ సమాజంలో ప్రచారం చేయడంలోనూ బౌద్ధమతంలాగే జైన మతం ముఖ్యపాత్ర వహించింది.

అమల్లో ఉన్న కొన్ని విజ్ఞాన శాస్త్రాల మూలం మతంపై ఆధారపడి ఉండేవి. తత్వశాస్త్రం మతానికి చాలా సన్నిహితమైంది. సాంప్రదాయ సిద్ధ పర్ణక్రమం. వ్యాకరణం, అలంకారిక శాస్త్రం వేదాలను అధ్యయనం చేసేటప్పుడే అభివృద్ధి చెందాయి. వీటిని వేదజ్ఞాన విభాగాలుగా పరిగణించడమైంది. ప్రాచీన ఇండో-ఆర్యన్ భాష అంటే వైదిక భాష మార్పు చెంది శాఖోపశాఖలుగా వర్ధిల్లింది. వాటిలో ముఖ్యంగా ఉత్తర హిందూస్థానంలోని మధ్యప్రాంతంలో తార్కికంగా అభివృద్ధి చెందిన భాష సంస్కృతం భాషే. కాబట్టి భారతదేశంలోని ఉన్నత వర్గాలన్నీ హైందవ మతాన్నీ, మతతత్త్వాన్నీ అధ్యయనం చేశారు. జ్యోతిశ్శాస్త్రం నక్షత్రాల కదలికలను బట్టి ఏర్పడిన శాస్త్రం. దీనిద్వారా మత సంబంధమైన కర్మకాండలను, యజ్ఞయాగాదులు నిర్వహించాల్సిన కాలాన్ని బ్రాహ్మణులు నిర్ణయించే వారు.

బౌద్ధమతం విద్యావిధానంపై ఎంతో ప్రభావాన్ని చూపింది. బుద్ధునికి పూర్వం విజ్ఞానశాస్త్రాల, మత అధ్యయనం సంస్కృతంలోనే సాగేది. పవిత్ర గ్రంధాలన్నీ సంస్కృతంలోనే ఉండేవి. బ్రాహ్మణులు, క్షత్రియులు, తప్ప ఇంకెవ్వరూ వీటిని అధ్యయనం చేసేవారు కాదు. అందువల్లనే విద్య ఉన్నత కులాలకు మాత్రమే పరిమితమైంది. బుద్ధుడు తన సందేశాన్ని ప్రచారం చెయ్యడానికి సంస్కృత భాష కాక ప్రజలందరి వాడుక భాషను ఉపయోగించాడు. బుద్ధుని కాలం నాటి వాడుక భాష ఇండో ఆర్యన్, తూర్పు మాండలికంగా పేర్కొనాలి. ఈ మాండలికంలోనే బుద్ధుడు

బోధన చేశాడు. అశోకుడు రాజుగా ఉన్న కాలంలో యిదే మత భాషగా ఉండేది. బౌద్ధమతంతో పాటే దేశమంతా ఈ భాష వ్యాప్తి చెందింది. అశో కుడు తన శిలాశాసన స్తంభాల్లో కూడా ఈ భాషనే వాడాడు. పరిజ్ఞానం విషయం చూస్తే బౌద్ధులు మతాన్ని మాత్రమే అధ్యయనం చేసేవారు. అధ్యయనం విషయంలో మామూలుగా బ్రాహ్మణులే ఆధిపత్యాన్ని వహిం చారు. తత్వశాస్త్ర విధానం, మత న్యాయం, రాజకీయ- ఆర్థిక విధానం, ఐతిహాసిక కవిత్వంలో మచ్చుతునకలుగా పైన పేర్కొన్న గ్రంధాలన్నీ బ్రాహ్మణులు తయారు చేసినవే.

కళకూడా బౌద్ధుల పోషణలో అభివృద్ధి చెందింది. బుద్ధుని కాలానికి ముందు లలిత కళలన్నీ ఎంతో ప్రాథమిక స్థాయిలో ఉండేవి. శిల్పం కూడా చాలా కొద్దిగానే అభివృద్ధి చెందింది. ఇళ్ళు ఒకటి నుంచి నాలుగంతస్తుల వరకు నిర్మించేవారు. వాటిని ఇటుకలతో, కొయ్యలతో నిర్మించేవారు. నదుల ఒడ్డున సముద్రతీర ప్రాంతాల్లో ఎత్తైన స్థలాల్లో నిర్మించేవారు. వారి ఇళ్ళకు కిటికీలు ఉండేవి. పైకప్పుకు ఎండుగడ్డి, పెంకులు వాడే వారు. ప్రతి ఇల్లు నలుచదరపు ప్రదేశంలో నిర్మించేవారు. అన్నివైపులా గదులుండేవి. గదు లకు ముందు వరండాలుండేవి. నగరాలను నలుచదరంగా గానీ, దీర్ఘ చతు రస్రాకారంలోగానీ నిర్మించేవారు. ప్రధానమైన వీధి తూర్పు పశ్చిమాలు గాను, పక్క వీధులు ఉత్తర దక్షిణాలుగా ఉండేవి. వృత్తులొక్కొక్క దానికి ఒక్కొక్క ప్రదేశాన్ని కేటాయించడం జరిగింది. దేవాలయాలు నగర ఉత్తర ప్రాంతంలో ఉండేవి. ప్రతి గది ఉపరి భాగం తడికెలతో కప్పబడి ఉండే ది. నగరాల్లో కూడా ఇటుకలు ఇళ్ళు కట్టడానికి వాడితే దేవాలయాలు మాత్రం వెదురుతో నిర్మించేవారు. చిత్తోడ్ దగ్గర ఉన్న విష్ణాలయం అన్నిం టిలోకి ప్రాచీనమైన దేవాలయం. బేస్ నగర్‌లో ఆకాలంనాటిదే ఇంకో దేవాలయం కన్పించింది.

అశోకుని కాలానికి ముందే, రాళ్ళను భవన నిర్మాణానికి వాడ్డం మొదలైంది. ఎక్కువగా రాతి కట్టడాలను నిర్మించినది అశోకుడే. వీటిలో రాజాంతఃపురాలు కాలక్రమేణా మృగ్యమయ్యాయి. ఇప్పటికీ, కొన్ని స్థూపాలు, స్తంభాలు విహారాలు కన్పిస్తున్నాయి. సాంచి, బార్‌హత్‌లలో ఈ స్తూపాల రూపాలను చూడవచ్చు. వాటి చుట్టూ ఉన్న ప్రహరీలకు, గేట్లలోనున్న చిత్రలేఖనం లౌకిక విధానాన్ని తెలియజేస్తుంది. ఆనాటి జీవిత విధానాన్ని

గూర్చిన పలు అంశాలు ద్యోతకమౌతాయి. ఒక రాతితో నిర్మించిన అశో కుని స్తంభాలు 40 నుంచి 60 అడుగుల ఎత్తు ఉన్నాయి. మెరుగులు దిద్దిన పైభాగం అద్దంలాగా మెరుస్తుంది. పైభాగంలో నలుచదరపు ఆకారంలో వున్న ఘంటాకారపు వలయ దంతపు స్తంభాగ్రం ప్రత్యేకమైన గుర్తులను చూపే చిత్రాల్లో ప్రధానంగా సింహం ఉంది. అన్నిటికన్నా ప్రసిద్ధి చెందింది కాశీకి సమీపంలో ఉన్న సార్‌నాథ్‌లోని స్తంభం. దానిపై నాలుగు సింహం బొమ్మలున్నాయి. వాటిపై ధర్మచక్రం ఉంది. భారత దేశ గణతంత్ర రాజ్యా నికి అధికారిక గుర్తు ఈ సింహాలు, పవిత్రమైన చక్రం.

బుద్ధుని కళారూపాల్లో పుష్పం ప్రధానమైంది. అది అజంతా గుహ ల్లోను, కుడ్యాలపైననూ చూడవచ్చు. ఇక్కడున్న చిత్రలేఖనం క్రీ.పూ. 2వ శతాబ్దం నుంచి క్రీ.శ.3వ శతాబ్ది వరకూ ప్రాచుర్యం పొందింది. ఇందులో బుద్ధుని కాలంనాటి కళ ఉచ్ఛస్థితిని చూడవచ్చు. కళాత్మక నైపుణ్యం లోను, సాంకేతిక సంపూర్ణతలోను, అజంతాకళ ఎంతో ఉన్నత ప్రమా ణంలో ఉండింది. ఎన్నో శతాబ్దాల పర్యంతం ఇది అభివృద్ధి చెందుతూ వచ్చింది. దీన్ని సరిగ్గా అర్థం చేసుకోవాలంటే అజంతా కళను దక్షిణ భార తదేశంలోని ద్రవిడ సంస్కృతి, సింధు నాగరికతలతో పోల్చినప్పుడు అవగాహనమవుతుంది. వైదిక సంస్కృతి ఉత్తర హిందూస్తాన్ సంస్కృ తిలో అగ్రగామి అయినా ఆ కాలంలో గణతికెక్కిన గొప్ప చిత్రలేఖనం లేదు.

ఈ ఉపపత్తి మూలంగా ఆనాటి కుడ్య చిత్రాలు అనార్యుల గొప్పత నాన్ని గూర్చి తెలుపుతున్నాయి. ఉదా: నాగరులు, మొదలైన వారు. అట్లే ఆర్యులకు సంబంధించినవి ఉన్నాయి. మరో ముఖ్య లక్షణమేమంటే బౌద్ధ కళకు సంబంధించి సౌలభ్యం, పరిమితులు లేకుండడం ఎక్కువ ఆడంబ రత కాని, అలంకరణ భావోద్వేగం కానీ కన్పించవు. ఈ లక్షణాలన్నీ బుద్ధుని ప్రభోదాల మూలంగా ఏర్పడ్డాయి. అట్లే బోధిసత్వ పద్మపాణి చెప్పినట్లు బౌద్ధ కళలో లోతైన ఆధ్యాత్మిక చింతన, అంతస్తత్వం ఉంది. వాటి మూలంగా భౌతిక సౌందర్యం, సౌకుమార్యం ద్యోతకమౌతుంది.

# 6.రెండవ సంగమం: పౌరాణిక హైందవ సంస్కృతి
## (క్రీ.శ. 200-700)

ఛాందస హైందవ మతానికి వ్యతిరేకంగా రెండు మతోద్యమాలు తలెత్తాయి. దేశంలో కొన్ని ప్రాంతాల్లో అవి ప్రాముఖ్యం వహించాయి. క్రీ.శ. 2వ శతాబ్దినాటికి, వీటి ప్రాబల్యం సన్నగిల్లింది. హిందూమతంలోని తాత్వికులు కొందరు, సత్యాన్వేషణ కోసం ప్రయత్నించి, కొన్ని కొత్త దృక్పథాలతో ఆలోచించ మొదలెట్టారు. వాళ్లు దేశ ప్రజల ఆధ్యాత్మిక చింతనను గూర్చి జాగ్రత్తగా అధ్యయనం చేయ మొదలెట్టారు. ప్రజల విశ్వాసాల్లో, ఆచరణలో మార్పులు తెచ్చి, మతంలో సంస్కరణలు తేవాలని పూనుకొన్నారు. వీటి మూలంగా ప్రజల మన్ననలను చూరగొనడానికి ప్రయత్నించారు. ఫలితంగా, హిందూ మతంలో నూతనాధ్యాయం ప్రారంభమైంది. నూతన జాతీయ సంస్కృతికి ఇది పునాదిగా రూపుదిద్దుకొంది. నూతన సంస్కృతి అభివృద్ధి చెంది, క్రీ.శ. రెండో శతాబ్దం నుంచి నాల్గో శతాబ్దం చేరే నాటికి, అంటే రాజుల కాలంలో, శిఖరాలందుకొంది.

మౌర్యుల తర్వాత, ఉత్తర, దక్షిణ భారత దేశాల్లో ఎన్నో సామ్రాజ్యాలు, తలఎత్తినప్పటికీ, ఏ ఒక్క దానికీ జాతీయ సామ్రాజ్యాన్ని స్థాపించడానికి శక్తిలేకపోయింది. తుట్టతుదకు, క్రీ.శ. నాల్గవ శతాబ్దారంభంలో, చంద్రగుప్తుడు (క్రీ.శ. 320-335), మౌర్య సామ్రాజ్యం తర్వాత, గుప్త సామ్రాజ్యాన్ని స్థాపించారు. అతని రాజధాని పాటలీపుత్రం. అతని పుత్రుడైన సముద్రగుప్తుడు, మనుమడైన రెండో చంద్రగుప్తుని హయాంలో వీరి సామ్రాజ్యం భారతదేశమంతటా వ్యాపించింది. దక్షిణ భారతదేశంలో కొన్ని ప్రాంతాలను మాత్రమే జయించలేదు. గుప్తులకాలంలో ఏర్పడ్డ రాజకీయ సమైక్యత మూలంగా, సాంస్కృతిక సమైక్యతా వాతావరణం నెల

కొనడమేకాక, హైందవ సంస్కృతీ వికాసం జాతీయస్థాయిని అందు కొంది. రాబోయే పుటల్లో ఈ నూతన సంస్కృతిని పరిశీలిద్దాం.

వైదిక హైందవ మతంలో శివ, విష్ణువులు ఇద్దరూ ప్రాచీన భారత ప్రజల దేవుళ్ళుగా ప్రఖ్యాతిగాంచారు. వైదిక దేవగణాల్లో రుద్రుడే శివుడు. సూర్యుడే విష్ణువు. ఈ దేవుళ్లపై నమ్మకం అనేది వైదిక హిందూ పద్ధతిలో మరీ అంత ప్రాముఖ్యత కాదు. అందుకనే ఈ విధానం ప్రజా జీవన సరళిలో పూర్తిగా మిళితం కాలేకపోయింది. ఏకేశ్వరోపాసన అనేది తర్వాతి మత విశ్వాసాల్లో ప్రధానమైన అంశం అయింది. అందుచేతనే నూతన మత విధానంలో హైందవ సంస్కృతికి ప్రాముఖ్యత పెరిగింది.

ప్రాచీన భారతదేశంలోని మత స్ఫూర్తి ఇంకా ఆ దశ నుంచి వెలు పలకు రాలేదు. ప్రకృతిలోని వివిధ శక్తులే వారికి ఆరాధ్య దైవాలు. వాటికి మానవాకృతులను కల్పించి విగ్రహాలను ప్రతిష్ఠించుకొని ఆరాధించేవారు. ఊహాతీత రూపాంతరమే ప్రపంచపుట్టుకకు, అభివృద్ధికి మూలకారణం. ఈ దేవుళ్లను, వారి జన్మవృత్తాంతాలను గురించి ఎన్నో కట్టుకథలు బయలుదేరాయి. దేశంలోని కొన్ని, ప్రాంతాల్లో శివుడు సృష్టికి మూలమని భావించేవారు. ఆయన సహధర్మచారిణి అయిన పార్వతి మాతృదేవత. సింధు లోయ నాగరకతకు కొన్ని శతాబ్దాల ముందే మాతృదేవతారాధన ఉండేది. ఇంకా కొన్ని ప్రాంతాల్లో విష్ణుమూర్తిని స్థితి లయుడిగా ఆరాధించేవారు. ఆయన భార్య లక్ష్మీదేవిని వివిధ వస్తువులతో ఆరాధించే ఆచారం ఉండేది. మానవ జీవితంలో పుట్టుక ఎంత ప్రధానమైందో మరణం కూడా అంతే ప్రధానం. జనన మరణాలకు మూలమైనవాడే శివుడు. అంటే సృష్టి లయలకు ఇతడే మూల కారకుడు. అట్లే, ఈయన భార్య గొప్ప మాతృమూర్తి. శక్తి సంపన్నురాలు. ఆమెకు ఉమ, పార్వతి అని పేర్లుండేవి. ఆమె కాళికాదేవి. ఈ శక్తి స్వరూపిణికి బలి ఒక్కటే సంతృప్తినిచ్చేది. విష్ణువు ఒకే కార్యక్రమాన్ని నిర్వహించేవాడు. అతడు స్థితికి మూల కారకుడు. మానవులను దయతో చూడ్డం, వారి సంక్షేమానికి పాటుపడ్డం ఆయన ఏకైక ధ్యేయం. ఆయన భార్య లక్ష్మీదేవి ఐశ్వర్యదేవత.

వైదిక సంస్కృతిలో బహు దేవతారాధన ప్రారంభమైంది. దీనికి కారణం భగవంతుడు వివిధ అవతారాలను దాల్చడమే. ఈ మత సిద్ధాంతం కింద పేర్కొన్న వివరణను దారితీసింది. జీవాత్మ ఒక్కడే, అదే పరమాత్మ.

అతడిని మూడు విధాలుగా భావించవచ్చు. సృష్టికర్త బ్రహ్మ, స్థితికి కారకుడు విష్ణువు, లయుడు శివుడు. ఒకే ఒక దేవుని రూపాలే పైన పేర్కొన్న త్రిమూర్తులు. దేవుని గుణగణాలే వివిధ మూర్తులుగా భాసించాయి. వీరిలో ఏ స్వరూపాన్ని పూజించినా బ్రహ్మను పూజించినట్లే. విష్ణుమూర్తి వివిధ రూపాల్లో ప్రపంచంలోకి వచ్చి ప్రజలకు సహాయకారుడుగా, మోక్ష సాధనకు మూల కారకుడిగా ఉన్నాడు.

మానవాకృతిని దాల్చిన దేవుడే అతని అవతారం. విష్ణుమూర్తి తొమ్మిది అవతారాలు ఎత్తాడు. వాటిలో ప్రధానమైనవి రాముడు, కృష్ణుడు, బుద్ధుడు.

పురాణాలనే పేరుతో అన్ని శాఖలను, అన్ని వర్గాలను కలపడం కోసం ఎన్నో రకాలైన కథలనూ, కాకరకాయలనూ అల్లారు. ప్రపంచం ఏ విధంగా సృష్టించడం జరిగింది? దేవుళ్ల జీవితాలు ఎలా వున్నాయి? రాజుల పరిపాలన ఏ విధంగా కొనసాగుతుంది? అనే వివిధాంశాలతో పురాణాలను రాయడం జరిగింది. ఎక్కువ పురాణాలు విష్ణువుకు సంబంధించినవే. కొన్ని మాత్రమే బ్రహ్మకు, శివునికి సంబంధించినవి. అథర్వణ వేదంలో ఐతిహాసిక పురాణాలను గూర్చి పేర్కొనడం జరిగింది. వీటిని కొందరు వైదిక వాఙ్మయంలో భాగాలని భావించారు. క్రీ.శ.5వ శతాబ్దానికీ, ఈనాడు లభ్యమౌతున్న పురాణాలనన్నింటినీ రాయడం జరిగింది. ఆనాటి హైందవ మతం వీటికి పవిత్ర గ్రంథాల ఔన్నత్యాన్ని చేకూర్చింది. వేదాలకంటే సామాన్య ప్రజానీకానికి పురాణాలే మక్కువ అయ్యాయి. ఈ నూతన హిందూ మతాన్ని ప్రాచీన మతం కంటే భిన్నంగా పేర్కొవాలంటే, పౌరాణిక హిందూ మతమని చెప్పాలి. ఈ క్రమంలో నిర్మితమైన సంస్కృతే పురాణ సంస్కృతి.

పౌరాణిక హైందవ మతం చాలా విశాలమైంది. అందుచేతనే వివిధ శాఖలను, వివిధ రకాలైన నమ్మకాలను ఇముడ్చుకోగల్గింది. ప్రకృతి ఆరాధన, విగ్రహారాధన, ఏకేశ్వరోపాసన ఇందులో ఇమిడిపోయాయి. మానవుల సామాజిక, నైతిక జీవన విధానానికి సంబంధించిన మత ధర్మాలు, అంటే కర్మ, పునర్జన్మ, వర్ణాశ్రమ ధర్మాలను ఉన్నవి ఉన్నట్లుగా వైదిక హిందూ మతం నుంచి గ్రహించడం జరిగింది.

ఇంకో ప్రధానమైన అంశం ఏమంటే వేదాలకు, అరణ్యకాలకు, ధర్మశాస్త్రాలకు సంబంధించిన వ్యాఖ్యానాలు. అట్లే హిందూమతంలోని జనన

మరణాలకు సంబంధించిన కర్మకాండ కూడా వ్యాప్తిలోకి వచ్చింది. దీనికి బాధ్యులు బ్రాహ్మణులు. ప్రజల మత, సామాజిక విధానాలపై నియంత్రణ వీరికుండేది.

పురాణ హిందూమత స్థాపకులు, ఆనాటి పరిస్థితులనన్నింటినీ అవగాహన చేసుకొని, భారతీయుల మనస్తత్వంలోని లోతుపాతులను అర్థం చేసుకొని, వివిధ మత పోకడలను ఆకళించుకోగలిగారు. ఈ పునాదిపై నిర్మితమైన సంస్కృతి విశాలమైంది, సమగ్రమైంది కూడా. ఇవి అన్నీ కాక, కుల భేదం ఎక్కువైంది. పురాణకాలపు మతం, సంస్కృతిని బట్టి బ్రాహ్మణులకు ఉన్నతస్థానం ఏర్పడ్డమే కాక వారి మూలంగా కులవ్యవస్థ గట్టి పడింది. బ్రాహ్మణులకు, మతంపైన, సాంఘిక జీవనము పైన ఎంతో పలుకుబడి ఉన్నను పరిపాలనలో గాని ప్రభుత్వంలోగాని వారికి ఎక్కువ ప్రవేశం లేదు. పౌరోహితులుగా మత కర్మకాండపై ఆధిపత్యాన్ని వహించారు. హిందూ రాజ్యం ఇంకా మతపరమైన రాజ్యంగానే ఉంది. అందువల్ల హిందూమత ఔన్నత్యానికి పాటుపడ్డం ప్రభుత్వం కర్తవ్యం. మత చట్టాలు అమలుపర్చడం కూడా ప్రభుత్వవిధియే. ఎప్పుడైతే పురోహిత వర్గ ప్రభావం నుంచి మానవుడు ఆలోచనా విధానం, సాంఘిక ఆచార సాంప్రదాయాలు కూడా శాసన మూలాధారాలుగా ఏర్పడ్డాయో, రాజ్యం లౌకిక చట్టాలను తయారు చేయడానికి అవకాశం ఉంది. హిందూమతాన్ని అనుసరించి ఒకే విధమైన సాంస్కృతిక సామాజిక జీవన విధానాన్ని అభివృద్ధిపర్చడానికి ఆ ప్రభుత్వానికి అవకాశముంది. అట్లే, ప్రాంతీయ సంస్కృతులకు, సాంఘిక సంస్థలను కూడా గుర్తించి వాటికి హిందూ సంస్కృతితో సమానమైన హోదాను ఇవ్వాల్సి వచ్చింది.

వర్ణాంతర వివాహాల మూలంగా కొన్ని ఉపకులాలు తలెత్తాయి. ప్రధానమైన నాలుగు కులాల్లో విభిన్నమైన సముదాయాలు తలెత్తాయి. వైశ్య కులంలో వృత్తి పరమైన ఉపకులాలు ఏర్పడ్డాయి. ఉదాహరణకు: వైద్య, కాయస్థ మొదలైనవి.

సమాజంలో స్త్రీలకు గౌరవం ఉన్నప్పటికీ, వారి పరిధిని దాటి బయటికి రాకూడదు అనే నియమం ఏర్పడింది. పురాణకాలం నాటి హిందూ మతాన్ని సంక్షిప్తంగా పరిశీలిస్తే, దాని మూలంగా ఉత్పన్నమైన విభిన్న పరిస్థితులు తేటతెల్లమౌతాయి. దేశంలో కొన్ని భాగాల్లో, ప్రధానంగా దక్షిణ

భారతదేశంలో, పురాణకాలంనాటి హిందూ మత ప్రభావమున్నప్పటికీ, ఏ విభాగానికి ఆ విభాగంలో ప్రత్యేకమైన భాష, ఆచార సాంప్రదాయాలు, న్యాయ శాసనాలు, ఆయా ప్రాంతాలను బట్టి ఏర్పడ్డాయని చెప్పవచ్చు. దక్షిణ భారతదేశంలో, కొన్ని ద్రవిడ సమాజాల్లో, మాతృ స్వామిక వ్యవస్థ కూడా అమల్లో ఉంది. హిందూ మతానుగుణ్యమైన పితృస్వామిక వ్యవస్థ కంటే ఇది పూర్తిగా భిన్నమైంది.

పురాణకాలంలో మతం, సమాజం ప్రాధాన్యత వహించినా, ప్రధానమైంది అది ఒక్కటే కాదు ఇతర అంశాలెన్నో, గుర్తించాల్సినవి ఉన్నాయి. విజ్ఞానశాస్త్రం, సారస్వతం, లలితకళలు కొంత వరకు మత పరిధి నుంచి బయటకు వచ్చాయి. వీటితో మానవ జీవితానికి అన్యోన్య సంబంధం ఉంది. గుప్తుల ఆస్థానంలో మత ప్రాధాన్యంలోని సాంప్రదాయ వాఙ్మయాలతో సరితూగ గలిగిందే, గుప్తుల కాలం నాటి వాఙ్మయం. ఆ రకంగా గుప్తులు వాఙ్మయాన్ని పోషించినందుకు మనం వారికి రుణపడి ఉండాలి.

విజ్ఞానశాస్త్రం, వాఙ్మయం అభివృద్ధి చెందటానికి ముఖ్య కారణం గ్రంధాలను ఎక్కువ ఉపయోగించుకోవడమే. ఎన్నో శతాబ్దాలు భారతదేశంలో కరోష్ఠి, బ్రాహ్మీలిపులు అమల్లో ఉండేవి. రాయడానికి ఉత్తర హిందూస్థానంలో చెట్ల బెరడును, దక్షిణ హిందూ స్థానంలో తాటాకులను ఉపయోగించేవారు.

సంస్కృతం మతానికి, విజ్ఞాన శాస్త్రానికి, వాఙ్మయానికి సంబంధించిన భాషగా పేరెన్నికగాంచింది. ఆనాడు ఉన్నత విద్యకోసం, విశ్వవిద్యాలయాలను ప్రభుత్వం ఏర్పాటుచేసేది. నలందాలోనూ, ఇతర ప్రదేశాల్లోనూ మత సంబంధమైన, లౌకికపరమైన విద్యను విద్యార్థులు అధ్యయనం చేసేవారు. ఆ కాలంలో విజ్ఞాన శాస్త్రాలు, వైద్యశాస్త్రం, గణిత శాస్త్రం, జ్యోతిశ్శాస్త్రాలు అభివృద్ధి చెందాయి. వైద్యంతోపాటు విద్యార్థులు శస్త్ర చికిత్సను నేర్చుకొనే వారు. శస్త్ర చికిత్సలో లాన్‌సెట్ (lancet)లను వాడే విధానాన్ని విద్యార్థులకు బోధించేవారు. గాయాలకు చికిత్సచేయడం, వాటికి వాడే ఔషధాలను తయారుచేయడం కూడా నేర్చుకున్నారు. గణిత శాస్త్రజ్ఞులకు పైథాగరస్ సిద్ధాంతం తెలుసు. $\pi$ విలువను తెలుసుకొని గణితాలకు సంబంధించిన సమాధానాలను కనుగొనేవారు. ఖగోళ శాస్త్రజ్ఞులు, నక్షత్రాలను, వివిధ గ్రహాలను బట్టి రాత్రింబవళ్లు

ఎట్లా ఏర్పడ్డాయో కనుగొన్నారు. భూమి రోజుకోసారి పరిభ్రమిస్తుందని కనుగొన్నారు. దాని చుట్టుకొలత ఎంత వరకు ఉందో తెలుసుకున్నారు.

# 7. నూతన వీచికలు - నూతన ప్రవాహాలు

## దక్షిణ భారతదేశంలో ఇస్లాం-అద్వైతం, భక్తి, రాజపుత్ర సంస్కృతి (క్రీ.శ. 700-1000)

హర్షవర్ధనుని తరువాత, 300 సంవత్సరాల వరకు రాజకీయ అనైక్యత ఉండేది. మేధా సంపత్తి విషయంలో కూడా ఏమాత్రం అభివృద్ధి పొడచూపలేదు. దేశం చిన్న చిన్న రాజ్యాలుగా విడిపోయింది. ఆ చిన్న రాజ్యాల్లో నివసించే ప్రజల దృక్పథంలో కూడా తేడా ఏర్పడింది. ఎవరికి వారు వారి స్వంత ప్రపంచంలో జీవించడం మొదలుపెట్టారు. జాతీయ సమైక్యత పూర్తిగా సన్నగిల్లింది. మతపరంగా కానీ, మేధాసంపత్తి విషయంలో గానీ లాంఛనత్వం, అధికారికతత్వం చోటుచేసుకొన్నాయి. పురాణకాలం నాటి హిందూమతంలోని రెండు శాఖలు, రెండు మతాలు, శైవ, వైష్ణవ మతాలుగా అభివృద్ధి చెందాయి. ప్రజల్లో మతస్ఫూర్తి ఎక్కువగా ఉండేది. నూతనత్వం కాని, లోతుకుపోయి విషయాన్ని పరిశీలించే తత్వంగాని ఉండేవికాదు. మతానికి సంబంధించిన రాతలు పురాణాలకు అనుబంధాలుగా, ప్రాచీనస్మృతులకు ప్రతిరూపంగా వ్యవహారంలోకి వచ్చాయి. గత కాలం నాటి ఆలోచనాపరుల భావాలను మక్కీకి మక్కీ అనుసరించేవారు. రచనలు వ్యాకరణానికి, ఛందస్సు నియమనిబంధనలకు పరిమితమైనాయి. వాఙ్మయంలోని ఇతర శాఖలైన నాటకంలోనూ, కావ్యరచనలోనూ ఇదే జరిగింది. శిల్పప్రక్రియా ప్రయోగంతో, పైవాటిలోని సారాంశాన్నంతా పిండి వేయడం జరిగింది. సృజనాత్మక వాఙ్మయంకన్నా, ఛందో గ్రంధాలు తండోపతండాలుగా రావడం మొదలెట్టాయి. వ్యాఖ్యాతలు ఈ నియమ నిబంధనలను అనుసరించే, ప్రాచీనగ్రంధాల ఆధారంగా వ్యాఖ్యానాలను రాశారు.

గుప్త సామ్రాజ్య పతనానంతరం, భారతదేశంపై ఎంతోమంది విదేశీయులు దండెత్తివచ్చారు. వారిలో ముఖ్యులు శకులు, హూణులు, ఘూర్జ

రులు. వీరి రాకతోనే దేశం ఐక్యతకు విచ్ఛిత్తి ప్రారంభమైంది. 11వ శతాబ్ది చివరిలో కొన్ని సాహసోపేతులైన తెగలు చిన్నచిన్న రాజ్యాలను ఏర్పర చుకొన్నారు. వారు ఒకరితో నొకరు యుద్ధం చేసుకొనే వారు. విచ్ఛిత్తి పొందిన రాజ్యాల స్థానంలో వీరే ప్రముఖపాత్ర వహించారు. వారు సంచార జాతులు. ఆనాటి హిందూమతం, సంస్కృతి వీళ్లను ఆకర్షించింది. హిందూ సమాజంలో అత్యున్నతమైన హోదాను సంపాదించాలనే ఉద్దేశ్యంతో వీరు తాము క్షత్రియ వీరుల సంతతి వారమని చెప్పుకొనేవారు. తామే రాజపు త్రులమని వ్యవహరించుకొన్నారు.

హిందూ సమాజంలో రాజపుత్రులు నూతన రక్తంతో ప్రవేశించి ఒక ఉత్తేజకరమైన ఉద్యమాన్ని లేవనెత్తారు. స్తంభీకృతమైన మేధో జీవితాన్ని సాంస్కృతిక జీవన విధానంలో వినూత్నమైన ఉత్తేజాన్ని కలిగించారు. వీరి ఆస్థానాలు కళలకు, సారస్వతానికి, కావ్యాలకు, నాటకాలకు నిలయాలైనాయి. మాళ్వరాజైన రాజభోజుడు (క్రీ.శ.1018-1055) గుప్త రాజుల వైభవాన్ని పునరుద్ధరించి, లలిత కళలను, పండితులను పోషించి 'రెండో విక్రమాదిత్యుడ'నే పేరును పొందాడు. ఆయనకు పూర్వం కనోజ్ రాజైన రాజా మహేంద్రపాలుడు, శేఖర్ అనే నాటకకర్తను పోషించాడు. ఈ కాలపు చివరి భాగంలో బెంగాల్ రాజైన రాజా లక్ష్మణసేన్ ఎంతో మంది కవులను పోషించాడు. 'గీత గోవింద' రచయిత అయిన జయదేవుడు ఈయన ఆస్థానంలోని వాడే!

పదకొండవ శతాబ్దానికి వాఙ్మయం సంస్కరణ పొంది కాశ్మీర్ వరకు చేరింది. దక్షిణ భారతదేశ పురాణ కథలను సంస్కృతంలో 'కథా సరిత్సాగర'మనే పేరుతో సోమదేవుడు అనువదించాడు. కల్హణుని 'రాజ తరంగిణి' కాశ్మీర్ చరిత్రను తెల్పే చక్కటి కావ్యం. వాఙ్మయంలోనూ, చరిత్రలోనూ ఇది ప్రసిద్ధి చెందిన గ్రంథం. సంస్కృతం ప్రజల ఆదరణను కోల్పోయిన తర్వాత ప్రాంతీయ భాషలు ప్రాముఖ్యంలోకి వచ్చాయి.

రాజపుత్రుల ఆస్థానంలో ఈ భాషలు ప్రాచుర్యాన్ని పొందాయి. [పింగల్] హిందీలో అజ్మీర్ రాజైన చౌహాను ప్రోత్సాహంతో 'పృథ్వీరాజ్ రాసో' అనే మొదటి గ్రంథ రచన జరిగింది. చందబర్దాయ్ చౌహాను ఆ కాలంలో ఆస్థానకవి. అతడే ఈ గ్రంథకర్త అని ప్రతీతి. కొంతమంది విద్వాంసుల దృష్టిలో ఈ గ్రంథాన్ని చాలామంది రచయితలు కలిసి రాసారనే భావన కూడా

ఉంది. రాజపుత్రుల కాలంలో వాస్తు శిల్పం కూడా అభివృద్ధి చెందింది. చిత్తోడ్ రణతంభోర్, మాండు, గ్వాలియర్‌నందలి కోటలు, బుందేల్‌ఖండే లోని ఖజురాహో, భువనేశ్వర్‌లోని దేవాలయాలు, వీరి శిల్పకళా ప్రతిభకు మచ్చుతునకలు. రాజపుత్రయుగ సంస్కృతి వారి ప్రతాపాన్ని ప్రతిబింబి స్తుంది. వ్యక్తిగత దృక్పథంతో పరిశీలిస్తే, కవిత్వం మొత్తం పూర్తిగా శృంగార రసభరితమైన కావ్యాలుగా పేర్కొనవచ్చు. జాతీయ సమైక్యతా, సమిష్టి సంక్షేమం దృష్ట్యా పరిశీలించినపుడు ఇవి కొంత నిరాశా జనకంగా ఉన్నాయి. తెగల స్పృహతో మునిగిన రాజపుత్రులు వర్గం, కులం, అనే వాటి పటిష్ట తలను గుర్తించలేక పోయారు. ఇక వీరికి జాతీయ సమైక్యతను గురించి ఆలోచించటానికి వీల్లేకపోయింది. ఆ విధంగానే ఆనాటి సమాజంలో ఐక మత్యం లోపించింది. నాలుగు చతుర్వర్ణాల్లో ఒక్కొక్కదానిలో ఎన్నో ఉప కులాలు ఏర్పడ్డాయి. అవి వ్యక్తులకే దాసోహమయినాయి. జాతీయతా భావం సంపూర్తిగా మృగ్యమైంది.

ఇదే కాలంలో, దక్షిణ భారతదేశం మితిమీరిన నాగరకతకు, విదేశీ యుల దండయాత్రలు దుర్ఘటనలకు ఎక్కువలోను కాలేదు. ఉత్తర హిందూ స్థానం వలె రాజకీయ అనైక్యతకు బలి కాలేదు. ఈ మూడు శతాబ్దాల కాలం కేరళ, పాండ్య రాజ్యాల్లో సుస్థిరత నెలకొనింది. ఈ కాలం తరు వాత వచ్చిన మార్పు చాలమంచి మార్పు, దక్షిణ భారతదేశాన్ని ఒకే రాజకీయ విభాగంగా ఏర్పరచింది. క్రీ.శ.1005 సం॥లో చోళరాజైన రాజ రాజు ఈ భాగానికంతటికీ ఏకైక రాజు. ఇతని నౌకాదళం శ్రీలంకను జయించింది. ఆయన కుమారుడైన రాజేంద్ర చోళుడు బంగాళాఖాత సమీప ప్రాంతాన్నంతటినీ జయించి తన రాజ్యాన్ని విస్తరింపచేసాడు.

దక్షిణ భారతదేశంలో ఉన్న అనుకూల పరిస్థితులు, ఉత్తర భారతదే శంలో వలెకాక వైజ్ఞానిక జీవితాన్ని స్తంభీకృతం కాకుండా చేశాయి. మత తాత్విక చింతనలో గుర్తింపదగ్గ మార్పు సంభవించింది. ఏడో శతాబ్దంలో వచ్చిన శైవ, వైష్ణవ మతాల్లో కొంతమంది ప్రచారకులు మతోత్సాహంతో పురాణాలను తమిళకవితలో వ్యాప్తి చేశారు. ఇదే తర్వాత భక్తి ఉద్యమం అయింది. దీనిలో వారు ప్రేమకు, భక్తికి ప్రాముఖ్యాన్నిచ్చారు. ఈ కూర్మి కవుల్లో శివుని అనుయాయులను 'అడయార్లు' అని, విష్ణు అనుయాయు లను 'ఆళ్వార్లు' అని అంటారు. దక్షిణ భారతదేశంలో హిందూ మతాన్ని

ప్రజలకు సన్నిహితంగా తీసుకెళ్లినవారే ఈ ఆళ్వారులు. హిందూమత సారస్వతంలోని పవిత్ర గ్రంథాలైన విష్ణుపురాణం, భగవద్గీత మొదలైన గ్రంథాల నుంచి భావాలను తీసుకున్నారు. వారి మతావేశం, కవితాత్పృష్ట మూలంగా విష్ణువుపై గల భక్తి ఈ మతాన్ని కొత్త మతంగా తీర్చిదిద్దింది. శైవ, బౌద్ధ, జైన మతాలకన్నా హిందూమతం సామాన్య ప్రజానీకానికి సన్నిహితమైంది. వైష్ణవంతో దక్షిణ భారతదేశంలో తలఎత్తిన మరో మతోద్యమం శైవం. ఆది శంకరాచార్యుల వేదాంత గ్రంథమైన 'ఉత్తర మీమాంస' అనే వ్యాఖ్య ఈ ఉద్యమంలో ప్రధానమైన పాత్ర వహించింది. ఆయన ప్రబోధాల్లోని ప్రధాన అంశం ఏమంటే, పవిత్ర గ్రంథాలన్నీ ఒకే సత్యాన్ని నిరూపిస్తాయి. వీటి మూలంగా ఏకేశ్వరోపాసన వివిధ రీతుల్లో వెల్లడవుతుంది. శంకరాచార్యుల దృష్టిలో దేవుడొక్కడే. అతడే సర్వశక్తిమంతుడు, నిర్గుణుడు. దేవుడు తప్ప మిగిలినవన్నీ మిధ్యలే. మానవుడు అజ్ఞానిగా ఉన్నంతవరకు మాయయే సత్యమని భావిస్తాడు. ఆ క్రమంలోనే జీవితాన్ని కొనసాగిస్తాడు. ఎవరైతే మోక్షాన్ని సాధించాలని అనుకుంటారో, వారు అజ్ఞానాంధకారం నుంచి బయటపడాలి. దేవునిలో ఐక్యం కావాలి. మానవుడు అత్యున్నత దశకు చేరుకునేంత వరకు దీన్ని సాధించలేడు. ఈ సాధనలో ఎన్నో ఆధ్యాత్మిక విషయాలను అభ్యసించాల్సి ఉంది. తన జితేంద్రియాలను నిగ్రహించుకొని, మామూలు ఆలోచనలను విడనాడి, ప్రత్యేకమైన స్థితిని చేరుకుంటాడు.

శంకరాచార్యుని అద్వైత సిద్ధాంతం హేతుబద్ధమైంది. హిందూమత పరిజ్ఞానం పుణికిపుచ్చుకొన్న తత్వ సిద్ధాంతం. భక్తి యోగాన్ని శంకరాచార్యుల కాలంలోనే ఆళ్వారులు, అడయారులు ప్రాచుర్యంలోకి తెచ్చారు. 10, 11 శతాబ్దాల్లో శైవ, వైష్ణవ పండితులు భక్తి ఉద్యమానికి తాత్వికచింతనను కల్పించారు. ఈ కోవలోకి చెందినవాడే రామానుజాచార్యులు. ఇతడు భక్తి శాఖను ఒక ప్రత్యేక మతంగా తీర్చిదిద్దాడు. ప్రజలందరు ఉత్తర, దక్షిణ భారతదేశాలనే తేడా లేకుండా ఈ మతం పట్ల ఆకర్షితులైనారు.

రామానుజాచార్యులు, శంకరాచార్యుల వేదాంత గ్రంథంలాగే, ఉపనిషత్తుల సారాంశాన్ని ప్రజలకు బోధించాడు. అయితే ఇతని వ్యాఖ్యాన ధోరణిలో తేడా ఉంది. ఇతని దృష్టిలో కూడా దేవుడు ఒక్కడే. అయితే అతడు నిర్గుణుడు కాదు. ఈశ్వరుడు అందరికీ అధిపతి. అతడే పురుషోత్త

ముడు. ప్రపంచంలోని సృష్టి, స్థితి, లయలకు కారకుడు. తన నుంచే ప్రకృతిని సృష్టించాడు. జీవాన్ని కూడా సృష్టించాడు. తన సృష్టికీ, తనకూ అభేధ్యాన్ని పాటించాడు. పదార్థం, జీవం రెండూ దైవ సంబంధాలే. అతడి ఆజ్ఞలను పాటించేవే. జీవాత్మ, కర్మకాండలను ముగించుకొని, జ్ఞానాన్ని సంపాదించి, చిట్టచివరగా మోక్ష సాధనకు ఉపక్రమిస్తుంది.

శంకరాచార్యుల అద్వైత మతం కానీ, ఆళ్వారు కవుల భక్తి ఉద్యమం కానీ భారతదేశ మత చరిత్రలో వినూత్నమైనది. వీటి పుట్టుకను పరిశీలించినప్పుడు పాత మత భావాలనే తీసుకున్నప్పటికీ, వీరికాలంనాటి సాంఘిక, రాజకీయ పరిస్థితులెన్నో వీటి ఆవిష్కరణకు దోహదం చేశాయి. దక్షిణ భారతదేశంలోని ఈ మత సంస్కరణకు మూల కారణం విదేశీ సంస్కృతీ ప్రభావమే. కొంత మంది చరిత్రకారులు దక్షిణ భారతదేశంలో ఉండిన కైస్తవ మత (Nestarian Christianity) ప్రభావమేనని భావిస్తున్నారు. డాక్టర్ తారాచంద్ తన గ్రంథమైన "భారతీయ సంస్కృతిపై ఇస్లాం మత ప్రభావం"లో, ఇస్లాం మతం యొక్క ప్రభావం ఈ మతోద్యమాలన్నింటి మీద ఉందని తెలిపారు. అంతకు పూర్వమే అరబ్బులకు దక్షిణ భారతదేశంతో సంబంధం ఉంది. ఇస్లాం మతం అవతరించక ముందే అరేబియా దేశానికి, దక్షిణ భారతదేశానికి వాణిజ్య సంబంధాలు ఉండేవి. ఏడో శతాబ్దంలో ఇస్లాం మతం అరబ్బులకు సాహస ప్రవృత్తిని నేర్పింది. దానిమూలంగా విదేశీ వ్యాపారం అభివృద్ధి చెందింది. పైగా ఇరాన్‌ను జయించడంతో, భారత-ఇరాన్ దేశాల మధ్య వ్యాపారం విరివిగా పెరిగింది. ఆ తర్వాత శ్రీలంకలోనూ, మలబార్ ప్రాంతంలోనూ వారు సంబంధాలు ఏర్పరచుకున్నారు. వీరు శాంతికాముక వ్యాపారులు కావడం వల్ల హిందూ రాజులు, ప్రజలు వీరి వ్యాపారాన్ని ఆటంకపరచలేదు. తమ మతాన్ని ప్రబోధించటానికి, ప్రాచుర్యంలోకి తేవడానికి పూర్తి స్వేచ్ఛను ఇచ్చారు. వారి ఉత్సాహం, హిందువుల మనస్సుల్లో ఉత్తేజాన్ని కలిగించింది. మతం పట్ల ఆసక్తిని పెంచింది. మత సంబంధమైన జీవితాన్ని కదలించి వేసింది.

ఆ కాలంలోనే అరబ్బులు, సింధు ప్రాంతానికి రావడం జరిగింది. వీరు ఇచ్చట పరిపాలనను కూడా ఏర్పరచుకున్నారు. 8వ శతాబ్ది ప్రారంభంలో శ్రీలంక ప్రభువు మృతి చెందిన అనాధపుత్రికలను హెడ్జా (Hedjah) అనే ఆ ప్రాంతపు గవర్నరు అయిన హజాజ్ ఇబ్న్-ఎ- యూసఫ్ వద్దకు

పంపాడు. వారు పయనిస్తున్న ఓడలను దొంగలు కచ్ ప్రాంతంలో కొల్లగొట్టారు. ఈ అమ్మాయిలను ఎత్తుకెళ్ళిపోయారు. సింధు రాజైన దాహర్‌ను వీరిని విడిపించమని హజాజ్ కోరాడు. కాని దాహర్ నిర్లక్ష్యం చేశాడు. అతన్ని శిక్షించాలనే ఉద్దేశ్యంతో క్రీ.శ. 712 ప్రాంతంలో ఒక దండయాత్ర జరిగింది. మహమ్మద్-బిన్-కాసిం సింధూ, ముల్తాన్ ప్రాంతాలను జయించి, ఇస్లాం ఖిలాఫత్‌లో కలిపి వేశాడు.

సింధురాజు క్రీ.శ. 861 ప్రాంతానికి ఖిలాఫత్ ఔన్నత్యాన్ని అంగీకరించాడు. ఆ తర్వాత ముస్లిం నవాబులు ఎన్నో స్వతంత్ర రాజ్యాలను ఏర్పరచుకున్నారు. ఈ ముస్లిం రాజ్యాల్లోనే కాక, మిగిలిన ప్రాంతాలలో కూడా, అరబ్ వ్యాపారులు సింధూ ప్రాంతంనుంచి గుజరాత్ వరకూ, కథియవార్ ప్రాంతాలలో వ్యాపారాన్ని కొనసాగించారు.

పశ్చిమ భారతదేశంలో హిందూ, మహమ్మదీయ ప్రభావాలను గురించి మనకు కొంత పరిచితమే. అరేబియా ప్రభావం ఇక్కడి ముస్లింలపై ఎంతో ఉంది. ఖలీఫామన్ సూర్ (క్రీ.శ.757-774) కాలంలో, హిందూ పండితులు బాగ్దాదుకు వచ్చి, బ్రహ్మగుప్తుని 'బ్రహ్మ సిద్ధాంతాన్ని,' 'కంధ్కధాయకాన్ని' తీసుకొచ్చి, అక్కడి పండితుల సహాయంతో, అరబ్బీ భాషలోకి ఆల్ ఫాజరీ అనువదించాడు. తర్వాత హరుణ్ (Harun) కాలంలో ఆయన, ఆయన మంత్రుల ఉదార భావాల మూలంగా ఎన్నో పుస్తకాలను సంస్కృతం నుంచి అరబ్బీ భాషలోకి అనువదించటం జరిగింది. ఈ మంత్రులు అరబ్బు పండితులను భారతదేశానికి వైద్య శాస్త్ర అధ్యయనానికి పంపడం జరిగింది. కొంతమంది వైద్యులను పిలిపించి వైద్యశాలల్లో సూపరింటెండెంట్లుగా నియమించడం జరిగింది. వారు వైద్య శాస్త్రంలోనూ, తత్త్వ శాస్త్రంలోనూ, ఖగోళశాస్త్రంలోనూ, జ్యోతిశ్శాస్త్రంలోనూ ఎన్నో గ్రంధాలను అరబ్బు భాషలోకి అనువదించారు. ఆల్-ఫిరిస్ట్ బెడ్‌బా యొక్క తాత్విక గ్రంధాన్ని అనువదించాడు. ఆచార్య సచీవ్ దృష్టిలో ఇది బాదరాయణ వ్యాసుని వేదాంత సూత్రమని అభిప్రాయపడ్డాడు. సింధూప్రాంతం ముస్లింల (అబ్బాసిద్ల) పాలనకాలంలో ఉండినంత వరకూ సంస్కృతం నుంచి అరబ్బీ భాషలోకి అనువాదం కొనసాగింది.

అయితే సింధు, గుజరాత్ ప్రాంతాలపై ముస్లింల సాంస్కృతిక ప్రభావం ఇంకా పూర్తిగా వెలుగులోకి రాలేదు. ఏది ఏమైనా దక్షిణ, పశ్చిమ భారత

దేశాల్లో ముస్లిం ప్రభావం పరిమితమైందే కాక పరోక్షమైంది కూడా. ఉత్తర భారత పరిస్థితి అట్లా కాదు. ముస్లిం తుర్కులు పదవ శతాబ్దం నుంచి పద మూడవ శతాబ్దం వరకు, ఢిల్లీ సుల్తానుల పరిపాలనా కాలందాకా దండ యాత్రలను కొనసాగించారు. భారతదేశ జీవన విధానంపై ప్రతి శాఖ లోనూ వీరి ప్రభావం ఉండనే ఉంది. ఎనిమిదవ అధ్యాయంలో ముస్లిం సంస్కృతి ఏర్పడ్డ విధానం, అది భారతదేశానికి ఎట్లా వ్యాపించింది, భారతదేశ సాంస్కృతిక విధానంలో ఎటువంటి పాత్ర వహించింది, అనే విషయాలను పరిశీలిద్దాం.

# 8. భారతదేశానికి రాకపూర్వం ముస్లిం సంస్కృతి

## ముస్లిం సంస్కృతికి ఆధారం ఇస్లాం మతం

ముస్లిం సంస్కృతికి ఆధారం ఇస్లాం మతం ఇస్లాం జన్మస్థలం అరేబియా. ఇది విశాలమైన భౌగోళిక ప్రదేశంలో ఒక భాగం. ఇది ఎర్ర సముద్రం, అరేబియా సముద్రం, పర్షియన్ గల్ఫ్ మధ్యధరా సముద్రాలచే పరివేష్టితమైంది. అరేబియా ప్రాచీన ప్రపంచంలో కేంద్రస్థానంలో ఉంది. ఇది మూడు ద్వీపాలకు కూడలి. ఇక్కడే అనేక గొప్ప సంస్కృతులు వెలిశాయి. ఆసియాలోనూ, ఆఫ్రికాలోనూ, యూరప్‌లోనూ ఎన్నో సంస్కృతులు పుట్టాయి. వీటన్నింటికీ అన్యోన్య సంబంధం ఉంది. మధ్యధరా సముద్రానికి, హిందూ మహా సముద్రానికి మధ్య అప్పటి కాలంలో వ్యాపారం బాగా కొనసాగేది. సిరియా, పాలస్తీనా, హెడ్‌జాజ్, యామెన్‌లకు భూమార్గాలున్నాయి. ఇవన్నీ తూర్పు పశ్చిమ ప్రాంతాలను రహదారి మార్గంలో కలుపుతున్నాయి. ఈ మధ్య ప్రాంతమే సార్వజనీన మానవ సోదరత్వానికి ప్రతీకగా ప్రపంచంలో నిలిచింది.

అరేబియా ప్రవక్త ఇచ్చిన నూతన సందేశం ఇస్లాం మతమే. ఇదే ప్రపంచానికి ఆశాజనకమూ, నమ్మకం కూడా. ఈ సందేశాన్ని ఇస్లాం మతం ఇచ్చినప్పటికీ, ఇది కొత్త మతం కాదు. ఇది అజరామరమైన సత్యాన్ని పునరుద్ఘాటించింది. దీన్ని దైవ ప్రతినిధులు కాలానుగుణంగా ప్రజలకు తెలియజేస్తున్నారు. దీన్ని వివరించడానికి దిన్, షారియా (Din, Shariah) అనే పదాలను ప్రయోగిస్తుంది. దిన్ అనేది అన్ని మతాలకు సమానం. సెమిటిక్ మతాలన్నీ ఇందులో ఇమిడి ఉన్నాయి. దీన్నిబట్టి మిగిలిన వాటిని అర్థం చేసుకోవచ్చు. షారియా అనేది నిశ్చయాత్మకమైన చట్టం. దీని మూలంగా ఒక ప్రత్యేక మతం అందరకూ సంబంధించిన

శాశ్వతమైన ఆదర్శాన్ని సాధిస్తుంది. దిన్ మాత్రం మారకుండా అట్లే ఉండి ఒక విధంగా కొనసాగుతుంది. షారియాలు విభిన్న స్థలాల్లో, ప్రజల్లో, విభిన్నమైన కాలాలను బట్టి మారుతుంటాయి. దిన్‌గా ఇస్లాం వివిధ మతాలు నిర్ణయించిన శాశ్వత సత్యాన్ని గుర్తించి స్థిరీకరించింది. కానీ ఇస్లాం మత షారియా అంతకు ముందున్న షారియాలను రద్దు పరుస్తుంది. ఇస్లాం మత ప్రబోధాలకు మూలం ఖురాన్. పవిత్ర మత ప్రవక్త మహమ్మద్‌కు ఖురాన్ అవగతమైంది. మహమ్మద్ ప్రవక్త సాంప్రదాయాలు మహమ్మదీయులకు రెండో ప్రధాన ఆధారం.

ఖురాన్ మూలంగా అభివృద్ధి చెందిన రెండు ప్రాథమిక మత సిద్ధాంతాలు:

1. విశ్వాంతరాళం నుండి గ్రహించిన దైవ సిద్ధాంతం.
2. మనిషికీ దైవానికీ ఉన్న సంబంధం. ఇదే మనిషికీ మనిషికీ మధ్య వున్న సంబంధాన్ని తెలియజేస్తుంది. అంతేగాక వాళ్ళ హక్కులు బాధ్యతలు సమాజంలో వారికున్న స్థానం తెలుస్తుంది.

ప్రపంచాన్ని 'అంతర్‌దృష్టిలో' పరికించినపుడు మానవుడికి ఒక క్రమబద్ధత, సామరస్యం, ప్రయోజనం అప్పుడు తెలిసి వస్తాయి. తద్వారా సృష్టికర్త పరిజ్ఞానం, వికాసం తెలుస్తాయి. ప్రపంచాన్ని ఏ ఉద్దేశ్యంతో సృష్టించాడో భగవంతుడొక్కడికే తెలుసు. దాని ఆకృతిని, స్థిరత్వాన్ని కాపాడడానికి కావాల్సిన నిష్పత్తిలో అందం, న్యాయం, అనేవి సృష్టికర్త (ఖాలిక్), రక్షకుడు (రాబ్) వునోహరుడు, దయార్ద్ర హృదయుడు (రహమాన్ అండ్ రహీమ్) అనే భావనకు దారితీశాయి. విశ్వ ప్రపంచం కారణ బద్ధమైన సిద్ధాంతానికి కట్టుబడి ఉంది. ఈలాగే మానవుడి చేతలు కూడ. మనిషి చేసే ప్రతి పనికీ ఈ జీవితంలోనే నిర్ణీతమైన ప్రతిఫలం ఒకటుంటుంది (జాజ). ప్రపంచం అంతమయ్యేటప్పటికి ఒక న్యాయనిర్ణయం (యాయుము-ఉద్-దీన్) చేసే రోజు వస్తుంది. అప్పుడు మానవ జీవితాలను త్రాసులో తూచి వారికివ్వాల్సిన పారితోషికాలను లేదా శిక్షలను ప్రకటించడం జరుగుతుంది.

కాబట్టి, ఖురాన్‌లో దైవానికి సంబంధించి చెప్పిన అంశాలను ప్రపంచానికి సంబంధించిన ఒకానొక సిద్ధాంతంగా వెల్టాన్ షాంగ్ (Weltan-schauung) చెప్పబడింది. ఖురాన్ ఊహించే ప్రపంచంలో బహుమానం కాని దండనకాని న్యాయ సమ్మతంగా ఉంటుంది. మానవ జీవితం ప్రపంచం

నుంచీ తనువు చాలించినా అంతటితో అతని జీవితం ఆగదు. ఇంకో ప్రపంచంలో ఎవరు చేసిన పనులకు తగ్గట్లు వారికి బహుమానాలు కాని, దండనలు కాని లభిస్తాయి.

ఇతర మతాలు తీసుకున్న దృక్పథం కంటే, ఇస్లాం మతం కూడా ప్రపంచంలో విలువలను, జీవితానికి వ్యతిరేక భావాన్ని ప్రకటించలేదు. కార్య క్షేత్రంలో, రాబోయే ప్రపంచాన్ని ఆధార భూతమని భావించడం గమనిస్తే ప్రస్తుత ప్రపంచంలో మనిషికి మరో ప్రాముఖ్యాన్ని, విలువను చేకూరుస్తుంది. ప్రపంచంలో ఎంత వరకు సత్యం ఉందో నిరపేక్ష మనుగడ దృక్పథంతో చూచినపుడు ఖురాన్‌కు ఇవేవీ సంబంధం లేవు. తనలో ఎంత వరకు సత్యం ఉందో ప్రపంచంలో కూడా అంతే సత్యం ఉందని భావించవచ్చు. ఆచరణలో రెండూ నిజమైనవే. ఇంత గట్టిగా జీవితాన్ని గురించి, భౌతిక ప్రపంచాన్ని గూర్చి ఆలోచించడం ఇస్లాం మతంలోని ప్రత్యేకత.

మనం గమనించినట్లుగా ఈ ప్రపంచ భావనలో సృష్టికర్త అత్యున్నతమైన వాడు. ఆయనే స్థితి, లయలకు కారకుడు. ఆశ్రిత రక్షకుడు. దయార్ద్ర హృదయుడు. ఇవే దేవుడిలో ఉండే మౌలిక లక్షణాలు. వీటినుంచే అనేక ఇతర లక్షణాలు రావడం జరిగింది.

ఖురాన్ దేవుడి నిర్దిష్టమైన, సమగ్రమైన లక్షణాలను తెలియజేసింది. దేవుడి ఖచ్చితమైన మనుగడను గూర్చి చర్చించడానికి ఖురాన్ జాగ్రత్తగా పరిశీలించింది. దేవుడి ప్రపంచ స్వభావాన్ని గూర్చిన సమస్య ఊహాజనిత తత్వంలో చాలా సున్నితమైంది. ఆస్తికత్వంలో కానీ, అది భౌతికవాదంలోనైనా ఆ భౌతికమైన పదార్థం ఎక్కువ వ్యతిరేకమైందే కాని నిశ్చయాత్మకమైంది కాదు. ఖురాన్ దేవుని ఐక్యతను గూర్చి ఇతర పరిస్థితులనుంచీ లభించే స్వాతంత్ర్యాన్ని గూర్చి గట్టిగా పేర్కొంటుంది. నిశ్చయాత్మకమైన ఆయన స్వభావాన్ని గూర్చి ఎక్కడా ప్రస్తావన లేదు.

ఖురాన్ దేవుని ఐక్యత గూర్చి చాలా దృఢంగా పేర్కొంది. దేవుని గుణగణాలను పంచుకోవడమనేది ఖురాన్ నిషేధించింది. ఆయన భౌతిక ఆకారమే కాదు, ఆలోచన గాని, మాటను గాని ఎవ్వరు ఆపాదించుకోకూడదు. ఇతర పరిస్థితులనుంచీ స్వాతంత్ర్యం పొందడమనే విషయంలో ఖురాన్ మధ్యే మార్గాన్ని అనుసరించింది. దేవుడు భౌతిక అస్తిత్వం నుంచీ

ఇతర పరిస్థితులనుంచీ దూరంగా ఉండాలని ఖురాన్ చెప్తుంది. వీటికి అనిర్దిష్టమైన విషయాలు ప్రధానాలు. మానవ మేధస్సుకు దేవుడంటే అయోమయ పరిస్థితిని కల్పించకూడదు. ఖురాన్ నిశ్చయమైన గుణాలను భగవంతునికి ఆపాదిస్తుంది. కానీ వాటిని మానవుని గుణగణాలతో సరిపోల్చడాన్ని ఒప్పుకోదు. భగవంతుని గుణగణాలను, మానవుని గుణగణాలతో పోలుస్తూ వాడే పదాలకు కూడా పరిమితులను ఏర్పరుస్తుంది. అయితే మనం గుర్తుంచుకోవాల్సిన అంశం ఏమంటే మొదటి దానికి, రెండో దానికి చాలా తేడాలున్నాయి.

విశ్వాసమున్న వాడి ప్రథమ బాధ్యత భగవంతుణ్ణి ప్రేమించడం. నిష్ఠతో పూజించడం. హృదయ పవిత్రత, మనస్సున కేంద్రీకరించడం అనేవి భగవంతునిపై చూపే శ్రద్ధాసక్తుల్లో ప్రధానమైన అంశాలు. వీటి కోసం దేవుణ్ణి ప్రార్థించడం, పుపవాసాలుండడం, మక్కాకు యాత్రకు పోవడం (Hajj) ప్రధానమైన అంశాలు. వాస్తవికమైన శ్రద్ధాసక్తులు కేవలం కర్మకాండల మూలంగా నిర్వహించలేం. దేవునికి విధేయతను చూపాలి. ఆయన ప్రవచించిన నైతిక చట్టాన్ని అనుసరించాలి. ప్రపంచంలో ఏ విధి నిర్వహణను ఎవరికి అప్పజెప్తాడో ఆ పనిని వారు చేయాలి. పరిమితులు లేని భగవంతుని పట్ల విధేయతే ఇస్లాం మతం. అదే యధాతథమైన అర్థం. మత సంబంధమైన అర్థం కూడా. ఇదే మనిషి జీవితానికి, ప్రపంచ చట్టానికి సామరస్యాన్ని కల్గిస్తుంది. నిజానికి ఇదే మనిషి స్వభావం కూడా.

భగవంతుని ఐక్యత అనే ధ్యానంలో మరో అంశం భగవంతుని యెడల శ్రద్ధాశక్తులను చూపడం. ఆయన్నుంచే సహాయాన్ని పొందాలి. ఇంతటి శ్రద్ధాసక్తులు ఇంకెవ్వరి మీద చూపకూడదు. ఆయనొక్కడే అవసరమొచ్చినప్పుడు ఆదుకుంటాడు. ఒక మనిషి పూర్తిగా తోటి మనిషిని ప్రేమించడం లేక అనిర్దిష్టమైన విధానంలో ఆసక్తిని చూపడంలో మనిషికి ఆత్మ గౌరవం ఉండదు. అదే అన్నింటి కన్నా మహాపాపం. ఇదే విషయాన్ని ఇస్లాం షారియా చెప్తుంది.

ఐక్య సిద్ధాంతం మూలంగా కొన్ని ఉప సిద్ధాంతాలు కూడా బయలుదేరాయి. ఇవి ఇస్లాం మతానికి చాలా ముఖ్యమైనవి. సృష్టికర్త ఐక్య సిద్ధాంతంలో, సృష్టి అనేది, మానవ సమాజమనేది ఒక సువ్యవస్థితమైన దేహం. మానవులే ఇందులో సభ్యులు. వారు, ఒకరికొకరు సన్నిహిత

సంబంధం ఉన్నవారు. ఇదే సార్వజనీన సోదర భావానికి మూలం. ఖురాన్ పురుషుణ్ని, స్త్రీనీ, యజమానినీ, సేవకునీ, ధనవంతునీ, బీదవానిని సమానంగా చూస్తుంది. లింగం, వర్ణం, వర్గం, వృత్తి దృష్ట్యా ఏ ఒక్కరూ ఇంకొకరికి తీసిపోరు. ఒకే ఒక భేదమేమంటే 'తాక్వ' (Taqwa) అనగా భగవంతుడంటే భయం, ఆయన శాసనాల పట్ల విధేయత, ఆయనకు, ఆయన సృష్టించిన ఇతరులకు సేవచేయడం. వ్యక్తి స్వాతంత్ర్యం, వ్యక్తి స్వేచ్ఛను, విలువను ఖురాన్ గుర్తించింది. ప్రతి వ్యక్తికి భగవంతునితో ప్రత్యక్ష సంబంధముంది. ఆయనకు, మనిషికి మధ్య మధ్యవర్తి లేడు.

ప్రవక్త అంటే నాయకుడు లేక అధ్యాపకుడు మాత్రమే. ఈయన తన బోధనల ద్వారా, ఆదర్శవంతమైన నడవడిక ద్వారా భగవంతునితో ఏ రకమైన సరియైన సంబంధం ఉండాలో చెప్పే ఒక సాధనం మాత్రమే. ఆయన సంపూర్ణమైన వ్యక్తిత్వం కలవాడు. ఖురాన్ ఆజ్ఞననుసరించి భగవంతుని వైపు నిన్ను నడిపించటానికి ఒక ఉదాహరణగా ఉపకరిస్తాడు. ప్రతివ్యక్తీ, అనుసరించే ఒక ఆదర్శ జీవి. భగవంతుని గుణగణాలకు ఇక్కడి ప్రతినిధి. ప్రతివ్యక్తి అభివృద్ధి చెందుతూ సమిష్టి జీవన విధానంలో సామరస్యానికి తోడ్పడాలి. ఇదే సరియైన వ్యక్తిత్వం. సంఘంలోనే నైతికాభివృద్ధి, అధ్యాత్మిక సమర్థత చేకూరుతాయి. ఋషి జీవితం ఇతరుల జీవితంకంటే భిన్నంగా ఉంటుంది. ఇలాంటి జీవితాన్ని ఖురాన్ సమ్మతించలేదు. సామాజిక దృష్టి అభివృద్ధికే ఎక్కువ ప్రాముఖ్యాన్నిచ్చింది. మౌలికమైన, మత సంబంధమైన ప్రార్థనలు, సమావేశాలు, వీటికే ప్రాధాన్యాన్నిచ్చింది. వాటికి తోడు మనిషి సోదర మానవుల పట్ల కొన్ని బాధ్యతలను నిర్వర్తించడాన్ని, అవే భగవంతుని పట్ల నిర్వర్తించే బాధ్యతలుగా గుర్తించడం జరిగింది.

ముస్లిం రాజ్యంలో సార్వభౌమాధికారం దేవునికే చెందిందని ఖురాన్ భావించింది. ఆయన నుంచి ప్రవక్తకు, ప్రవక్తనుంచి, ఖలీఫాకు ఈ అధికారం సంక్రమిస్తుంది. సార్వభౌమాధికారం ఖలీఫాకు చెందడాన్ని గురించి ఖురాన్ వ్యాఖ్యాతలు వివిధ రకాలుగా వ్యాఖ్యానించారు. ఒక దృక్పథంలో ఖలీఫా, ప్రవక్తలాగే భగవంతునిచే నియమితుడు. జనేచ్ఛ మూలంగా అంగీకారాన్ని పొందిన ఏ వ్యక్తి అయినా ఖలీఫా కాగలడని ఎక్కువమంది మహమ్మదీయులు భావిస్తున్నారు. భక్తి ప్రపత్తులవల్ల సరైన ఖలీఫా

అవగల్గుతాడు.

శాసనాల విషయంలో చూస్తే షారియాలో మౌలికమైన సూత్రాలను ఖురాన్‌లో చెప్పడం జరిగింది. ఇవే మహామ్మదీయ రాజ్యాలన్నింటిలో అమలులో ఉన్నాయి. ప్రవక్త వీటిని అతని కాలంలోని అరబ్ సమాజానికి అన్వయించాడు. మహమ్మదీయ శాసనాన్ని రూపొందించాడు. భావిలో ఈ మహమ్మదీయ శాసనాన్ని పరిస్థితులకనుగుణంగా మార్చే బాధ్యతను 'ముజ్‌తాహిడ్స్' (Mujtahids) లేక పండితులకు ఖురాన్‌లో నిష్ణాతులైన వారికి "హదిత్" (Hadith)కు వదిలివేశాడు. ఆ కాలంలోని విద్యావంతులైన వారికి కూడ ఇందులో భాగస్వామ్యం ఉండేది.

మత సంబంధమైన ఈ రాజ్యంలో ఖురాన్ సమానత్వ సోదర భావాల ఆధారంగా సమాజాన్ని నిర్మించింది. ఇందులో వర్ణం, దేశం, వర్గం అనే తారతమ్యాలు లేవు. ప్రతి సభ్యునికీ షారియా పరిమితులతో సమిష్టి సంక్షేమాన్ని చేకూరుస్తుంది. భౌతిక ఆధ్యాత్మిక సంబంధమైన విలువలను పొందడంలో పూర్తి స్వేచ్ఛను చేకూర్చింది.

ఖురాన్ రాజకీయ, సాంఘీక, సాంస్కృతిక అంశాలన్నింటికీ మూలం సమిష్టి సంక్షేమమేనని పేర్కొంది. ఆర్థిక రంగంలో ప్రైవేటు ఆస్తిపాస్తులను గుర్తించింది. అయినప్పటికీ ఏ కొద్దిమంది చేతుల్లోనో ధనమంతా నిక్షిప్తం కాకుండా ఉండటానికి ప్రయత్నించింది. ఈ లక్ష్యంలోనే మహమ్మదీయులు కట్టాల్సిన "కుమ్స్", "జాకెట్" (Khums and Zakat) అట్లే వారసత్వ చట్టాన్ని గురించిన పన్నును విధించింది. సొంత భూమి విషయంలో కొన్ని పరిమితులను ఏర్పరిచింది. ఆనాడున్న ఒకే ఒక ఉత్పత్తి సంబంధమైన అంశం భూమియే. అయినప్పటికీ నామమాత్రమైన ఆస్తిని మాత్రమే వారు పొందవచ్చు. ఆనాడు ఉన్న దోపిడి విధానంలో మూడు పద్ధతులుండేవి - బానిసత్వం, వడ్డీ వ్యాపారం, జూదం, చివరి రెంటినీ రద్దుచేయడం జరిగింది. బానిసత్వమంటే యుద్ధ ఖైదీలను కుటుంబాలకు ఒప్పంద సేవకులుగా (covenanted servants) నియమించే వారు. వారికి హక్కులు, బాధ్యతలు ఉండేవి. మరల స్వాతంత్ర్యాన్ని పొందే వరకు ఇదే పరిస్థితిలో ఉండేవారు. (తర్వాతి కాలంలో ఈ పద్ధతి ఆచ్ఛాదన లేని బానిసత్వంగా మారింది). వడ్డీ వ్యాపారం జూదం పూర్తిగా నిర్మూలింపబడ్డాయి. ఇస్లాం మతం దోపిడీ విధానాన్ని అరికట్టింది. ఈ అరికట్టడంలో శాసనాన్నే

ఎక్కువగా అవలంబించింది. ఆ విధంగా ఆర్థిక విధానాన్ని నియంత్రించేందుకు రాజ్యం అనుసరించిన విధానాన్ని చూపింది. సమిష్టి విధానానికి అవసరమైన కళలను, సాహిత్యాన్ని అభివృద్ధి పరిచింది. ఖురాన్ ఉపయోగం లేని కవుల భ్రాంతిని ఖండించింది. సృజనాత్మకమైన ఉత్సాహాన్ని కొలిపించే బ్రహ్మానంద లోకానికి తీసికెళ్ళగల పద్య రచనను ప్రోత్సహించింది. ప్రవక్త, అతని అనుయాయుల కాలంలో ఉన్న అరబ్ పద్యాలను నిరసించింది. అవి పూర్తిగా అసభ్యకరమైన రచనలు. అనాగరికమైన ద్వేషపూరితమైన భావాలను కలిగించేవి. అయితే శృంగార వీర రస పూరితాలైన రచనలను ఆమోదించింది. సంగీతంలో కదిలించే స్ఫూర్తినిచ్చే రాగాలకు ప్రాధాన్యాన్నిచ్చింది. విషాదపూరితమైన వాటికి ఎక్కువ స్థానం లేదు. చిత్రలేఖనంలోను, శిల్పాలలోను, సజీవంగా ఉన్న వ్యక్తుల చిత్రాలను, శిల్పాలను ఆమోదించలేదు. ప్రవక్తలవంటి నాయకుల విగ్రహాలను పూజించడానికి అనుమతివ్వలేదు.

## ఇస్లాం రాజ్యం - ముస్లీం రాజ్యం

చాలా కాలం వరకు మహమ్మదీయ సంస్కృతి ఖిలాఫత్ కిందనే మతాంతర రాజ్యంగా భాసిల్లింది. ఇందులో మూడు స్థాయిలున్నాయి. అవి ఏవనగా:

(a) ప్రవక్త పరిపాలన, అతని కింద పనిచేసే నలుగురు ఖలీఫాల పాలన.

(b) బాను ఓమయ్యా ఖిలాఫత్.

(c) బాను అబ్బాస్ ఖిలాఫత్.

మహమ్మదీయ చరిత్రకారులు ఇస్లాం సమాజాన్ని గూర్చి మొదటి అంశంలో తెలియజేశారు. ఈ సమాజం మతానికి, లౌకిక విధానానికి, సామరస్యాన్ని చేకూర్చింది. పాలకులకు, పాలితులకు రాజీ కుదిర్చే విధంగానే కాక వర్గానికి, వర్ణానికి, జాతికి, దేశానికి తారతమ్యం లేని సమాజాన్ని గూర్చి తెలిపింది. రెండో అంశంలో ఇస్లాం సమాజంలో కల్పితమైన సమైక్యత ఉండేది. పునాది నుంచి అనైక్య లక్షణాలు ఏర్పడేవి. బాను ఓమయ్యా వంశపారంపర్యమైన రాజరికం ద్వారా రాజుకు, పౌరులకు మధ్య అగాధం ఏర్పడింది. దీని మూలంగా అరబ్బులకు, ఇతరులకు మధ్య అగాధమేర్పడింది. ఆ స్థానంలోని ఆడంబర జీవితం, ఔన్నత్యం ముస్లీం అరబ్బుల

జీవితం మీద వ్యతిరేకమైన భావాన్ని కలిగించింది. అయినప్పటికీ వాళ్లు చొరవ తీసికొని ధైర్యవంతులైన సైనికులుగా మసలేవారు. వారి మతం కూడ ఉత్సాహవంతమైన మిషనరీ దృక్పథంతో ఉండేది. మూడో అంశం, అబ్బాసీ ఖిలాఫత్ అనైకమత్యంతో కూడిన అనేక అంశాలతో ఉండేది. ప్రజాస్వామ్య దృక్పధంతో పరిపాలిస్తున్నామనే భ్రమ పోయింది. భోగలాలసత్వం, ఖిలాఫత్ వ్యక్తిగత అధికారం ఎక్కువై పరిపాలనలో కొంతవరకు ఇస్లామిక్ న్యాయాన్ని అనుసరించాలని నిర్ణయించడం జరిగింది. ఇదే ఖలీఫాకూ, నిరంకుశ రాజుకు ఉన్న తేడా. అబ్బాసీ ఖలీఫాలు తమ సొంత గుణగణాల మూలంగా పేరు ప్రఖ్యాతులను సంపాదించుకున్నారు. అసమర్థులైన, బలహీనులైన అనుయాయులు ముస్లిం ప్రజల సహకారాన్ని పొందలేదు. ఇప్పుడు సమాజానికీ, రాజ్యానికీ, ఖలీఫాకూ, సమాజానికున్న తేడాలు స్పష్టమయ్యాయి. ప్రజల మంచితనంతో కాక, సైన్య సహాయంతో పరిపాలనను నిర్వహించడం జరిగింది.

ప్రజాస్వామ్య లక్షణాలైన స్వేచ్ఛ, సమానత్వాన్ని అణచివేయడంపై ఖిలాఫత్ ఉద్యమం ఆధారపడి ఉంది. మహమ్మద్ ప్రవక్త కనుగొన్న ఉద్యమం ఇదే. ఇతని తర్వాత వచ్చిన అనుయాయులు ఈ నిర్మాణాన్ని తునాతునకలు చేశారు. స్పెయిన్, ఈజిప్టు ప్రప్రథమంగా స్వతంత్రమైనాయి. మిగిలిన ప్రాంతాలు కూడ వీటిని అనుసరించాయి. రాజకీయ రంగంలో తలెత్తిన అనైక్య (separatist) ధోరణి సాంస్కృతిక జీవనంలో కూడా ప్రతిబింబించింది. పదమూడవ శతాబ్ది మధ్యకాలానికి ఉన్న సమానమైన లేక అంతర్జాతీయ అంశం, మహమ్మదీయుల సాంస్కృతిక విధానంలో కాలక్రమేణా బలహీనమైంది. జాతీయ, స్థానిక అంశాలు ఎక్కువైనాయి. అందువల్ల ఇస్లాం రాజ్యం, సంస్కృతి ఏభై సంవత్సరాల కాలం మాత్రమే మహమ్మద్ ప్రవక్త అతని అనుయాయులైన నలుగురు ఖలీఫాల కింద కొనసాగింది. బాను ఓమయ్య, బాను అబ్బాస్ కింద నుండిన ఖిలాఫత్ ఉద్యమంలో రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో కొంతవరకు మాత్రమే ఇస్లాం ఛాయలుండేవి. పదమూడో శతాబ్ది మధ్య భాగంలో అబ్బాస్ ఖిలాఫత్ క్షీణించిన తర్వాతనే ముస్లిం రాజ్యాలు ఏర్పడ్డాయి. ఖిలాఫత్ రాజ్యాలు ముస్లిం పాలకుల వంశానుగతంగా వచ్చిన రాజ్యాలు, లేక మహమ్మదీయుల జాతీయ రాజ్యాలు. అంతేకాని ఇస్లాం మత, రాజకీయ, సాంస్కృతిక అంశాలు అందులో లేవు.

# 9. భారతదేశంలో హిందూ సంస్కృతికి ముస్లిం సంస్కృతికి మధ్య సంబంధం

ఇంతకు ముందుపేర్కొన్నట్లుగానే, ముస్లిములు క్రీ.శ. 712 నాటికి భారత దేశానికి వచ్చి సింధ్, ముల్తాన్ ప్రాంతంలో రాజ్యాన్ని ఏర్పరిచారు. బహుశా వ్యాపార నిమిత్తంగా అంతకంటే ముందే దక్షిణ భారతదేశానికి వారు వచ్చారు. ఎనిమిదవ శతాబ్ది నుంచి తీరప్రాంతాలైన సింధూ నుండి ఖతియవార్, గుజరాత్ ప్రాంతంలో స్థిరనివాసాన్ని ప్రారంభించారు. ఇస్లాం, హైందవ సంస్కృతుల సంబంధం ఎనిమిదవ శతాబ్దిలోనే ప్రారంభమైందని మనం భావించవచ్చు. హిందూ విద్వాంసులు వైద్యం, గణితం, ఖగోళ శాస్త్రాల మీద రాసిన గ్రంథాలు సింధ్ ప్రాంతం నుంచి అరేబియా వరకు వ్యాపించిన మూలంగా ముస్లింల మేధాసంపత్తి పెరిగిందని పేర్కొనబడింది. ఆ విధంగా ఇస్లాం మత భావాల మూలంగా హిందువుల్లో భక్తి ఉద్యమం తలెత్తింది. వస్త్రధారణపై, ఆచార వ్యవహారాలపై అరబ్ మహమ్మదీయుల ప్రభావం కొంతవరకు దక్షిణ భారతదేశంలో కనిపిస్తుంది. అయితే సరైన శాస్త్రీయ పరిశోధన జరగనందువల్ల దీన్ని ఖండితంగా నిరూపించలేకున్నాం.

పదవ శతాబ్దం అంతమయ్యే వరకు ముస్లింలు హిందూ సంస్కృతి అంచులను మాత్రమే స్పర్శించారని చెప్పాలి. వారు హిందూ సంస్కృతి కేంద్రానికి దూరంగా ఉండేవారు. 11వ శతాబ్దంలో గజనీలు పంజాబ్ ముల్తాన్‌లపై చేసిన ముట్టడి వల్ల హైందవ, ఇస్లాం నాగరికతలకు సాన్నిహిత్యం రాలేదు.

నిజానికి ఢిల్లీ సుల్తానుల పాలన వల్లనే ఈ సాన్నిహిత్యం ఏర్పడింది. ఉత్తర హిందూ స్థానంలో, ముస్లిముల దండయాత్రలు ఘజనీ నుండి ప్రారంభమైనవి. ఇదే వారి రాజధాని. ఇప్పటి ఆఫ్ఘనిస్తాన్‌లో చాలా భాగం, ఇరాన్‌లో కొంత భూభాగం ఇందులో కలసి ఉండేది. అబ్బాసి, ఖిలాఫత్

పాలనలోనికి రాక పూర్వం టర్కీ రాజులు సాహసోపేతంగా ఏర్పరిచిన పెద్ద రాజ్యాల్లో ఇదొకటి. యివి కాలక్రమేణా క్షీణించాయి. సుబక్తజన్ క్రీ.శ. 986-987లో పంజాబ్‌పై మొదట దండయాత్ర చేశాడు. అతని కొడుకు మహమ్మద్ పరిపాలన కొల్లగొట్టడంలోను, దండయాత్రలతోనూ నిండిపోయింది. ఘజనీల పరిపాలనను ఏర్పర్చి, దాదాపు 150 సంవత్సరాలు పేషావర్, పశ్చిమ పంజాబులపై ఆ పాలన సాగింది. 1170లో మహమ్మద్ ఘోరి ఘజనీ వంశంనుండి సామ్రాజ్యాన్ని వశం చేసుకొని భారతదేశంలోకి తన సామ్రాజ్యాన్ని వ్యాపించేందుకు కొత్త సన్నాహాలు చేశాడు. ఆనాటి రాజపుత్ర నాయకుల్లోని అనైక్యతను ఆసరాగ తీసుకొని తను, తన సేనా నాయకుడైన కుతుబుద్దీన్ ఐబాక్ కలిసి ఒకే ఒక ఓటమి తరువాత, ఉత్తర హిందూ స్థానంలో కొంత భాగాన్ని జయించడం జరిగింది. మహమ్మద్ ఘోరి మరణానంతరం కుతుబుద్దీన్ ఐబాక్ ఢిల్లీ సల్తనత్ పేరుతో ఒకానొక స్వతంత్ర సామ్రాజ్యాన్ని క్రీ.శ.1206లో స్థాపించారు.

ఢిల్లీ సల్తనత్‌ను ఎన్నో ముస్లిం వంశాలు పాలించాయి. దాదాపు 300 సంవత్సరాల కాలం, ఒకరి తర్వాత ఒకరు పాలించారు అల్లావుద్దీన్ ఖిల్జీ హయాంలో అతడి పాలన భారతదేశమంతా విస్తరించింది. అలాగే సయ్యద్ కాలంలో ఢిల్లీ సల్తనత్ పాలన ఢిల్లీ నగర పొలిమేరల వరకే పరిమితమైంది. ఈ విధంగా ఒక్కొక్కరి వంశ పరిపాలనలో ఒక్కో విధంగా రాజ్య విస్తరణ జరిగింది.

భారతదేశ చరిత్రలో ఢిల్లీ సల్తనత్ పాలన ఒక కొత్త శకానికి నాందీగా పేర్కొనాలి. మొట్టమొదటి సారిగా, హర్షవర్ధనుని మరణానంతరం 500 సంవత్సరాలకు, భారతదేశంలో రాజకీయ ఐకమత్యం ఏర్పడింది. కొత్త పాలకులు విదేశస్థులైనాక భారతదేశాన్ని వాళ్ల మాతృదేశంగా భావించారు. ఈ విదేశీయులు క్రీ.పూ. రెండవ శతాబ్దంలో బాక్టీరియా నుండి వచ్చిన యవనుల (గ్రీకుల) వలె వారి దేశ సంస్కృతి నుండి ఎంతో కాలంగా తెగ తెంపులు చేసుకున్న వారిలాగా లేక వీరి సంస్కృతి స్కితియన్ల, హూణుల సంస్కృతివలే అతి పురాతనమైనదైతే వీరు హైందవ సమాజంలో విలీనం అయ్యేవారే. కాని వీరు అభివృద్ధి చెందిన అంతర్జాతీయ సంస్కృతి ప్రతినిధులైనందున ఆ సంస్కృతులకు కేంద్ర స్థానాలైన బయటి దేశాలతో (బాగ్దాద్‌తో సహా) ఎడతెగని సంబంధాలను నెలకొల్పారు. కాబట్టి వీరికి

సంపూర్ణ భారతీయులవడానికి చాలాకాలంపట్టింది.

నిజానికి భారతదేశంలో కూడా ఇస్లాం రాజ్యాన్ని ఏర్పరచుకోవడానికి ప్రయత్నించారు. ఇతర ముస్లిం రాజ్యాల్లో కొనసాగుతున్న వంశపారంపర్య రాజరికాన్ని ఏర్పరిచి షారియాను కూడా ప్రవేశపెట్టి, ముస్లిమేతరులకు మత, సాంస్కృతిక స్వేచ్ఛనిచ్చే ప్రయత్నం జరిగింది. రాజకీయ హక్కులను మాత్రం వీరికి పరిమితంగా ఇవ్వాలని భావించారు. కాస్తో కూస్తో ఢిల్లీ సల్తనత్‌ను ముస్లిం రాజ్యంగా ఏర్పరచాలని ప్రయత్నించినా అందులో ఏమాత్రం కృతకృత్యులు కాలేదు. భారతదేశంలో రాజకీయ ఐక్యతను తోడ్పడక పోవడమే, దీని మూలంగా ఏర్పడ్డ దురదృష్ట పరిణామమని పేర్కొనవచ్చు. అలా జరగకుంటే నూతన జాతీయ ఐక్యత ఏర్పడి ఉండేది.

హిందూ ముస్లింలు కలసి మెలసి ఉండటం వల్ల సాంస్కృతిక అవగాహన ఏర్పడింది. దాని ఫలితం మూడు శతాబ్దాల అనంతరం కన్పించింది. ఢిల్లీ సల్తనత్ ఈ ఐక్యమయ్యే తనంతట తానే జరిగే ఈ పద్ధతిని ఏదైనా ఉద్దేశ్య సాధనకుపయోగించుకోలేక పోవటమేకాక దాన్ని అర్థం కూడా చేసుకోలేదు. హర్షవర్ధనుని మరణానంతరం, దాదాపు వెయ్యి సంవత్సరాల తరువాత కాలంలో మొట్టమొదటిసారిగా భారతదేశం జాతీయ ఐక్యతను సాధించడానికి అక్బరు గట్టిగా కృషి చేశాడు. ఈ విధంగా చేయడంలో ఆయనకు మూడు వందల సంవత్సరాల ఢిల్లీ సుల్తానుల చరిత్ర, వారి జయాపజయాలు దోహదం చేశాయి.

ఢిల్లీ సల్తనత్ ఏర్పరచాలనుకున్న సాంస్కృతిక ఆదర్శాలను మనం ఇప్పుడు సమీక్షించాల్సి ఉంది. భారతదేశ జాతీయ ఐక్యతకు ఇవి ఎంత వరకు ఉపకరించాయో తెలుసుకోవాలి.

పదమూడవ శతాబ్ది ప్రథమ భాగంలో ఢిల్లీ సల్తనత్ రూపుదిద్దుకుంటున్నప్పుడు, తూర్పు ఇస్లాం రాజ్యాల్లో నిరాశ, నిస్పృహలు, అనైక్యత చోటుచేసుకొన్నాయి. అబ్బాసీ ఖిలాఫత్, బాతినీ వర్గాలు కొనసాగిస్తున్న అరాచక కార్యక్రమాలు, పశ్చిమ ప్రాంతాల్లోని ఐరోపా మతోన్మాదులు తెచ్చిన వత్తిడి, తూర్పు దేశాల్లో మొగలాయిల పాలన ఈ ముస్లిం రాజ్యాలను బలహీన పరిచాయి. అందువల్ల ఇస్లాం మత సాంస్కృతిక శక్తులు పనిచెయ్యలేక పోయాయి.

అటువంటి అవకాశాన్ని ఢిల్లీ సుల్తానులు కలిగించారు. ఢిల్లీ ఎంతో మంది పండితులకు, యోగులకు, కవులకు, సైనికాధికారులకు, రాజనీతిజ్ఞులకు కేంద్ర స్థానమైంది. కాల్తీ రాజ్యాన్ని ఏ విధంగా రూపొందించాలో ఢిల్లీ సల్తనత్ స్థాపకులకు అర్థం కాలేదు. కుతుబుద్దీన్ ఐబాక్ సైనిక పాలననే అనుసరించాడు. అతని అనంతరం ఇల్‌టుమిష్ ఇరవై అయిదు సంవత్సరాలు పరిపాలించారు. ఆ కాలంలో ఢిల్లీ సల్తనత్ తూర్పు ముస్లీం రాజ్యాల్లాగే ఉండేది. అంటే బాగ్దాద్‌లోని ఖలీఫా నామమాత్ర సార్వభౌముడు. స్వతంత్ర రాజైనప్పటికి షారియా పరిమితుల్లో పాలన సాగేది. మంగోలులు బాగ్దాద్ ఖిలాఫత్ అధికారాన్ని విధ్వంసం చేసిన తర్వాత, ఆ అధికారం ఈజిప్టుకు చెందిన ఫతీమ ఖలీఫాలకు, తైమూరు నాయకత్వంలోని సైయద్స్‌కు బదిలీ అయింది. లోడి, సూరి వంశాలు ఖలీఫా ప్రతినిధులని ఆ కాలంనాటి నాణేలు చాటుతున్నాయి. ఇవి ఏ వ్యక్తిని గూర్చి కూడా పేర్కొనలేదు.

ఖిలాఫత్‌కు సంబంధించి మాత్రమేకాక, ఇతర విషయాల్లో కూడ ఢిల్లీ సల్తనత్ ఇస్లాం స్వభాగం ఊహాజనితం మాత్రమే. పర్షియాలో నిరంకుశ రాజరికం ఉండేది. నలుగురు ఋజువర్తులైన ఖలీఫాల తర్వాత, ఈ రాజరికం నెమ్మదిగా ఇస్లాం రాజ్యంలోకి వ్యాపించి పర్షియన్, టర్కీ రాజుల పాలనలో చేరిపోయింది. ఢిల్లీ సల్తనత్ కాలంలో ఇస్లాం మతాతీతమైన నిరంకుశత్వంగా ప్రకటితమైంది. పర్షియన్, టర్కీ రాజ్యాల్లో రాజులు ఇస్లాం విధానం నుండి తప్పుకొని కేవలం రాజ్యాంగ శాసనం, భూమిశిస్తు విషయాల్లో మాత్రమే ఆ మతాన్ని అనుసరించారు. ఇతర విషయాల్లో ఫాకూహా (Faquha) వ్యాఖ్యానించిన షారియాను మాత్రమే అనుసరించారు. షారియాను అనుసరించడం, విస్మరించడమనేది, ఇటు సొంత జీవితంలో కాని, అటు రాజ్యపాలనలో కాని సుల్తాన్ ఇష్టంపై ఆధారపడి ఉండేది. ముఖ్యంగా 'కామన్‌లా' (అందరికీ ఒకే చట్టం) అనేది సుల్తాన్ హక్కుగా భావించడం జరిగింది. అది అందరూ ఒప్పుకొన్న విషయమే.

ఆర్థిక విషయాల్లో ఢిల్లీ సల్తనత్ ఇస్లాం రాజ్యాలకు భిన్నంగా ప్రవర్తించింది. ఉదాహరణకు, భూమిశిస్తు, ఇస్లాం మతంలో మొదటి నుంచి ఉత్పత్తిలో ఐదోభాగం ఉండేది. అది లోడీల, సూరిల కాలంలో పెరిగింది. అల్లా ఉద్దీన్ ఖిల్జీ కాలంలో ఈ శిస్తు విపరీతంగా పెరిగి మొత్తంలో సగం భాగమైంది.

ఢిల్లీ సుల్తానులు ముస్లిం వ్యవసాయదారులను ఇస్లాంచే కేటాయించిన 50 శాతం గ్రాంట్లను, వారికి ఎప్పుడు ఇచ్చినట్లు లేదు. ఇస్లాం మతానికి చెందిన వారసత్వాన్ని ఖచ్చితంగా అమలు జరుపలేదు. ఇస్లాం మతాన్ని స్వీకరించిన వాళ్ళని వాళ్ళ స్థానిక ఆచారాలను పాటించేందుకు అనుమతివ్వబడింది. ఇందువలన షారియా మౌలిక సిద్ధాంతానికి విరుద్ధంగా కుమార్తెలకు వారసత్వ హక్కు నిరాకరించారు. అట్లాగే వడ్డీతో అప్పు ఇవ్వడం, పుచ్చుకోవడమనే విషయం కూడా ఇస్లాం మతానికి విరుద్ధమైంది. హిందువుల్లో ఇది సర్వసాధారణం.

నైతిక రంగంలో రాజు సొంత జీవితాన్ని గురించి ఎవ్వరూ పట్టించుకోకూడదనేది, రుజువర్తనుడైన ఖిలాఫత్ వరకూ కొనసాగింది. అయితే, 'ఇతిసాబ్' (moral censorship) ప్రజల జీవితానికి సంబంధించి, ఇస్లాం రాజ్యాల్లో దృఢంగా ఉండింది. అయితే ఢిల్లీ సుల్తానులు దీన్ని అసలు పాటించలేదు. కులీన వర్గంలో నైతిక పరమైన అడ్డంకులుండేవి. కాబట్టి రాజ్యాంగం దాన్ని అమలు జరిపేది కాదు. కాని మతశక్తి విషయంలో సామాన్య ప్రజాభిప్రాయాన్ని బట్టి అనుసరించడం జరిగింది.

సంక్షిప్తంగా చెప్పాలంటే, ఢిల్లీ సల్తనత్ వాస్తవానికి ఇస్లాం రాజ్యం కానేకాదు. ఇది కేవలం మధ్యయుగ ముస్లీం రాజ్యాలకు మాత్రమే పరిమితం. ఢిల్లీ సల్తనత్ ముస్లీంల జాతీయ రాజ్యం కూడా కాదు. ముస్లీంలు సుల్తానులుతో మత సామ్యత ఉన్నవారు కాబట్టీ, ముస్లీమేతరుల కంటే భిన్నంగా చూడ్డం జరిగింది. సైన్యంలో వీరిదే పైచేయి. వీరిమీదనే సుల్తాను ఆధారపడేవాడు. ముస్లీంలలో కూడ ప్రభువులు, ఉన్నత వర్గాలు మామూలు వాళ్లనంటే భిన్నంగా పరిగణించబడేవారు. అట్లే, విదేశ ముస్లీంలకు, స్థానిక మస్లీంలకు మధ్య వ్యత్యాసం వుండేది. ముస్లీములు కాని, హిందువులు కాని అందరూ రాజుకు విధేయులే. ప్రభుత్వ విధానాన్ని మలచడానికి వారికవకాశం లేదు. వివిధ ముస్లీం వంశాల పాలనలో ఢిల్లీ సల్తనత్‌ను నిరంకుశ రాజరికమనే పేర్కొనాలి.

ఇక్కడ ప్రధానమైన సమస్య ఏమంటే, హిందువులకు, ఢిల్లీ సుల్తానులతో ఉన్న సంబంధం ఏమిటి? హిందువులు అధిక సంఖ్యాకులు. భారత జాతీయతలో హిందువులదే ప్రథమ తాంబూలం. 9వ శతాబ్ద ప్రారంభం నుండి పదో శతాబ్దం అంతమయ్యే వరకు, ఉత్తర హిందూ స్థానంలో రాజ

పుట్‌లే పాలకులని చూసాం. వీరు వీరాధి వీరులు. జాతీయ సమైక్యత దృష్టితో ఆలోచిస్తే నిజానికి, అనైక్యత్వం చోటు చేసుకుంది. కులాలు, ఉపకులాల విభజన హిందూ సమాజంలో మితిమీరి పోయింది. ప్రధాన వర్గాలైన రాజపుట్‌లు, బ్రాహ్మణులలో కూడా కులాలు, గోత్రాలు ఎక్కువ య్యాయి. రాజపుత్రుల్లో తెగల దృక్పథం ఎక్కువ. దాని మూలంగానే వారి మధ్య అనంతమైన అంతఃకలహాలు పెరిగాయి. ఎవ్వరూ ఆ వాతావ రణంలో సమైక్యత కోసం కృషి చెయ్యలేని పరిస్థితి అది.

ఈ అనైక్యతే ముస్లీంలు దండెత్తే అవకాశం కలిగి భారతదేశాన్ని జయించడానికి ముఖ్య కారణమైంది. మహమ్మద్ ఘజనీని ఎదుర్కొనడా నికి సంయుక్త కూటమి ఏమీ ఏర్పడలేదు. ఘోరికి వ్యతిరేకంగా చిట్టచివ రలో రాజపుత్ర రాజులంతా ఐక్యంగా ప్రయత్నించినా, అది పూర్తిగా జరు గలేదు. ఎక్కువ ఫలవంతం కాలేదు. కనూజ్ రాజు బలవంతుడైనా ఇందులో చేరలేదు. భారతదేశ శక్తిలో కొంతభాగం మాత్రమే దీన్ని ఎదుర్కోడానికి ఉపయోగించడం జరిగింది.

హిందువుల్లో, ఢిల్లీ సల్తనత్ స్థాపన, క్రితంలో గుర్జారులు, హూణుల దండయాత్రలు సృష్టించిన భావననే కల్గించింది. భౌతికంగా వారిని జయిం చిన వారికి విధేయులైనారే తప్ప వాళ్ల ఆత్మలో నిక్షిప్తమైన జాతి, మత స్వయం సమృద్ధి, ఎడబాటుతనం వల్ల హిందూ- ముస్లీంల మధ్య సాంగత్యం సాధ్యం కాలేదు. గూర్జారులకు, హూణులకు వాడిన 'మ్లేచ్ఛ' అనే పదాన్ని యిప్పుడు ముస్లింలపై ఉపయోగించారు.

ముస్లీంల పట్ల హిందువులకు వ్యతిరేకత భావాత్మకమైంది. ఉన్నత వర్గాలకు ముస్లీం రాజ్యాలతో ఉన్న సంబంధం కొన్ని ప్రత్యేక కారణాల వల్లే హిందూ రాజులు, స్థానిక ప్రభువులు, తమ రాజ్యాలను కూడా ముస్లీంలు ఆక్రమిస్తారేమోనని భావించారు. విదేశస్థులు అధికారంలో వుండి పాలించే కేంద్ర ప్రభుత్వమైనా, కేవలం కప్పం కట్టించుకొనేటట్లైతే వారు సర్దు కునే వారు. తమ స్వంత విషయాల్లోను, భారతీయ సాంప్రదాయానికి విరుద్ధ సిద్ధాంతాలను, ఈ ఏకస్వామ్య పాలనను వ్యతిరేకించారు.

బ్రాహ్మణులూ ఈ రాజకీయ మార్పుకు తట్టుకోలేక పోయారు. ఢిల్లీ సల్తనత్ హిందువులకు పూర్తి మత స్వేచ్ఛను ఇచ్చారు. వారి వ్యక్తి పర మైన చట్టాన్ని గుర్తించారు. న్యాయపాలన అమల్లో బ్రాహ్మణులను న్యాయా

ధిపతుల సహాయానికి నియమించారు. అయినా సాంఘికంగా, ఆర్థికంగా వారు పోగొట్టుకున్న అనుకూలతలను యీ చర్యలు పూరించలేక పోయాయి. బ్రాహ్మణులు పూర్వం పురోహితులుగాను, జ్యోతిశ్శాస్త్రవేత్తలుగాను, న్యాయాధిపతులుగాను, ధర్మాదాయ సంబంధమైన ఉద్యోగ బాధ్యతలను నిర్వర్తించేవారు. శాసనమే వారికి ప్రత్యేకావకాశాలను కల్గించింది. రాజ్యం వారికి భద్రత చేకూర్చింది. కాని, మారిన రాజకీయ పరిస్థితుల్లో వారి ఉద్యోగ హోదా కించపరచడం జరిగింది. పరోక్షంగా వారి సామాజిక స్థాయి ప్రభావం కూడా దిగజారింది. అంతేగాక, సమాజంలో బ్రాహ్మణులకు ప్రాముఖ్యం కొరవడింది. దానికి కారణం ముస్లీం సమాజంలో పౌరోహిత వర్గం లేక పోవడం. అందువల్ల బ్రాహ్మణుల ప్రాముఖ్యం తగ్గింది.

సాధారణంగా ప్రజానీకానికి ప్రభుత్వానికి ఉన్న సంబంధం, పూర్తిగా గాక పోయినా, కొంతవరకు మెరుగు పడింది. ముందున్న వ్యతిరేకత, అపనమ్మకం కొంత సన్నగిల్లిన తర్వాత, కొత్త ప్రభుత్వంతో వాళ్లు సహకరించడం ప్రారంభించారు. దీనికి కారణం, పెద్దగా వ్యతిరేకించవల్సిన అవసరం లేదు కనుక. ప్రధానంగా ముస్లిం రాజులు దేశ శాంతి భద్రతలను కాపాడారు. హిందు ప్రజల పట్ల న్యాయబద్ధంగాను, మత, సాంస్కృతిక రంగాల్లో స్వేచ్ఛనిచ్చి పాలించారు. సివిల్, క్రిమినల్ శాసనాల్లో కొన్ని మార్పులు తెచ్చారు. ఇస్లాం చట్టాల్లోని కొన్ని నిర్బంధాలను ప్రవేశపెట్టారు. భారతదేశంలో పాలకులు వారి శాసనాన్ని ప్రజలపై రుద్దడమనేది కొత్తదేం కాదు. హిందూ, బౌద్ధ మతావలంబకులైన రాజులు కూడా ఈ పనిని చేసినవారే. అయితే ధర్మ శాస్త్రానికి సంబంధించిన మతపరమైన విషయాల్లో వ్యక్తిగత శాసన సంబంధమైన అంశాల్లో, ధర్మ శాస్త్రంలో జోక్యం చేసుకుంటే మాత్రం సహించలేక పోయేవారు. కానీ, ఢిల్లీ సుల్తానులు ఈ పొరపాటు జరగనీయకుండా జాగ్రత్త పడ్డారు. పైగా హిందూ పండితులను, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ శాఖల్లో నియమించి, వారి మూలంగా హిందువుల వ్యక్తిగత న్యాయ విషయంలోను, వారి మత సంబంధ విషయాల్లోను ఎంతో విశాల భావాన్ని చూపించారు.

ఢిల్లీ సల్తనత్ భారతదేశంలో రాజకీయ సమైక్యతను సాధించడానికి కృషి చేశారు. అయినా హిందువులు, ముస్లిములు పరిపాలిస్తున్న రాజ్యాన్ని తమదిగా భావించలేక పోయారు. సికందర్‌లోడి, షేర్షా సూరీలను మినహా

యిస్తే మిగతా వారెవ్వరూ తమకు, హిందువులకు మధ్యనున్న అంతరాన్ని పూడ్చడానికి ప్రయత్నించలేదు. పైగా జిజియా పన్ను హిందువులపై విధించి, తమది ఇస్లామ్ రాజ్యం అనే భావాన్ని ఇంకా స్పష్టపరిచారు. మనం చూచినట్లుగానే ఢిల్లీ సల్తనత్ ఇస్లాం మత రాజ్యం కాదు. ఒకవేళ అయినప్పటికీ దానికి జిజియా పన్ను విధించే అధికారం లేదు. ఎందువల్లనంటే, ఇప్పుడు అమలులో లేనటువంటి తప్పని సరియైన మిలిటరీ సర్వీసు కోసరం యిచ్చిన పరిహారము కాబట్టి. ఢిల్లీ సుల్తానులు జిజియా పన్నును వసూలు చేసినప్పటికీ, అది కేవలం నామ మాత్రమే. దాన్ని సక్రమంగా విధించలేదు. కారణం హిందువుల ఆత్మ గౌరవాన్ని భంగపరుస్తుందనే ఉద్దేశ్యంతోనే. అయినప్పటికీ ఆచరణలో రాజోద్యోగుల విషయాల్లో వ్యత్యాసాన్ని చూపేవారు. మొట్టమొదటిసారిగా మహమ్మద్ బీన్ తుగ్లక్ హిందువుల యెడల రాజీ విధానాన్ని చూపేరు. తుగ్లక్ పరిపాలన పూర్తి అయ్యేనాటికి అంటే సికిందర్‌లోడి, షేర్‌షా సూరి కాలంలో రాజ్యోద్యోగుల్లో మత వివక్షత పూర్తిగా తొలగిపోయింది. ఆనాటి రాజ భాషైన పర్షియన్‌ను హిందువులు నేర్చుకున్నారు. ఆ భాషను అధ్యయనం చేసి దానిద్వారా ప్రధానమైన, బాధ్యతాయుతమైన పదవులు సంపాదించుకొందామనే ఉద్దేశంతోనే ముందుకు రాసాగారు. బెంగాల్ దక్కన్‌లోని బహమనీ రాజ్యం చిన్న మహమ్మదీయ రాజ్యాలైనప్పటికి అవి ఢిల్లీ సల్తనత్‌లో చేరక స్వతంత్రంగా ఉండేవి. ఇవి మాత్రమే కాక, మరికొన్ని రాజ్యాలు ఢిల్లీ రాజ్యంలో చేరనేలేదు. ఉదాహరణకు జైనుల్-అబిదిన్ అనే రాజుపాలనలో ఉన్న కాశ్మీరు, మొదటి నుంచి కూడా సమతౌల్య విధానాన్ని అనుసరించి హిందువుల ప్రేమను, విశ్వాసాన్ని చూరగొన్నది.

మహమ్మదీయ రాజులతో ఎప్పుడైతే హిందువులకు సఖ్యత ఏర్పడిందో అప్పటినుంచి వారి సంబంధాలు సామాన్య ముస్లింలతో చాలా వరకు అభివృద్ధి చెందాయి. ఆలోచనా సరళిలో కూడా మార్పు వచ్చింది. ఎప్పుడైతే ముస్లింలు భారతదేశాన్ని తమ దేశంగా భావించారో, అప్పటి నుంచి వర్గ వైషమ్యాలకు, మత దురభిమానానికి వారు దూరమయ్యారు. మేమే జయించాం కాబట్టి, మేమే అధికులమనే భావం సన్నగిల్లింది. వారి శత్రుభావం కూడా కొంత వరకు తగ్గింది. వీరిలో ఈ రాజీ విధానం పెంపొందటానికి చారిత్రాత్మక కారణాలున్నాయి. భక్తి ఉద్యమానికి సంబంధించిన

ముస్లీం సూఫీలు, హిందూ సన్యాసులు సఖ్యతకు నిర్వహించిన పాత్ర విశిష్టమైనది.

భారతదేశంలో చాలామంది సూఫీలు భగవంతుడొక్కడే అనే ఆదర్శవంతమైన భావాన్ని అనుసరించారు. హిందువులు తమ భావాలు వైదిక సిద్ధాంతాలకు అనుకూలంగా ఉన్నాయని వాటికి ఆకర్షితులైనారు. అయితే హిందువుల్లో తక్కువ కులాలవారు మహమ్మదీయ సాంఘీక వ్యవస్థపట్ల ఆసక్తి చూపారు. దానికి కారణం ఆ వ్యవస్థ సమానత్వం, సోదరభావం మీద ఆధారపడటం వల్లనే. ఈ లక్షణాలు నేటికీ అమలులో ఉన్నాయి. చాలా మంది హిందువులు మహమ్మదీయ మతాన్ని స్వీకరించారు. కొంత మంది స్వీకరించకపోయినా, ముస్లింలతో సన్నిహితంగానే ప్రవర్తిస్తు వచ్చారు. ముస్లీంలుగా మారిన హిందువులను కొన్నాళ్లు తదితర హిందువులు వెలి వేశారు. కాని నెమ్మదిగా ఎంతో సహన భావన ప్రదర్శించడం జరిగింది. వారే నిజంగా రక్త సంబంధం ఉన్న హిందువులకు, విశ్వాసం ఉన్న సోదరులకు మధ్య సంధానకర్తల్లా ప్రవర్తించారు.

భక్తి ఉద్యమం హిందూ-మహమ్మదీయుల సమ్మేళనంలో మత సామరస్యాన్ని కలిగించింది. రామానుజ శాఖకు చెందిన రామానందుడు ఉత్తర హిందూ దేశంలో 14వ శతాబ్దాంతం నుంచి 15వ శతాబ్దం మధ్య కాలం వరకూ ఈ భక్తి ఉద్యమాన్ని అభివృద్ధిపరిచాడు. రాముడు విష్ణుమూర్తి అవతారం అని, ప్రజల్లో దృఢమైన భావాన్ని కలిగించాడు. రాముని వ్యక్తిత్వం మనుష్యుల భావాలకు చాలా దగ్గరగా ఉంటుందని ఆయన భావించాడు. రామానందుడు ఈ భావాలను కుల, లింగ వ్యత్యాసం లేకుండా అందరికీ వర్తింప చేశాడు. మహమ్మదీయులు కూడా ఈ కోవలోకి చేరారు. రామభక్తిని పెంపొందించడానికి ఆయన శిష్యుడైన తులసీదాసు కవిత్వాన్ని రాసి ప్రజల మన్ననలను పొందాడు. రామానందుడి మరో శిష్యుడైన కబీరు 15వ శతాబ్ది చివరిలోనూ, 16వ శతాబ్ది పూర్వార్ధంలో ఉండి ఉద్యమాన్ని కొనసాగించాడు. కబీరు తన ఉద్యమాలతో కొత్తదనాన్ని తీసికొని వచ్చి హిందూ-ముస్లింలిరువుర్ని ఆకర్షించాడు.

హిందువులు, మహమ్మదీయులు, ఇతరులు అనే తేడా లేకుండా కబీరు పాడిన కీర్తనలు సర్వసమ్మతను కలిగించాయి. భగవంతుడంటే కబీరుకు ఉన్న భావన అద్భుతమైనది. భగవంతుడంటే అతని దృష్టిలో

కేవలం ఒక ఊహ కాదు. మేధా సంపన్నులకు కూడా అందనటువంటి ఒక గొప్ప అనుభూతి. ఆయన అనుభవాన్ని మేధా సంపన్నత దృష్టితో వ్యాఖ్యానిస్తే ఫలితం పూర్తిగా వ్యతిరేకంగా కనిపించింది. కబీరు దృష్టిలో విరుద్ధమైన ఈ భావాలు రావడం వాస్తవమే. అయితే సత్యాన్ని తెలపడంలో ఏ ఒక్క భావానికి సంపూర్ణత్వం లేదు. హైందవమతం, ఇస్లాం మతం రెండూ ప్రజలకు అవసరమైన స్ఫూర్తిని కలిగించాయి. కాని రెండు మతాల ఉపరితల నిర్మాణాన్ని, కర్మ సిద్ధాంతాలను గర్హించాల్సి ఉంది. కులాలమధ్య, వర్ణాల మధ్య, దేశాల మధ్య ఉన్న వైషమ్యాలను ఆయన ఖండించాడు. భక్తి ఉద్యమంలో వచ్చిన మిగిలిన ప్రవక్తలలాగానే ఈయన తన భావాలను రచనల రూపంలో రాయాలను కోలేదు. ఆయన పాటల రూపంలో వాటిని వెల్లడించారు. ఆయన మరణానంతరం అవి పుస్తకాల రూపంలో వెలువడ్డాయి.

కబీర్‌కు సమకాలికుడైన గురునానక్ క్రీ.శ. 1469 సంవత్సరంలో జన్మించాడు. మహమ్మదీయుల ఏకేశ్వరోపాసన అనే సిద్ధాంతాన్ని, హిందువుల పునర్జన్మ సిద్ధాంతంతో సమ్మిళితం చేసి నూతన మత విధానాన్ని ప్రతిపాదించాడు. మతానికి ప్రధానమైన ఆధారం అద్భుతమైన అనుభూతి. దీనికి నైతిక విలువలను ఆయన జోడించాడు. ఇతని ఆధ్యాత్మిక పవిత్ర భావాన్ని నైతిక సంస్కరణతో సమ్మిశ్రితం చేసి దానికి ఒక రూప కల్పనను ఇచ్చాడు. తరువాతి కాలంలో అదే నూతన మత శాఖగా ఏర్పడింది.

బెంగాల్‌లో హిందువులు, మహమ్మదీయులు వారి అనుయాయులు అనుసరించిన అనేక రకాలైన భక్తి ఉద్యమాల్లో చైతన్యుని (క్రీ.శ.1485-1533) కృష్ణభక్తి ఉద్యమం విశిష్టమైనది. అట్లే 14వ శతాబ్ది పూర్వార్థంలో మహారాష్ట్రలో జన్మించిన నామదేవుని ఉద్యమం, 17వ శతాబ్దానికి చెందిన తుకారామ్ భక్తి ఉద్యమం మామూలు స్థాయికంటే కొంత పైకి ఎదిగి మేధావి వర్గంలోనూ సామాన్య ప్రజానీకంలోనూ చాలా ప్రభావాన్ని చూపాయి.

పైన పేర్కొన్న ఇలాంటి మహనీయులు మతాన్ని కుయుక్తులకు లోను కాకుండా కాపాడారు. హిందూమతంలోని అద్భుత శక్తినీ, ఇస్లాం మతంలోని తసావుఫ్ (Tasavwaf)ను రెంటినీ మిళితంగా ఒకే మతంగా చేసి భారత దేశానికంతటికీ ఒకే దైవం ఉండాలని, దేశ సమైక్యత కోసం వారు పాటుపడ్డారు. అయితే దురదృష్టవశాత్తు అద్భుతావహమైన అనుభవం

ఒక్కటే మతం కాజాలదు. అందువల్ల ఈ మతోద్యమాలు అసలు మతాలుగా వాటి అంశాలతో ప్రత్యేకమైన విభాగాలుగా చీలిపోయాయి. అయినప్పటికీ వాళ్ళ ప్రయత్నాలు విఫలం అయ్యాయని భావించరాదు. మతాన్ని, ఉత్సవాలు, కర్మకాండలు నుంచి వేరు చేయలేక పోయినప్పటికి, ఆయా మతాల్లో కొంత కదలికను కలుగచేసి నూతన ఉద్యమాన్ని ప్రాప్తింపచేశారు. సమానత్వం, నూతనోజ్జీవాన్ని కలిగించారు. హిందూమత, ఇస్లాం మత ప్రవాహాలను కలపలేక పోయినా, ఉపరితలంలో వీటిని కొంత వరకు కలుసుకొనేటట్లు చేయగలిగారు. అంటే మధ్య యుగంలో ఏ మాత్రం లేని మత సామరస్య వాతావరణాన్ని కలిగించినారని చెప్పవచ్చు.

భౌతిక వాతావరణ ప్రభావం మూలంగా వీరిలో ఉత్తమ అభిరుచులు ఏర్పడ్డం సహజం. దీని మూలంగా హిందువులు-ముస్లీంలు ఒకరికొకరు సన్నిహితులైనారు. చిత్రలేఖనం, సంగీతం అనే రెండు లలితకళలపై ఇస్లాం కఠినమైన పరిమితులు పెట్టింది. నిజానికి ముస్లీం దేశాల్లో ఈ రెండు లలిత కళలు అభివృద్ధి చెందలేదు. భారత దేశంలో ఈ కాలంలో ముస్లీంలు చిత్రలేఖనాన్ని ప్రోత్సహించలేదు. అయితే సంగీతం మాత్రం వారి హృదయాలను ఆకట్టుకొంది. సాధారణ ప్రజలందరూ మహమ్మదీయ మతాంతరీకరణ పొందినవారే. బీజాపూర్ జాన్‌పూర్ ముస్లీం ప్రభువులు సంగీతమంటే చెవికోసుకునే వారు. సుల్తాను అయిన హుస్సేన్ సార్ఖ్యా (Hussain Sharqui) సంగీతంలో కయ్యాల్ అనే క్రొత్త శైలిని కనిపెట్టాడని తెలుస్తుంది. ఇది హిందువుల్లోను, ముస్లింల్లోను ప్రధానమైన శైలిగా తరువాత రాణించింది. దృపద్ (Dhrupad) అనే హిందూ-కర్ణాటక శైలిని మంచి అభిరుచులు గల ముస్లీంలు అందరూ ఆనందించేవారు. బీజపూర్ రాజైన ఇబ్రహీం ఆదిల్‌షా సంగీతంలో రసజ్ఞుడు. నౌరస్ (Nauras) అనే సంగీత గ్రంధాన్ని రచించాడు. ముస్లీం సూఫీలు సంగీతాన్ని ఆరాధించారు. సంగీతమే హైందవ-మహమ్మదీయ హృదయాలను సమున్నతికి చేర్చిందని చెప్పాలి.

ముస్లీంలు సౌందర్య ఆరాధనకోసం వాస్తు శిల్పాన్ని ప్రధానంగా అంగీకరించారు. దీని మూలంగా ముస్లీంలు, హిందువులు పరస్పరం తమ తమ ప్రభావాలను చూపించుకో గలిగారు. ఈ కాలంలోనే భారతదేశాన్ని పరిపాలించిన ముస్లీం రాజులకు అధిక సంపద ఉండేది. దానితో వారు ఎన్నో కట్టడాలను నిర్మించారు. అయితే ఈ పనికి సాధారణంగా హైందవ

వాస్తు శాస్త్రజ్ఞులను, శిల్పకారులను నియమించేవారు. భవన నిర్మాణ స్వరూపం ముస్లీం రాజు మనస్సులో పుట్టినప్పటికీ అది భారతీయ పరిస్థితులకు అనుకూలంగా జరిగింది. అంతేగాక హిందూ శిల్పకారుడు ఆ ప్రణాళికను రూపొందించి అమలుచేసేటప్పుడు హిందూ పద్ధతియే ప్రతిబింబించడం జరిగింది. ఎంతో అద్భుతమైన మార్పును మతంలో తీసుకురావాలని ప్రయత్నం చేసిన దానికంటే ఈ వాస్తు శిల్పమే హిందూ-ముస్లీం సమ్మేళనానికి ఎక్కువ దోహదం చేసింది. ఢిల్లీ సల్తనత్ ప్రారంభ దశ నుంచీ హిందూ- మహమ్మదీయుల సమ్మిశ్రిత శైలి వాస్తు శిల్పంలో కొట్టవచ్చినట్టు కనిపించేది. 14వ శతాబ్దంలో ఈ మార్పులు ఇంకా చాలా స్పష్టమైనవి. బెంగాల్, గుజరాత్ డక్కన్‌లలో ఇవి స్పష్టంగా కనిపించాయి. అదే విధంగా బుందేల్‌ఖండ్, రాజస్థాన్ రాజ్యాల్లోని హిందూ రాజ్యాల్లో కూడా ఈ మార్పు స్పష్టంగా కనిపించింది.

ఢిల్లీ సుల్తానుల కట్టడాలైన అజ్మీర్‌లోని జమా మసీదు, ఢిల్లీకి సమీపంలో ఉన్న కువాతుల్ ఇస్లాం మసీదు మొట్టమొదటి నుంచి ఇస్లాం వాస్తు శిల్పకళలు లభ్యమైన సాధనాలకు అనుకూలంగా మలచబడినట్లు రుజువైంది. ఫర్గూసన్ పేర్కొన్నట్లు మౌంట్ ఆబూలో వున్న జైన దేవాలయం పద్ధతిలో అజ్మీర్‌లోని జమా మసీదు కట్టినట్లు తెలుస్తుంది. వాస్తవానికి కువాతుల్ ఇస్లాం మసీదు ఒక దేవాలయ శిధిలాల్లో కట్టడం జరిగింది. ప్రసిద్ధి చెందిన కుతుబ్‌మినార్‌లో మహమ్మదీయుల భావన కనిపించినప్పటికి, అమల్లోకి వచ్చేసరికి గుప్తుల కాలంలోని స్తంభాల, మధ్యయుగంలో శిఖరాల పోలిక ఉందని స్పష్టమవుతుంది. అంతేగాక అలంకరణల్లో ఉత్తర హిందూ స్థానానికి చెందిన హిందూ-జైన శిల్ప శైలుల ప్రభావం స్పష్టమౌతుంది. మానవ, జంతువుల ఆకృతులు ఈ శిల్పాల్లో లేవు. అక్కడక్కడ చెదురుమదురుగా పూలహారాలు, పూలకుండీలు మాత్రం ఉన్నాయి. వాటి సుందర వాక్పటిమ ఏమిటో తెలుస్తూనే ఉంది. వాటిని అరబ్ భాషలో 'కూఫిక్' శైలిలో రచించిన దస్తూరి వాటి అందాన్ని ఇంకా ద్విగుణీకృతం చేస్తోంది.

ఢిల్లీ నుండి వైదొలగిన మహమ్మదీయ రాజ్యాలు కొన్ని స్థానిక మార్పులతో ఈ విధానాన్నే అనుసరించాయి. ముఖ్యంగా గుజరాత్‌లోని కట్టడాల్లో గోపురం, ద్వారం తప్ప మిగిలినవన్నీ హిందూ శైలికి సంబంధించినవే. క్రీ.శ. 15వ శతాబ్దంలో నిర్మితమైన మొహఫిజ్‌ఖాన్ మసీదు, 16వ శతా

బ్దంలోని అబూతూరబ్ సమాధి ఈ సంప్రదాయానికి చెందినవే.

ఢిల్లీ సుల్తానుల కాలానికంటే తరువాత ఏర్పడ్డ ముస్లిం స్వతంత్ర రాజ్యాల్లో హిందూ-ముస్లిం భావ సమైక్యత ఎక్కువగా ఉంది. ఈ చిన్న మహమ్మదీయ రాజ్యాలకు స్వేచ్ఛ ఉండేది. ఈ రాజ్యాలు, అంటే బెంగాల్, దక్కన్, పూర్తిగా హిందూ వాతావరణానికి సంబంధించినవి. ఇవి ఢిల్లీకి దూరంగా ఉన్నాయి. ఢిల్లీ పరిపాలన నుంచి స్వాతంత్ర్యాన్ని పొందడానికి ఈ రాజ్యాలు హిందువులతో సఖ్యతతో మెలగాల్సి వచ్చింది. వారికి అందుబాటులో ఉన్నంత వరకు, ప్రజల భావాలను కోరికలను అవగాహన చేసుకోవడానికి ప్రయత్నించారు. స్థానిక ప్రభువుల నుంచి కప్పాలను వసూలు చేసేవారు. పరిపాలనలో చిన్న పదవి నుంచి పెద్ద పదవి వరకూ ఉన్న ఉద్యోగాల్లో హిందువులకు అవకాశం ఇచ్చారు. వారి యెడల సన్నిహితత్వాన్ని చూపి వారి ప్రేమను చూరగొన్నారు.

బెంగాల్ రాజుల్లో ప్రధానంగా అల్లావుద్దీన్ హుస్సేన్‌షా (1493-1518), ఆయన కుమారుడు నజీరుద్దీన్‌షా (1518-1533) ప్రజల ప్రీతిపాత్రులవడమేగాక, సంస్కృతం నుంచి బెంగాలి భాషలోనికి గ్రంథాలను తర్జుమా చేయడాన్ని కూడా ప్రోత్సహించారు. హుస్సేన్‌షా అందించిన ప్రోత్సాహంతోనే 'మాలాధర్వసు' భగవద్గీతను బెంగాలీ భాషలోనికి అనువదించాడు. అదే విధంగా నజరాత్‌షా పోషణలో మహాభారతాన్ని అనువదించడం జరిగింది. ఇంకో ముస్లిం రాజుకాలంలో కూడ రామాయణాన్ని క్రిధ్వీదాస్ అనువాదం చేసాడు.

దక్కన్ రాజ్యాల్లో ముస్లిం ప్రభువులకు హిందువులకు ఇంకా ఎక్కువ సన్నిహిత సంబంధం ఉండేది. బహమనీ రాజ్య స్థాపకుడు తన బ్రాహ్మణ స్నేహితుడైన గంగూ మూలంగా సింహాసనాధిష్ఠుడైనాడు. అందుకు కృతజ్ఞతగా, ప్రేమతో ఆ రాజు గంగూను మంత్రిగా చేయడమే గాక తన రాజ వంశానికి ఆ పేరు పెట్టుకోవడం జరిగింది. బహమనీ కాలంలో బ్రాహ్మణులకు, ఇతర హిందువులకు పరిపాలనలో ఎక్కువగా భాగస్వామ్యం ఉండేది. బహమనీ సుల్తానుల పతనానంతరం ఆవిర్భవించిన ఐదు ముస్లిం రాజ్యాలు కూడా ఈ విధానాన్ని అనుసరించాయి. వీరు స్థానిక భాషలను ఆదరించారు. కొంతమంది మరాఠీ, ఉర్దూ కవులను కూడా పోషించారు. పశ్చిమ హిందీ మాండలికం దక్కన్ ప్రాంతాలకు వచ్చినప్పుడు ఆ భాషలో

మార్పు వచ్చింది. ఈ ముస్లీం పాలకులు, ఉత్తరాది నుంచి వచ్చిన హిందూ-ముస్లీం సహచరులు, పరస్పరం మాట్లాడుకున్న భాషయే ఉర్దూ భాష అయింది. దక్కన్‌లోనే ఈ భాషకు సాహిత్యం పుట్టింది. ఈ సాహిత్యమే స్థానిక ప్రజలకు, ఉత్తరాది వలస వాసులకు మధ్య వారధిగా నిలిచింది.

అయితే, కాశ్మీర్ రాజైన సుల్తాన్ జైనుల్ - అబిదిన్ కాలంలో హిందూ మహమ్మదీయ సమ్మేళనానికి ఎక్కువ విజయం చేకూరింది. చరిత్రలో ఆయనకు ఎంతో గౌరవం వుంది. అతడు ప్రజల ప్రీతి పాత్రుడు. కాశ్మీర్ లోని ప్రతి బిడ్డకు ఇతని కథలు తెల్సు. ఈయనకు ఇంతటి పేరు ప్రఖ్యాతలు రావడానికి కారణం ఇతని మత సామరస్యమే. హిందువులకు ముస్లీంలకు మధ్య తారతమ్యం ఏమీ చూపలేదు. ఇతనికి పూర్వం కాశ్మీర్‌ను పాలించిన రాజైన సికిందర్ కాలంలో ఎంతోమంది బ్రాహ్మణులు అతని క్రూరపాలనను తట్టుకోలేక కాశ్మీర్‌ను వదిలిపెట్టారు. జైనుల్ అబిదిన్ 1427లో సింహాసనాధిష్టుడైనపుడు వారిని మరలా పిలిపించాడు. వారి మన్ననలను చూరగొన్నాడు. ఆయన పాలనకంటే ముందుగనే ఎంతో మంది ఉద్యోగులు ఎన్నో పదవులు అలంకరించారు. జాతి పరమైన, వర్ణ పరమైన వ్యత్యాసాలకు ఇతడు స్వస్తి చెప్పాడు. ముస్లీంలు హిందూ మతాన్ని, ప్రాచీన భారతీయ సంస్కృతిని అర్థం చేసుకోవడానికి ఎన్నో సంస్కృత గ్రంథాలను పర్షియన్ భాషలోనికి తర్జుమా చేయించాడు. కళలను, చేతి పనులను పోషించాడు. ప్రధానంగా సంగీతాన్ని పోషించడమే గాక వివిధ ప్రాంతాలనుంచి గాయకులను తన ఆస్థానానికి ఆహ్వానించాడు. అక్బర్ కాలానికి ఒక శతాబ్దం ముందే జైనుల్ - అబిదిన్ కాశ్మీర్ చరిత్రలో ఒక నూతన అధ్యాయాన్ని ప్రారంభించాడని చెప్పవచ్చు. ఒకే భారతీయ జాతిని నిర్మించాలనుకున్న అక్బరు కృషికి ఇతడి విధానాలే మూలమని చెప్పవచ్చునేమో!

# 10. మూడవ సంగమం: హిందూస్తానీ సంస్కృతి-I

## మొగల్ సామ్రాజ్యావతరణ దశలో

క్రీ.శ.1494లో టర్కిస్థాన్‌లో ఫర్గానా అనే చిన్న పాలకుడు మరణించగా అతని కుమారుడైన బాబర్ 12వ ఏట రాజయ్యాడు. బాబర్, తండ్రివైపున తైమూర్ వంశానికీ, తల్లివైపున చంఘీజ్‌ఖాన్ వంశానికీ, అంటే రెండు వంశాలకు వారసుడు. రెండు వంశాల నుండి స్ఫూర్తిని పొంది తన పాలనలో మొదటి నుండి సాహసోపేతమైన జీవితాన్ని ప్రారంభించిన వాడు బాబర్. 1504లో ఎన్నో ఒడిదుడుకులను తట్టుకొని నిలబడి కాబూల్‌ని జయించాడు. దాన్ని తన రాజధానిగా చేసుకుని భారతదేశాన్ని జయించాలని కలలుగన్నాడు.

పదహారవ శతాబ్దారంభానికి ఢిల్లీ సల్తనత్, ఆఫ్ఘనిస్తాన్‌కు చెందిన తెగల రాజ్యమైంది. ఆ తెగలమధ్య జరిగిన నిరంతర పోరాటాల వల్ల బలమంతా పీల్చి పిప్పిచేయడం జరిగింది. ఇబ్రహీంలోడి నామమాత్రపు రాజు. అతని బంధువులు, ఇతర ప్రభువులు అతన్ని ద్వేషించారు. విదేశీ దండయాత్రకు ఇంతకు మించి అదను లేదు. బాబర్ భారతదేశంలో తన విజయ పరంపరలను ప్రారంభించాడు. 1526లో, అంటే, తన ఐదోసారి దండయాత్రలో, ఇబ్రహీంలోడీని ఓడించి, చంపి ఢిల్లీని ఆక్రమించుకున్నాడు. ఈ రకంగా మొగల్ సామ్రాజ్య స్థాపన బాబర్ కాలంలో జరిగి, మనుమడైన అక్బర్ కాలం నాటికి జాతీయ రాజ్యంగా పరిణమించింది. ఈ నేపథ్యమే నూతన జాతీయ సంస్కృతికి, మనం పేర్కొనే హిందూస్తానీ సంస్కృతికి మూలమైంది.

హిందూస్తానీ సంస్కృతి అభివృద్ధిని పేర్కొనే ముందు, 16వ శతాబ్ది

పూర్వార్థంలో భారతదేశంపై దండెత్తిన మొగలులకు, మూడొందల సంవత్సరాల క్రితం భారతదేశంపై దండెత్తిన తురుష్కులకు తేడా ఉంది. కుతుబుద్దీన్ ఐబక్ నాయకత్వంలో తురుష్కులు భారతదేశాన్ని జయించారు. అయితే వారు యుద్ధ ప్రియులే కాని ప్రభుత్వ పాలనలో అనుభవం లేని వారు. సాంస్కృతిక జీవితమంటే ఏమిటో తెలియదు. వారు తురానియన్, పర్షియన్, ఇస్లాంలకు సంబంధించిన రాజకీయ. సాంస్కృతిక విధానాలకు, కొంత స్థానిక భారతీయ రంగును పులిమినా, వీటన్నింటినీ కలిపి వైవిధ్యం లేకుండా సామరస్యంతో కూడిన ఒక సంస్కృతిని రూపొందించలేక పోయారు. బాబర్ ఛగ్‌తాయ్ (Chagtai) వంశానికి చెందినవాడు. రాజరికానికి అలవాటు పడ్డ వంశమిది. ఇంకేమి కావాలి! రెండు వంశాలకు చెందిన లక్షణాలను పుణికి పుచ్చుకొన్నాడు. మొగలాయీ, తుర్కుల సాహసాన్ని, దేహపుష్టిని పర్షియన్ల సౌకుమార్యాన్ని, సొగసుని మరోవైపు ఇస్లాం మత ఆధ్యాత్మిక లోతుపాతులను, నైతిక క్రమశిక్షణను జోడించుకొని అభివృద్ధికరమైన సామరస్యపూరిత లౌకిక సంస్కృతిని మొగలులు అభివృద్ధి పరచగలిగారు. బాబర్ భారతదేశానికి వచ్చేనాటికి మొగల్, ఇస్లాం సంస్కృతులను తీసుకువచ్చాడు. తర్వాత ఇంకా విలువైన, విభిన్నమైన సాంస్కృతిక అంశాలను జోడించి సామరస్యపూరితమైన సంస్కృతీ వికాసానికి దోహదం చేశాడు. బాబర్‌కు, అతని కుమారుడైన హుమాయున్‌కు విశాలమైన దృక్పథం, ఆలోచనా సరళి ఉండింది. వాటి మూలంగా భారత రాజకీయ, సంస్కృతీ ఐక్యత స్థాపన అనే మహోన్నత కార్యక్రమాన్ని ప్రారంభించారు. అయితే వారు స్వల్పకాలం మాత్రమే పాలించారు. అక్బర్ 14వ సంవత్సరంలో తండ్రియైన హుమాయున్ నుంచి రాజ్యాన్ని పొంది, దాదాపు యాభై సంవత్సరాలు చక్రవర్తి హోదాలో నూతన జాతీయరాజ్యాన్ని, నూతన జాతీయ సంస్కృతిని ఏర్పరచాడు.

బెంగాల్, దక్కన్, కాశ్మీరులలో ఉండిన స్వతంత్ర ముస్లీం రాజ్యాలు హిందువులను, ముస్లింలను రాజకీయంగా, సాంస్కృతికంగా సన్నిహితం చేశారనే విషయాన్ని ఇదివరకే పేర్కొన్నాం. తర్వాత వచ్చిన ఢిల్లీ సుల్తానుల్లో సికిందర్‌లోడి, షెర్‌షాసూరి హిందువుల పట్ల విశాల దృక్పథాన్ని చూపించారు. అయితే ఈ మార్పు ప్రజల అవసరార్థం గమనించీ, గమనించనట్లుగా జరిగింది. ఈ మూడు వందల పైచిలుకు సంవత్సరాల్లో ఢిల్లీ

సల్తనత్ పరిపాలనా కాలంలో ముస్లీం పాలకులు ఎవ్వరూ కూడా భారత దేశ సమైక్యతను గూర్చి ఆలోచించలేదు. కేవలం ఉపరితలం మీదనే వారి పాలన ప్రభావం ఉండింది గాని, లోతులకు పోయి ఆలోచించలేక పొయ్యారు. ఈ సమైక్యత భారతదేశ విభిన్నతలో కొట్టుమిట్టాడుతున్నట్లు ఉండింది. ఛగ్‌తాయ్ వంశానికి చెందిన సాహసం, చాకచక్యం ఉన్న అక్బర్ మాత్రమే ఈ పనిని చేయగలిగాడు. తాత్త్వికుడుగా తన ఉదార హేతువాద బుద్ధిని చూపాడు. ఈ రెండింటినీ జీర్ణించుకొని ధైర్య సాహసా లతో గతించిన పాలనకు సంకెళ్ళ దాస్యం నుండి భారతదేశానికి విముక్తి కలిగించాడు. ఒక కొత్త జీవితానికి మార్గదర్శకుడయ్యాడు.

అక్బర్ సాధించిన ఈ నూతన భారతదేశానికి, ముఖ్య లక్షణమే మంటే ఇది మత ప్రాధాన్యతపై నిర్మాణం కాలేదు. దేశ పౌరసత్వం అనే ప్రాతిపదికపై దీన్ని నిర్మించడం జరిగింది. ఇదే మొట్టమొదటి భారతదేశ ఆధునిక భావన. వాస్తవానికి ఆధునిక యుగం 19వ శతాబ్దపు మధ్య భాగంలో ఏర్పడింది. ఆ ఆధునికత అమాంతంగా ఊడిపడలేదనే విషయం ఇక్కడ స్పష్టమౌతోంది. యూరోపియన్లకు, సామాజిక జీవన విధానంలో రాజ్యాన్ని ఏర్పరచడమే ముఖ్యమైన విషయం. మతం అంత ప్రాధాన్యం కాదు. ఇదే విషయం ఐరోపా ఖండంలో సంస్కరణోద్యమం తర్వాత ఏర్పడి, మత ప్రాతిపదికపై ఏకత్వసాధననే భావనకు తెరపడింది. అయితే భార తదేశంలో ఈ భావన అంతకుముందే ఏర్పడింది. ముస్లీంలు నూతన మతంతో అడుగుపెట్టినపుడు జనాభా అంతా రెండు విభాగాలుగా, లేక శత్రుత్వ కూటములుగా ఏర్పడింది. సామాజిక జీవితంలో మతం ఎట్లా ఉండాలో ఆ స్థానాన్నే రాజ్యం వహించింది. ఢిల్లీ సుల్తానుల కాలంలో ఈ పరిస్థితిలో మార్పు రాలేదు. కాని ఛాందసత్వం లేని మొగలాయిల కాలంలో ఈ మార్పు జరిగింది. వారు అరబ్ ఖలీఫా సార్వభౌమత్వాన్ని తృణీక రించి, భారతదేశానికి రాకపూర్వమే మార్పు చెందారు. ఆ మార్పు స్వతః సిద్ధంగా ఆలోచించ శక్తిగల అక్బర్‌లాంటి చక్రవర్తి కాలంలోనే సిద్ధించింది.

లేకుంటే, అక్బర్ భారతదేశంలోని ముస్లీంలకందరికీ మతాధిపతి అయి ఉండాల్సింది. లేక ముస్లీం మత రాజ్య సంస్థాపకుడైనా అయ్యుండా ల్సింది. కానీ ఆయన లౌకిక జాతీయ రాజ్య సంస్థాపకుడు కాగలిగాడు. భారత చరిత్ర చదివే విద్యార్థికి ఆయన మత నాయకత్వం కేవలం రాజ

కీయ ఎత్తుగడ అని తెలుస్తుంది. ఆయన 'ఉలేమాల' నుంచి విడిపడి ద్విగుణీకృతమైన బలంతో పనిచేశాడు.

అక్బర్, పర్షియాకు చెందిన షాఅబ్బాస్ సఫావీకి రాసిన ఉత్తరం లోని విషయాలను బట్టి ఆయన లౌకికత్వం, మత ప్రాధాన్యం లేని రాజ్య స్థాపన స్పష్టమౌతున్నాయి-"దేవుడు మనకందించిన దైవదత్తమైన ఖజానాలే ఈ విభిన్నమైన మత సముదాయాలు. వాటిని మనం అలాగే ప్రేమించాలి. ప్రతి మతాన్ని ఆయన (దేవుడు) ఆశీర్వదించాడు. అనవరతం పచ్చని తోటలా ఉండే సార్వజనీన సహనాన్ని మన ప్రయత్నంతో అనుభవించాలి. ఆయన ఏ తేడా లేక అందరిపైన ఒకే విధంగా కటాక్షాన్ని కురిపిస్తాడు. దేవుని నీడలైన రాజులు ఈ సూత్రాన్ని ఎప్పుడూ మరువరాదు." అక్బర్ స్నేహితుడు, తాత్త్వికుడు, మార్గదర్శకుడైన అబుల్‌ఫజల్ తన 'ఐనీ అక్బర్'లో ఈ విధంగా రాశాడు - "రాజు మత వ్యత్యాసాలకన్నింటికీ అతీతుడు. ప్రతి వర్గానికీ, ప్రతి సమాజానికీ ఆయన నిర్వర్తించే విద్యుక్తధర్మంలో మత వ్యత్యాసాలు అడ్డుపడరాదు. అందరిపట్ల రక్షకుడిగా ఉన్నపుడే ప్రతి ఒక్కరు సుఖశాంతులతో ఉండగలుగుతారు. అప్పుడే భగవంతుని నీడలో మనం పొందే ప్రయోజనాలు సార్వజనీనంగా అందరికీ అందుబాటులో ఉంటాయి."

అక్బర్ ఈ సిద్ధాంతాన్ని తు.చ. తప్పకుండా, నిజాయితీతో పాటించాడు. ప్రభుత్వ కళ్ళేలను తన చేతిలోనికి తీసుకున్న తర్వాత, 1563లో యాత్రపన్నును, జిజియా పన్నును నిషేధించాడు. ఆ విధంగా హిందూ, ముస్లిం ప్రజల మధ్య ద్వేషాన్ని కలిగించే విషయాన్ని తొలగించాడు. దీని కంటే ప్రధానమైంది 1564లో ప్రతిపాదించిన శాసనం - భారతీయుడు ఏ కులానికీ, వర్గానికీ సంబంధించినా బానిస కాకూడదు. రాజ్యం గుర్తించిన వ్యక్తి స్వేచ్ఛ, న్యాయసమ్మత, వర్గ, తెగల వివక్షత లేకుండా ప్రతి పౌరుడూ సమానంగా అనుభవించాలి. ఇది మధ్యయుగ ఆసియా నేపథ్యానికి విరుద్ధంగా ప్రకటించిన మౌలిక విధానం. అంతేకాక, సివిల్, మిలటరీ రాష్ట్ర సర్వీసులన్నింటిలో హిందువులకు అవకాశాన్ని కల్పించాడు. తన పరిపాలనలో ఉన్నత స్థానాల్లో వారిని నియమించడం కూడా జరిగింది. సామ్రాట్ కుటుంబం, రాజపుత్రుల మధ్య చేసుకున్న వైవాహిక సంబంధాలు ఈ నూతన సౌభ్రాతృత్వానికి తార్కాణంగా పేర్కొనవచ్చు. అక్బర్

హిందూ ముస్లింలలో ఈ సామరస్యాన్ని చేకూర్చడానికి ప్రయత్నించాడు.

అయితే అక్బర్ ఏర్పరచిన జాతీయరాజ్యానికి, జాతీయ విధానానికి పరిమితులు లేకపోలేదు. ఈ గ్రంథప్రవేశికలో జాతీయతకు, దేశ ప్రజలందరికీ సంబంధించిన రాజ్యాంగ శాసనం అవసరమని పేర్కోడం జరిగింది. అక్బర్ కాలానికి ఈ జాతీయతకు ఇంకా పరిమితులుండేవి. ఆ కాలంలో రాజకీయ సముదాయానికి లేక దేశానికి లిఖిత, అలిఖిత రాజ్యాంగం లేనప్పుడు లేదా ప్రభుత్వానికి ఒకే ఒక ఆదర్శం లేనప్పుడు, ప్రజలకు, రాజుకు ఉన్న సంబంధమే ప్రధానమైంది. అందువల్ల తన ప్రజలు రాజు పట్ల విధేయతను చూపడం, ఆయన ఏ తేడాలు లేకుండా ప్రజలందరి పట్లా సమానమైన ప్రేమను, న్యాయాన్ని చూపడం ఉండేది. అతని వారసుల్లో కూడా ఎవరైతే ఈ విధానాన్ని అనుసరించారో వారికి ప్రజలు విధేయులుగా ఉండటం జరిగింది. అయితే అందరికీ సమానమైన జాతీయత అనేది ఆ రోజుల్లో అంత ఎక్కువగా ఉండేది కాదు. ఈ రోజుల్లోలాగ జనేచ్ఛని ప్రతిబింబించే రాజ్యాంగ శాసనాలు లేవు.

రాజ్య ఏకత్వమనేది తనకు, ప్రజలకు మధ్య ఉన్న సంబంధాన్ని బట్టి ఉంటుందన్న విషయం అక్బర్‌కు తెలుసు. ఏ ముస్లిం రాజుకు లేనంతగా ప్రజలతో ప్రత్యక్ష సంబంధాన్ని ఏర్పరచుకున్నాడు. తన అంతఃపురంలోని ముందు లోగిట్లో ప్రజలకు ఇచ్చే దర్శనం పూర్వ భారతీయ చక్రవర్తులను గుర్తుకు తెచ్చింది. ఈ విధంగా ప్రజల మనస్సులను అక్బర్ చూరగొన్నాడు.

అక్బర్ కాలంలోనే మిగిలిన ప్రధానమైన ప్రాచీన భారతీయ రాజ్య సాంప్రదాయాలను పునరుద్ధరించడం జరిగింది. అక్బర్ దానధర్మాలను, నైతిక సంస్కరణలను ప్రవేశపెట్టాడు. ఢిల్లీ సుల్తానులు యాంత్రికంగా ముస్లిం సమాజంలోనే వీటిని ఆచరించేవారు. అటువంటిది అక్బర్ సక్రమంగా, ఏ తేడాలేకుండా భారతీయులందరికీ అన్వయించాడు. ముస్లిం 'ఉలేమాలను,' 'ఫకీరులను' రాజ్యం ఏ విధంగా పోషించిందో అలాగే హిందూ పండితులను, సాధువులను రాజ్యం పోషించేది. మసీదులకు మొగల్ చక్రవర్తులు ఏ విధంగా దానధర్మాలిచ్చారో, మందిరాలకు కూడా అలాగే ఇవ్వడం జరిగింది. తాగుడు, జూదం, వ్యభిచారం ఈ మూడింటి విషయంలో ప్రజలందరిపైనా సమానంగా నిషేధాజ్ఞలు విధించాడు. మత

జోక్యం అనే నింద వచ్చినప్పటికినీ 'సతి' వంటి హిందూ ఆచారాలను అరికట్టాడు.

అక్బర్ మునిమనుమడైన ఔరంగజేబ్ తన ప్రయత్నంతో లౌకిక రాజ్యమైన మొగల్ సామ్రాజ్యాన్ని మతరాజ్యంగా మార్చాలని విఫల ప్రయత్నాలు చేశారు. దీని పర్యవసానంగా మొగల్ రాజ్య పునాదులే కదలిపోయ్యాయి. అతని మరణానంతరం, అత్యున్నతమైన, వంద సంవత్సరాల పాటు వెలుగొందిన మొగల్ సామ్రాజ్యం నీడలాగా మిగిలింది.

పరిమితార్థంలోనైనా జాతీయ రాజ్యంగా వెలుగొందిన మొగల్ సామ్రాజ్యంలో జాతీయ సంస్కృతి అభివృద్ధి చెందింది. ఔరంగజేబ్ కాలంలో ఇది పూర్తిగా విచ్ఛిన్నమైంది. ఇంతకుముందు అధ్యాయంలో ఢిల్లీ సుల్తానుల కాలంలో హిందూ ముస్లింల మధ్య ఏర్పడ్డ వ్యత్యాసం స్పష్టమైంది. అయితే ప్రేమ, సాన్నిహిత్యం అనే భావాలు హిందూ భక్తుల్లోనూ, ముస్లిం సూఫీల్లోను, అంటే రెండు సమాజాల్లోను ఒకదానిపై ఒకటి ప్రభావాన్ని చూపాయి. మొగల్, ఇస్లాం మత లేక ఇరానియన్, ఇస్లాం సంస్కృతిని, హిందూ సంస్కృతితో సమ్మేళనం చేసే ప్రక్రియ సాధారణంగా జరుగుతున్నప్పటికీ, అక్బర్ పట్టుదలతో ఈ పనిని త్వరితగతిని చేయించగలిగాడు. దీనిమూలంగా అక్బర్ ఆస్థానంలో సమానమైన సంస్కృతి ఏర్పడింది. దీన్ని మొగల్ ప్రతిపత్తి ఉన్న ప్రదేశాలకన్నింటికీ వ్యాప్తిచేయడం జరిగింది.

సాధారణ సంస్కృతికి మూలం భాషే. 13వ శతాబ్దంలో పర్షియన్ భాష పశ్చిమ ప్రాంతాల్లోని హిందీతో కలిసి అంటే ఢిల్లీ, ఢిల్లీ పరిసర ప్రాంతాల్లో, అధికార భాషగా ఏర్పడింది. దాన్ని హిందీ, హైందవీ లేదా హిందూస్తానీ అని వ్యవహరిస్తున్నాం. తర్వాత దీన్ని ఉర్దూగా పేర్కొడం జరిగింది. హిందూ, ముస్లింల మధ్య ఈ భాషే అమల్లో ఉండేది. దీనికి సారస్వత హోదా ఒక్క దక్కన్ ప్రాంతంలోనే వచ్చింది. ఉత్తర హిందూస్తాన్‌లో పర్షియన్ భాష అధికారభాషగా, సారస్వత భాషగా ముస్లింలలో ఉండేది. సికిందర్‌లోడి కాలంలో హిందువులు పర్షియన్ భాషను నేర్చుకొన్నారు. అయితే ప్రభుత్వఖాతాలు హిందీ భాషలో ఉండటంతో హిందూ ఉద్యోగులు ఖచ్చితంగా పర్షియన్ భాషను నేర్చుకొనే అవసరం లేకుండా పోయింది. అక్బర్ ఆర్థిక మంత్రి, తోడర్‌మల్, సామ్రాజ్యంలోని ఖాతాలన్నీ పర్షియన్ భాషలో ఉండాలనీ, ఆ భాషలోనే ఉత్తర ప్రత్యుత్తరాలు జరగా

లని నిర్ణయించాడు. ఫలితంగా రాష్ట్ర ఉద్యోగాల్లో ఉన్న అధిక సంఖ్యాక హిందువులు పర్షియన్ భాషను నేర్చుకున్నారు. అంతేకాక, హిందూ ఉన్నత వర్గాలకు, రాజపుత్ర ప్రముఖులకు చక్రవర్తితో సన్నిహిత సంబంధముండేది. ఆస్థానంలో కానీ, ప్రైవేట్ సమావేశాల్లో కానీ, వేటకు వెళ్ళేటప్పుడు, సైనిక దండయాత్రలు చేసేటపుడు పర్షియన్ భాషాజ్ఞానం అవసరమైంది. రాజుకు, హిందూ ప్రజలకు ఉన్న ఈ సంబంధాన్ని బట్టి పర్షియన్ భాష హిందువుల్లో ప్రాముఖ్యంలో ఉండింది. అంతేకాక మొట్టమొదటిసారి భారతదేశ చరిత్రలో హిందూ ముస్లింలకు పర్షియన్ సాధారణ భాష అయింది. అక్బర్, హిందూ ముస్లింలకు ఎన్నో పాఠశాలలు ప్రారంభించాడు. ఇందులో మాధ్యమంగా పర్షియన్ భాషే ఉండేది ఈ రకంగా, అందరికీ ఒకే రకమైన విద్యావిధానం ఉండటం వల్ల, ఒకే రకమైన భాష, ఒకే రకమైన భావాలు ఏర్పడటానికి అవకాశం ఏర్పడింది. మత సంబంధమైన పాఠశాలల్లో తప్ప, ఇతర మత సంబంధలేని పాఠశాలల్లో కులం, మతం అనే తేడా లేక ఒకే రకమైన పాఠాలను బోధించేవారు. అబుల్‌ఫజల్ చెప్పిందాన్నిబట్టి, ఈ పాఠశాలల్లో పర్షియన్ సారస్వతం, భాషా నిర్మాణం, రాత మొదలగునవి సాధారణ పాఠ్యాంశాలు. నీతి శాస్త్రం, గణిత శాస్త్రం, వ్యాపార గణాంకాలు, కార్యాలయ నిర్వహణ, వ్యవసాయం, క్షేత్రగణితం, రేఖా గణితం, జ్యోతిశ్శాస్త్రం, గృహ ఆర్థిక విధానం, రాజనీతి శాస్త్రం, వైద్యశాస్త్రం, తర్కశాస్త్రం, భౌతిక శాస్త్రం, చరిత్ర ఇవన్నీ కొన్ని కొన్ని విభాగాలుగా, ఉప విభాగాలుగా ఏర్పరచారు. ఈ పాఠశాలల్లో నెలకొన్న మత ప్రాధాన్యం లేని ఈ పాఠ్యాంశాల మూలంగా జాతీయ సమైక్యతకు అవసరమైన శాస్త్రీయ దృక్పథం, వాతావరణం ఏర్పడ్డాయి.

ఈ విద్యావిధానం సాంస్కృతిక అవగాహనను హెచ్చుస్థాయికి తీసుకెళ్ళింది. హిందూ ముస్లిం విద్యావంతులు సంస్కృతం నుండి ఎన్నో ప్రామాణిక గ్రంథాలను పర్షియన్ భాషలోకి తర్జుమా చేశారు. గత, సమకాలీన చరిత్ర గ్రంథాలను కూడా రాయడం జరిగింది.

ముల్లా అబ్దుల్ ఖాదీర్ బదోని హిందూ పండితుని సహాయంతో మొట్టమొదటిసారిగా పర్షియన్ భాషలోకి రామాయణాన్ని, అథర్వణ వేదాన్ని తర్జుమా చేశాడు. తర్వాత ఎంతోమంది హిందువులు రామాయణాన్ని పర్షియన్ గద్య, పద్యాల్లోనికి తర్జుమా చేయడం జరిగింది. హిందూ, ముస్లిం

పండితులు మహాభారతాన్ని కూడా తర్జుమా చేశారు. ఈ తర్జుమా పండి తుల సంఘంలో ముల్లా అబ్దుల్ ఖాదీర్ కూడా ఒక సభ్యుడే. ఫైజీ అనే ఒక గొప్ప కవి ''లీలావతి' అనే గణిత శాస్త్రాన్ని పర్షియన్ భాషలోకి అను వదించాడు. హిందూ అనువాదకులు గణితశాస్త్రం, జీవ శాస్త్రాలకు చెందిన ఎన్నో గ్రంథాలను పర్షియన్ భాషలోకి తర్జుమా చేయడం జరిగింది. షాజ హాన్ కాలంలో ఆయన కుమారుడైన దారాషికోకు హిందూతత్త్వ శాస్త్రం అన్నా, తత్త్వ శాస్త్రం అన్నా, మార్మిక గాథలన్నా ఎక్కువ మక్కువ. విలు వైన గ్రంథాలను, తత్త్వశాస్త్రాన్ని, ఉపనిషత్తులను, భగవద్గీతను, యోగ వాశిష్ట్యాన్ని పర్షియన్ భాషలోకి తర్జుమా చేయించాడు. తానే స్వయంగా 'మజ్‌మల్-బాహరిన్' (రెండు సముద్రాలు కలిసే చోటు) అనే హిందూ-ముల్లాల మార్మికతత్త్వాన్ని ఒకటిగా వివరించి చెప్పే గ్రంథాన్ని రచించాడు.

చరిత్రలో, హిందూ రచయితలైన బృందావన్ దాస్, సుజన్ రాయ్, చంద్రభాన్ బ్రాహ్మన్, భీమ్‌సేన్, ఈశ్వరదాస్ మొదలైన వారు అబుల్ ఫజల్, అబ్దుల్ ఖదీర్ బాదోని, కాఫీఖాన్ మొదలైన ప్రధాన ముస్లీం చరి త్రకారులతో సమానులు. ఈ గ్రంథాల్లో, ఏవో కొన్ని వ్యక్తిగతాలైన లక్ష ణాలు, మానసిక ప్రవృత్తులుండొచ్చు కాని, దృక్పథంలో రెండింటికీ పోలి కలున్నాయి; అట్లే వారు రాసిన రీతులు కూడా సమానంగా ఉన్నాయి. ఇద్దరూ మొగల్ సామ్రాజ్యానికి చెందినవారే. వారి వ్యక్తిగత భావాలను చొప్పించక, నిజాయితీతో, సత్యాన్ని, వస్తుపరతతో రాసినవారు. వారి రచనల్లో రాజు కేంద్రం. అక్కడక్కడా ఆనాటి సాంఘిక పరిస్థితులను, సాంస్కృతిక జీవన విధానాన్ని రాయడం జరిగింది.

ముస్లీంలతో కలసి హిందువులు కూడా పర్షియన్ భాషలో కవితలు రాయ డానికి పూనుకొన్నారు. మీర్జా మనోహర్ తాసనీ, చంద్రఖాన్ బ్రాహ్మణ్, బన్ వారీలాల్ వాలీ అనే హిందూ కవులు ఫైజ్, ఉర్ఫీ, నజీరీ, కలీమ్, కుడ్సీ అనే ముస్లీం కవుల వలే చాలా పేరెన్నిక కవులు కాకున్నా, చాలా మంది ముస్లీం కవులకంటే మేలైనవారే! పర్షియన్ భాషను వారు తమ భాషగా భావించేవారు. చంద్రభాన్ బ్రాహ్మణ్ కవితలే, హిందువులు కొద్ది కాలం లోనే ఎంతో ఆశ్చర్యాన్నిచ్చే కవితను రాయగలరో అనేదానికి మంచి ఉదాహరణ. పర్షియన్ భాషలో కవిత్వం రాయడంలో అతనిలో సొంత శైలి ఉంది. పర్షియన్ కవితకు భారతదేశంలో సంధికాలమది. ఖుస్రూ రాసిన

అందమైన, సాంప్రదాయ బద్ధమైన సులభశైలి రాను రాను ఉద్రేకపూరిత మైన శృంగార కవితకు దారి తీసింది. ఉర్దూ రచనల్లో ఇది అద్దులేని ఊహా జనిత లోకాల్లోకి పయనించింది. హిందూ కవుల రచనల్లో కూడా ఈ శృంగార భావన కన్పిస్తుంది.

జాబులు రాయడంలోని సారస్వత కళను హిందువులు మాత్రమే సాధించగలిగారు. అబుల్‌ఫజల్, ఆలంఘీర్ (ఔరంగజేబ్) పర్షియన్ గద్యం రాయడంలో దిట్టలు. మున్షీహర్ కరన్, చంద్రభాన్ బ్రాహ్మణ్, మున్షీ మధూ రామ్, మున్షీ నిహాల్ చంద్, మున్షీ అవధేరాజ్‌లతో సమానంగా లెక్కించ దగ్గ రచయితలు పైన పేర్కొన్న యిద్దరు మాత్రమే. జాబులు రాయడ మనే సాహిత్య ప్రక్రియలో అపుడు రెండు భిన్న రీతులుండేవి సరళంగా, నేరుగా రాసే ఔరంగజేబ్ శైలి. ఇది మొగలాయిల తొలి సాహసోపేత జీవి తాన్ని వర్ణించిన శైలిని గుర్తుకు తెస్తుంది. రెండో శైలి పూర్తిగా విద్యా వ్యాసంగానికి చెందినది - అబుల్ ఫజల్ మొగలాయీ సామ్రాజ్య ఆస్థాన ఘనతను వర్ణించిన శైలి. పర్షియన్ భాషలో జాబు రాసే ప్రక్రియ భారత దేశంలో అమలు పరచిన పద్ధతికి, చంద్రభాను, మధూరామ్ రచనలకు, హిందూ ముస్లిం రచనలకు ఉదాహరణలుగా పేర్కొనవచ్చు. ఆచరణలో అక్బరు పర్షియన్‌ను ఆస్థాన భాషగా చేసినా, ఆయన దేశీయ భాషల అభివృద్ధికి కూడా ప్రోత్సాహమిచ్చాడు. బ్రిజ్‌భాషా, అవధి హిందీలో ప్రము ఖమైనవి. ఇవి అక్బరు కాలానికి ముందే అభివృద్ధిలో నుండేవి. అవధిలో, షేర్షా కాలంలో, 'పద్మావతి' అనే కావ్యాన్ని రాసిన మాలిక్ మహమ్మద్ జయిసీ ఎంతో గొప్పవాడు. జాతీయ స్పృహవల్ల అక్బరు కాలంలో పెల్లు బికిన అత్యుత్సాహ వాతావరణంలో హిందీ ఎక్కువగా అభివృద్ధి చెందింది. ఈ అభివృద్ధికి కారకులు హిందువులు, ముస్లింలు ఇద్దరూను. సూర్‌దాస్ కృష్ణభక్తి అపూర్వమైంది. అతని కవిత చాలా ఉన్నతమైంది. ఇతని పాటల్లో కృష్ణునిపై ప్రేమ, భక్తి తాండవమాడుతుంటాయి. వాటిని 'సుర్‌సాగర్' అంటారు. అబ్దుల్ రహీంఖాన్ ఖానాన్, అక్బరు ఆస్థానంలో మూలస్తంభం వంటివాడు. తాను స్వయంగా కవి. హిందీ కవితను ప్రోత్సహించాడు. గంగ, నరహరి, చక్రవర్తి స్నేహితుడైన బీర్బల్ కూడా గొప్ప ఆస్థాన కవులు. అక్బరు కూడా హిందీ కవిత రాశాడు. తర్వాత కేశవ్ దాస్, బీహారీ, దేవ్, రస్‌ఖాన్ (ముస్లిం) హిందీ కవిత్వాన్ని అత్యున్నత శిఖరాలకు

తీసుకొని వెళ్ళారు. శివాజీ, ఛత్రశాలుడిపై శాశ్వతకీర్తిని తెచ్చే ఇతిహాసాలను భూషణ్ రచించాడు.

శిల్పకళ విషయంలో హిందు, ముస్లిం అంశాలను సమ్మిశ్రితం చేయడమనేది ఢిల్లీ సుల్తానుల కాలంలో జరిగింది. అయితే ఈ రెండింటినీ కలిపి సామరస్యపూరితమైన శైలిని తేవడానికి స్వతసిద్ధమైన మేధాసంపత్తి, విశాల దృష్టి కావాలి. ఇవి మొగల్ చక్రవర్తుల కాలంలో లభ్యమైనాయి. బాబర్, హుమాయూన్‌లు ఇరువురూ పర్షియన్ శైలినే శిల్పకళలో ప్రోత్సహించారు. దీనికోసం పర్షియన్ శిల్పులను తీసుకొచ్చారు. వారి కాలంలోని భవనాలు, బాబర్ నిర్మించిన పానిపట్, శాంభాల్‌లోని మసీదులు, హుమాయూన్ నిర్మించిన ఫతౌహాబాద్, హిస్సార్, పర్షియాలోనున్న ఇస్ఫాహాన్ తరహా మధ్యయుగం నాటి భవనాల శైలిలో ఉన్నాయి. అక్బరు కాలంలో వచ్చిన శిల్పకళ ఢిల్లీలోని హుమాయూన్ సమాధి. దీన్ని నిర్మించిన పర్షియన్ శిల్పి మీర్జా ఇనాయతుల్లా. ఆ తర్వాత అక్బర్ రాజకీయ, వైజ్ఞానిక రంగాల్లో సాధించినట్లే, టర్కీ, పర్షియన్, ముస్లిం భావనలను హిందూ భారతీయ శైలులకు జోడించి ఒక గొప్ప సౌందర్యోపేతమైన మొగల్ శైలిని తెచ్చాడు. అది కంటికి వెలుగు, మనస్సుకు శాంతిని కలిగించింది. ఫతేపూర్ సిక్రీలోని జామా మసీదు, డిజైన్‌ను ఇస్ఫాహాన్ (పర్షియా) నుంచి గ్రహించింది. దానికున్న ఉదాత్తమైన తలవాకిలి, సాంప్రదాయబద్ధంగా ఉన్న మధ్యయుగంలోని పర్షియన్ శైలి లక్షణాలను పుణికి పుచ్చుకొంది. పైభాగంలో ఉండే గుమ్మటాల్లో (Doms) జైనశైలి కనిపిస్తుంది. మౌంట్ అబూలోని శిల్పకళ ఇందులో ద్యోతకమౌతుంది. జహంగీర్ కాలంలో హిందూ ప్రభావం ఇంకా పెరిగింది. సికింద్రలోని అక్బరు సమాధి, దీనిలో ముస్లిం శైలికి సంబంధించిన కమానులు, గుమ్మటాలు ఉన్నా, బౌద్ధ విహారాలకు, మహాబలిపురంలోని రధాలకు చెందిన పద్ధతి కనిపిస్తుంది.

మొగల్ శిల్పకళ షాజహాన్ కాలంలో ఉచ్ఛదశకు చేరుకొంది. పర్షియా నుంచి, ఇతర దేశాలనుండి శిల్పులను పిలిపించి, వివిధ దేశీ ప్రభావాలతో కట్టడాలను నిర్మించారు. దీని మూలంగా దేశీయ హిందూ శైలి కొంత వెనుకంజ వెయ్యడానికి ఆస్కారం ఏర్పడింది. ఆ తర్వాత పూర్తిగా మొగలాయీ శైలికి మారిపోవడం జరిగింది. పూర్తిగా అంగాంగాల్లో ఈ శైలిని చొప్పించడం కష్టం అయింది. విప్లవాత్మకమైన మార్పులు ఏమంటే,

షాజహాన్ పాలరాయిని విరివిగా వాడాడు. ఆ రాతిని వాడాలంటే ఎక్కువ జాగ్రత్త, నైపుణ్యం, సౌకుమార్యం ఉండాలి. ప్రతి చిన్న పనిని కూడా చక్కగా రూపొందించుకోవడమే కాక, అవసరమైతే మార్చుకోడానికి అవకాశముండేది. ఇంతటి వెలుగును ప్రసాదించే ఈ పాలరాయి పనికి అందమైన పూలను చెక్కడానికి, ఎంతో జాగ్రత్త, సౌకుమార్యత అవసరం. అందుకే పైనుండే పెద్ద పెద్ద భాగాలు ఖాళీగా ఉంచడం జరిగింది.

మొసైక్ (Mosaic) మీద, రంగురంగులున్న రాళ్ళమీద చెక్కిన అందమైన రూపాలు అలంకారం చేసినట్లు రూపొందించడం జరిగింది. కమాన్‌లు వివిధమైన రూపాల్లో రూపొందించారు. స్తంభాలను కొత్తగా పలచనైన రూపాలతో చేయడం జరిగింది. గుమ్మటాలు (దోములు) సౌకుమార్యమైన శిఖరాలతో ఒకదానికొకటి సమానంగా కట్టబడ్డాయి. భవనాల రూపురేఖలు, అలంకారికమైన పని, నూతనమైన, అత్యున్నతమైన సౌందర్యాన్ని ప్రతిబింబించేవిగా వున్నాయి. దానికితోడు వొంపులు తిరిగిన గీతలు అందంగా వున్నాయి. శిల్పి తన చాతుర్యంతో, ఎంతో అందాన్ని, హుందాతనాన్ని, సౌకుమార్యాన్ని కలిగించగలిగాడు. భారతీయ శిల్పి, పర్షియన్ శిల్పరీతులతో కలిపి ఒక కొత్త ప్రయోగం చేయడం, అంతకుముందు అటు పర్షియన్ శిల్పులు కాని, ఇటు భారతీయ శిల్పులు కాని చేయనటువంటి నూతన ప్రయోగాన్ని చేయడంలో ఎన్నో కొత్త గుణాలు కన్పించాయి. నూతన శైలిని సృష్టించగలగడం ఒక కొత్త విశేషం. వస్తువు భారతదేశంలో లభ్యమైనప్పటికినీ, భారత, విదేశీ శిల్పులతో ప్రయోగం జరగడం ఒక విశిష్ట లక్షణం. 'పాలరాతి స్వప్నం'గా తాజ్‌మహల్ వర్ణించబడింది. దాన్ని నిర్మించిన శిల్పి షిరాజ్ నుంచి వచ్చాడో లేక ఇటాలియన్ శిల్పి నిర్మించాడో తెలీదు. ఎవరు నిర్మించినా అది ఒక భారతీయ రాజు మనస్సులో పుట్టిన భావనగా, భారతీయ ప్రేమకు, జ్ఞాపికగా భారతీయ పాలరాతితో వెలిసిన భవనమై స్వచ్ఛతకు, శాంతికి, కరుణకు నిలిచిన ఆకృతిగా మన కనులముందు తాజ్‌మహల్ సాక్షాత్కరిస్తుంది.

ఈ కాలంలో చిత్రలేఖనం కూడా ఒక కొత్త శైలిని ఏర్పరుచుకొంది. టర్కో-ఇరానియన్, ప్రాచీన భారతీయ శైలితో కలిసిన కొత్త సౌకుమార్యతను సంతరించుకొంది. ఇంతకు ముందు పేర్కొన్నట్లుగానే, మత నిబంధనల మూలంగా ఢిల్లీ సుల్తానుల కాలంలో చిత్రలేఖనం అభివృద్ధి చెంద

లేదు. హిందూ చిత్రకారులు గ్రంధాల్లో విషయాలను వివరిస్తూ చిత్రించే బొమ్మలు ఎన్నో వేశారు. అజంతా సాంప్రదాయం కాలానుగుణ్యంగా మార్పు చెందింది. మధ్యయుగ భారతీయ శైలి, ప్రధానంగా రాజపుత్రుల శైలి, అంటే వారు పోషించిన శైలి, ప్రాద్భలంలోకి వచ్చింది. హిందూ చిత్రకారులు ప్రధానంగా పురాణాల నుంచి, రామాయణ, మహా భారతాల నుంచి, కృష్ణుడి కధల నుంచి సంగీతరాగాలను చిత్రించారు. ఎక్కడో కొన్ని మాత్రం సామాన్య ప్రజలనుంచి తీసుకొన్నారు. వాళ్ళ చిత్రలేఖనాలు ప్రకృతిని, దాని వివిధ రీతులను సరళంగా, చక్కగా చిత్రించారు. సంకీర్ణ, మూర్తభావాలతో కూడిన చిత్రాలను వారు పట్టించుకోలేదు.

తైమూరు వారసులకు చిత్రలేఖనమంటే చాల మక్కువ. వారి పోషణలో పర్షియన్ కళ క్రమేపీ అభివృద్ధి చెందింది. బజాద్ కాలంలో హెరాట్ స్కూలు సంపూర్ణతను సాధించింది. మీర్ సయ్యద్ అలీ, క్వాజా అబ్దుస్ సమద్ షిరాజీ, బజాద్ శిష్యులు. వీరు హుమాయూన్‌తో పాటు భారత దేశం వచ్చారు. వారి చిత్ర పటాల్లో భారతీయ ప్రభావం ఉన్నప్పటికీ, టర్కీ-ఇరానియన్ అంశాలే ఎక్కువ. వాస్తవికతకు, భారతీయ చిత్రలేఖనం సులభరీతికి ప్రాముఖ్యాన్నిచ్చిన అక్బర్, భారతీయ రీతిని, పర్షియన్‌ల నాజూకుదనాన్ని జోడించి నూతన శైలిని అభిలషించాడు. చిత్రకళల అకాడెమీ, హిందూ, పర్షియన్ కళాకారులతో కూడి ఆయన కొలువులో ఉండేది. పర్షియన్ ఉపాధ్యాయులు అయిన సయ్యద్ అలీ, అబ్దుస్ సమద్ వారియొక్క హిందూ శిష్యులచేత పర్షియన్ రేఖా చిత్రాలను మెలకువతో, దిద్దాల్సిన రంగులతో చిత్రీకరింప చేయడం జరిగింది. సిద్ధాంతపరమైన ఒక గ్రంధాలయాన్ని ఏర్పరచి, కళకు సంబంధించిన గ్రంధాలు, పేరెన్నికగన్న చిత్రకారుల పటాలను అందులో ఉంచారు. కళాకారులు పనిలో ఉండగా, అక్బర్ స్వయంగా తానే వెళ్తుండేవాడు. అక్బరు కాలంలో దస్వంత్, ఫరూక్ బేగ్, బసవన్, సాన్‌వాలా ప్రధానమైన చిత్రలేఖకులు. వాళ్ళు లౌకిక సాంప్రదాయాన్ని పాటించారు. ప్రారంభంలో ఈ శైలి పర్షియన్ పద్ధతిలో ఉండేది; అలంకారాలతో ఎంతో విస్తృతంగా, ధృఢంగా ఉండి, కాలక్రమేణా భారతీయ జీవంతో, ప్రవాహ లక్షణాలతో శక్తివంతమై అక్బరు పాలనాకాలం పూర్తయ్యేనాటికి, అనగా జహంగీరు కాలానికి స్వతంత్రమైన మొగల్ శైలిగా అభివృద్ధి చెందింది.

జహంగీరు కళా పోషకుడే కాక, తనే ఒక కళాకారుడు. ఆయన కాలంలో చిత్రకళ ఉన్నత దశకు చేరుకొంది. ఫరూక్ బేగ్, నదీర్, మహమ్మద్ మురాద్, అబుల్ హసన్, మాన్‌సూర్, బిషన్‌దాస్ మనోహర్, దౌలత్ ఆనాటి ప్రసిద్ధ చిత్రలేఖకులు. వారి పరిధి విస్తృతంగా పెరిగి, పురాణాల దశ దాటి, యుద్ధ భూమి, వేట, ప్రేమ, రాజుల ఆస్థానాలు, సూఫీ ఆరామాలు, వ్యక్తుల పటాలు, జంతువులు, చెట్లు, రంగురంగుల పువ్వులు - ఒకటేమిటి - మానవ జీవితపు వివిధాంశాలతో, యావత్‌ప్రకృతి - అన్నీ చిత్రలేఖన వస్తువులే. ఇవన్నీ జహంగీరు చక్రవర్తి, ఆయన ఆస్థానంలోని ప్రభువుల యిష్టాన్ని చూరగొన్నాయి.

షాజహాన్‌కు చిత్రలేఖనం కంటే శిల్పంపైననే మక్కువ జాస్తి. అయినప్పటికీ కొందరు రాజకుమారులు, ప్రభువులు చిత్రలేఖనాన్ని పోషించారు. చిత్రలేఖనం పేరు ప్రఖ్యాతులు పూర్తిగా తగ్గకున్నా, మిగిలిన కళలకంటే తక్కువ స్థానాన్ని పొందడం గమనించవచ్చు. అధిక సంపద దీనికి కారణం కావచ్చు. ఎక్కువ బూటకమైన మెరుగులకే అవకాశమిచ్చారు కాని, కళాత్మకమైన గుణగణాలకు ప్రాధాన్యత నివ్వలేదు. ప్రతి చిత్రలేఖనానికి గిల్‌బార్డర్ ఉండితీరాలి. అనూప్ చిత్రా, చిత్రమణి, ఫకీరుల్లా, హాషీమ్ అలీ, షాజహాన్ కాలంనాటి ప్రసిద్ధ చిత్రకారులు - వీరిలో ఎవ్వరినీ మన్సూర్, అబుల్‌హసన్, మనోహర్‌లతో పోల్చడానికి వీలులేదు. ఔరంగజేబ్ మత ఆడంబరత మూలంగా చిత్రలేఖనం విచ్ఛిన్నత చెంది ఆతని తరువాత మొగల్ సామ్రాజ్య పతనంతో అది పూర్తిగా విచ్ఛిన్నతకి గురి అయింది.

సంగీతం విషయంలో, హిందూ-ముస్లింల మధ్య అభిరుచిలో సమన్వయం, ఢిల్లీ సుల్తానుల కాలంలో స్వతంత్రరాజ్యాల్లో అభివృద్ధి చెంది, అట్లే సూఫీల ఆరామాల్లోనూ వర్ధిల్లింది. మొగలుల కాలంలో అందరికీ చెందిన జాతీయ సంగీత విధానం అమల్లో ఉండేది వాళ్ళ పోషణలో ఇది ఇంకొంత అభివృద్ధి చెందింది. మేధాపరమైన సిద్ధాంతాల ప్రమేయం లేకుండానే, సంగీతంలో మానవుల మనోభావాలను, అనుభవాలను వ్యక్తం చేయవచ్చు. కులాలు, తెగలు అనే తేడా లేకుండా అందరిలో ఉన్న ఈ సంగీత కళను చూస్తుంటే, భారతీయుల హృదయాలన్నీ ఏకత్వంలో లగ్నమైనాయా అనిపిస్తుంది. మౌలిక సాంస్కృతిక స్పృహ ఈ కాలంలో

శాశ్వతంగా నెలకొల్పబడిందా అనిపిస్తుంది.

సాధారణ సామాజిక జీవితంలో ఏకరూపత సిద్ధించింది. ఆచార సాంప్రదాయాల్లో కానీ, ఆహారంలో కానీ, వస్త్రధారణలో కానీ, భోగభాగ్యాల్లో కాని, వినోదాల్లో కానీ, ఈ కాలంలో అభివృద్ధి చెందిన తీరుతెన్నులను పరిశీలిస్తే, లక్షలాది హిందూ, ముస్లిం కుటుంబాల నిత్య జీవితంలో వచ్చిన మార్పులు అవగతమవుతాయి. ఈ మార్పులను గూర్చిన వివరణ యిక్కడ అవసరంలేదు. .

# 11. హిందూస్థానీ సంస్కృతి-II

ఔరంగజేబు పరిపాలనా కాలంలోని మొదటి సగం భాగంలో, రాజకీయంగా మొగలు సామ్రాజ్య కీర్తి ఉన్నత శిఖరాలను అందుకొంది. ఆ తరువాత క్షీణదశ ప్రారంభ మైంది. దక్కన్‌లో ఔరంగజేబ్ చేసిన దండయాత్రల మూలంగా ఖజానా ఖాళీ అయింది. ఆయన అనుసరించిన సంకుచిత విధానాల మూలంగా, అక్బర్‌కు చాలా సన్నిహితులుగా ఉన్న రాజపుత్రులను దూరం చేసుకొన్నాడు. దీనికి తోడు మూడు శత్రు వర్గాలైన, సిక్కులు, మహారాష్ట్రులు, జాట్‌లు ఈ వ్యతిరేకతకు దోహదం చేశారు. ఔరంగజేబ్ మరణానంతరం ఈ నాలుగు వర్గాలు, ముఖ్యంగా మహారాష్ట్రులు, మొగల్ సామ్రాజ్య పునాదుల్ని పెకలించి వేశారు. మొగలుల ఆస్థానంలో తురానియన్‌లు, పర్షియన్‌లు, ఆఫ్ఘన్ సముదాయాలు కేంద్ర ప్రభు త్వాన్ని బలహీనపరిచాయి. అందువల్ల రాష్ట్రాల్లోని గవర్నర్‌లు స్వతంత్రులయ్యారు. ఆగ్నేయదిశలో విదేశీదాడులు ప్రారంభమయ్యాయి రెండు శతాబ్దాలుగా మొగలు సామ్రాజ్యశక్తి, ఖ్యాతుల మూలంగా అడుగుబెట్టలేని ఈ శక్తులు కొత్తగా అడుగు పెట్టడం జరిగింది. ఐరోపా వర్తకులు, ముఖ్యంగా లండన్ నుంచి ఈస్ట్ ఇండియా కంపెనీవారు 16, 17 శతాబ్దాల్లో భారతదేశానికి వచ్చి, దేశాన్ని కబళించి వేయ డానికి పూనుకున్నారు. ధన సంపాదనకోసం వ్యాపార నిమిత్తమై వచ్చి, రాజకీ యాల్లో తలదూర్చి దండయాత్రలు కూడా ప్రారంభించారు. విశాలమైన భూభా గాలను ఆక్రమించుకున్నారు. భారత రాజకీయాల్లో ఒక ప్రముఖపాత్రను వహిం చారు

వాస్తవానికి, అక్బరు, ఆయన వారసుల పరిపాలనలో అభివృద్ధి చెందిన హిందూస్థానీ సంస్కృతిలో విచ్ఛిత్తి ప్రారంభమైంది. అయినప్పటికీ, అదే, దేశా నికంతటికీ సంబంధించిన సంస్కృతి. దాని ప్రభావం దేశంలో నలుమూలలా వ్యాపించి వుంది. ఇటువంటి తరుణంలో పాశ్చాత్య సంస్కృతి, భారతదేశ సాంస్కృ

తిక జీవన విధానంలో అడుగుబెట్టడం ఒక నూతన అంశంగా పేర్కొన వచ్చు. ఈ మార్పు బ్రిటిష్ వ్యాపారుల వల్ల జరిగింది. 19వ శతాబ్ది ఉత్తరార్థంలో ఇది స్పష్టంగా కనిపించింది. కానీ ఈ విచ్ఛిత్తి అనేది చాలా నిదానంగా జరిగింది. రాజకీయ అనైక్యత ప్రారంభమైన నాటినుంచి వివిధ సముదాయాల్లోను, ప్రాంతాల్లోను ఇదే సంధానకర్తగా పనిచేసింది. దీని నూతనత్వం శక్తి, చేవ అడుగంటడం ప్రారంభించినా, దీని ప్రభావం మాత్రం విస్తృతమైంది. నూతన కేంద్రాలైన లక్నో, హైదరాబాద్, ముర్షిదాబాద్ మొదలగు ప్రదేశాల్లోని ప్రజలకు ఈ సంస్కృతి సర్వసామాన్యమైంది. 1857లో జరిగిన విపత్తు నుంచి ఇది తేరుకోలేక పోయింది.

ఈ కాలంలో ప్రచారంలో ఉన్న పర్షియన్ భాష ఇతర ప్రాంతాలకు పాకింది. కుంచించుకుపోయి, మొగల్ సామ్రాజ్య ప్రతిపత్తి ఉన్న ప్రదేశాల్లోనే కాక, దక్కన్, బెంగాల్, అయోధ్య మొదలగు స్వతంత్రరాజ్యాల్లో కూడా పర్షియన్ భాష రాజభాష అయింది ఈ ప్రాంతాల్లో ఎక్కువమంది ఉద్యోగస్తులు హిందువులే. సచివాలయంలో (Dar-ul-Insha) హిందువులే ఎక్కువగా ఉండేవారు. అందువల్ల 18వ శతాబ్దంలో 'మున్షి' అనే పదం బాగా పర్షియన్ భాష తెలిసిన వారికి ఉపయోగించేవారు. హిందూ రాజ్యాల్లో కూడా రాజభాష పర్షియనే మరాఠా సామ్రాజ్యం ఈ విషయంలో మొగల్ సామ్రాజ్య అడుగుజాడల్లో నడిచింది. 1819 వరకు ఈస్ట్ ఇండియా కంపెనీ కూడా పర్షియన్ భాషనే అనుసరించింది. ఆ తరువాతనే ఆంగ్లభాష ప్రవేశించింది కానీ ఆచరణలో ఆంగ్లభాష ప్రారంభమైనప్పటికీ, చాలాకాలం పర్షియన్ భాషే అమల్లో ఉండేది విద్యావంతులైన హిందువులు, ముస్లింలు మామూలు ఉత్తర ప్రత్యుత్తరాలకుగానీ, సారస్వత, విజ్ఞాన శాస్త్ర సంబంధమైన విషయాల్లో ఈ భాషనే వాడేవారు.

సారస్వత, వైజ్ఞానిక అభివృద్ధి దృష్ట్యా ఈ కాలం నిరాశాజనకమైంది. రాసిన పుస్తకాలు అంతకు ముందుకాలం కంటే తక్కువేమీ కాకపోయినప్పటికీ ప్రమాణాల విషయంలో అంత విలువైనవి కావు సృజనాత్మకత, హేతుబద్ధత లోపించాయి. పండితులు అంతకుముందు రచయితల అడుగుజాడల్లో నడవడం ప్రారంభించారు నిఘంటువులను తయారుచేయడం, ఉదాత్తమైన వ్యక్తుల జీవిత సంగ్రహాలను రాయడం, కథలు, నవలలు రాయడం వారి ప్రధాన బాధ్యత. మొదట్లో హిందూ రచయితలు ముస్లిం రచయితలకంటే ఎక్కువ రాసేవారు. ఆ తరువాత ముస్లింలు కూడా సమానంగానే రాసేవారు. నవలాకారుల్లో గులాం

అలీ ఆజాద్, లక్ష్మీనారాయణ షఫీక్; నిఘంటువు రచనలో టేక్ చంద్; క్రోడీకరణలో 'బహరీ ఆజమ్,' 'మిరాత్ ఉల్ ఇస్తిలా' అనే గ్రంధాన్ని రచించిన ఆనందరాం ముఖ్లిస్. సిరాజుద్దీన్ ఖాన్ అర్జూ రాసిన 'సిరాజుల్ లుఘాత్' ముఖ్యమైనవి. ఈ కాలంలోని హిందూ మున్షీలు రాసిన లేఖారూపకమైన కావ్యాలు పర్షియన్ భాషలో కనిపిస్తాయి. వారి పర్షియన్ భాషా చాతుర్యం ఆశ్చర్యం గొలుపుతుంది. ఇరానియన్ల భాషీయమైన లోకోక్తులను వదలిపెట్టడం సహజమైందే. దురదృష్టకరమైన విషయమేమంటే వారు మథోరాం వాడిన కృతక బాషను వాడారే కాని బ్రాహ్మణ, అలంగీర్ ఉపయోగించిన సులభమైన, సరళమైన పదాలను వాడలేకపోయారు.

చరిత్ర, జీవిత చరిత్రల్లో చాలా రచనలు జరిగినా, నాణ్యత విషయంలో అంత ప్రతిభ కనిపించలేదు. అయినప్పటికీ గులాం అలీ ఆజాద్, లక్ష్మీనారాయణ్ షఫీక్, గులాం హుస్సేన్ రాసిన 'సియార్-ఉల్-ముతా-అఖిరిన్'లాంటి చారిత్రక రచనలు చాలా ప్రధానమైనవి. తత్వశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం, ఖగోళశాస్త్రం, గణితశాస్త్రం మిగిలిన విజ్ఞాన శాస్త్రాల్లో పాండిత్య ప్రకర్ష కనిపించిందే కానీ స్వతస్సిద్ధమైన వాస్తవికతపాలు తక్కువ. హిందువులు వివిధ శాఖల్లో ఎంత విజ్ఞానాన్నందించారో దాదాపు ముస్లింలు కూడా అంతే విజ్ఞానాన్ని అందించారు. అనేక, అనువాదాలు సంస్కృతం నుంచి పర్షియన్ భాషలోనికి చేసింది మాత్రం హిందువులే.

అక్బరు కాలంనాటి ఇతిహాసిక రచనల బదులుగా శుద్ధ సారస్వతంలో అద్భుతావహాలయిన రచనలు, శృంగార రసభరితమైన కావ్యాలు హెచ్చుగా కనిపిస్తున్నాయి. ఇంద్రియ సంబంధమైన, ఊహాతీతమైన రచనలు చేసేవారు. ఇవి వాస్తవానికి దూరమైనవి. 'బోస్తన్-ఇ-ఖయాల్' అనే గ్రంధాన్ని ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు. వీటిలో హిందువులు చారిత్రాత్మక రచనలను కొన్ని మాత్రమే రాశారు. ఎక్కువగా చారిత్రాత్మక కథలను, జానపద కథలను రాశారు. ఆనాడు వచ్చిన కవిత్వం కూడా వైజ్ఞానికంగా కానీ, రసాత్మకంగా కానీ క్షీణదశకు చెందిన రచనలే. ఉర్ఫీ, నజరీ రాసిన శృంగార రసోచితమైన గ్రంథాల్లో సులభశైలిగానీ, వాస్తవిక విషయాలుగానీ లేవు. అయితే ఆకాంక్ష, నూతనత్వం వారి ఆలోచనలలో కనిపించేవి. బెడిల్ ఈ అద్భుతావాలమైన కవితలు రాయడంలో ఎన్నో వైజ్ఞానిక ప్రయోగాలు చేశాడు. చాలామంది హిందూ, ముస్లిం కవులు బెడిల్‌ను అనుసరించారు. తన శిష్యుడైన ఆనంద్‌రామ్ ముఖ్లిస్ కానీ

గురువులైన ఆజాద్, అర్షు, షఫీక్‌లు గానీ ఈ విధానాన్ని అనుసరించలేదు.

ఈ కాలంలోనే ఉర్దూభాష బాగా అభివృద్ధి చెందింది. ఉత్తర హిందూస్థాన్‌లోగానీ, దక్కన్‌లోగానీ పర్షియన్ సాహిత్యానికి వ్యతిరేకంగా ఈ అభివృద్ధి జరిగింది. ఈస్ట్ ఇండియా కంపెనీ ఈ భాషఖ్యాతిని గుర్తించింది. సివిల్ ఉద్యోగుల విద్య నిమిత్తం స్థాపించబడిన ఫోర్టు విలియం కాలేజి విద్యా ప్రణాలిలో ఆంగ్లభాష, పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రాల జాబితాలో ఈ ఉర్దూ భాషను కూడా చేర్చడం జరిగింది. ఉర్దూ రచయితలను నియమించి అరబ్బీ, సంస్కృత భాషలనుంచి తర్జుమా చేయించడం జరిగింది. సులభరీతిలో, మంచి భాషలో తర్జుమా అయిన గ్రంథాల్లోని భాషను హిందూస్థానీ అని పిలిచేవారు. కొన్ని గ్రంథాలు దేవనాగరి లిపిలో రాయడం జరిగింది. అందులో అర్థంకాని అరబ్బీ, పార్శీ పదాలకంటే సంస్కృత పదాలనే ఎక్కువగా వాడారు. దీని మూలంగా హిందీ ప్రామాణికత పెరిగింది. అయితే ఈస్ట్ ఇండియా కంపెనీ ఉర్దూ భాషను ఎంత ప్రోత్సహించినప్పటికీ, పాలనా భాషగా ఎక్కువ రోజులు మనలేకపోయింది. అందువల్లనే పర్షియన్ భాష తర్వాత ఆంగ్ల భాషే అధికారిక భాష అయిందని చెప్పాలి. అయితే ఉర్దూ భాషకున్న గొప్పదనం వల్ల, మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా పశ్చిమోత్తర రాష్ట్రాల్లో, అంటే ఉత్తర ప్రదేశ్, పంజాబ్ ఇతర స్వతంత్ర రాజ్యాల్లో అధికారిక భాషగా అంటే ఆంగ్లభాషతో సమానంగా మనగలిగింది.

మొగల్ సామ్రాజ్య పతనం మూలంగా శిల్పకళ, ఇతర లలిత కళలు కూడా శిధిలావస్థని పొందాయి. రాజకీయాలకు గురైన ఢిల్లీ ఆస్థానంలో కళలను పోషించడానికి యిచ్ఛగానీ, డబ్బుగానీ ఉండేది కాదు. చిన్న, చిన్న స్వతంత్ర రాజ్యాల్లో ఈ కళలను కొంత ప్రోత్సహించినప్పటికీ ఆ కళాకారులకు ఎక్కువ ప్రేరణని ఇవ్వలేకపోయారు. అందుచేతనే వారు గురువులు చేసినదాన్నే యధాతథంగా పాటించేవారు.

ఈ కాలంలో శిల్పకళ ఎక్కువ అభివృద్ధి చెందలేదు. రాజభవనాలు, సమాధులు, దేవాలయాల్లో ఆనాటి మొగల్ లేక హిందూస్థానీ శైలి కన్పిస్తుంది. జామ్‌నగర్ రావు, ఛెత్తర్‌పూర్ రాజభవనాలు, మహారాజ రంజిత్ సింగ్ జ్ఞాపకార్థం లాహోర్‌లో నిర్మించిన కట్టడాలు, కోటాలో మహారావ్ ఉమ్మెడ్‌సింగ్ కట్టిన కట్టడాలు, ఆల్వార్‌లో మహారాజ భక్తవార్ సింగ్ కట్టడాలు, కాశీలోని విశ్వేశ్వర మందిరం, అమృత్‌సర్‌లోని స్వర్ణదేవాలయం మొదలగునవి వాటికి ఉదాహరణలుగా పేర్కొ

నవచ్చు. కాలగమనంలో విధ్వంసం కాగా మిగిలిన హిందూ, ముస్లిం ప్రభువుల నివాస భవనాలను బట్టి చూస్తే షాజహాన్ పాలనలో నిర్మించిన కట్టడాల ఆకృతుల్లాగానే ఉన్నాయి.

చిత్రలేఖనంలో మొగలాయి శైలే కాకుండా అయోధ్య, హైదరాబాద్ మొదలగు ప్రదేశాల్లో జైపూర్ శైలికూడా అభివృద్ధి చెందింది. జమ్మూలో కానీ పంజాబ్‌లోని కొంద ప్రాంతాల్లో చేసిన చిత్రలేఖనాల్లో ఈ శైలి ప్రభావం కన్పిస్తుంది. హిందూ శాస్త్రీయ లేదా నూతన సంగీతంలో కొత్తదయిన ఒక మిశ్రమ శైలి ఢిల్లీ సుల్తానుల, మొగలాయి చక్రవర్తుల కాలం నాటిది కన్పిస్తుంది. హిందూ, ముస్లింలు ఇరువురూ దీన్ని బాగా అభివృద్ధి పరిచారు. వీటిలో ఎన్ని వైమనస్య భావాలున్నప్పటికీ భారత ప్రజలందరి మనస్సులను చూరగొనగలిగిన శక్తి ఆనాటి సంగీతానికి ఉంది.

సామాజిక జీవన విధానంలో ఆహార పద్ధతుల్లోను, వస్త్రధారణలోను, ఆచార- సంప్రదాయాల్లోను హిందూ, ముస్లిం ఉన్నత వర్గాల్లో ఈ హిందూస్థానీ సంస్కృతి ఏకస్వామ్యతని చేకూర్చగలిగింది. ఈ దశ చివరి వరకు కూడా ఆ భావం స్పష్టమౌతూనే ఉంది బ్రిటీష్ వారు కానీ, ఇతర ఐరోపా వాసులుగానీ రాసిన భారతీయ జీవనాన్ని బట్టి ఒక సామాన్య హిందూస్థానీ సంస్కృతి, ప్రాంతీయ, ఖండ సంస్కృతులతో పాటు ఉంటూ వచ్చింది. అక్బర్ కాలంలో నిర్మించిన ఘనమైన భవనాల పైభాగాలు నాశనం చేసినా, పునాదులు మాత్రం యథాతథంగానే ఉన్నాయి.

* * *

1773 తరువాత కాలంలో భారత జీవన విధానంపై బ్రిటిష్‌వారి సాంస్కృతిక ప్రభావం ఉండింది. అంటే ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రభుత్వ కార్యకలాపాలు బ్రిటిష్ పార్లమెంట్ నియంత్రణ కిందికి వచ్చాయి. కంపెనీ నాగరిక ప్రభుత్వ గుణగణాలను అలవరచుకుంది. అంతవరకూ ఈస్ట్ ఇండియా కంపెనీలో పనిచేసిన ఉద్యోగులు కేవలం దోపిడీ వ్యాపారస్తులే. వారికి సంస్కృతి అంటే అర్థం ఏమిటో కూడా తెలియదు అవి చాలా గడ్డు రోజులు. ప్రజల రక్తం పీల్చడం వారిపని. వారిమూలంగానే భారతీయులకు బ్రిటీష్‌వారంటే ఏవగింపు కలిగింది. మహాత్మాగాంధీ రాజకీయాల్లో అడుగుపెట్టిన తరువాత తన ప్రేమ సందేశం ద్వారా ఈ భావాన్ని కొంత వరకు పోగొట్టగలిగాడు.

మొదటి గవర్నర్ జనరల్ అయిన వారెన్‌హేస్టింగ్స్ కంపెనీ పరిపాలన నంతా పూర్తిగా మార్చివేశాడు. దానికన్నా మంచి సివిల్ ఉద్యోగి బృందం ఉంటేనే భారతీయులకు బ్రిటీష్ వారికి మధ్య సామరస్యం ఉంటుందని ఆయన భావించడం జరిగింది. వారెన్‌హేస్టింగ్స్ మేధావి, విశాలదృక్పథం కలవాడు. సంస్కారవంతుడు. బ్రిటీష్‌పాలకుల్లో ఇతడు ఒక్కడే ప్రజల సంస్కృతిని అర్థం చేసుకొని పరిపాలించాలనే భావం కలవాడు. పాలించే దేశ ప్రజలను సంరక్షించడం, అభివృద్ధి పరచడం పాలకుల కర్తవ్యంగా అతడు భావించాడు. ఆయన కోరికపైనే గులాం హుస్సేన్, సియార్-ఉల్-ముతా-అఖిరిన్ (Siyar-ul-Muta- akhkhirın) అనే చారిత్రక ప్రామాణిక గ్రంధాన్ని 18వ శతాబ్దంలో రాశాడు. వారెన్‌హేస్టింగ్స్‌కు ఇంగ్లీష్ భాషలోను, ఐరోపా ప్రామాణిక గ్రంధాల్లోను క్షుణ్ణమైన పరిజ్ఞానం ఉంది. అంతేకాక సంస్కృత, పర్షియన్ భాషలు కూడా ఆయనకు తెలుసు. పర్షియన్ భాష సౌమ్యతని, సౌందర్యాన్ని ఆస్వాదించగలిగాడు ఒక స్నేహితునికి లేఖ రాస్తూ, ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయ పాఠ్యాంశాల్లో పర్షియన్ భాషను కూడా చేర్చాలనీ, ఆంగ్ల విద్యా బోధనలో పర్షియన్ భాషకు స్థానం కల్పించాలని సూచన చేశాడు. ముస్లీం, హిందూమత శాసనాలను క్రోడీకరించి మౌల్వీలు, పండితులతో వాటిని ఆంగ్లం లోకి అనువదింపచేశాడు. 1781లో కలకత్తా మదర్సా, 1784లో రాయల్ ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్‌ను ప్రాచ్యవిద్యా పరిశోధనా కేంద్రం సర్ విలియం జోన్స్ అధ్యక్షతన ఆ సంస్థలను పోషించాడు.

కలకత్తా మదర్సా, బెనారస్‌లోని సంస్కృత కళాశాల ఈస్ట్ ఇండియా కంపెనీవారి ఈ పాలనలో విద్యాభివృద్ధి కోసం చేసిన మొదటి మెట్టుగా పేర్కొవచ్చు దాని తరువాత ఫోర్ట్ విలియం కళాశాలను సివిల్ ఉద్యోగుల శిక్షణ కోసం ఏర్పరచబడింది. కాని కొంతకాలం వరకు ప్రజల విద్యకోసం వారు ఏమీ చేయలేదు 1813లో ఛార్టర్ చట్టం ద్వారా, బ్రిటీష్ పార్లమెంట్ ఆదేశం ప్రకారం విద్యకోసం ప్రతి సంవత్సరం తప్పనిసరిగా ఒక లక్ష రూపాయలను కేటాయించడం జరిగింది అయితే పది సంవత్సరాల వరకు ఈ సమస్య సమస్యగానే ఉంది ఈ ధనాన్ని ప్రాచ్య విద్యకోసం వెచ్చించాలో, లేక పాశ్చాత్య విద్యకోసం, విజ్ఞాన శాస్త్రాలకోసం వెచ్చించాలో ఇదమిత్థంగా తేలలేదు. 1823లో కంపెనీ పాలన, ప్రాచ్య విద్యకోసమే దీన్ని ఖర్చు చేయాలని నిర్ణయించింది. ప్రజల్లో విద్యను బోధించడం కోసం ఒక

కమిటీ ఏర్పడింది. దాని మూలంగా అరబ్బీ, పార్సీ, సంస్కృత భాషలలో బోధన చేయాలని, పాఠ్య గ్రంథాలను ప్రచురించాలని, ఆంగ్ల భాషనుంచి ఆధునిక విజ్ఞాన శాస్త్రాలను ప్రాచ్య భాషల్లోకి తర్జుమా చేయాలని తలంచడం జరిగింది. ఈ పద్ధతి ప్రకారంగా రెండు కొత్త సంస్థలు - ఆగ్రా కళాశాల, ఢిల్లీ కళాశాలలు ఏర్పరచబడ్డాయి.

అయితే ఈ పద్ధతికి మొదట్లో అనుకున్నంత విజయం చేకూరలేదు. ఛాందసులైన భారతీయులు తమ బిడ్డల్ని ప్రభుత్వ కళాశాలలకు పంపడానికి ఒప్పుకోలేదు. మత భావాల్లో రాకూడని ప్రభావం వస్తుందేమోనని భయపడ్డారు. తమ బిడ్డల్ని చదివించాలనుకున్న తల్లిదండ్రులు, ప్రభుత్వ ఉద్యోగాలు దొరకాలంటే ఆంగ్ల విద్య చదువుకుంటేనే లాభముంటుందని అభిప్రాయ పడ్డారు. వారి ఉద్దేశం ప్రకారం ఉన్నత భావాలుకల డేవిడ్ హేర్ 1817లోనే హిందూ కాలేజిని ఏర్పరచాడు. అందులో ఇంగ్లీష్‌తోపాటు పర్షియన్, బెంగాలీ భాషల్ని నేర్పేవారు. బాబు గవుర్‌మోహన్ ఆఢ్డే ప్రాచ్య విద్యాబోధనకోసం ఓరియంటల్ సెమినరీ అనే మరో సంస్థను స్థాపించాడు. ఈ రెండు సంస్థల్లో ఎక్కువమంది విద్యార్థులు విద్యను అభ్యసించేవారు. అందువల్ల ప్రాచ్యవిద్యా సంస్థలో విద్యార్థులు కరువైనారు. 1829లో అంగ్లభాషను ప్రభుత్వ అధికారిక భాషగా ప్రకటించినందువల్ల ఈ సంస్థలు ఆ సమయంలో ఇంకా దెబ్బతిన్నాయి. 1835లో మరల పాతపాట ప్రారంభమైంది. ఆ సమయంలో లార్డ్ మెకాలే పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ కమిటీకి చైర్‌మన్. పేరు ప్రఖ్యాతినొందిన మెకాలే రాసిన 'నోట్', ఎంతో తెలివితేటలతో, వాక్చాతుర్యంతో రాసినా, అందులో ప్రాచ్య సంస్కృతికి సంబంధించిన ఆయన అజ్ఞానం, విపరీత సంకుచితత్వం వెల్లడవుతున్నాయి. అయినప్పటికీ గవర్నర్ జనరల్ భారతదేశంలో బ్రిటీష్‌వారి శాశ్వత విద్యావిధానం ఎలా ఉండాలి, ఆధునిక విజ్ఞాన శాస్త్రాలను ఎలా అభివృద్ధి పరచాలి అనే విషయాల్ని తెలియజేశాడు. ఇంగ్లీష్ భాషను పాఠశాలల్లో, కళాశాలల్లో తప్పనిసరిగా బోధించడమేగాక, అది మాధ్యమిక భాషగా కూడా ఉండాలని నిర్ణయించాడు. కంపెనీ పాలన ప్రాథమిక విద్యను గూర్చి ఆలోచించనేలేదు. పాత మక్తబ్‌లు ఎన్నో, ఈ రాజకీయ అశాంతి, ఆర్థిక విపత్తుల మూలంగా మూతబడ్డాయి. కలకత్తా చుట్టుపక్కల ఉన్న క్రైస్తవ మిషనరీలు, సామాజిక స్పృహగల భారతీయులు కొందరు ప్రాథమిక పాఠశాలలను నెలకొల్పారు. అవి నిజానికి ప్రజల అవసరాలను తీర్చ

లేకపోయాయి. పారిశ్రామిక, వృత్తి విద్యలను నిర్లక్ష్యం చెయ్యడం జరిగింది. దేశీయ హస్తకళలను, పరిశ్రమలను అణచివెయ్యాలనే దృష్టి ఇందులో ఇమిడి ఉంది. వైద్య విద్య కొంతవరకు గుర్తింపు పొందింది. కొన్ని వైద్య విద్యాలయాలను కలకత్తాలో (1807) హిందూస్తానీ మాధ్యమంలో నెలకొల్పారు. కలకత్తా వైద్య కళాశాల (1835), బొంబాయి గ్రాంట్ వైద్య కళాశాల (1845)లను ఇంగ్లీషు మాధ్యమ భాషగా నెలకొల్పారు.

అందువల్ల ఆంగ్లేయులు ఆకాలంలో చేసిన విద్యా కార్యక్రమాలు పేర్కొనదగ్గవి కావు. ఇవి భారతీయ సాంస్కృతిక జీవితాన్ని ఏమాత్రం మలచలేకపోయాయి. ఇవి పరిమితమైనవే కాక, అవ్యవస్థీకృతమైనవి.

ఈ కాలంలో విద్యా విధానాన్ని కల్గించడంలో ద్విగుణీకృతంగా దోహదం చేసింది, కొన్ని కళాశాలల స్థాపన కంటె, కొత్తగా ప్రవేశపెట్టిన ముద్రణా యంత్రం, వార్తా పత్రికలు. ఆంగ్లంలో ముద్రణ జరగడం బహుశ బ్రిటీష్‌వారు వచ్చాక మొదలై ఉండవచ్చు. 1760లో 'హిక్స్ గెజెటియర్' మొట్టమొదటి వార్తాపత్రికగా కలకత్తాలో వచ్చింది. భారతీయ భాషల్లో బెంగాలీలో మొదటి వార్తా పత్రిక 'ది బెంగాల్ సమాచార్' అనే పేరుతో 1816లో వచ్చింది. బ్రిటిష్‌పాలన అంతం వరకు ఇంగ్లీషులోను, ఇతర భారతీయ భాషల్లోను అనేక వార్తా పత్రికలు ప్రాచుర్యంలోకి వచ్చాయి. భారత ప్రజల గురించి, నూతన భావాల గురించి విస్తృతమైన వార్తలను అందించినవి అవే.

లలిత కళలను పెంపొందించడంలో కంపెనీ ప్రభుత్వంకానీ, ఆంగ్లో-ఇండియన్ సమాజంకానీ చేసిన కృషి స్వల్పమైంది. ఈ సమాజంలోని సభ్యులకు వ్యాపారదృష్టి ఎక్కువ. లాభదృష్టితోను, భౌతిక ఆనందంకోసం పనుల్ని చేసేవారు. రసానుభూతి అనేది ఏ కొద్ది మంది సివిల్ ఉద్యోగులకే పరిమితం. వారు తమ విశాలమైన గదుల్లో సర్‌జోషువా రెనాల్ప్ లేక నార్త్‌కోట్ చిత్రించిన మౌలిక చిత్రలేఖనాలను తగిలించుకొని, అలంకరించుకొని ఆనందించేవారు. కొంత మంది భారతీయ రాజులు, ముఖ్యంగా అయోధ్యరాజులు, ఐరోపా కళాకారులను పిలిపించి తమకు చిత్రాలను చిత్రీకరించమని కోరారు. వీటినిబట్టి ఆనాటి భారతదేశ కళాభివృద్ధిని పేర్కొనలేం కదా! ఔత్సాహిక సంగీతం, నృత్యం, అభినయం ఆంగ్లో-ఇండియన్ సమాజంలో కనిపించేవి. అయితే, వాటికి ఎక్కువ ప్రామాణికత లేదు. అవధ్‌నవాబ్, వజిద్ అలీషా ఆస్థాన రంగస్థలంలో ఇంగ్లీష్ రంగస్థల ఏర్పాట్లు చేయించాడు.

శిల్పకళ విషయంలో 19వ శతాబ్ది ఆరంభం వరకూ ఈస్ట్ ఇండియా కంపెనీ తరచుగా పోర్చుగీసువారి శైలినే అనుసరించింది. భారతదేశంలో ఉన్న ఐరోపా స్థావరాలన్నింటిలో పోర్చుగీసు శైలి ప్రాచుర్యంలో ఉండేది. ఆ శతాబ్ది ఉత్తరార్థంలో ఆంగ్లేయ ఇంజినీర్లు తయారుచేసిన ప్రభుత్వ భవనా లెన్నో వెలిశాయి. అవి లండన్ భవనాలను 17, 18 శతాబ్దాల్లో నిర్మించిన ఇంగ్లీషు నగరాలను పోలి ఉన్నాయి. రెన్ అనే ఇంగ్లీషు వాస్తుశిల్పి రూపొం దించిన వాల్‌బ్రూక్‌లోని సెయింట్ స్టీఫెన్స్ చర్చి నమూనాలో 1787లో కల కత్తా కాథడ్రల్‌ను నిర్మించడం జరిగింది. డెర్బిషైర్‌లోని కెడల్‌స్టన్ హాల్ నమూనాలో 'గవర్నమెంట్ హవుస్' 1802లో పూర్తిగావించారు. 19వ శతాబ్ద పూర్వార్థంలోని భవనాలన్నింటికీ పునరుజ్జీవన శైలి గల సాంప్రదాయబద్ధ మైన ముంగిళ్ళు, విస్తృతమైన వరండాలు, బ్రహ్మాండమైన పోర్టికోలు ఉండడం ఈ శైలి ప్రభావమే. కొంతమంది భారతీయులు కూడా తమ భవనాలను ఈ శైలిలోనే నిర్మించుకున్నారు. అయితే భారతీయుల, యూరోపియన్ల సమ్మిశ్రి తమైన శైలి రాలేదు, అయినప్పటికీ, అసతుద్దౌలా కాలంలోని లక్నో భవ నాలు, ముఖ్యంగా ఇమామ్‌బారా, రూమీ దర్వాజాల సరళమైన, సమపా ళ్ళలో రూపొందించిన ఆకృతి పాశ్చాత్య వాస్తు శిల్ప ప్రభావమే

భారతీయ జీవితంలోని వాస్తవికమైన, పేర్కోదగ్గ ప్రభావం పాశ్చాత్య నాగరికతలోని సాంకేతిక అంశం మూలంగా సంప్రాప్తించింది. ఆధునిక ఆయు ధాలుగానీ, సైనిక వ్యవస్థలోని పద్ధతులుకానీ బ్రిటీష్‌వారి ఆధిపత్యం మూలం గానే భారతీయులు నేర్చుకున్నారు. ప్రతి సంస్థాన రాజ్యం, తమకు వన రులు లభించినంతవరకు వాటిని అమర్చుకొన్నారు. 1823లోనో లేక 1824లోనో స్టీమర్లు ప్రారంభమైనందున ప్రయాణం సులభమైంది. భారతీయులు విదేశా లకు పోవడానికి ప్రోత్సాహం లభించింది. వారి దృక్పథాలు విశాలం కావడా నికి యిది ఎంతో ఉపయోగపడింది. ఈ కాలం చివరిలో గ్యాస్‌లైట్, రైల్వేలు, టెలీగ్రాఫ్‌లు ఈదేశంలో ప్రవేశపెట్టడం జరిగింది. 1853లో బొంబాయికి, థానాకు మధ్య, 1855లో కలకత్తా, రాణిగంజ్ మధ్య మొట్టమొదటి రైల్వే లైనులు వేయడం జరిగింది. 1854లో కలకత్తా బొంబాయిల మధ్య, మద్రాస్, అటక్‌ల మధ్య టెలిగ్రాఫ్ విధానం ప్రవేశపెట్టారు.

18వ శతాబ్ద చివరి దశలో పాశ్చాత్య సంస్కృతి కొన్ని పరిమిత ప్రదే శాల్లో, కొద్దిమంది భారతీయుల్లో ప్రారంభమైంది. అయినా దేశ సాంస్కృతిక

జీవన విధానంలో ఇది గొప్పగా మార్పు తెచ్చిందని చెప్పడానికి లేదు. భారతదేశ ప్రజలందరికీ పాశ్చాత్య సంస్కృతిని పరికించడానికి అవకాశం లేదు. వారు చూసిందే మాత్రమైనా ఉందంటే క్రైస్తవ మిషనరీలు, వర్తక ప్రభువులు ఈ దేశానికి తీసుకొని వచ్చిందే. ఇది భారతీయుల మతానికి, ఆర్థిక సంక్షేమానికి, రాజకీయ స్వేచ్ఛకి హానికరమైంది. పాశ్చాత్య సంస్కృతి అంటే బ్రిటీష్‌వారి రాజకీయ, ఆర్థిక పెత్తనంలాగే ఉంటుందని భారతీయులు భావించడం జరిగింది. అందుచేతనే వారి సంస్కృతి అంటే వ్యతిరేకత ఏర్పడింది. ఈ వ్యతిరేకత 1857లో సిపాయిల తిరుగుబాటు జరగడానికి దోహదం చేసిన కారణాలలో ఒకటి.

# 12. భారతదేశంపై ఆంగ్ల సంస్కృతీ ప్రభావం

## (క్రీ.శ. 1857-1920)

19వ శతాబ్ది పూర్వ భాగంలోనే భారతదేశంలో బ్రిటీష్‌వారి రాజకీయ సర్వాధికారం స్థిరపడినప్పటికీ, పాశ్చాత్య సంస్కృతీ ప్రభావం అప్పటికి పూర్తిగా వేళ్ళూనుకొనలేదు. కొత్తగా వచ్చిన పాలకులతోనే, ఆ సంస్కృతి భారతదేశానికి వచ్చింది. ఆనాటి పాశ్చాత్య నాగరికతా ప్రాబల్యం ప్రజలపై ఎంత వరకు ఉందో ముఖ్యంగా కొన్ని అంశాల ఆధారంగా చెప్పవచ్చు. వారి సాంకేతికాభివృద్ధికి నిదర్శనంగా రైల్వేలను, టెలిగ్రాఫ్‌లను పేర్కొనవచ్చు. ఆంగ్ల నాగరికత, కలకత్తా వంటి పెద్ద నగరాల్లో తప్ప, మిగిలిన ప్రదేశాల్లో ప్రభావం చూపలేకపోవడానికి మూడు కారణాలున్నాయి: (1) భారతీయులకు తమ సంస్కృతే సంతృప్తినిచ్చింది. దాన్ని మార్చాలని అభిప్రాయపడలేదు. రాజకీయ పతనానికి కారణం వారు మేధాపరంగా, నైతికంగా దిగజారడం వల్లనేనన్న విషయాన్ని గుర్తించలేకపోయారు. ఆ కారణంగా, సాంస్కృతిక జీవనం స్తంభీకృతమైందనీ, ఏమాత్రం ప్రేరణ ఇతర దేశాల నుంచి వచ్చినా, మార్పు వస్తుందనే విషయాన్ని అంగీకరించలేక పోయారు. (2) మెకాలే వంటి కొంతమందికి తప్ప, ఇంగ్లండ్‌లో ఆ కాలంలో వృద్ధి చెందిన ఆధిక్యతాభావం. మిగతా వారిలో లేదు. ధనం, అధికారంపై ఆంగ్లేయులకు వ్యామోహం మెండు. కానీ జాతీయతా సంబంధమైన, వర్ణపరమైన గర్వాన్నుండి చాలావరకు దూరంగా ఉన్నారు. 'తెల్లవాడిదే భారం' ('the white man's burden') అని గానీ, వారే నల్లవారి రక్షకులన్న భావన అప్పటికి పూర్తిగా మనస్సులోనికి రాలేదు. ఆంగ్ల పరిపాలకులైన స్లీమన్‌వంటి వారు, రాజకీయంగా బ్రిటీష్‌వారు పెత్తనం వహించినా. భారతీయుల సంస్కారం, సంస్కృతి పాండిత్యాలపై నమ్మకం ఉండేది. అందులోనూ ముస్లింల ప్రాచ్య సాంప్రదాయ విద్యా విధానంపై గౌరవం ఉండేది. సంక్షిప్తంగా చెప్పాలంటే.

మెకాలే ఆంగ్ల విద్యను ప్రభుత్వ విధానంగా ప్రవేశపెట్టినా, ఆంగ్లేయుల్లో ఎక్కువ మంది తమ సంస్కృతిని భారతీయులపై రుద్దాలని ప్రయత్నించ లేదు. వారు కొంతవరకు భారతీయ సంస్కృతి చేతనే ప్రభావితులైనారని చెప్పాలి.

1857 సిపాయిల తిరుగుబాటు తర్వాత పరిస్థితి పూర్తిగా మారింది. భారతీయులు తమ రాజకీయ అశక్తతకు విభ్రాంతి చెందారు. దీని మూలంగా తమ సంస్కృతిపై నమ్మకం సన్నగిల్లడం ప్రారంభమైంది. భారతీయ పాలకులు, భౌతిక, నైతిక బలహీనతల పట్ల తమకున్న ఏవగింపుతో భారతీయులను, వారి సంస్కృతిని చిన్నచూపు చూశారు. ఆంగ్లేయ ఉద్యోగి వర్గానికి తమ సంస్కృతి పట్ల అవ్యాజానురాగమైన ప్రేమ ఉండేది. వారు తమ సామ్రాజ్యవాద ప్రాబల్యంతో భారతీయులను గుప్పిటనుంచుకొన్నారు. అణగారిపోయిన భారతీయ ప్రజలను పునరుద్ధరించడమే తమ కర్తవ్యంగా భావించారు. ఇది సాధించాలంటే ఆంగ్ల విద్య, సంస్కృతులే శరణ్యమని నమ్మారు. రాజకీయ అనిశ్చితను తొలగించాలంటే, ఆంగ్లేయులొక్కరే సమర్థులని వారి భావం. వారే శాంతి పరిరక్షణ చేయగలరు. మధ్యయుగ భారతీయ సంస్కృతికి కాలం చెల్లింది. ఈ సంస్కృతి, ఆధునిక యుగ ఆర్థిక రాజకీయ మేధోపరమైన వ్యాపకాలకు దోహదం చేయ లేదు. దీనికి ఆధునిక పాశ్చాత్య సంస్కృతిని జీర్ణించుకోవడం కొంత అవసరమని గుర్తించారు. ఆ సంస్కృతి ఫలితంగానే వారికి శక్తి, సంపన్నతలు చేకూరాయని వీరు విశ్వసించారు. విదేశీ మేధాసంపత్తిని, రాజకీయాలను వ్యతిరేకించే వారు ఎంతో మంది ఉన్నా, వాళ్ళు బయటపడలేదు. ప్రభుత్వ ఆగ్రహం నుండి తప్పించుకోవడానికి ఏకైక మార్గం మతం. ఎక్కువ మంది తమ పదవీ విరమణ అనంతరం జీవితాన్ని మత పాఠశాలల్లోనూ, మఠాల్లోనూ గడప ప్రారంభించారు. వృద్ధులు, ఉన్నత, మధ్య తరగతులకు చెందినవారు కొత్త రాజకీయ, సాంస్కృతిక విధానాలకు అలవాటు పడ్డారు. హిందువులు సాధారణంగా పరిస్థితులకు అనుగుణ్యంగా నడచుకోగలిగేవారు. వారు ఆంగ్ల విద్యకు అనతికాలంలోనే అలవాటు పడ్డారు. సర్ సయ్యద్ అహమ్మద్ ఖాన్ లాంటి విజ్ఞులు తెలియచెప్పేంత వరకు ముస్లింలు పూర్తిగా పాశ్చాత్య విద్యకు దూరంగా ఉండేవారు. ఆయన వారిని కాలానుగుణ్యంగా నడచుకోవాలని ఉద్బోధించాడు. 1857లో జరిగిన ప్రథమ భారత స్వాతంత్ర్య సమరానికి ఒక కారణమైన విద్యా, సాంస్కృతిక విధానాన్ని మార్చడానికి భారత ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. కొత్త విధా

నాన్ని క్రమబద్ధంగాను, సమగ్రంగాను భారతీయుల్లో ఒక పెద్ద భాగం సహాయంతో ప్రవేశపెట్టింది. ఈ విధానం ఎట్టకేలకు లక్ష్యాన్ని సాధించింది. ఆంగ్ల సంస్కృతిని దేశీయవాళిలో అనుకరించినందువల్ల, క్రమేణా హిందుస్థానీ సంస్కృతి బదులు ఆంగ్ల సంస్కృతియే చోటు చేసుకోసాగింది.

నూతన విద్యా, సాంస్కృతిక విధానాలు అక్బరుకాలం నాటి రాజకీయ సమైక్యతను జ్ఞప్తికి తెస్తాయి. రాజ్యానికి బద్ధులుగా ఉండాలన్న అంశం ఇందులో ప్రధానమైనది. మౌలికమైన తేడా ఏమంటే, అక్బరు కాలంలో విశేష అధికారంలో సర్వశక్తిగల రాజరికం అమల్లో ఉండేది. అయినా, వర్ణ, కుల వివక్షతలు లేకుండా అందరికీ సమానమైన హోదా, సమాన హక్కులుండేవి. ముస్లింలు విదేశీయులే అయినా, భారత దేశానికి వచ్చి, ఇక్కడ స్థిరంగా పాతుకొని పోయి, భారతదేశాన్నే తమ దేశంగా భావించడం జరిగింది. అక్బరు, అతని వారసులు చాలా వరకు ప్రజలతో సన్నిహిత సంబంధాలను ఏర్పరుచుకొన్నారు. రాజు వారి కోర్కెలను, భావాలను అర్థం చేసుకొంటాడనే నమ్మకం ప్రజల్లో ఏర్పడింది. కాని బ్రిటిష్‌వారు ఏర్పరచాలన్న రాజ్యం బ్రిటన్‌కు లోబడి ఉండాలి. అందువల్ల ఇది వాస్తవంలో రాజ్యమే కాదు. వలస రాజ్యాన్ని పరిపాలించేది బ్రిటిష్ పార్లమెంట్ మాత్రమే. ఇందులో రాజు, రాణిల ప్రమేయం లేదు. అంటే, భారతీయులు విధేయులై ఉండాల్సింది ఒక వ్యక్తికీ కాదు, ఒక వంశానికీ కాదు, ఇంగ్లండ్ దేశానికంతటికీ. ఏ దేశమైతే పాలితదేశ సంస్కృతి, చరిత్రలను అర్థం చేసుకోలేక పోయిందో, ఏ దేశమైతే కొన్ని వేలమైళ్ళ దూరంలో ఉండి తమ ప్రభావాన్ని భారతదేశంపై ప్రసరించలేక పోయిందో, అటువంటి దేశానికి భారతీయులు బాధ్యులుగా వుండాల్సి వచ్చింది. ఇంగ్లండ్ దేశ ప్రతినిధులు, ఇంత వరకు ప్రజలతో ఉన్న సంబంధాలను విడనాడి ప్రజలకు దూరమయ్యారు. ఈ విధానాల ఫలితంగా సాంస్కృతిక రంగంలో కూడా రాజీ మార్గం లేక, పెత్తందారీ పద్ధతిని అనుసరించారు. అక్బరులాగా రెండు సంస్కృతుల సమ్మేళనం కోసం పాటుపడక, సామాజికంగా దూరంగా ఉంటూ, పాశ్చాత్య విద్య, సంస్కృతులను భారతీయులపై రుద్ది పెత్తనం వహించారు. పైగా అదే మంచిదని కూడా భావించారు.

నిజానికి, పాశ్చాత్య సంస్కృతికి ఉన్న గొప్పతనమేమంటే, దాని ఆధునిక శాస్త్రీయ దృక్పథం, ఆచరణలో సమర్థత ఉండటం. దురదృష్టవశాత్తూ ఆధునికత వారికి లాభంకంటే కీడే కలిగించింది. రక్తహీనమైన భారతీయ

సమాజానికి ఈ ముఖ్య లక్షణాలను చేకూర్చలేకపోయింది.

భారతదేశానికి మొట్టమొదటసారిగా తరలివచ్చిన ఆధునిక పాశ్చాత్య సంస్కృతి అసలైంది కాదు. ఎగుమతికి తగ్గ నమూనాలో ఉన్న సాంస్కృతిక దినుసు. దీనికి సంబంధించిన అన్ని హంగులు ఇంగ్లండ్ నుంచి వచ్చాయి. వాటిని కలపడం మాత్రం భారతదేశంలోనే జరిగింది. ఈ కలిపిన ఆంగ్లేయులు మేథావంతంగా చెప్పుకోదగ్గవారు కాదు. ఆంగ్లేయుల్లో ప్రతిభావంతులు వాళ్ళ మాతృదేశానికి ఉపయోగపడగా, మిగిలిన సాదా మనుషులు మాత్రమే భారతదేశానికి వచ్చారు. వాళ్ళు యువకులు. వాళ్ళ సంస్కృతీ కేంద్రం నుంచి, మేధాపర స్వేచ్ఛ ఉన్న దేశం నుంచీ, కొన్ని వేల మైళ్ళు దాటి వచ్చి, నోరులేని, జవాబు చెప్పలేని మనుష్యులను, బ్రిటీష్ ప్రభుత్వానికి విధేయులుగా చేసి, బ్రిటిష్‌వారు వుత్పత్తిచేసి తీసుకొచ్చిన సామగ్రిని కొనే నమ్మకస్తులుగా భారతీయులను తయారుచేయడానికి వచ్చారు. వాళ్ళకున్న తీరిక సమయంలో విద్యా విధానంలో మార్పు తెచ్చి, నూతన సాంస్కృతిక ప్రపంచాన్ని నిర్మించాలనుకొన్నారు.

దాదాపు 50 సంవత్సరాల కాలం, బ్రిటిష్ సామ్రాజ్యపథ నిర్దేశకులు, వారిలో ప్రధానంగా సివిల్ సిబ్బంది, విద్యాధికారులు భారతదేశానికి వచ్చి ఎంతో ఉత్సాహంతో భారతదేశాన్ని పాలించడానికి ప్రయత్నించారు. సమర్థవంతమైన పాలన ఏర్పర్చడం, మధ్య యుగ వ్యావసాయిక సమాజ సంస్కృతీ పరిధుల్లో దేశాభివృద్ధికి తోడ్పడాలనీ, పాశ్చాత్య సంస్కృతిలోని భౌతిక, మానసిక దీవెనలతో దేశాన్ని మార్చాలని అభిలషించారు.

కాని సహజంగా ప్రతికూలమైన ప్రదేశమైనందువల్ల, అనారోగ్యకర సామాజిక వాతావరణం వల్లా. గొప్ప గొప్ప పండితులు, కళాకారులు, పాశ్చాత్య సంస్కృతిని ఈ దేశంలో నిర్మించడానికి రాలేక పోయారు. దాని ఫలితంగా, మిడిమిడి జ్ఞానంతో ఉన్న కొందరు వేడుకార్థమై రావడం తటస్థించింది. వస్త్రధారణలో కాని, ఆసనాది సామగ్రి విషయంలో కాని, కళ, శిల్పాలకు సంబంధించి కానీ, ఆలోచనా, వ్యవహార విధానాల్లో వీరు కాలం చెల్లిన అంగ్లేయ సంస్కృతిని ప్రవేశపెట్టారు. భారతదేశంలో వ్యాపించిన ఈ సంస్కృతి, వాస్తవానికి ఆంగ్ల లేక పాశ్చాత్య సంస్కృతి కూడా కాదు. పాశ్చాత్య దేశాల పెత్తనంలోని ఆసియా, ఆఫ్రికా ఖండాల్లోని వలస రాజ్యాల్లో ఏర్పడ్డ సంస్కృతిలాంటి ఒక రకమైన భారతీయ వలస సంస్కృతి అనొచ్చు.

వర్ణాధిక్యతా గర్వంతో, కలుపుగోలుతనంతో వ్యవహరించనందు వల్లా, అనుభవ శూన్యులైన ఆంగ్ల పాలకులు భారతదేశంలో చేయాల్సిన కృషి చేయలేక పోయారు. అధ్యాపకులుగా వ్యవహరించి భారతీయులకు ఎన్నో విషయాలను బోధించాల్సిన వీరు, దానిని వారు అగౌరవంగా భావించి భారతీయులనే విద్యార్థులతో సన్నిహిత సంబంధాలను ఏర్పరచుకోలేక పోయారు. భారతీయులు, వీరి నుంచి గ్రహించిన సంస్కృతి వస్త్ర ధారణకు, ఆహార వ్యవహారాలకు, జీవన సరళిలో కొంతభాగం వరకే పరిమితమైంది. ఆంగ్లేయుల్లో కనిపించే మత సంశయాత్మకత, భౌతికత అనే అంశాలు భారతీయులు అలవర్చుకొన్నారు. ఈ విషయాల్లో భారతీయులనబడే శిష్యులు, వారి గురువులను (ఆంగ్లేయులు) శక్తి మేరకు అనుసరించారు. ఆంగ్లేయుల్లో ప్రధాన లక్షణాలైన ఆత్మ గౌరవం, ఆత్మ నిగ్రహం, పరిస్థితుల కనుగుణంగా నడుచుకొనే శక్తి, శ్రద్ధాసక్తులను చూపడం, నైతికపరమైన ధైర్య సాహసాలు పెద్ద మనిషిగా జీవించగల్గడం మొదలైన వాటికి తోడుగా ఆధునిక లక్షణాలైన, శాస్త్రీయ దృష్టి, మానవతా దృక్పథంలాంటి పాశ్చాత్య ప్రపంచ లక్షణాలు మాత్రం భారతీయులు గ్రహించలేక పోయారు. అవి వారిపై ఏ ప్రభావాన్ని చూపలేదు. ఆంగ్ల విద్యను, ఆధునిక విజ్ఞాన శాస్త్రాలను అధ్యయనం చేసినందు వల్ల, ఒక కొత్త భారతీయ వర్గం పైకి భారతీయులుగా కన్పించినా, మానసికంగా ఐరోపావాసులుగా ఉండే, ఒక కొత్త భారతీయ వర్గం ఉద్భవిస్తుందని లార్డ్ మెకాలే భావించాడు. నిజంగా ఆంగ్లేయుల పైపై మెరుగులను అనుకరించారే కాని వారి నైతిక, మేధా సంపత్తిని భారతీయులు గ్రహించలేక పోయారు. ఇంగ్లీషువారి స్వభావ ప్రభావం వీరిపై పూర్తిగా ప్రసరించలేదు. పైగా వారిలోని అవలక్షణాలన్నిటినీ పుణికి పుచ్చుకొన్నారు. వాటి మూలంగా భారతీయుల్లో ఒక వాయి, వరుస లేకుండా, సమతౌల్యం లోపించిన పరిస్థితి బయలుదేరడం, జాతీయతాభావం సన్నగిల్లడం జరిగింది.

సంక్షిప్తంగా చెప్పాలంటే, ఈ ఆంగ్ల వలస విధాన నాగరికత మూలంగా కొత్త సంస్కృతి ఏర్పడింది. ఉన్నత, మధ్య వర్గాల భారతీయులు సాధారణమైన పద్ధతులను, ఆంగ్లేయుల సంస్కృతిని ఏర్పర్చుకొన్నారే కాని, జాతీయ సంస్కృతిని నిర్మించుకోలేక పోయారు. ఆంగ్ల విద్య నేర్చుకొన్నవారిలో ఏకస్వామ్యత పెరిగింది. అంతేకాని, జీవితంలో ఉండాల్సిన ఉన్నత విలువల్లో, అవినాభావ సంబంధాలలో సమాజం నిర్మింపబడలేదు. ఏదిఏమైనప్పటికి, మనం

గమనించాల్సిన అంశం ఏమంటే, మగత నిద్రలో కూరుకుపోయిన భారతీయుల మనస్సులను మాత్రం పాశ్చాత్య సంస్కృతి విచలితులను చేసింది.

అపార్థాలను పోగొట్టి, ఇక్కడ మనం అర్థం చేసుకోవలసిన విషయాలు రెండున్నాయి. మొదటిగా, భారతదేశంలోని అంగ్లేయుల లేక యూరోపియన్ల సాంస్కృతిక జీవితాన్ని వర్ణించడం మన అభిమతం కాదు. ఆంగ్లేయుల ప్రభావం మూలంగా పాశ్చాత్యీకరణ పొంది, వాళ్ళను అనుకరించే భారతీయులను గురించి మాత్రమే చెప్తున్నాం. రెండవది ఏమంటే, ఈ అనుకరణ భారతీయులందరికీ అన్వయించదు. ముఖ్యంగా ఆంగ్ల విద్యను నేర్చుకొని, రాజకీయ స్వేచ్ఛకోసం, దేశంలోని సాంస్కృతిక పరిస్థితులను చక్కదిద్దిన గొప్పవారైన భారతీయులెంతో మంది వీళ్ళలో ఉన్నారన్న విషయం మర్చిపోరాదు.

భారతదేశంలో ఏర్పడ్డ వలస విధాన ఆంగ్లేయ సంస్కృతి దేశమంతా వ్యాపించింది. ఇదొక చిత్రమైన సంస్కృతి. ఇంతకు ముందెన్నడూ భారతదేశంలో ఇలాంటి సంస్కృతి ఏర్పడలేదు. భారతదేశంలో మత సంబంధమైన హిందూ రాజ్యం ఉండేది; నైతిక పరమైన బౌద్ధమతం అమల్లో ఉండేది. అల్లే సాంస్కృతికపరమైన మొగలాయి రాజ్యముండేది - కాకుంటే సార్వభౌమాధికారం, ఒకే వ్యక్తి హస్తగతమై ఉండేది. సామ్రాట్టు ఉండేవాడు. అతడికి రాజకీయంగా ఏ భేదము లేకుండా ప్రజలందరూ సమానులే. రాజాస్థానం సామాజిక, సాంస్కృతిక జీవితాలకు నిలయం. చక్రవర్తి కార్యనిర్వాహక, న్యాయ సంబంధమైన, శాసనాధికారాలను చెలాయించడమే కాక ఎన్నో సాంస్కృతిక కార్యకలాపాలకు నిలయంగా ఉండేవాడు. సాంఘిక సంస్కరణలకు, నైతిక విలువలను కాపాడ్డం, దయాదాక్షిణ్యాలను ప్రదర్శించడం, కళలను, వృత్తులను పోషించడం, వస్త్రధారణలోను ఆచార, వ్యవహార పద్ధతుల ఆచరణలోను కొత్తదనాన్ని చూపడం వంటి సాంస్కృతిక విధులను ఆచరించేవాడు. మహమ్మదీయ రాజుల కాలంలో కూడా రాజ్యంలోని కేంద్రస్థానం అంతర్గతమైందే. బ్రిటీష్‌వారు నెలకొల్పిన రాజ్యం మాత్రం ప్రతి విషయంలోను సాంప్రదాయ భారతీయ రాజ్యానికి భిన్నమైనదిగా ఉండింది. నిజానికి అది రాజ్యమే కాదు, సార్వభౌమాధికారం లేని అధీన పాలన మాత్రమే. సార్వభౌమాధికారం పేరుకు మాత్రం సామ్రాట్టు అయిన రాజు వద్ద ఉండేది. వాస్తవానికి బ్రిటీష్ పార్లమెంట్ వైస్రాయికి అధికారాలను దత్తం చేసింది. సివిల్ సర్వీసు సిబ్బంది సహాయంతో అతడు వాటిని నిర్వహించే

వాడు. ఈ సిబ్బంది మొత్తం విదేశీయులదే. వర్ణ, సాంస్కృతిక వ్యత్యాసాలతో తామే గొప్పవారమని విర్రవీగేవారు. 'దేశీయ' ('Native') అనే పదం జుగుప్సాకరమైనది. ఈ పరిస్థితుల్లో మంచి ప్రభుత్వ లక్షణమైన పాలక, పాలితుల మధ్య సత్సంబంధం ఉండేది కాదు. అయితే 1857 తర్వాత భారతదేశానికి వచ్చిన బ్రిటిషు సివిల్ సిబ్బంది చాలా వరకు మనఃపూర్వకంగాను, కొన్ని సంఘటనల్లో వీరోచితంగాను దేశంలో శాంతి భద్రతలు నెలకొల్పేందుకు ప్రయత్నించారు. వారు సమర్థతలో, సక్రమమైన న్యాయ విధానాలను నెలకొల్పి ప్రజా జీవితాలను మెరుగుపరచ ప్రయత్నించారనే విషయాన్ని మనం చూసాము. అయితే బ్రిటిష్‌వారి ప్రయత్నాలు ఫలించలేదు. కారణమేమంటే, వాతావరణం ఇద్దరికీ కొత్తకావడం వల్లా, పరస్పర అనుమానాల వల్లనూ, వారి ఆర్థిక విధానం వల్లనూ (దాన్ని గూర్చి తర్వాత పేర్కొంటాం), అనుకొన్నంత అభివృద్ధిని, శాంతిని సాధించలేకపోయారు.

బ్రిటిష్‌ప్రభుత్వం సాంస్కృతిక కార్యకలాపాలను చూస్తే, ఏ కొద్దిమందికో ఆంగ్ల విద్యను నేర్పడం మినహా, ఏ విధమైన సాంస్కృతిక కార్యకలాపాలనూ నిర్వహించలేక పోయింది. పాలకుల సాంస్కృతిక, సామాజిక జీవన విధానం పాలితులకు పూర్తిగా అందుబాటులో లేకుండా పోయింది. వారిని నడిపించడానికి, అది కాంతిపుంజం కాదు. పాలితులను, పాశ్చాత్య జీవిత వెలుగులో, పాండిత్యంతో చైతన్యవంతులను చేయడం, తమ కర్తవ్యంగా భావించారు. అయితే ఆంగ్ల విద్యను, ఆధునిక తత్త్వాన్ని, విజ్ఞాన శాస్త్రాలను భారతీయులకు బోధిస్తే పూర్తిగా వారిని పాశ్చాత్య సంస్కృతికి చేరువ చేసినవాళ్ళవుతారు. సాంస్కృతికంగా వికాసవంతులుగా, మొగలుసుల్తానుల్లాగా చెయ్యాలంటే, బ్రిటిష్‌వారికి సాధ్యం కాదు. దానికి ఎంతో వ్యూహం, కలుపుగోలు మనస్తత్వం ఉండాలి. బ్రిటీష్‌వారికి అవి లేవు. అందువల్ల, వ్యక్తిత్వం లేని, సాంస్కృతిక సంబంధం లేని, సార్వభౌమాధికారంలేని రాజ్యం, భారతీయ సంస్కృతికి ఏ కొద్ది సహాయము చేయలేక పోయింది. అయితే, వారి పాలన భారతదేశానికి శాంతి, క్రమబద్ధతలను ప్రసాదించింది. అంతకంటే ముఖ్యమైన, విలువైన విషయమేమంటే, భారతదేశ భవిష్యత్తుకవసరమైన, రాజకీయ, సాంస్కృతికాభివృద్ధిని చేకూర్చింది. నూతన సిద్ధాంతాలైన వ్యక్తిగత, జాతీయ స్వాతంత్ర్యాన్ని, అట్లే ప్రజా జీవితాన్ని ప్రజాస్వామిక సిద్ధాంతాలకు అనుగుణంగా మలుచుకోడానికి కావాల్సిన ప్రాధమిక శిక్షణను ఇచ్చింది.

మొదటిసారిగా, వైస్రాయి రిప్పన్ కాలంలో (1880-84) మున్సిపల్ బోర్డు ల్లోనూ, జిల్లా బోర్డుల స్థాయిలోనూ ప్రాతినిధ్య ప్రభుత్వ సిద్ధాంతాన్ని ప్రవే శపెట్టాడు. ఆ విధానం కారణంగా భారతీయులు ఆధునిక ప్రజాస్వామ్య సిద్ధాంతాలను తెలుసుకోడానికి అవకాశం కల్గింది. అంతేకాక, రాజకీయ సమానత్వాన్ని అర్థం చేసుకోడానికి అవసరమైన చైతన్యాన్ని వారికి చేకూ ర్చాడు. యూరోపియన్‌లతో సరిసమానంగా వ్యవహరించే 'ఇల్బర్ట్ బిల్లును' ప్రవేశపెట్టాడు. ఈ బిల్లు మూలంగా ఏర్పడిన గట్టి విభేదాలు ఆ తరువాత భారత జాతీయ కాంగ్రెస్‌ను 1885లో స్థాపించటానికి మూల కారణమయ్యాయి. లార్డ్ రిప్పన్ వారసులు కూడా ఇలాంటి ఉదారమైన విధానాన్ని అనుసరించి నట్లయితే, రాజకీయ, సాంస్కృతిక అవగాహన భారతీయులందరికీ ఎంత గానో కలిగి ఉండేది. అది బ్రిటిష్ వారి నేతృత్వం వల్ల సాధ్యమై ఉండేది. ఈ ఉదారవాదం మూల కారణంగా పూర్తి మార్పు, అంటే, బ్రిటిష్ వారి నుంచీ అధికారం, భారతీయులకు సంక్రమించవలసిన పరిస్థితి ఏర్పడి ఉండేది. జాతీయ స్థాయిలో నిర్వహించిన ఆందోళన మూలంగా ఎన్నో రాయితీలు బ్రిటీష్ ప్రభుత్వం నుంచి సంక్రమించాయి. క్రమంగా భారతీయులు తమ అసమ్మతిని వెల్లడించడానికి ప్రయత్నించారు. వారిచ్చిన రాయితీలు ఆల స్యమవడంతో ప్రజలకు సంతృప్తిని ఇవ్వలేక పోయాయి. రాజకీయ స్వేచ్ఛ మీద ఎంతో ఇష్టం ఉండే బ్రిటీష్‌వారు, వారి ఆర్థిక కారణాల మూలంగా, భారతదేశాన్ని వీలైనంత ఎక్కువ కాలం పాలించాలనే దుగ్ధతో, భారతీయు లకు స్వేచ్ఛను ఇవ్వలేక పోయారు.

భారతదేశాన్ని పాలించే బ్రిటిష్ ప్రభుత్వ ఆర్థిక విధానాన్ని అర్థం చేసుకో వాలి. వారి ఆర్థిక విధానం రాజకీయ విధానాన్ని మార్చలేకపోయింది. కారణమే మంటే, ఈస్టిండియా కంపెనీ వారసత్వంతో తమ వస్తువులకు ఖచ్చితమైన మార్కె ట్‌ను ఏర్పరచుకోవాలని వాంఛించింది. అదే విధంగా, తమ పెట్టుబడికి మంచి మూలధనం ఇది అని తలచింది. ఈస్టిండియా కంపెనీపై బ్రిటీష్ ప్రజాభిప్రాయం ఎన్నో వత్తిడులను తీసుకొని రావడానికి కారణమేమంటే, కొద్దిమంది కంపెనీ వాటాదారులు భారతదేశ వ్యాపార లాభాలపై గుత్తాధిపత్యం వహించడమే. పారి శ్రామిక విప్లవం కారణంగా బ్రిటన్‌లో తయారైన వస్తువులు చాలా విపరీతంగా పెరిగాయి. వాటికి కొత్త మార్కెట్లు, అవసరమైనాయి. కాబట్టి ఈస్టిండియా కంపెనీని రద్దుచేసి, బ్రిటిష్ పెట్టుబడిదారులందరూ కలసి దేశమంతా భార

తీయ మార్కెట్‌ను కొల్లగొట్టవచ్చు. అందువల్ల బ్రిటీష్ ఇండియా ప్రభుత్వం, వారి ఆర్థిక విధానాలతో బ్రిటిష్ పారిశ్రామిక విధానానికి అనుగుణంగా భారతదేశంతో సంబంధాలను ఏర్పరచుకొంది. పైగా, భారతదేశం పూర్తిగా వ్యావసాయిక దేశం కాబట్టి, ముడి సరుకులను అందిస్తే, వాటిని తమ కర్మాగారాల్లో వాడుకొని, వాళ్ళు తయారుచేసిన వస్తువులను భారతీయులకు అమ్మవచ్చు. ఈ విధానాన్ని అమలు పరచడంలో బ్రిటిష్ ప్రభుత్వం ఈస్టిండియా కంపెనీ మొరటు విధానాన్ని అనుసరించనక్కర లేదు. ఇంతకంటే మెరుగైన, స్వదేశ సంబంధమగు పద్ధతులనే ఉపయోగించవచ్చు. వాణిజ్య విధానాన్ని మలచి, సుంకములను నేర్పుతో విధించి తమ లక్ష్యాన్ని సాధించుకోవచ్చు.. దీనిలో రెండు ప్రధానమైన అనుకూల పరిస్థితులున్నాయి. బ్రిటన్‌లోని యంత్రాలద్వారా తయారైన వస్తువులను దిగుమతి చేసుకోవచ్చు. రెండోది, భారతదేశంలో ఉత్పత్తి చేసే పారిశ్రామికోత్పత్తులు వాటిలో కొన్ని విలువైనప్పటికినీ - వాటిని నిరుత్సాహపరచవచ్చు.

వాస్తవానికి, భారతదేశంలో ఎన్నో కర్మాగారాలు ప్రారంభమైనాయి. బ్యాంకులు వచ్చాయి. రైల్వే కంపెనీలు ఏర్పడ్డాయి. ఇవన్నీ ఆర్థిక ప్రగతికి మూల కారణాలనే భావం అల్పజ్ఞానంగల పరిశీలకులకు కలగవచ్చు. ప్రప్రథమంగా ఇవన్నీ భారతదేశ వైశాల్యానికి, జనాభాకు సరిపోయినవి కావు. రెండో అంశమేమంటే, వాటి యజమానులు, నిర్వాహకులు కూడా బ్రిటీష్‌వారే. వారితో ఉన్న భారతీయులు కేవలం వాటి వాడకందారులు, పనివారు, గుమాస్తాలు మాత్రమే. వాడకందారులుగా కొంతమందికి ఆదాయం లభించినప్పటికీ, వీరంతా చాలా బీద వారు. కార్మికులుగా ఎంతోకాలం వారు కార్మిక చట్టాలు కాని, యూనియన్‌లు కాని లేకుండా, బ్రిటీష్ వారి దయాదాక్షిణ్యాలకు లోనైన వారే. క్లుప్తంగా చెప్పాలంటే, బ్రిటిష్ ప్రభుత్వం వారిదంతా కావాలనే చేశారు. ప్రభుత్వ విధానాలు, వారి ఉదాసీనత కారణంగా ఏర్పడ్డా, ప్రధానంగా భారతీయుల అమాయకత్వం, నిర్లక్ష్యం వల్లనే వారీ పరిస్థితికి దిగజారారు. ఆధునిక పారిశ్రామిక విధానం భారతదేశానికి ప్రత్యేక పరిస్థితుల్లో సంక్రమించింది. కాని దాన్ని నిర్ధారించి నడిపే మార్గం పూర్తిగా విదేశ పారిశ్రామికవేత్తల చేతుల్లోనే ఉండింది. హాని కలుగకుండా దానికి కావాల్సిన రక్షణలు ఐరోపా ఖండంలోనే శాసనం ద్వారా కల్పించబడింది. దాని ఫలితంగా లాభాలన్నీ బ్రిటీష్ వారికి చెందాయి, నష్టాలన్నీ భారతీయులకు సంక్రమించాయి. అయితే భారతదేశం, తన మధ్యయుగ వ్యావ

సాయిక ఆర్థిక విధానాన్ని మాత్రం కాపాడుకోగల్గింది. నిజానికి పరిస్థితి చాలా వరకు దిగజారి పోయింది. విద్యుత్ పరిశ్రమల ఉక్కు పిడికిళ్ళతో దేశీయ చేతి పరిశ్రమలు పూర్తిగా నశించిపోయాయి. కార్మికుల్లో కొంతమందిని తప్ప మిగిలిన వారందరినీ వ్యవసాయ రంగానికి మళ్ళించాల్సి వచ్చింది. దానితో భూమి మీద వత్తిడి ఎక్కువ అయింది. అంతకంటే నికృష్టమైన పరిస్థితి ఏమంటే, భారతదేశంలోని రైతు ఆ పరిస్థితుల్లో కూడా వ్యవసాయ రంగంలో పాత పద్ధతులనే వాడేవాడు. అందుచేత అత్యున్నత దేశాలతో పోటీ పడాల్సి వచ్చింది. ఆ దేశాల్లో రైతులకు సహకార బాంక్‌లు, శాస్త్రీయమైన ఉత్పత్తి విధానాలు, వ్యవస్థీకృత మార్కెట్ వ్యవస్థ వారికి అనుకూలంగా ఉండేవి. భారతదేశంలో అమాయకత్వానికి రైతులు ఒక చిహ్నం. దానికి తోడు వడ్డీ వ్యాపారి, మలేరియా అతనిని పట్టి పీడించేవి. అందువల్ల రైతు అన్ని విధాల నష్టపోయాడు. అతడు ఉత్పత్తి చేసిన పత్తి, గోధుమలు నాణ్యతలో తక్కువన్న కారణంగా, చాలా తక్కువ ధరలకు అమ్మాల్సి వచ్చింది. నీలిమందు, రసాయనిక రంగుల ముందు తట్టుకోలేక పోగా, దాని పంటను ఆపాల్సిన పరిస్థితి వచ్చింది. ప్రభుత్వం ఎన్నో రకాల సహాయం చెయ్యడానికి ప్రయత్నించింది. వ్యవసాయ శాఖ, సహకార శాఖలు ఏర్పాటు చేశారు. పరిశోధనా సంస్థ ప్రారంభమైంది. కొత్త తరహా వ్యవసాయ, పశు ఉత్పత్తి క్షేత్రాలు ప్రారంభమైనాయి. వ్యావసాయిక ఉత్పత్తికి, పనిముట్లకు, పశువులకు సంబంధించిన ప్రదర్శనలు ప్రారంభమైనాయి. అయితే ఉన్నత వర్గాల నిర్లక్ష్యం వల్లా, కింది ఉద్యోగుల అసమర్థత, చిత్తశుద్ధి లేకపోవడం వల్లా బీద రైతు ఏ విధమైన లాభాన్నీ పొందలేక పోయాడు. ఎంతో సేవాభావంతో, నిస్వార్థంతో, సుదూరంగా గ్రామీణ ప్రాంతాల్లో నివసించే పేద రైతుకు సేవచేయడం అవసరం. వాళ్ళు అసలే పాత పద్ధతులను అనుసరించేవారు. వారిని కొత్త పద్ధతులకు మలచే సామర్థ్యం విదేశీ ప్రభుత్వానికిగాని వారి సిబ్బందికి గాని లేకపోయింది. భూస్వాములు చాలా రాష్ట్రాల్లో ప్రభుత్వానికి, రైతులకు మధ్య దళారీలుగా ఏర్పడ్డారు. వాళ్ళొక ప్రత్యేక వర్గంగా తయారైనారు. రైతులను ఉత్సాహపరచలేక పోయారు. కాబట్టి పేద రైతు ఈ కొత్త పరిస్థితులకు తట్టుకోలేక భూస్వామి, వడ్డీ వ్యాపారుల గానుగల్లో పడి నలిగిపోయి విపరీతమైన బాధలకు లోనైనాడు. ఈ ప్రత్యక్ష, పరోక్ష ఫలితాలకు వ్యావసాయిక రంగంలో ఏర్పడ్డ ఆర్థిక మాంద్యం, దేశ ఆర్థిక స్థాయిని ఇంకా దిగజార్చింది. దీని మూలంగా రాజకీయ ఆందోళన ఇంకా పెరిగింది.

రాజకీయ, ఆర్థిక రంగాల్లో మాదిరిగానే, ఆంగ్లేయ వలస సంస్కృతి భారతీయుల నూతన ధోరణులను అర్థం చేసుకోవడంలో సమతౌల్యం లేని సర్దుబాట్లను ఎన్నో చేసింది. అయినా భారతీయులకు వీటిని అనుసరించే ఏ అవకాశం లేకపోయింది. అల్లే సాంస్కృతిక జీవన విధానంలో కూడా వారి పాత్ర వ్యతిరేకంగాను, ఆందోళనకరంగాను ఉండింది. ఇది స్థిరత్వం లేని కొంతమంది జీవితాలను కదిలించివేసి ఒక ఉద్యమానికి దారి తీసింది. ఏ పద్ధతీ లేక, ఏ దారీలేని కర్తవ్యం ప్రజల భవితవ్యాన్ని గూర్చి ఏమీ చెప్పలేక పోయింది. భారతీయుల కాలం చెల్లిన ఆచార సాంప్రదాయాలను పారద్రోల డంలో కొంత విజయం సాధించినా, అధికారం పట్ల విధేయతను చూపాలనే వారి రాజకీయ విధానం, ఒక రకమైన మానసిక బానిసత్వానికి దారి తీసింది. చేసేది లేక వారు ఆంగ్లేయ వలస సంస్కృతిని అనుకరించడం మొదలు పెట్టారు.

పాఠశాల, విశ్వవిద్యాలయ విద్యాబోధనలో ఆంగ్లేయ వలస సంస్కృతి విధాన ప్రభావం ఎలా ఉండిందో చూద్దాం. వీటి ద్వారా బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం కొంత వరకు వారి సంస్కృతిని వ్యాప్తి చేసింది.

ప్రాథమిక విద్య విషయంలో ప్రభుత్వానికి చాలా తక్కువ శ్రద్ధ ఉండేది. వాటికి సంబంధించిన పాలన, పురపాలక, జిల్లా బోర్డులకు బదిలీ చేశారు. అధ్య యన పాఠ్య ప్రణాళికలను తయారుచెయ్యడం, అప్పుడప్పుడు ఉద్యోగులను తనిఖీకి పంపడం మినహా ప్రభుత్వ విద్యా విభాగం మరే నిర్మాణాత్మక కృషీ చేయలేదు. మౌలికంగా చేసిన మార్పు ఏమంటే, మత సంబంధమైన విద్యను పాఠ్య ప్రణాళిక నుండి తొలగించి, భూగోళం, చరిత్ర మొదలైన ఇతర లౌకిక పాఠ్యాంశాలను ప్రవేశపెట్టడం. కొన్ని ప్రత్యేక అవకాశాలను ఉపాధ్యాయుల శిక్షణ కోసం కల్పించడం. వీటి వలన ఏమాత్రం తృప్తీ కలుగలేదు. విద్యా విషయ కంగా ఉపయోగకరమైన కొద్ది చిన్న మార్పులు మాత్రం చేయడం జరిగింది. కానీ ప్రాథమిక విద్యను స్థానిక బోర్డులు, ప్రైవేటు సంస్థలు ఆర్థిక యిబ్బందుల వల్ల నిర్వహించలేక పోయినాయి. అందువల్ల పాఠశాలల సంఖ్య తగ్గింది. వీటికి తోడు పాఠశాలల నిర్వహణ కాలం తగ్గడం వల్లా, అధ్యయన పద్ధతులు సక్ర మంగా లేనందువల్లా, వాటి ఆలనా, పాలనా సరిగా వుండనందువల్లా చేసిన కాస్త ప్రయత్నం కూడా వ్యర్థమైంది.

ఇక, సెకండరీ స్కూలు విద్య విషయంలో రెండు ప్రధానమైన నష్టా

లున్నాయి. భాషా సంబంధమైన పాఠ్య ప్రణాళిక అన్ని పాఠశాలల్లో ఒకే రకంగా ఉండేది. విద్యార్థులకు ఏది అవసరమో అది బోధించలేదు. ఇంత కంటే దురదృష్టకర విషయమేమంటే, ఆంగ్లభాషే మాధ్యమంగా బోధించబ డేది. పిల్లలకు 7 లేక 8 సంవత్సరాలు వచ్చేసరికి, ఇంగ్లీషు మాధ్యమంలో చదువగలరని, ఇతర పాఠ్యాంశాలకంటే ఆంగ్లానికే ఎక్కువ అవకాశం ఇవ్వడం జరిగింది. ఆ రకంగా సాధారణ గ్రహణ శక్తి ప్రమాణాలను, విద్యా విలువ లను, తగ్గించడం జరిగింది. విశ్వ విద్యాలయ పాఠ్యాంశాలను కూడా ఆంగ్లంలో బోధించినప్పటికినీ, వాళ్ళకు నచ్చిన పాఠ్యాంశాలను చదువటానికి అవ కాశం ఉండేది. ఆంగ్ల విద్యాబోధన మూలంగా జరిగిన నష్టమేమంటే, విద్యార్థి, విషయం అర్థం చేసుకోకుండా రాసేవాడు, మాట్లాడేవాడు. పాలక రాజ్యాల్లో, అవగాహన లేకుండా విషయాన్ని బట్టీ పెట్టి నేర్చుకునే దురదృష్ట పరిస్థితి ఏర్పడింది. అందువల్ల 'ఆధునిక విద్య' భారతదేశంలో మరింతగా దెబ్బ తినింది. తెలియని పదాల శబ్దాలు కూడా తెలియకుండానే బట్టీ వేయడం. భాషా అధ్యయనంలో కన్నా ఈ లోపం జీవ శాస్త్రాల్లో ఎక్కువ కన్పించింది. చిలకపలుకుల్లా, విషయాలను బట్టీ వేసేవారు, రైమ్‌లు నేర్చుకునే వాళ్ళ కంటే మరీ అధ్వాన్నంగా, అవిద్యావంతులుగా తయారయ్యారు.

ఇన్ని ఇబ్బందులున్నప్పటికీ, ఎంతో సమర్థులు, విజ్ఞానవంతులు ఆంగ్ల విద్య మూలంగా తయారైనారు. అది విద్యావిధానం వల్ల కాదు. ఆంగ్ల-భారతీయ అధ్యాపకుల మేధోసంపత్తి మూలంగా, విద్యార్థుల గొప్ప శక్తి సంపన్నతల వల్లా యిది సాధ్యమైందని చెప్పాలి. లేకుంటే, ఆధునిక పాశ్చాత్య విద్యా సంస్థల్లోని విద్యార్థులు కూడా ప్రాచీన 'ప్రాచ్య' విద్యా సంస్థల్లో శిక్షణ పొందిన వారుగానే వుండేవారు. ఇద్దరిలోనూ జీర్ణం కాని సమాచారమే ఎక్కువగా ఉండేది. నింపా దిగా, గుర్తుంచుకోడమనే శిక్షణ మాత్రమే పొందారు. ప్రతిరూపం, ఆలోచన, జిజ్ఞాస, విమర్శ అనే శక్తులు జీవితానికి అన్వయించబడలేదు.

ప్రాచ్య విద్యకంటే పాశ్చాత్య విద్య చదివిన వారు రెండు విధాల భిన్నంగా ఉండేవారు. భౌతిక, సామాజిక ప్రపంచ విషయాలను గురించి వారికి బాగా తెలుసు. తమకిచ్చిన పనిని క్రమంగా చేసేవారు. బ్రిటీష్ ఉన్నతోద్యోగుల ఆదే శాలను తు.చ. తప్పకుండా పాటించేవారు. తమ నిర్ణయాలకు, అభిప్రాయాలకు తావీయకుండా యాంత్రికంగా పనిచేసేవారు. కొద్ది వేతనానికే వాళ్ళు పని చేసేవారు. ప్రభుత్వ సర్వీసులో చేరనివాళ్ళు, ఇతర స్వతంత్ర వృత్తులను

చేపట్టేవారు. విశ్వవిద్యాలయ డిగ్రీ పట్టాదారులు పెరగడంతో, ఉద్యోగాల్లో పోటీ పెరిగింది. న్యాయశాస్త్ర పట్టాదారులకు మరింతగా నిరుద్యోగ బాధ ఉండేది.

ఆధునిక యుగ వైతాళికులు, బ్రిటీష్ వలస విధాన సంస్కృతి మూలంగా, పాశ్చాత్య ప్రపంచ వెలుగుతో భారతదేశాన్ని ప్రకాశింప చెయ్యాలని చూచారు. ఆంగ్ల జీవిత విధానాన్ని అనుకరించడమే తమ కర్తవ్యంగా వారు భావించారు. అది వాళ్ళ తప్పుకాదు. కాని వాళ్ళు నేర్చుకొన్న విద్యా విధానానిది. వారు, విచక్షణా జ్ఞానంతో ఆంగ్లజాతి గుణగణాల్లోని మౌలికాంశాలను అనుసరించకుండా, కేవలం గుడ్డిగా అనుకరించారు. ఆంగ్లేయులు భౌతిక విలువలకే ప్రాధాన్యాన్ని ఇచ్చారు. కాని, ఆధ్యాత్మిక విలువలకు ప్రాముఖ్యాన్నివ్వలేదని భావించారు. పైకి కన్పించే భౌతిక భావానికి, ఆధ్యాత్మికత పట్ల నిర్లక్ష్య భావానికి వెనుక కొత్తదైన మత విధానం, నైతిక శుద్ధి ఉన్నాయన్న విషయాలను భారతీయులు గమనించలేదు. అట్లే, ఆంగ్లేయుల వ్యక్తివాద విధానాన్ని స్వార్థపూరిత విధానంగా భ్రమించారు. ఆలోచనాపూరిత ఉదారవాదాన్ని, ధనంపట్ల వారికున్న ఆపేక్షగా భావించారు. ఆంగ్లేయులకు క్రైస్తవమత ప్రభావం లేదనుకుంటే, దానికి కారణం వారికి నైతిక సౌందర్యం పట్ల ఉన్న శ్రద్ధ, దేశభక్తి, వారి కళలమీద, కవిత్వం మీద, వాఙ్మయం మీద ఉన్న శ్రద్ధేకాని వేరేది కాదు. గుడ్డిగా ఆంగ్లేయులను అనుకరించిన భారతీయులు వారి సాంప్రదాయబద్ధమైన మతాన్ని, నైతిక విలువలను, కళలను, వాఙ్మయాన్ని వదలిపెట్టడమే కాక, వారి దేశాన్ని, ప్రజలను కూడా విస్మరించారు.

పాశ్చాత్య కళలంటే, ఇంగ్లాండ్‌లో ఆంగ్లభాష చదువుకున్న కొద్దిమంది భారతీయులకే తెలుసు. భారతదేశంలో చదువుకున్న వారికి చాలామటుకు తెలియవు. అంతేగాక కళాకారులతోను, కళా విమర్శకులతోను సంబంధమున్నపుడే కళాభిరుచి వంటపడుతుంది. భారతదేశంలో అలాంటి కళాకేంద్రాలు లేవు. అవి ఇంగ్లండ్‌లో ఉన్నా, అవి మన భారతీయ విద్యార్థులకు అందుబాటులో ఉండేవి కావు.

ఆంగ్ల వాఙ్మయ విషయంలో, మనవాళ్ళు పాఠశాలల్లో కాని, విశ్వవిద్యాలయాల్లో కాని కొంతకాలం నిర్దేశిత గ్రంథాల చదువు కోసం వెచ్చించారు. వాళ్ళ చదువు పూర్తయిన తర్వాత, కేవలం నవలలను, అదీ కేవలం డిటెక్టివ్ నవలలను మాత్రమే చదివేవారు. ఆంగ్ల వాఙ్మయాన్ని క్షుణ్ణంగా చది

విన వాళ్ళెవ్వరూ లేరు. ప్రధానంగా కవితల్లో, కవి హృదయాన్ని అర్థం చేసుకొని, సుఖ - దుఃఖాలను పంచుకొంటూ, మానవ హృదయాలను అర్థం చేసుకొన్నవారు లేనేలేరు. సంక్షిప్తంగా చెప్పాలంటే, ఏ ఒక్కరూ పూర్తిగా ఆంగ్లేయుల వాఙ్మయాన్ని మథించి, అందులోని సారాంశాన్ని అర్థం చేసుకున్న వారు లేరు. కేవలం నిస్సారమైన, నిర్జీవమైన విషయాన్ని తెలుసుకొని, స్వార్థపరతను మాత్రం పెంచుకొన్నారు.

ఎవరైతే వలస విధాన ఆంగ్ల సంస్కృతిని అర్థం చేసుకోలేకపోయారో, దానిలో నిక్షిప్తమై ఉన్న వైజ్ఞానిక, కళాత్మక హృదయాన్ని తెలుసుకోలేక పోయారో, వాళ్ళు ఆంగ్లభాషకు కొత్తదనాన్ని ఏం ఇవ్వగలరు? ఆంగ్లభాషలో, ఏదైనా నూతనత్వాన్ని చేకూర్చిన భారతీయులెవరైనా ఉన్నారంటే, వారు ప్రాచ్య విద్యనభ్యసించి, తర్వాత ఆంగ్ల విద్యను నేర్చుకొన్న భారతీయులే. వారే భారతీయ తత్త్వశాస్త్రం, మతం, న్యాయం, చరిత్ర, వాస్తు శాస్త్రాలపై ఆంగ్లంలోను, వారి స్వంత భాషలోను గ్రంధాలు రాశారు. వారి వాఙ్మయాన్ని, కళలను కొత్త పరిస్థితుల కనుగుణంగా మలచుకొన్నారు.

వారి మార్గదర్శకత్వంలోనే, భారతీయ భాషలు పగటి కలలుగా మిగిలిపోకుండా, వాస్తవ జీవితాన్ని శోధించి నిగ్గుతేల్చగల గ్రంధాలైనాయి. నాటకం, నవల భారతీయ భాషల్లో పునరుద్ధరింపబడ్డాయి. మధ్య యుగంలో మరుగునపడ్డ, వాస్తవిక జీవితదృష్టి, ప్రధానంగా మనిషిని భౌతిక, సామాజిక పరిసరాలను బట్టి వాస్తవిక రంగుల్లో చిత్రీకరించడం జరిగింది. భారతీయ వాస్తుశాస్త్రంలో, పాశ్చాత్య ప్రభావం వల్ల, స్థలాన్ని పొదుపు చెయ్యడం, పరిశుభ్రత, ఆరోగ్య దృష్ట్యా మార్పులు తెచ్చారు. ఇవి కాకుండా, పాశ్చాత్య ప్రభావం వల్ల, ఆరోగ్యవంతమైన, సమర్థవంతమైన మార్పులూ వచ్చాయి. అవి జీవితానికి సౌందర్యాన్ని చేకూర్చకపోయినా, మనం వాడే వస్తువుల్లో కుర్చీలు, బెంచీలు, వస్త్రధారణ, ఆహార విహార విషయాల్లో మార్పులు తెచ్చాయి.

ఇదంతా, ప్రాచ్యవిద్యలో ఆరితేరిన ఆంగ్ల విద్యాధికుల్లోనే ఎక్కువ జరిగింది. కేవలం ఆంగ్ల విద్యనభ్యసించిన వాళ్ళల్లో, ఈ పరిజ్ఞానం, జీవితాన్ని సరిగా వ్యాఖ్యానించుకోవడం, సౌందర్యారాధన జరుగలేదు. వారేమైనా చేసి ఉంటే అది వార్తా పత్రికల్లో రాయడానికి మాత్రమే పనికి వచ్చింది. చాలా కొద్ది మంది మాత్రమే ఆంగ్లో-ఇండియన్ పత్రికల్లో రాయగలిగారు. యథాతథ అనుకరణతో, స్పష్టతలేని ఆలోచనా విధానం వల్లా వారు రాసిన

రాతల్లో వ్యాకరణ దోషాలు, ఇంగ్లీషు నుడికారం లోపించడం, అంగ్లేయుల నవ్వులాటకు గురైంది. 'ఇంగ్లీషు బాబూ' సంస్కృతిలో బాబు జబ్బార్జీ, బి.ఏ., బాబు పిచ్చీలాల్, ఎం.ఏ. అని ఆంగ్లో- ఇండియన్ మాసపత్రికల్లో వాళ్ళ పేర్లు ప్రచురించుకోడం హాస్యాస్పదంగా ఉండేది.

సంక్షిప్తంగా చెప్పాలంటే, మనకొచ్చిన అంగ్లేయ వలస సంస్కృతి చాలా స్వల్పం. దాని చుట్టూ అల్లిన నిర్మాణం మాత్రం చాలా బాగున్నట్లున్నా, అందులో జీవం మాత్రం లోపించింది. అసలైన ఆంగ్ల సంస్కృతి మాత్రం కన్పించేది కాదు. భారతీయ 'సాహెబ్'లుగా పరిగణించబడిన వారు మాత్రం ఆంగ్ల వస్త్రధారణంతో, వచ్చీరాని భాషలో వాళ్ళల్లో వాళ్ళతోనూ, పనివాళ్ళతోనూ మాట్లాడేవారు. డబ్బున్న వాళ్ళు బంగళాల్లో నివసించే వారు. వారి ఆసనాది సామగ్రులను 'ఆంగ్ల పద్ధతి'లో సమకూర్చుకొనే వారు. అననుకూలమైన కుర్చీల్లో కూర్చొని కత్తులతో, ఫోర్కులతో టేబుల్ భోజనాలు చేసేవారు. క్లబ్బుల్లో పేకాటలాట్టం, టెన్నీస్, బిలియార్డ్స్ ఆటలాడే వారు. యూరోపియన్‌ల నాట్య ప్రదర్శనలను చూస్తూ, మత్తు పానీయాలను సేవించేవారు. వాళ్ళ పద్ధతుల్లో, వాళ్ళ నడకల్లో, విన్యాసాల్లో 'ఆంగ్ల పద్ధతు'లను పాటించేవారు.

రాసే భాషకన్నా, ఈ 'సాహెబ్'లలో మాట్లాడే భాష మరీ ఎగతాళి పంచాంగంగా ఉండేది. రాతలో వారి తప్పిదాలు కేవలం వ్యాకరణానికో, శైలికో పరిమితం అయ్యేవి. ఉచ్చారణ మరీ అధ్వాన్నంగా ఉండేది. వారు ఆంగ్లేయ పద్ధతిలో మాట్లాడాలని చేసే వ్యర్థ తాపత్రయం వినేవారికి అర్థం కాకుండా ఉండేది. వస్త్రధారణలో, వాళ్ళు ఆంగ్లేయుల్లా కన్పించాలనుకోవడం, ఆడంబరాల కోసం పాకులాడ్డం, సరైన పద్ధతిలో బట్టలు కుట్టించుకోకపోవడం, ఇవన్నీ కేవలం అనుకరణలే కానీ, వీటిలో వాస్తవికత లోపించింది. చక్కటి కత్తిరింపుకాని, సులభంగా సరిపోయే వస్త్రాలను వీళ్ళు కుట్టించుకోలేక పోయారు. ఎప్పుడు, ఏ వస్త్రాలు వేసుకోవాలో అనే అంశంపై వారికి స్పష్టమైన అవగాహన ఉండేది కాదు. వారి బంగళాలు, విశాలంగా, పెద్ద పెద్ద గదులతో, విశాలమైన వరండాలతో నిండి ఉండేవి. ఇండియాలో బ్రిటిష్ ప్రభుత్వ భవన శాఖా నిర్మాణాలకనుగుణంగా, ఉండేవే కాని, వాటిలో కళాత్మకత ఉట్టిపడేది కాదు. ఈ బంగళాల్లో ఆసనాది సామగ్రికూడా అందుకు అనువైందిగానే ఉండేది. వారి ఆహారం మాత్రం, ఆంగ్లేయ, భారతీయ అభిరు

చుల సమ్మిశ్రితంగా ఉండేది. అయితే ఆంగ్లేయుల టేబుల్ అలవాట్లు వున్న ఆ కాస్త రుచిని కూడా పోగొట్టేటట్లుండేవి.

టేబుల్ అలవాట్లలోనే గాక, సామాజిక నడవడికలో కూడా ఈ 'సాహెబ్'లు ఆంగ్లేయ సాహెబ్‌లను అనుకరించ ప్రయత్నించారు. అనుకరణ కేవలం తోలుబొమ్మలాట పద్ధతిలో ఉండేది. పైపైని అనుకరించే ఈ ఆంగ్ల విధానాలు, వాళ్ళ నీతిని కూడా నాశనం చేశాయి. ఈ అనుకరణ వల్ల వాళ్ళలో ఒక దురభిమానం, దర్పం పెరిగాయి. ఆంగ్లేయుల ఆత్మ విశ్వాసం, తమ కాళ్ళపై తాము నిలబడగలిగిన మంచి లక్షణాలు సైతం, వీరిలో దురాక్రమణ పూర్వ మనస్తత్వానికి దారితీశాయి. అనుకరణ కేవలం పురుషులకు మాత్రమే పరిమితం కాలేదు. కొందరు స్త్రీలు వీటిని అనుకరించి మరింత నికృష్ట పరిస్థితికి దిగజారారు. సాంఘికంగా క్షీణత జరుగుతున్న ఈ కాలంలో భారతీయ స్త్రీలు అణచివేతకు గురి అయ్యారు. ఎదిగీ ఎదగని మనస్తత్వం గల వీరు అనారోగ్యం, సాంఘిక పరిమితులకు గురికావడం వలన ఎన్నో ఒత్తిడులకు లోబడాల్సి వచ్చింది. రక్షితస్థితి నుండి బయటకు లాగబడి, ఆ పరిస్థితికి తట్టుకోలేక, పూపిరాడని పరిస్థితుల్లో వెనక్కు మరలడం, ఎన్నో కష్టాలకు, ప్రలోభాలకు, గురి కావలసి వచ్చింది. స్త్రీ తన సమతౌల్యతను కోల్పోయింది. ఈ కొత్త సంస్కృతి ఆమె ఏకాంతతకు భంగం కలిగించింది. సాంప్రదాయపూర్వకంగా ఎప్పటినుంచో వస్తున్న స్త్రీ, పురుషుల మధ్య ఉన్న దూరాన్ని తగ్గించడమే కాక స్త్రీలను, తెలియని పురుషులతో కలిసి క్లబ్బుల్లో నాట్యం చేసే పరిస్థితికి దారి తీసింది. ఈ చైతన్యానికి చాలా మంది తిరగబడ్డారు. పాశ్చాత్యదేశాల్లోని స్త్రీల సంస్కరణోద్యమాలకు, వాళ్ళ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకే కాక, వాళ్ళ విద్యకు కూడా భారతీయులు భయపడి పోయారు.

నూతన చైతన్యాన్ని వ్యాప్తి చేయడంలో బ్రిటిష్ ప్రభుత్వం ఈ విద్యాధిక వర్గంపై ఆశలు పెంచుకుంది. ఉన్నత, మధ్య వర్గాలకు చెందిన ఏ కొద్దిమందిలోనో ఏర్పడ్డ అభివృద్ధిని చూపి బ్రిటిషువారు తమ్ము తాము సమర్థించుకొన్నారు. ఈ అభివృద్ధి క్రమం పై నుంచి కిందకు వడపోతగా దిగుతుందనుకొన్నారు. అయితే వారి ఆశలు ఫలించలేదు. ఈ విషయంలో ఉన్నత వర్గాలు ఏమీ చేయలేకపోయాయి. చేసినా, ప్రేమతో, తోటివాళ్ళపై ఆదరణతో చేయలేదు. విద్యాధికులు, ఒకవైపు నిరక్షరాస్యులైన భారతీయులకు, మరోవైపు

ప్రాచ్యవిద్యలో నిష్ణాతులైన సాంప్రదాయబద్ధులకూ దూరమైనారు. తమ ప్రజల మధ్యే తాము పరాయివారమనే భావానికి గురి అఖునారు. అయినా, దీనికి వారు గర్వించారు. తూర్పు, పశ్చిమ దేశాల మధ్యలో ఉన్న ఎవరికీ చెందని భూభాగంలో ఉండి, మాతృదేశాభిమానం కానీ, జాతీయబంధం గాని వారిని కదిలించలేక పోయాయి. వారిని కుంగదీసిన భావమేమంటే, భారతదేశం లోని ఆంగ్లేయ సమాజంలో వారికి స్థానం లేకపోవడమే. నిజానికి తమ దేశానికి ఎంతో కొంత సేవ చెయ్యాలనే భావన కూడా వారిలో కొరవడింది. విదేశీ పాలకులకు సేవచెయ్యడంలో వీరు పూర్తిగా నిమగ్నులైనారు. వారు చేయవలసిన జాతీయ సేవ, విద్య, సంస్కరణలను ఇతరులకు వదలివేశారు.

ఆంగ్లేయ వలస సంస్కృతి, హిందూస్తానీ సంస్కృతి మరుగున పడటానికి కారణమైనా, దాని ప్రభావం కొద్దిమందికి మాత్రమే పరిమితమైంది. దీనిని సమర్థించిన వారు సమాజంలో బాగా ఉన్నత స్థితిలో ఉన్నవారే. అంటే, బ్రిటిష్‌ప్రభుత్వ కరుణా కటాక్షాలు వీళ్ళపై ఉన్నాయి. వీరితో ప్రత్యక్ష సంబంధం లేకపోయినా నూతన సంస్కృతి వీళ్ళను ప్రభావితులను చేసింది. ఈ ప్రభావం ఎంతవరకంటే, విశాల దృక్పథాన్ని వీళ్ళు ఏర్పరుచుకొని ఆధునిక భావజాలంతో సంబంధాలు ఏర్పరుచుకొనేంత వరకేనని చెప్పాలి. మరికొందరైతే పాశ్చాత్య సంస్కృతిని చీడ పురుగులా భావించి దాన్నుండి దూరంగా ఉండిపోయారు. వీళ్ళు పూర్తి ఛాందసులైన మత ప్రవక్తలు, వారి అనుయాయులు.

మత గురువులు, ముఖ్యంగా మహమ్మదీయ మతానికి చెందినవారు, కొత్త తరహా విద్యనభ్యసించడానికి, పాశ్చాత్య నాగరికతను అనుసరించడానికి అంగీకరించలేదు. అంతేగాక, సాంఘీక, సాంస్కృతిక రంగాల్లో పాశ్చాత్య ప్రభావం ఉండకూడదని ఉద్బోధించారు కూడా. అక్బరు కాలంలో వచ్చిన హిందుస్తానీ సంస్కృతి మత సంబంధమైనది కాదని, హిందూ, ముస్లీం మత గురువులు అంగీకరించలేదు. బ్రిటీష్ ప్రభుత్వ రాకతో వీళ్ళు కొంత ఉదాసీన వైఖరిని అవలంబించారు. అయినా, ప్రజల అసంతృప్తిని పెంచడానికి ప్రయత్నించారు. ఈ విధంగా ఆంగ్ల, మత ప్రాధాన్యంలేని హిందూస్తానీ సంస్కృతుల పట్ల అసంతృప్తి చెంది, వందలాది సంవత్సరాల చరిత్రలో వెనక్కు వెళ్ళి, పురాతన యుగానికి చెందిన ప్రాచీన సంస్కృతివైపు ప్రజలను నడిపించుటకు వెళ్ళారు. రాబోయే అధ్యాయంలో హిందూ, మహమ్మ

దీయుల మధ్య సాంస్కృతిక, రాజకీయ రంగాల్లో ఈ సంస్కృతిలో ఎటు వంటి మార్పు వచ్చిందో గమనిద్దాం.

# 13. ఆంగ్లేయ సంస్కృతికి ప్రతిస్పందన: రాజకీయ, సాంస్కృతిక వేర్పాటువాదం

## I

ప్రథమ ప్రపంచ మహా సంగ్రామాంతంలో సంభవించిన నూతన పరిస్థితుల మూలంగా, విద్యావంతుల భావనలో విప్లవంలాంటి ఒక మార్పు వచ్చింది. బ్రిటీష్ ప్రభుత్వం వాగ్దానం చేసిన స్వయంపాలన సంపాదించుకోగలమన్న ఆశాభావం చివరకు నిరాశగా మారింది. వారికి, తమ భౌతిక, వైజ్ఞానిక దాస్యంపై స్పృహ ఏర్పడింది. అందువల్ల తాము ఇంతకు పూర్వం దూరం చేసుకొన్న మత శాఖలు, ప్రజానీకంవైపు మళ్ళి, వారితో చేరి, విదేశీ పాలకులకు వైరుధ్యంగా సమిష్టి ప్రయత్నం సాగించారు.

వారి వైఖరిలో, ఈ ఆకస్మిక మార్పుకు కారణం, 1919 సంస్కరణల చట్టం ఫలితంగా సంభవించిన కనువిప్పు, వైరుధ్య ప్రభావం పాక్షికం మాత్రమే. అంతకంటే ముఖ్యమైన అంశం, యుద్ధకాలం తర్వాత ఆకస్మికంగా వచ్చిన ఆర్థిక సంక్షోభం; మొట్టమొదటిసారిగా సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ వ్యవస్థ, భారతీయుల కళ్ళ ముందు సాక్షాత్కరించింది. ఈ సంక్షోభం ఇంచుమించుగా, అన్ని వర్గాల ప్రజలను ఆవహించింది. అయితే, దీనివల్ల ముఖ్యంగా బాధితులు బీద, మధ్య తరగతి, కార్మిక వర్గాలవారు. వీరు నిరుద్యోగానికి గురి అయ్యారు. వ్యవసాయదారులు, తమ ఉత్పత్తిని, బహు స్వల్ప ధరలకు విక్రయించాల్సి వచ్చింది. యుద్ధకాలంలో, ఎన్నో పారిశ్రామిక కర్మాగారాలు నెలకొల్పారు. వాటిలో అధికభాగం బ్రిటిష్ పెట్టుబడితో నిర్మించినవే ట్రేడ్ యూనియన్ ఉద్యమం, కార్మికుల శాసనాలు, ఇంకా శైశవ దశలో ఉన్నందున, కార్మికులు గురవుతున్న విపరీతమైన దోపిడికి ప్రతిఘటనగా ఏ విధమైన రక్షణలు చేపట్టలేదు. యుద్ధం అంతమవడంతో అనేక లక్షల ప్రజలు నిరుద్యోగులయ్యారు. వారి సంరక్షణకు ఏ విధమైన అవకాశం లేకుండింది. ఇదే విధంగా, విద్యావంతులైన నిరుద్యోగుల సంఖ్య విపరీతంగా పెరిగింది.

వ్యవసాయదారులను చూస్తే, వారి దైన్యతకు అంతూపొంతూ లేదు. విదేశీ యుల పోటీ, భూస్వామి, రుణదాత - ఈ ముగ్గురినీ భరించలేకపోయారు. దానికితోడు అడపాదడపా వచ్చే భయంకరమైన కరువులూ, వరదలూ, వారి వినాశనానికి కారణమైనాయి.

భారతీయ ప్రజానీకం ఎన్నో శతాబ్దాలనుంచీ ఆయా కాలంలోని ప్రభుత్వాలకు అలవాటుగా విధేయులవుతూ ఉండేవారు. అయినా వారి ప్రాపంచిక బాధలన్నింటినీ ప్రభుత్వమే తీర్చగలదన్న ఆశాభావం వారికుండేది. ఈ కారణంగా వారు రైతులను, కార్మికులను నాశనం చేసి ఆర్థిక సంక్షోభానికి గురి చెయ్యడానికి కారణం విదేశీ ప్రభుత్వమేనని నేరం మోపారు. కాబట్టి జాతీయ కాంగ్రెస్‌కు ఆనాటికే విద్యావంతుల వర్గాల్లో బ్రిటిష్‌వారిపై వ్యతిరేకత ఏర్పడింది. ఈ ఆర్థిక సంక్షోభాన్ని రాజకీయ కల్లోలంగా ఎక్కువ శ్రమపడకుండానే మార్చుకోగలిగారు. ఈ కార్యంలో వారికి హైందవ, ముస్లిం మతాల, సాంస్కృతిక ఉద్యమాల నాయకుల సహాయం లభించింది.

విభిన్న వర్గాలను బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఐక్య పరచడానికి ప్రయత్నించారు. ప్రజలు విద్యావంతులు కాపడంతో ఆర్థిక, మత నైతి కావసరాలను గూర్చి హిందూ, ముస్లిం భావాలకు వారి కోర్కెలను సమానంగా అర్థం చేసుకోగల్గిన నాయకుడు అవసరమని కాంగ్రెస్‌వారు భావించడం జరిగింది. ఆ సమయంలో, ఈ లక్షణాలన్నీ మూర్తీభవించిన మహాత్మాగాంధి, భారత రాజకీయ రంగంలో ప్రవేశించాడు. ఆయన వ్యక్తిగత ఆకర్షణ శక్తియే అన్ని వర్గాల, మతాల, శాఖలవారిని ఆకట్టుకొని కాంగ్రెస్‌వైపుకు మళ్ళించింది. ఆయన నైతిక, ఆధ్యాత్మిక ప్రభావమే, వారందరినీ, విదేశీ బానిసత్వం నుంచి స్వాతంత్ర్యం అనే సమిష్టి కార్యసాధనకు పురికొల్పింది.

గాంధీ మహాత్ముడు, బ్రిటీష్ పాలనకు వ్యతిరేకంగా, జాతీయ కాంగ్రెస్ ప్రారంభించిన రాజకీయ పోరాటంలో, నాయకుడిగా 1919 నాటి రౌలట్ చట్టాల రద్దుకోసం చేసిన ఆందోళన, యిందులో ప్రథమ ఘట్టం. ఈ చట్టాలు, ప్రపంచ యుద్ధం ముగిసిన చాలాకాలం తర్వాత, బ్రిటీష్ భారత ప్రభుత్వం అవలంబించిన ప్రజావ్యతిరేక యుద్ధ కాల విధానాల్ని, యింకా పొడిగించి కఠినం చెయ్యడానికి, అమల్లోకి వచ్చాయి. స్వాతంత్ర్య ఉద్యమాన్ని అణచడానికి నిర్దేశితమైనాయి. గాంధీ చట్ట ధిక్కరణ ప్రణాళికతో దేశ వ్యాప్తమైన

దీన్ని ఎదుర్కొన్నాడు. ప్రభుత్వం, అమృతసర్‌లో జలియన్‌వాలాబాగ్‌లో శాంతి యుతంగా సమావేశమైన ఒక సభపై జరిపిన కాల్పుల మూలంగా, పంజాబ్ రాష్ట్రమంతటా సైనిక చట్ట ప్రకటనవల్లా, ఈ ఉద్యమాన్ని అణచడానికి పూనుకొంది. ఈ అమృతసర్ కాల్పుల్లో మృతులైన హైందవ, ముస్లిం, సిక్కుల రక్తం మూడు మతాలవారిని జాతీయ కాంగ్రెస్ పతాకం కింద పవిత్రులుగా రూపొందించింది. భారతీయ ముస్లింలు, బ్రిటిష్ ప్రభుత్వం మధ్య, తూర్పు ఆసియాలో అనుసరిస్తున్న విధానాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. అక్కడ తుర్కుల సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది. నూతనంగా ఏర్పడ్డ రాజ్యాలు, తదితర ముస్లిం రాజ్యాలు సైతం, రాజకీయ చదరంగంలో పావులుగా ప్రయోగించడం జరిగింది. అందువల్ల వారంధరూ కొంత మత ప్రేరణగల వ్యవస్థగా రూపొందారు. దీన్ని ఖిలాఫత్ కమిటీ అన్నారు. ఇది ముస్లింల్లో పూర్వ సాంప్రదాయ మతవాదులనూ, విద్యావంతులను కలపడానికి వేదిక అయింది. ఈ కమిటీ, భారత స్వాతంత్ర్య సమరంలో జాతీయ కాంగ్రెస్‌తో మైత్రి నెరపడానికి నిశ్చయించింది. ఫలితంగా, మహాత్మాగాంధీ అహింసాయుత అసహాయోద్యమ ప్రణాళికను అనుసరించడానికి త్రోవ చూపింది. విదేశీ ప్రభుత్వం, ప్రజల సహకారం లభించినప్పుడు మాత్రమే కొనసాగుతుందనీ, ఆ సహకారం విరమిస్తే, అది పతనమవుతుందనే సిద్ధాంతాలపై ఆధారపడి ఉంది.

ఈ మహత్తర పోరాటం, భారతీయులు మాటలోగాని, చేతలోగాని హింస లేకుండానే, చట్టాలను ఎదిరించటానికి తిరుగుబాటుగా సాగింది. భారతీయుల హృదయాలనుంచి నిస్పృహ, దౌర్బల్యతలను తొలగించింది. నిరాయుధులు, పరాధీనులైన ప్రజలు తమ ఆత్మ బలాన్ని, ఆత్మ గౌరవాన్ని సంరక్షించుకొని స్వాతంత్ర్య సాధనకు దృఢ విశ్వాసాన్ని ప్రకటించారు. కొన్ని విజయాలు, అపజయాలు తటస్థించినా, గాంధీ నాయకత్వంలో ఏడు సంవత్సరాలు కొనసాగింది ఈ ఉద్యమం. గాంధీ, తదితర కాంగ్రెస్ నాయకులు, కారాగారంలో బంధితులైనారు. ప్రభుత్వం ఏమాత్రం తమ కుతంత్ర ఆలోచనలు మాననందున ఈ ఉద్యమం విజృంభించింది.

భారత దేశ రాజకీయ సంస్కరణల్లో, తరువాయి దశలో ప్రభుత్వం వీరి కోర్కెలను తీర్చడానికి సంసిద్ధంగా ఉందని తెల్పడానికి, సర్‌జాన్ సైమన్ ఆధ్వర్యాన ఒక రాయబారం భారతదేశానికి రాగలదని, బ్రిటిష్ ప్రభుత్వం 1927లో ప్రకటించింది. ఈ కుయుక్తులకు ప్రత్యుత్తరంగా కాంగ్రెస్, మద్రాసు

సమావేశంలో (1927, డిసెంబరు), తమ ధ్యేయం 'పూర్ణ స్వరాజ్యం,' "సాధ్యమైతే బ్రిటీష్ సామ్రాజ్యంలో భాగంగాకానీ, అవసరమైతే సామ్రాజ్యానికి వెలుపలా," అని తెల్పింది. పండిట్ మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతన ఒక కమిటీని, స్వతంత్ర భారతదేశ రాజ్యాంగ విధానాన్ని తయారు చేయటానికి, దాన్ని అఖిల భారతీయ రాజకీయ పక్షాల సమావేశానికి ఆమోదం పొందడానికి నియమించింది.

1928లో సైమన్ కమిషన్ భారతదేశానికి వచ్చినపుడు అన్ని రాజకీయ పక్షాలు దానిని బహిష్కరించాయి. కొన్ని విభాగాలకు చెందిన వ్యక్తులు, సముదాయాలు మాత్రమే సాక్ష్యమివ్వడానికి ఉన్నాయన్న విషయం అర్థమైంది. అన్ని పార్టీలు నెహ్రూ కమిటీ నివేదికను అనుసరించాయి. అదేమిటంటే భారతదేశం బ్రిటిష్ కామన్‌వెల్త్‌లో స్వయంప్రతిపత్తి గలదనడం. కాని అలీ సోదరుల ఆధ్వర్యంలో ముస్లీంలు దీన్ని అంగీకరించలేదు. పది సంవత్సరాలుగా కృషిసల్పిన మత సామరస్యానికి ఇదే చివరి ఘట్టం. అయినా చాలా మంది ముస్లీంలు కాంగ్రెసుకే మద్దతు తెలిపారు. అధిక సంఖ్యాకుల్లో ప్రత్యేకమైన విభజనా దృక్పథాలు ఏర్పడ్డాయి. కాంగ్రెస్, నెహ్రూ నివేదికను కలకత్తా సమావేశంలో అంగీకరించింది (డిసెంబరు 1928). అందులోని ప్రతిపాదన ఏమంటే, స్వయం ప్రతిపత్తి సంవత్సరం లోపల ఇవ్వకపోతే, నెహ్రూ నివేదికకు కాలదోషం పడుతుంది. కాంగ్రెస్ మరలా సంపూర్ణ స్వరాజ్యం అనే విధానానికి తిరిగి వెళుతుంది. బ్రిటీష్ ప్రభుత్వం కాంగ్రెస్ విధానాన్ని లక్ష్యపెట్టలేదు. అందువల్ల కాంగ్రెసు, 1929 డిసెంబరు 31వ తేదీ అర్ధరాత్రి, సంపూర్ణ స్వరాజ్యాన్ని సాధించడానికి కృతనిశ్చయాన్ని తెల్పింది. దృఢమైన తీర్మానం తీసుకోడం జరిగింది. 1930 జనవరి 26వ తేదీన, భారతదేశంలో సమావేశమైన అన్ని సభల్లోను లక్షల కొద్ది ప్రజలు పాల్గొని, స్వాతంత్ర్య ప్రతిజ్ఞను తీసుకున్నారు.

1930 మార్చి నెల్లో, భారత స్వాతంత్ర్య సమరంలో రెండో ఘట్టం ప్రారంభమైంది. ప్రభుత్వ అనుమతి లేందే ఉప్పు తయారు చేయరాదన్న చట్ట ధిక్కారం ప్రారంభమైంది. ఈ ప్రత్యేక చట్టం మాత్రమే ప్రజల తిరుగుబాటుకు కారణమవడానికి ఉప్పు ధరలు పెరగడం, దానివల్ల బీద ప్రజలు బాధపడటాన్ని గమనించవచ్చు. కథియవార్ తీరంలోని దండిగ్రామంలో గాంధీ మహాత్ముడు, సముద్ర జలాలనుంచి ఉప్పు తయారుచేస్తానని ప్రకటించాడు.

కాలి నడకన అక్కడికి వెళ్లాడు. ఈ సంఘటన దేశాన్ని మొత్తం ఉద్రిక్తపర చింది. ప్రజలు బాహాటంగా న్యాయ చట్టాలను ధిక్కరించారు. విదేశీ వస్త్రా లను, ప్రధానంగా బ్రిటిష్ కర్మాగారాల్లో తయారైన వాటిని, బహిష్కరిం చారు. ఈసారి, ఉద్యమం నిర్దిష్టమైన క్రమపద్ధతిలో సాగింది. అన్ని కులా లకు, మతాలకు చెందిన ఒక లక్షమంది ప్రజలు జైళ్ల పాలయ్యారు. వారిలో ఎందరో ప్రతిఘటన లేకుండానే పోలీసు దళాలు పెట్టే చిత్రహింసలకు గుర య్యారు. పోలీసు కాల్పుల్లో ఎందరో మృతిచెందారు.

1931వ సంవత్సర ప్రారంభంలోనే, మితవాద నాయకులు కొందరు కాంగ్రెసుకు, ప్రభుత్వానికి ఒక సంధి ఏర్పాటు చేశారు. అదే గాంధీ - ఇర్విన్ ఒడంబడిక. బ్రిటీష్ ప్రభుత్వంలో ఒడంబడిక కోసం గాంధీ లండన్‌లోని రౌండ్ టేబుల్ సమావేశానికి హాజరైనాడు. ఏ విధమైన ఒడంబడిక సాధ్యం కానందున, మహాత్ముడు భారతదేశానికి రాగానే, సత్యాగ్రహానికి ఉద్యమిం చాడు. ప్రభుత్వం ఇంకా కఠిన చర్యలు తీసుకొంది. కాంగ్రెసు నాయకు లంతా జైళ్ల పాలయ్యారు. కాంగ్రెస్ కమిటీల ఆంతరంగిక నిధులు, నాయ కుల ఆస్తిపాస్తులను జప్తు చేయడం జరిగింది. అనేకమంది స్వాతంత్ర్య సమరయోధులు తాము ఖైదీ, లేదా మృతి చెందడం కంటే, సర్వస్వం కోల్పోయి కుటుంబాలను కరువు కాటకాల పాల్జేయాలేమోనన్న భయానికి లొంగిపొయ్యారు. కాల క్రమేణా ఉద్యమం నీరుకారిపోయింది.

కాంగ్రెసు ఉద్యమ తాత్కాలిక పతనాన్ని అవకాశంగా తీసుకొని, బ్రిటీష్ ప్రభుత్వం కొందరు ప్రతిపక్షాలు కాని ప్రజలతో, మరో రౌండ్ టేబుల్ సమా వేశం ఏర్పాటు చేసి, రాజకీయ సంస్కరణల ప్రణాళికను సిద్ధం చేసింది. దాన్ని 1935లో బ్రిటీష్ పార్లమెంటు, భారత ప్రభుత్వ చట్టం అనే పేరుతో ఆమోదించింది. రాష్ట్రాల్లో అన్ని శాఖలను, కేంద్రంలో పరిశ్రమలు, వాణిజ్యం, రైల్వేలు మొదలైన శాఖలను, ఎన్నికైన భారతీయ మంత్రులకు అప్పగించ డానికి నిశ్చయించడం జరిగింది కాని, వైస్రాయి రాష్ట్ర గవర్నర్ల చేతిలో రద్దు పరిచే అధికారముంచింది. బ్రిటీషు ఇండియా, భారతీయ స్వతంత్ర రాజ్యాలు కలసి ఒకటై కేంద్ర ప్రభుత్వంగా ఏర్పడింది. దీనిపై అధికారం బ్రిటీష్ ప్రభుత్వానికే ఉంటుంది కేంద్ర శాసన సభలో 33 శాతం దిగువ సభ నుంచి, 40 శాతం ఎగువ సభ నుంచి స్వతంత్ర రాజ్యాలు ప్రతినిధులను పంపుతారు. పాలకులే వీళ్లను ఎంపికజేస్తారు.

1937లో సాధారణ ఎన్నికలు నూతన చట్టం కింద జరగక పూర్వం కాంగ్రెస్ లాంఛన ప్రాయంగా సత్యాగ్రహ ఉద్యమాన్ని విరమించింది. ప్రభుత్వం ఉద్యమ నాయకులను విడుదలచేసింది. ఎన్నికల్లో పోటీ చేసి, కాంగ్రెస్ బ్రహ్మాండమైన విజయాన్ని సాధించింది. ఐదు రాష్ట్రాల్లో పూర్తి విజయం, కొన్ని రాష్ట్రాల్లో బృహత్ పక్షంగాను, లేక రెండో బృహత్పక్షంగా గెల్చింది. కొన్ని మాసాల ఊగిసలాట తర్వాత రాష్ట్రాల్లో సంస్కరణలను తలపెట్టింది. ప్రతిఘాతమైన కేంద్ర ప్రభుత్వ పథకాన్ని వ్యతిరేకించింది. ఐదు రాష్ట్రాల్లో కాంగ్రెసు తన మంత్రి వర్గాలను ఏర్పాటు చేసింది. మరి రెండు రాష్ట్రాల్లో అధిక సంఖ్యాక బలం గల సంయుక్త మంత్రి వర్గాలను ఏర్పాటు చేసింది.

జాతీయ కాంగ్రెస్ చరిత్రలో, పరిమితమైన అధికారాలతో ప్రభుత్వ బాధ్యత స్వీకరణ అనేది ఒక గణనీయమైన సంఘటన. దీని ఫలితం ఒకటి కాదు, అనేకం. ఇది కాంగ్రెసు నాయకుల పాలనా సామర్థ్యాన్ని ప్రకటించడా నికి అవకాశాన్ని కలిగించింది. దీన్ని వాళ్లు సద్వినియోగం చేసుకొని, తమ సంఖ్యను పదిరెట్లు అధికం చేశారు. మరోవైపు ఇది, కొంత వరకు కాంగ్రెసు దృష్టిని తమ ఆదర్శాలైన పూర్ణ స్వరాజ్యం, మత సమైక్యతల నుంచి తప్పించి వేసింది. అందు మూలంగా అల్పసంఖ్యాకులు, ముఖ్యంగా ముస్లింలు కొంత దూరమయ్యారు. దీనికి పైకి కన్పించే కారణమేమంటే, నూతన సభ్యుల ప్రవేశం. వీరిలో ఎక్కువ మంది పూర్తిగా కాంగ్రెసు మూల సిద్ధాం తాలతో ఏకీభవించలేదు. కేవలం అధికార మోహానికి ఆకర్షితులైనారు. పార్టీ లోని పాత వర్గాలను అణచిపెట్టడం, దాని రూపాన్ని మార్చడం, దానికి పూర్వ సాంప్రదాయ రూపాన్నివ్వడం జరిగింది. పాత సభ్యులు చాలామంది తమ సభ్యత్వానికి తిలోదకాలిచ్చారు. మరికొందరు వామ పక్షాల్లోను, ముస్లింలు ముస్లింలీగులోను చేరడం తటస్థించింది.

ముస్లిం లీగు ఎంతోకాలం ఈ పార్టీకి ఛాయలాగ ఉండింది. ఇందులో ప్రధాన అంశం, అందులో జీవిత అధ్యక్షుడైన మహమ్మదాలి జిన్నా. ఇప్పు డది కాంగ్రెస్ పట్లగల వ్యతిరేకతను పూర్తిగా ఉపయోగించుకొంది. ప్రధా నంగా కాంగ్రెస్ అనుసరించిన మత ధోరణి, అంతకంటే కూడా ముఖ్య మైనది జమీందారీ పద్ధతి రద్దు విధానం. కొన్ని రాష్ట్రాల్లో ముస్లిం మధ్య తర గతి వర్గం జీవనోపాధికి జమీందార్లపై ఆధారపడ్డంతో ఈ అవకాశమేర్ప డింది. అతి త్వరితంగా పటిష్ఠమైన వ్యవస్థీకృత రాజకీయ పక్షంగా ముస్లిం

లీగు రూపొందింది. బ్రిటీష్ ప్రభుత్వం మద్దతుతోను, ఇతర ప్రతిఘాతక శక్తుల బలంతోను పుంజుకొంది. ప్రత్యేకమవ్వాలనే ధోరణి దృఢంగా నాటుకొంది. చివరకు అది పాకిస్తాన్‌గా మారడానికి అంకురార్పణ జరిగింది. అంటే ముస్లిం మెజారిటీ ఉన్న రాష్ట్రాలు మొత్తం ఒక ప్రత్యేక స్వతంత్ర రాజ్యంగా ఏర్పడ్డాయన్న మాట. ఇది సుదీర్ఘ కాలంగా కొనసాగుతున్న సాంస్కృతిక వేర్పాటువాద ఫలితమే రాజకీయ పరిణామం చెంది పాకిస్తాన్‌గా రూపొందిందని మనం తెలుసుకోగలం. ఇది తాత్కాలికంగా, స్వాతంత్ర్యోద్యమ విజృంభణ మూలంగా కొంతకాలం మరుగునపడి, అవకాశం తలెత్తేసరికి ఒక రూపాన్ని తీర్చిదిద్దుకొంది.

1939వ సంవత్సరంలో, కాంగ్రెసు పక్షం వారి రాష్ట్ర ప్రభుత్వాలు, ద్వితీయ ప్రపంచ సంగ్రామాన్ని, ఏ విధమైన దృక్పథంతో ఎదుర్కోవాలన్న సమస్య ఎదురైంది. కాంగ్రెస్ మొత్తం ఫాసిజాన్ని ఖండించింది. బ్రిటీష్ ప్రభుత్వంతో యుద్ధ ప్రయత్నాల్లో సహకరించాలా, వద్దా లేక అవసరమైన నిబంధనలేమిటి అనే విషయంలో కాంగ్రెస్ సభ్యుల మధ్య భేదాభిప్రాయాలు పొడసూపాయి. మహాత్మాగాంధీ అభిప్రాయం ప్రకారం బ్రిటన్‌కు, దాని మిత్రులకు పూర్తి సహకారాన్ని అందించాలి. కేవలం నైతిక బలాన్ని మాత్రమే అందించాలి. తాత్కాలికంగా తమ డిమాండ్లను ఆపివెయ్యాలి. అహింసా సిద్ధాంతానికి విరుద్ధంగా ఏ పరిస్థితిలోను యుద్ధ ప్రయత్నంలో వీరు పాల్గొనరాదు. కొందరు కాంగ్రెస్‌వాదులు ఈ అవకాశాన్ని జార విడవక, డిమాండ్ల కోసం వత్తిడి చేసి నైతిక సహాయమే కాక, సంపూర్ణ ఆచరణాత్మక సహాయం అందించాలన్నారు. ఎందుకంటే, కాంగ్రెస్ అహింసా విధానాన్ని దేశంలోని అంతర్గత రాజకీయ పోరాటానికి మాత్రమే పరిమితం చేసింది. అంతేకాక, దానికి విదేశీ దురాక్రమణలు సంభవిస్తే ఎదిరించడానికి ఒక విభాగంగా అధిక సంఖ్యాకులను నిర్ణయించలేదు. ఈ ఉభయ దృక్పథాల మధ్య ఊగిసలాట బయలుదేరింది.

ఈ క్లిష్ట పరిస్థితిని ఎదుర్కోవటానికి, కాంగ్రెస్ మంత్రి మండలులు అన్ని రాష్ట్రాల్లో రాజీనామా ఇచ్చాయి. కాంగ్రెస్ పక్షం మాత్రం, ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టడానికి, లేదా యుద్ధ సన్నాహంలో పాల్గొనటానికీ ఏ విధమైన శ్రద్ధాసక్తులను చూపలేదు. కాని తరువాత గాంధీ మహాత్ముని సలహాను పెడచెవిని పెట్టి, కాంగ్రెస్ తాత్కాలిక జాతీయ ప్రభుత్వ స్థాపనకు తోడు,

యుద్ధానంతరం సంపూర్ణ స్వరాజ్యం ఇవ్వడానికి వాగ్దానం చేస్తేనే, యుద్ధంలో సహకరిస్తామని చెప్పింది. ఈ అభ్యర్థనను ప్రభుత్వం లక్ష్య పెట్టలేదు. యుద్ధ కాలంలో, ప్రజల హక్కులను అణచినందుకు నిరసనగా గాంధీజీ వ్యక్తిగత సత్యాగ్రహానికి పూనుకొన్నాడు.

1942వ సంవత్సరం ఆరంభంలో జపాన్, బర్మాను, మలయాను ఆక్రమించి, భారతదేశంపై దండయాత్ర సాగించడానికి బెదిరించినప్పుడు, రూజ్ వెల్ట్ సలహా మేరకు, బ్రిటీష్ ప్రభుత్వం సర్‌స్టాఫర్డ్ క్రిప్స్‌ను సంప్రదింపుల కోసం భారతదేశానికి పంపింది. ఇతడు భారతదేశానికి రావటానికి కారణం కేంద్ర ప్రభుత్వంలోని శాఖలనన్నింటిని వివిధ రాజకీయ పక్షాలకు ప్రాతినిధ్యం వహించే మంత్రులకు బదిలీ చెయ్యాలన్న భావనతోనే. రక్షణ శాఖను బదిలీ చెయ్యాలనుకోలేదు. యుద్ధం తర్వాత అధినివేశ ప్రతిపత్తి ఇస్తామని వాగ్దానం చేయటం జరిగింది. ఇది కాంగ్రెస్‌కు, ముస్లీం లీగ్‌కు కొంత వరకు నచ్చింది. గాంధీజీ పూర్తిగా తిరస్కరించినందువల్ల అందరూ దీన్ని తిరస్కరించారు.

మహాత్మాగాంధీ, బ్రిటీష్ ప్రభుత్వం భారతదేశాన్ని, జపాన్‌దేశ దాడి నుంచి రక్షించలేదని భావించాడు. బ్రిటీష్ ప్రభుత్వం తిరోగమిస్తే, జపాన్ దేశం దానంతట అదే దండయాత్రను విరమిస్తుందని ఆయన భావించాడు. ఒకవేళ వాళ్లు దండెత్తినట్లైతే, స్వాతంత్ర్యోద్యమ ఉత్సాహంతో ప్రజ్వరిల్లే భారతీయులు ఎదుర్కోడమే కాక వారితో సహకరించరు కూడా.

ఆయన కాంగ్రెసును ఒక తీర్మానాన్ని చేయమని కోరాడు (అగస్టు 1942). బ్రిటీష్ ప్రభుత్వం 'భారతదేశాన్నుంచి తొలగి పోవాలని.' అట్లేవాళ్లు పోనట్లైతే దేశమంతా శాసనోల్లంఘనాన్ని ప్రారంభిస్తామన్నాడు. మహాత్మాగాంధీ వైస్రాయిని కలిసి చర్చ జరపకముందే, గాంధీజీ, ప్రముఖ కాంగ్రెస్ నాయకులంతా జైళ్ల పాలయ్యారు. బాధ్యతాయుత నాయకుల మార్గదర్శకత్వాన్ని కోల్పోయి, దేశభక్తులు, నిజాయితీపరులైన యువత ఊగిపొయ్యారు. అనుభవశూన్యులైన వామపక్ష నాయకత్వంలో, దేశమంతా అట్టుడికినట్లైంది. భయకంపితులైన ప్రజల ఆందోళనలను, ఇంకా భయానక పద్ధతుల్లో ప్రభుత్వం అణచివేసింది. భారతదేశం అంతా స్మశానశాంతితో మునిగిపోయింది.

రెండో ప్రపంచయుద్ధం ముగిసిన తర్వాత, లేబర్ ప్రభుత్వం పాలనకు వచ్చింది. వారి నాయకత్వంలో బ్రిటీష్ ప్రభుత్వం ఉదారత్వంతోను, రాజ

కీయ ధురందరత్వంతోను, భారతీయుల సమస్యకొక న్యాయపరమైన, హేతు బద్ధమైన పరిష్కార మార్గాన్ని ఏర్పర్చడానికి చిత్తశుద్ధితో ప్రయత్నించింది. అధికారాన్ని బదిలీ చేయడానికి, ముఖ్యమైన రాజకీయ పక్షాలతో ఒప్పందం చేసుకోడానికి కాబినెట్ కమిటీని పంపింది. అందులో సెక్రటరీ ఆఫ్ స్టేటు లార్డ్‌పెతిక్ లారెన్స్, సర్‌స్టాఫర్డ్ క్రిప్సు, అలెగ్జాండర్ ఉన్నారు. వాళ్లు భారతదేశానికి రాగానే కనుగొన్న ఒకే ఒక అడ్డంకి ప్రత్యేక దేశం కోసం ముస్లీం లీగు చేస్తున్న డిమాండు. దాన్ని ఐక్య స్వాతంత్ర్య భారతదేశాన్ని కాంక్షించే కాంగ్రెసు కోరికను బ్రిటీష్ ప్రభుత్వం ఏ రకంగా సమన్వయించుకొంటుందనే అంశం. వారొక రాజీ ప్రతిపాదన చేశారు. వివిధ రాష్ట్రాలకు చెందిన అధిక సంఖ్యాకులైన ముస్లీంలు, హిందువులు స్వతంత్ర సముదాయాలుగా ఏర్పడి ఒక పటిష్టం కాని సమాఖ్యగా ఏర్పడాలనీ అప్పుడు వెంటనే బ్రిటీష్ ప్రభుత్వం స్వయం ప్రతిపత్తిని ఇవ్వడానికి సిద్ధంగా ఉందని తెలియజేశారు. ఆ ప్రతిపాదనను అందరూ సక్రమంగానే ఆహ్వానించారు. కాని గడచిన పది సంవత్సరాలలో బ్రిటీష్ ప్రభుత్వం పోషించిన వేర్పాటువాదం, ద్వేషభావంతో హిందూ-ముస్లీంల మధ్య రక్తపాతమైన మత కలహాలను రేకెత్తించి అపనమ్మకాన్ని పుట్టించాయి. అందువల్ల వివేకంతో కూడిన ఆలోచన లోపించింది. దేశంలో పలుప్రాంతాలలో జరిగిన హింసాకాండ, ఘర్షణల మధ్య శాంతిని నెలకొల్పే ప్రయత్నంలో జరిపిన రాయభారం విఫలమైంది. పరిస్థితులు తారాస్థాయికి చేరుకున్నందువల్ల బ్రిటిష్ ప్రభుత్వం శాంతిని నెలకొల్పేందుకు వారు యిచ్చట యింకా ఉండవలసి వచ్చిందని తెలివైన సాకును చెప్పింది. ఇంతకన్నా విషమ పరిణామం ఏమిటంటే, భారతదేశాన్ని రెండు భాగాలుగా విభజించటం - ఒకటి, పాకిస్థాన్ అనే పేరుతో పశ్చిమ పంజాబు వాయవ్య సరిహద్దు రాష్ట్రం, బెలూచిస్థాన్, సింధు, తూర్పు బెంగాలు రాష్ట్రాలుగాను, మిగిలిన దేశమంతా రెండవ భాగంగాను ఏర్పడ్డాయి. రెండు దేశాలైన భారతదేశం, పాకిస్తాన్‌లకు అధినివేశ ప్రతిపత్తి 1947 సం॥రం ఆగస్టు 14, 15 తేదీలలో క్రమంగా సంక్రమించింది. భారతదేశం కలలుకన్న స్వరాజ్యం ఎట్టకేలకు ఈ విధంగా సిద్ధించింది. సజీవంగా విశృంఖలాల నుంచి వచ్చిందే కాని శరీరావయవాలు కొన్నింటిని వదలుకోవాల్సి వచ్చింది. రాజ్యాంగ సభ **1949వ సంవత్సరంలోని చివరి భాగంలో రాజ్యాంగ శాసనాన్ని ఆమోదించింది. ఆ శాసనాన్ని 1950 జనవరి 26వ తేదీన అమలు పరచడం జరిగింది.**

భారతదేశం సర్వ స్వాతంత్ర్య, ప్రజాతంత్ర, గణతంత్ర రాజ్యంగా రూపొందింది. అయినప్పటికి బ్రిటన్‌తో కామన్‌వెల్త్ మూలంగా లాంఛనప్రాయం కాని సంబంధాన్ని నిలుపుకుంటూనే వుంది.

## II

భారత స్వాతంత్ర్య సమరంలో చిట్టచివరన ఒక క్లుప్తమైన పరిశీలన జరపాల్సి ఉంది అత్యధిక సంఖ్యాకులైన సమాజానికి అధిక సంఖ్యాకులైన అల్పసంఖ్యాక వర్గానికి మధ్య ఏర్పడ్డ విభేదాలను మూడు దశలుగా పేర్కొనవచ్చు మొదటి దశ 1918 నుంచి 1928 వరకు. ఈ కాలంలో సంపూర్ణమైన రాజకీయ ఐక్యత ఉండింది రెండవ దశలో 1928 నుంచి 1937 వరకు అలజడి పెరగడం. మూడవ దశలో కాంగ్రెస్ ఏడు రాష్ట్రాల్లో అధికారం చేపట్టడం, ముస్లింలీగ్‌తో తీవ్రమైన శతృత్వం ఏర్పడ్డం. ఇది ముఖ్యంగా లీగ్ ప్రతినిధిత్వం వహించే అధిక సంఖ్యాకులైన ఉన్నత, మధ్య తరగతికి చెందిన ముస్లింల లాగా తలెత్తడం దీనితో జాతీయ కాంగ్రెస్‌ను ఒక హైందవ సంస్థ వ్యవస్థగా ముద్ర వేయడం జరిగింది. కాని ఇది సమర్థించదగనిది కాదు.

మనం ఇంతకు ముందే ముస్లిం లీగ్‌కు కాంగ్రెస్‌కు మధ్య ఏర్పడ్డ వివాదాన్ని భూభాగాలకు సంబంధించినదిగా పేర్కొన్నాం అనేక రాష్ట్రాల్లో ఉన్నత, మధ్య తరగతి ముస్లింల ప్రయోజనాలను దెబ్బతీసిందన్న విషయం గమనించాం. లీగ్‌లో సభ్యులుగా ఉన్న పేద వర్గాల ఆర్థిక ప్రయోజనాలు కూడ ఈ వేర్పాటు విధానం వల్ల దెబ్బతిన్నాయి. వీటిని కేవలం ఆర్థిక సిద్ధాంత మూలంగా వివరించడం కష్టం. మత ద్వేషం రగులుకుంటుందన్న విషయానికి సందేహం లేదు కాని మధ్య ప్రాచ్య ప్రపంచంలోని ముస్లిం దేశస్థులతో పోల్చి చూస్తే, ముస్లిమేతరులతో నివసించడానికి మత విద్వేషం ఒక కారణం కాజాలదు.

హిందూ ముస్లింలలో సామరస్యం లేకపోవడమే భారతదేశ విచ్ఛిన్నకర విభజనకు కారణమయింది. హిందూ ముస్లిం జాతుల సంస్కరణ ఉద్యమాల్లోని సాంస్కృతిక విభజన ధోరణులు వేళ్ళు పాతుకుని పోయాయి. ఈ ఉద్యమాలు మొగలు సామ్రాజ్య పతన కాలంలో ప్రారంభమైనాయి. ఆనాటి రాజకీయ అస్థిరతల మూలంగానే ప్రజలను నైతిక పతనం నుంచి కాపాడలేక పోవడం జరిగింది. ఆ తరువాత పర్యవసానంగా భారతదేశానికి వ్యాపారం

పేరుతో వచ్చిన వ్యాపారస్థుల సాహస కార్యక్రమాల వల్ల పశ్చిమ దేశాల సంస్కృతి త్వరితగతిలో అభివృద్ధి చెందింది. 19వ శతాబ్ది ఉత్తరార్థంలో ఆంగ్లేయ వలస పాలనా విధానం హిందువుల్లోనూ ముస్లింలలోను భయాన్ని రేకెత్తించింది. వీరిలో కొందరు ప్రత్యేకంగా ముస్లిం మతాచార్యులు తమ నైతిక, ఆధ్యాత్మిక ప్రతిఘటనా శక్తులతో ఆంగ్ల సంస్కృతి ఆధిపత్యాన్ని ఎదుర్కొన్నారు. వారి మతపరమైన సాంస్కృతిక చైతన్యాన్ని వెనక్కు వెళ్ళి చూచి వాటి నుంచి నూతనమైన స్ఫూహను, వేగాన్ని పుంజుకున్నారు. ఇందులో వారు విజయాన్ని సాధించారు. కాని ఆ విధంగా సింహావలోకనం చేసుకో వడం మంచి ఫలితాన్ని యివ్వలేదు. వాళ్ళ దృష్టిలో విలువైన వారసత్వం హిందూస్థానీ సంస్కృతికి సంబంధించి నశించిపోయిందని తెలుసుకున్నారు. కాలానుగుణంగా హిందూ, ముస్లిం ప్రజల సమ్మిశ్రితంతో ఏర్పడ్డ సామాన్య సంస్కృతిని మొగలుల కాలంలోనే కొద్ది మంది హిందువులు, ముస్లిములు తమ స్వంతం కాదని నిరాకరించారు. ఈ సంస్కరణల పునరుజ్జీవనం గురించి సంక్షిప్తంగా పరిశీలించాల్సి వుంది. ప్రస్తుత భారతదేశంలోని సాంస్కృతిక పరిస్థితిని అవగాహన చేసుకోవాలంటే ఈ పరిశీలన ఎంతో తోడ్పడుతుంది.

ముస్లింలు భారతదేశం వచ్చే నాటికి వారి సాధారణ సాంస్కృతిక మత జీవన విధానం ఇస్లాం మతం ఏర్పడ్డ తరువాత ఎంతో మార్పు చెందిం దని మనం యింతకు ముందే గమనించాం. ఈ మార్పుకు కారణం ముస్లిం ఆధ్యాత్మిక వాదులు ఆస్థానాలకు పరిమితమై, ఎన్నో కుతర్కాలను చేసి ధనాన్ని, అధికారాన్ని పొందాలని తాపత్రయం పడినందువల్ల వినాశ హేతు వైందని భావించవచ్చు. వీళ్ళు పూర్తిగా మతాచార్యులుగాను ఆధ్యాత్మిక మార్గదర్శకులుగాను తమ విధిని విస్మరించడం వల్ల ఈ విధంగా జరిగిందని చెప్పాలి.

ముస్లిం సమాజంలో, 17వ శతాబ్దంలో యిద్దరు ముస్లిం ఆధ్యాత్మికవా దులు, ఆస్థాన ప్రభావానికి లోనుగాక, మతపరమైన నైతిక చైతన్యాన్ని పున రుద్ధరించడానికి ప్రథమ ప్రయత్నం చేశారు. మౌలానా షేక్ అహమ్మద్ సర్ హింద్ (1564-1624) ముస్లిం మార్మికతను మార్చడానికి ప్రయత్నించాడు. అద్వైత వాదం నుంచి మార్చాలని ప్రయత్నించాడు. ఇది పూర్తిగా నిష్క్రి యకు, సోమరితనానికి దారితీసింది. అట్లే సాంప్రదాయ వ్యతిరేకమైన నమ్మ కాలకు ఛాందసత్వానికి కూడా దారితీసిందని చెప్పాలి. సామాన్య ప్రజానీ

కాన్ని ప్రేరేపించాడు. రాజాస్థానాలలోని ప్రభువులు మితవ్యయంతో స్వచ్ఛంద జీవితాన్ని గడపాలని, ఇస్లామిక్ 'షారియా'ననుసరించి జీవితాన్ని గడపాలని భావించాడు. ఈయన జహంగీరు ప్రభువు ముందు సాష్టాంగ పడాలనే ప్రభుత్వ శాసనంను ధిక్కరించి తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించాడు. అందుకు అతను జైలు పాలు కావడం తప్పలేదు. మౌలానా షా అబ్దుల్ హక్ (1551-1642) ఢిల్లీకి సంబంధించిన వాడు. యితడు మహమ్మద్ ప్రవక్తకు సంబంధించిన సాంప్రదాయాలకు ప్రజామోదం కలిగించాలని ఇస్లాం మత బోధనలను చేశాడు. భారతీయ ముస్లింలందరికీ ఈ బోధనలను అందించాడు.

సున్నీ ముస్లింలకు సంబంధించి మత సంస్కరణ ఉద్యమాలకు అత్యున్నతమైన విజ్ఞానాన్ని అందించిన వారు షా వల్యుల్లా, అతని కుటుంబం. షా వల్యుల్లా ఖురానును పర్షియన్ భాషలోకి తర్జుమా చేశాడు. ఖురాన్ అధ్యయనాలకు సంబంధించిన అనేక గ్రంథాలను రచించాడు. ఈ విధంగా ముస్లింలకు ఇస్లాంకు మౌలికమైన నాయకుడైనాడు. ఆయన సారస్వత గ్రంథాలను ప్రసిద్ధికెక్కిన ఆయన కొడుకులు పూర్తి చేశారు. ముఖ్యంగా షా అబ్దు అజీజ్. తర్వాత అజీజ్ ప్రముఖ శిష్యుడు మౌలానా సయ్యద్ అహమ్మద్, బెరేలికి సంబంధించినవాడు, అల్లుడు మౌలానా అబ్దుల్ హై, అన్న కొడుకు మౌల్వీ మహమ్మద్ ఇస్మాయేల్ ఆయన సంస్కరణలను ఆచరణలోకి తెచ్చారు. తీవ్ర సంస్కరణవాదులైన ఈ ముగ్గురు సిక్కు పాలననుంచి, ఐచ్ఛిక సాయుధ సైన్యంతో పశ్చిమ పంజాబ్‌ను, వాయవ్య రాష్ట్ర ప్రాంతాన్ని వశంచేసుకున్నారు (1815). వారి ఉద్దేశం ఆక్రమించిన ప్రాంతాన్ని ఒక నమూనా ఇస్లాం రాజ్యంగా రూపొందించటమే. కాని, పఠానులతో భేదాభిప్రాయాలు, సంస్కర్తల పట్టుదలను బలహీనపరచింది. కొన్ని సంవత్సరాల తర్వాత వారు సిక్కుల చేతుల్లో బాలకోట వద్ద పరాజయం పొందారు. మౌలానా సయ్యద్ అహమ్మద్, మౌల్వీ మహమ్మద్, రణభూమిలో స్వర్గస్థులైనందున 'ఇస్లాం రాజ్యం' అస్తమించింది.

షా వల్యుల్లా, అతని పుత్రులు ప్రారంభించిన స్వచ్ఛమైన సామాజిక, మత సంస్కరణోద్యమాలు గొప్ప విజయాన్ని సాధించాయి. ముస్లింలలో ఒక విభాగం, తమ మూఢ విశ్వాసాలకు, ఆడంబర జీవితం, అలవాట్లకు స్వస్తిచెప్పి, ప్రాచీన ఇస్లాం మతస్థుల్లా పవిత్రమైన జీవితాలను సాగించారు.

1857 తర్వాత అభివృద్ధి చెందుతున్న పాశ్చాత్య సంస్కృతి ప్రభావం

వల్ల ఛాందస మతంకు కలిగిన అపాయ సూచన మూలంగా స్వచ్ఛమైన ఉద్యమం తీవ్రరూపం ధ్యాల్చింది. 1868లో స్థాపించబడిన దియోబంద్ సెమినరీలో చదువుకున్న మతదృష్టి గల ముస్లిం యువత, ఆంగ్లేయ సంస్కృతి పట్ల శతృత్వాన్ని పెంచుకున్నారు. నౌనౌటాకు చెందిన మౌలానా మహమ్మద్ ఖాసీమ్, మరికొందరు, షా వల్యుల్లా మత శాఖకు చెందిన మత గురువులు విద్యకు, స్వతంత్రతకు కేంద్రంగా దియోబంద్ విఖ్యాతిని శాశ్వతం చేశారు. దియోబంద్ ప్రారంభం నుంచి రాజకీయ స్వాతంత్ర్యం, ఆ ఉపాధ్యాయుల, విద్యార్థుల మనస్సులపై గాఢంగా పనిచేశాయి. మౌలానా మహమ్మద్ ఉల్ హసన్ గతిశీల వ్యక్తిత్వం మూలంగా వారిలో ఒక ప్రగాఢమైన వాంఛను కల్గించింది. బ్రిటీష్ ప్రభుత్వం ఇతడిని జైలుకు పంపి, అనేక సంవత్సరాలు మాల్టాలో రాజకీయ ఖైదీగా ఉంచింది. ఇంకో స్వాతంత్ర్యోద్యమ నాయకుడు మౌలాని షిబ్లీ. మౌలానా అబ్దుల్ కలామ్ అజాద్ నాయకత్వంలో ముస్లిం మత వర్గానికి నిర్దిష్టమైన రూపం, నిర్దేశం లభించింది. వాళ్ల భావాల్లో పూర్తి స్పష్టతలేదు. ఈయన జాతీయ కాంగ్రెసుతో ఒడంబడిక చేసుకున్నాడు. మత కల్లోల వాతావరణం నుంచి కొంత మార్పు కలిగింది. ఆనాటి దాడులను తట్టుకొని నిలవ గలిగింది.

దియోబంద్ పుట్టుక తర్వాత, కొంత కాలానికి ఇంకో ముస్లిం ప్రముఖ సంస్కర్త సర్ సయ్యద్ అహమ్మద్ ఖాన్ ఆధునిక పాశ్చాత్య విద్యకోసం అలిఘర్ కళాశాలను స్థాపించాడు. ఈ రెండు సంస్థలు ముస్లీం సమాజాన్ని సంస్కరించాలని ఉద్దేశించబడినాయి. వాళ్ళ సంస్కరణోద్దేశం వేరు. దియోబంద్ అస్పష్టమైన ప్రాచీన ఇస్లాం మతాన్ని పునరుద్ధరించాలని ప్రయత్నిస్తే, అలిఘర్ ఒక నిర్ధిష్టమైన, వాస్తవికమైన, ప్రస్తుత భౌతిక పరిస్థితుల కనుగుణ్యమైన సంస్థగా రూపొందింది.

ఆలీఘర్‌ను గూర్చి మాట్లాడుతున్నామంటే, సయ్యద్ అహ్మద్‌ఖాన్ అతని సహచరులైన, నిష్కల్మషులైన, స్వార్థరహితులైన సంస్కర్తలను గూర్చి ప్రస్తావించాలి. అట్లే ఆనాటి అధిక భాగమైన ఉన్నత, మధ్య తరగతి వర్గానికి చెందిన ముస్లింలను పేర్కొనాలి. ఎందుకంటే ఈ సంస్కరణ వాళ్లకు సంబంధించిందే. సయ్యద్ అహ్మద్ ఖాన్ వ్యక్తిగతంగా అత్యున్నత భావాలు కల విద్యలో శక్తి గల సంస్కర్త, రాజనీతి విశారదుడు. అతని ఆదర్శం విస్తృతమైంది, ఉన్నతమైంది కూడా. భారతీయ మనస్సులను, మధ్య యుగంనాటి

మూఢత్వం నుంచి మరల్చడానికి పాశ్చాత్య విద్య మూలంగా ఆధునిక యుగంలోని 'నూతన వెలుగు'ను పాశ్చాత్య, హిందూస్థాన సంస్కృతుల్లోని ఉత్తమోత్తమ అంశాలను సమన్వయం చేసి, ఒక కొత్త సంస్కృతిని నిర్మించ ఆశించాడు. రాజకీయ స్థాయిలో ఈ విధానం భారతీయుల జాతీయ ఆత్మ గౌరవాన్ని మన్నించే ప్రభుత్వంతో మాత్రమే సహకరిస్తుంది.

ఇతడు ఘాజీపూర్‌లో స్థాపించిన ఆంగ్ల పాఠశాల (1864), పర్షియన్ పాఠశాల, మొరాద్‌బాద్ (1869) శాస్త్రీయ సంఘం (1863) హిందూ, ముస్లీంల సంపూర్ణ సహకారంతో ఉభయుల కోసం ఈ సంస్థలను స్థాపించారు. కాని, బెనారస్‌లో హిందు జన సామాన్యం హిందు మత పునరుద్ధరణ భావంతో ఉన్నారని, అస్ఖలితమైన హైందవ సంస్కృతి కోసం, హిందూస్థానీ సంస్కృతికి వదిలి వేశారనే విషయం స్పష్టమైంది. ఈ ధోరణికి చిహ్నంగా బెనారస్‌లో 1867లో ఒక ఉద్యమం బయలుదేరింది. ప్రభుత్వ కార్యాలయాల్లోనూ, న్యాయ స్థానాల్లోను ఉర్దూ భాషను తొలగించి, దేవనాగరి లిపిలో హిందీని సాంప్రదాయబద్ధంగా అమలుచేయడానికి నిర్ణయించారు. దీన్ని ఆపడానికి, సయ్యద్ అహమ్మద్ తన హైందవ మిత్రులతో వాదించాడు. కాని ఫలితం లేకపోయింది. అంతట, సాంస్కృతిక రంగంలో హైందవులకు, ముస్లీంలకు సహకారం సాధ్యం కాదన్న తీర్మానానికి రావడం జరిగింది. సంస్కరణ కార్యక్రమాలను ముస్లీంలకే పరిమితం చేశాడు. ప్రభుత్వ సహాయాన్ని, రక్షణను కోరాడు.

బాల్కన్ ద్వీపకల్పంలోను, త్రిపోలీలోను జరిగిన యుద్ధాల్లో, ముస్లీం ఖిలాఫత్ కేంద్రమైన టర్కీ జోక్యం చేసుకొంది. బ్రిటీష్‌వారికి వ్యతిరేకమైన ధోరణి ఏర్పడింది. ఆలీఘర్ కళాశాల విద్యార్థుల్లో ఎక్కువ మందిలో ఈ వ్యతిరేకత కట్టలు తెంచుకొని ముందుకు వచ్చింది. దీన్ని అరికట్టడానికి కళాశాల అధికారులు ఎన్ని చర్యలు తీసుకున్నా వాళ్ళలో ఆ భావం రోజు రోజుకు ప్రబలమైంది.

హసరత్ మొహనీని యిక్కడ వ్యక్తిగత ఉదాహరణగా పేర్కోవచ్చు. ఇక్బాల్ కవిత కలిగించిన ఉత్సాహం, మౌలానా మహమ్మద్ బహిరంగంగా కలిగించిన ప్రోద్బలం మూలంగా ప్రజల్లో రాజకీయంగా కనువిప్పు కలిగింది. ముస్లీంల్లో ఆధునిక విద్యావంతుల వర్గం ఏర్పడింది. దీని వెనుక మత చింతనగల మౌలానా మహమ్మద్-ఉల్-హసన్, మౌలానా షిబ్లీ, మౌలానా

అబుల్ కలామ్ అజాద్‌లు కూడా ఉన్నారు. ప్రభుత్వం, ఈ అభివృద్ధికి ఆందోళన చెంది, దాన్ని ఎదుర్కోవడానికి ముస్లిం అభిమాన సంఘమును ప్రోత్సహించడం, అది ముస్లింలీగ్ అనే పేరుతో రాజకీయ పక్షంగా ఏర్పర్చడం జరిగింది. విద్యాధికులైన జాతీయవాదులకు, ప్రభుత్వ విధేయులకు మధ్య ఘర్షణగా ఏర్పడింది. ముస్లిం లీగుకు నాయకుడు ఆ రోజుల్లో, తీవ్ర జాతీయ నాయకుడైన జిన్నా, 1916లో అధ్యక్షుడై జాతీయ కాంగ్రెసుతో అవగాహనకు వచ్చాడు. తర్వాత మహాత్మాగాంధీ నేతృత్వంలో చేపట్టిన కార్యక్రమం తీవ్రతరమైనందు వల్ల, మౌలానా మహమ్మద్ అలీ జాతీయతా వాదులైన ముస్లింలను, 'ఖిలాఫత్ కమిటీ'లో చేర్చారు. దీని స్థాపన టర్కీ ఖిలాఫత్‌కు, పవిత్ర మత స్థానాలైన మక్కా, మదీనా పట్టణాలను పునరుద్ధరించడానికి ఆందోళన జరపడం కోసం మహమ్మద్ అలీ జామియా మిలియా అనే విద్యా సంస్థను స్థాపించాడు. అందులో జాతీయవాదులైన విద్యార్థులు, ఉపాధ్యాయులకు అవకాశం కల్పించాడు. వాళ్ళు చాలామంది అలీఘర్ కళాశాల నుంచి తీసివేయ బడిన వారే 'ఖిలాఫత్ కమిటీ' ఆధ్వర్యంలో సాంప్రదాయ బద్ధులైన దియోబంద్ గ్రూప్‌ను, ఆంగ్ల విద్యనభ్యసించిన అలీఘర్ సముదాయాన్ని ఒక తాటికిందకి తెచ్చాడు. వారి మధ్య సమన్వయ భావాన్ని కలిగించి, అనేక జాతుల, వర్గాలచే ఆకర్షింపబడ్డ స్వాతంత్ర్య సమరయోధులతో చేతులు కలిపింపజేసి జాతీయ కాంగ్రెస్ ప్లాట్‌ఫారంపైన నిలవడానికి దోహదం చేశాడు.

సాంప్రదాయిక, ఆధునిక విద్య గడించిన ముస్లిం వర్గం వారి మధ్య ఐక్యత ఫలించింది. రెండు వర్గాల మధ్య ఉత్సాహం ఏర్పడింది. సాంప్రదాయ ముస్లిం వర్గం వారి అవసరాలు, సమస్యలను కాలానుగుణ్యంగా అర్థం చేసుకోవడం, వ్యవస్థీకరణ శిల్పాన్ని నేర్చుకొన్నారు. రెండో వర్గం వారు మత చైతన్యస్ఫూర్తిని పొంది, ముస్లిం ప్రజలతో సంబంధాన్ని ఏర్పరచుకొన్నారు. ముస్లింలు ఐక్యభావనకు, కార్యాచరణకు సమర్థతను పెంచుకొని, 1920-22 సం||రాల మధ్యకాలంలో స్వాతంత్ర్య పోరాటంలో ముఖ్య భూమికను వహించారు. ప్రపంచంలోనున్న ముస్లింలు అందరూ ఎదుర్కొంటున్న సమస్యవైపు దృష్టిని మళ్ళించడానికి అవకాశం ఏర్పడింది. ఆ సమస్య ఏమిటంటే ఆధునిక యుగ అవసరాలకు, పరిస్థితులకు అనుగుణ్యంగా మత, సాంస్కృతిక జీవితాన్ని మలచుకోవడమే. కాని దురదృష్టవ

శాత్తు వీరిరువురి మధ్య కలయిక ఎక్కువ కాలం మనలేదు.

టర్కీ దేశస్థులు ఖిలాఫత్ వ్యవస్థను రద్దు చేయ నిర్ణయించడం మూలంగా ఖిలాఫత్ ఆధారంతో ముస్లిం జాతిపై తమ ప్రభావాన్ని వ్యాపింపజేసిన ఖిలాఫత్ ఉద్యమం హఠాత్తుగా నీరుగారిపోయింది. దీనిమూలంగా వారి మనో ధైర్యం దెబ్బతింది రెండు విభాగాల మధ్య వెనుకటిలాగానే అగాధమేర్ప డింది. ఒకరినొకరు ఓర్చుకోలేక పోయారు. ఒక్కొక్క విభాగం మరల చీటలు వారింది. ఛాందసులైన ముస్లింలు హైజాక్‌లో దైవిక సంబంధం గల వ్యక్తుల సమాధులపై నిర్మించిన మసీదులను నిర్మూలించడానికి, రాజైన ఇబ్నిసౌద్ విధానాన్ని బలపరచటమా? లేదా ఎదిరించడమా? అనే అంశంపై అంత ర్యుద్ధం సాగించారు కాంగ్రెస్, ముస్లింల మధ్య సంబంధాలను గురించి ఆధునిక విద్యావంతులైన ముస్లింలు వారిలో వారు పోరాటం సాగించారు. స్వాంతంత్ర్యోద్యమంలో ఇష్టంలేని వారు, ఖిలాఫత్ ఉద్యమానికి మద్దతు ఇస్తున్న కారణంగా కాంగ్రెస్‌ను బలపరచారు. ఇప్పుడు వీరికి కాంగ్రెస్ వాతా వరణం అనుకూలంగా లేదు. వీరిని అభిమాన సంఘం ఆకర్షించింది గెలుచు కొంది

ఈ చీలిపోయినవారు కాంగ్రెస్‌లో తర్ఫీదు పొంది తమ ప్రభావాన్ని ప్రజలపై చూపగలిగారు. అదే విధంగా ఖిలాఫత్‌లో కూడా అనుభవాన్ని గడించారు. వీరు అభిమాన సంఘాన్ని ముఖతలంగా పెట్టుకొన్నారు. విధే యులైన సముదాయం ఏర్పరచిన భవనాలను ఉపయోగించుకొన్నారు అల్లే అభిమాన సంఘం మొదట ముస్లిం సభలో, తర్వాత ముస్లిం లీగ్‌తో కలి సింది. వీరు ముస్లింలను కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా రెచ్చగొట్టారు. బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకం చెయ్యడానికి ఐక్యదళంగా ఉన్న హిందువులను, ముస్లింలన్ను విడగొట్టారు.

భారతదేశంలో ఒకేసారి వచ్చిన మతోన్మాద అలజడుల్లో ముస్లింలు. కాంగ్రెస్ వ్యతిరేకులైన హిందువులు ఉన్నారా? లేక వారిని పోలీసులే ప్రోత్స హించారా? లేక వాళ్ళు ప్రభుత్వానికి రహస్య ప్రతినిధులా? కాని కొంత మంది రాజకీయ నాయకులు వారిని సిద్ధాంతాలకు కట్టుబడనీయక తమ మత సంబంధమైన వ్యవస్థలను పటిష్టం చేసుకోవడానికి వినియోగించుకు న్నారు. అయినప్పటికీ వీరు ప్రజలను జాలువాద పార్టీల్లోకి ఆకర్షించక పోయి నమా హిందువులను, ముస్లింలను వేరు చేయడంలో విజయం సాధించారు.

ముస్లీం మతవాదులు మతం పేరుతో ప్రజలకు పిలుపునిచ్చారు. కాని దాని నుంచి మంచి ఫలితం సాధించలేక పోయారు. ఎందువలనంటే అధిక సంఖ్యాకులైన ఛాందసులు, మత ప్రభావం కల విద్యావంతులైన ముస్లీంలు వారికి వ్యతిరేకం కాబట్టి. నిరక్షరాస్యులైన అమాయక ముస్లీంలు, హైందవ ప్రజానీకం తీవ్రమైన మతోన్మాదులచే గాని కుట్రదారులచే రక్తసిక్తమైన సంక్షోభాన్ని తేలికగా సృష్టించడానికి పూనుకొనే వారు. కాని వారిలో వారు ద్వేషాన్ని గాని, దుష్టభావాన్ని గాని దీర్ఘకాలం దాచుకోలేదు. అందువల్ల 1937 నాటి జనరల్ ఎన్నికల్లో ముస్లీం ఓటర్లలో ఎక్కువ మంది ముస్లీంలీగుకు ఓటు వేయలేదు. అనేకచోట్ల కాంగ్రెస్‌కూ, స్వతంత్ర్య అభ్యర్థులకు, తదితరులకు ఓటు వేశారు.

కాని, ఎన్నికల అనంతరం, కాంగ్రెస్ మంత్రి వర్గాలు రాష్ట్రాల్లో ఏర్పాటు చేసినప్పుడు, జాతీయ ముస్లీం నాయకులు, తమకు చాలా తక్కువ సంఖ్యలో పదవులు ఇచ్చారని బాధపడ్డారు. అంతకంటే ప్రధానమైన అంశం, ముస్లీంలు తమ సాంస్కృతిక హక్కులను కాంగ్రెస్ ప్రభుత్వం అణచివేస్తుందని బాధపడ్డారు. వాస్తవానికి ఊహాజన్యమైన క్లేశమేమంటే, ఇంతకుముందే పేర్కొన్నట్లు, అధిక సంఖ్యాకులైన కొత్త కాంగ్రెస్‌వాదులు మహాత్మాగాంధీ ఔదార్యముగల సిద్ధాంతం పట్ల నమ్మకం చూపలేదు. గాంధీ అల్పసంఖ్యాక వర్గం పట్ల, ముఖ్యంగా ముస్లీంల పట్ల ఆచరణలో పెట్టిన విధానాన్ని వారు అంగీకరించలేదు. ముస్లీంల పట్ల చూపిన ప్రత్యేక దృక్పథం కాంగ్రెసులో మార్పు తెచ్చింది. అది స్వల్పమైందే. దీనికి ప్రత్యక్షమైన గుర్తు ఏమిటంటే కాంగ్రెస్ ప్రకటన హిందూస్థానీ పర్షియన్, దేవనాగరి రెండు లిపులలో జాతీయ భాష కావాలని భావించడం. దీన్ని కాంగ్రెసు ప్రభుత్వాలు గౌరవించలేదు. కొన్ని రాష్ట్రాల్లో ఉర్దూ భాషను నిర్లక్ష్యం చేశారు. ఈ కారణం ముస్లీంలలో ఉన్నత, మధ్య తరగతులు అనే తేడా లేక సర్వజనీన అసంతృప్తిని కల్గించింది. అట్లే, కింది మధ్య తరగతి ముస్లీంల్లో కూడా అసంతృప్తి ఏర్పడింది. వీళ్లే పట్టణాల్లో అధిక సంఖ్యాకులైన ముస్లీంలు.

కాంగ్రెసుకు వ్యతిరేకమైన ముస్లీంలు ముస్లీం లీగులో చేరారు. కాంగ్రెస్‌ను రెచ్చగొట్టడానికి మత అంశంకంటే సాంస్కృతిక విషయం ప్రధానంగా భావించారు. నీతి నియమాలు లేని పద్ధతిలో దాన్ని దోపిడీ చేశారు. కొన్ని రాష్ట్రాల్లో వాళ్లు అల్ప సంఖ్యాకవర్గంగా ఉన్నారు కనుక, ప్రచారానికి ఉప

యోగించుకొన్నారు. రాజకీయ చరిత్రలో దీనికి సామ్యత కానరాదు. ముస్లింల్లో హిందీ, హిందూస్థానీ ఉద్యమాన్ని (దేన్నైతే, గాంధీ మహాత్ముడు, హైంద వులు, ముస్లింల మధ్య ఉత్కృష్టమైన సాంస్కృత సామరస్యాన్ని కల్గించ డానికి ప్రత్యేక ప్రయోజనం కోసం ప్రారంభించాడో). ముస్లిం సంస్కృతిని దిగజార్చేదాన్నిగా చిత్రించారు. దీన్ని ముస్లిం సంస్కృతిని కించపరచడా నికి చేశారనే మాటవచ్చింది. బేసిక్ విద్యా ప్రణాళిక విషయంలో, గాంధీ, విఖ్యాతులైన ముస్లిం విద్యావేత్తలతో సంప్రతించి ఏర్పరిస్తే, దీన్ని ముస్లింల సాంస్కృతిక జీవనానికి ప్రమాదమని భావించటం జరిగింది. ఈ ప్రమాదా లకు రక్షణలను (అల్ప సంఖ్యాక వర్గ రాష్ట్రాల్లో ముస్లింలకు) కల్పించుటం అంటే భారతదేశాన్ని చీల్చటమే. అధిక సంఖ్యాకులుగల ముస్లిం ప్రాంతా లను వేరుచేసి, పాకిస్తాన్ అనే పేరుతో స్వతంత్ర రాజ్యాన్ని నెలకొల్పడమే. మామూలు మేధస్సుకు అనుమానం కల్గినదేమంటే, మైనార్టీ రాష్ట్రాల్లో ముస్లింలు భారతదేశంలో ఉంటే మంచిదే. పాకిస్తాన్ వాళ్ల సమస్యలను పరిష్కృతం చేయలేదని విశ్వసించడం జరిగింది. ఈ చిక్కుకు ఒకే ఒక పరిష్కార మార్గ ముందనే ఊహ జనించింది. కాంగ్రెసు అత్యధిక సంఖ్యాకులుగా ఉన్న రాష్ట్రాల్లో, అంటే మంత్రి వర్గంలో ఉన్న రాష్ట్రాల్లో, జమీందారి విధానాన్ని రద్దు చెయ్యా లని తలపెట్టారు. ముస్లింలు ఎక్కువగా జమిందారులపై ప్రత్యక్షంగా ఆధా రపడ్డారు. అందువల్ల కాంగ్రెసు మంత్రివర్గాలు జమీందారీ విధాన రద్దును ప్రతిపాదించిన రాష్ట్రాల్లో, ముస్లింలలో అశాంతి ప్రస్ఫుటంగా ఉంది. ముస్లిం జమీందారులు (వారు హైందవ సహోదరులు కూడా) అధిక సంఖ్యలో కాంగ్రెసు ప్రభుత్వాలను పడగొట్టాలని ప్రయత్నించారు. కాబట్టి, హిందువులు కొందరు ముస్లిం లీగుకు మద్దతునిచ్చారు. ప్రత్యేక దేశం ఏర్పడుతుందనే నమ్మకం వారికి లేకపోవచ్చు. కాని భారతీయ రాజకీయాల్లో ఒక ప్రతిష్టంభనను సృష్టించి, దాని మూలంగా తమ రక్షణ మిషపై బ్రిటీష్‌వారు పాకిస్తాన్‌ను ఏర్పర్చడానికి మద్దతునిచ్చి ఉండవచ్చు.

ఏదిఏమైనా, ముస్లింలీగు ఈ సాంస్కృతిక అంశాన్ని వాడుకోడంలో విజయవంతమైంది. కాంగ్రెసుకు వ్యతిరేకంగా భారతీయ ముస్లింలను రెచ్చ గొట్టారు. ఆ రకంగా పాకిస్తాన్ సమస్య బలపడింది. ప్రముఖులైన కాంగ్రెసు నాయకులు, ఇది కేవలం మధ్య తరగతికి పరిమితమైన ఒక భావన మాత్రమే కాని, ముస్లిం ప్రజానీకానికి సంబంధించింది కాదని ఉద్ఘాటిస్తూ వచ్చారు.

కానీ, భారతదేశంలో విద్యలేని ప్రజానీకం మొత్తం ప్రత్యేకంగా ముస్లిం మధ్య తరగతికి చెందిన తమ నాయకులను గుడ్డిగా నమ్ముతున్నారన్న విషయాన్ని గమనించలేక పోయారు.

విభజన తర్వాత, దాదాపు ముస్లింలీగు నాయకులు అందరూ భారతదేశంలోని ముస్లింలను వారి మానానికి వదలి, పాకిస్తాన్‌కు తరలిపోయారు. ముస్లిం నాయకత్వం జాతీయ ముస్లింల చేతిలోకి పోయింది. వారు ఎల్లప్పుడూ ఐక్య భారత జాతీయత కోసం నిలబడ్డవారు. 1937కు పూర్వం రెండు జాతుల సిద్ధాంతం ఎవ్వరూ విననుకూడా లేదు. భారతదేశ గడ్డపై అది మృతి చెందింది. అప్పటి నుంచి ముస్లింలు భారత యూనియన్‌లో ఒక అంతర్భాగమైనారు. వారు, ఇతర అల్ప వర్గాల్లాగే, అధిక సంఖ్యాకులైన హిందువుల్లాగే ఇష్టపడి భారత జాతీయతను అంగీకరించారన్న సత్యమే, వివాదానికి అతీతమైన సాక్ష్యం. వారి ప్రతినిధులు రాజ్యాంగ సభలో (ప్రత్యేక మత ప్రాతిపదికపై ఎన్నుకోబడ్డారు). ఏకగ్రీవంగా నూతన భారత రాజ్యాంగాన్ని బలపర్చారు. ముస్లిం వార్తా పత్రికలు, ప్రజా సంస్థలు అదే విధంగా చేశాయి. వీటన్నిటికంటే ప్రబల నిదర్శనం, ప్రథమ సాధారణ ఎన్నికల్లో (1952), వారిలో అత్యధిక సంఖ్యాకులు కాంగ్రెసుకు ఓటు వేశారు. తక్కిన వారు భారత రాజ్యాంగానికి విధేయులైన ఇతర పక్షాలకు వేశారు.

ఇప్పుడు సమస్య ఏమంటే, భారతీయ ముస్లింలు, భారత జాతీయతతో కలసిపోగా, ఐక్య జాతీయ సంస్కృతి గురించి వారి అభిప్రాయమేమిటి? ఇది తెలియాలంటే, భారతదేశంలో ముస్లింలతో ఇది ఆధునిక సాంస్కృతిక స్థితిని సంక్షిప్తంగా తెలుసుకోవాలి.

ప్రస్తుత పరిస్థితి ఏమంటే, ప్రపంచమంతటానున్న తమ మతస్థుల వలె, భారత దేశంలోని ముస్లింలు, మతాన్ని అనుసరిస్తూనే ఆధునిక పాశ్చాత్య సంస్కృతిని ఆమోదించాలా అన్నది ప్రధాన సమస్య. నేటి వరకూ వారికి, దాని రెండు సిద్ధాంతాల గురించి నిర్దిష్టమైన అవగాహన ఉంది. భారత రాజ్యాంగానికి బద్ధులైనందు వల్ల, తమలో ఒక స్వల్ప విభాగం మినహా, మత ప్రాధాన్యత గల రాజ్యం అనే భావన నుంచి వేరై, ఆధునిక భావన అయిన లౌకిక ప్రజాస్వామ్యాన్ని ఒప్పుకొన్నారు. పై సిద్ధాంత రాజ్య భావన ఎన్నో దేశాల్లో అంతర్గత ఘర్షణకు లోనైంది. ముస్లింలు, భారతీయ జాతుల వలె, ఆసియాలోని ప్రజల్లాగే, రాజ్యానికి దేశభక్తిని, విధేయతను పవిత్ర

మైన విలువలుగా గౌరవించారు. పాశ్చాత్య దేశాలు విశ్వసించిన మతం కంటే, దేశం లేక రాజ్యం ఎక్కువ ప్రాముఖ్యం గలవి అనే భావాన్ని ఏకగ్రీవంగా తిరస్కరించారు. మతం, అన్ని కాలాల్లోలాగే అధికతరమైన విలువకల్గిందే.

ఈ విధంగా భారతీయ ముస్లీంలు, జాతీయ సంస్కృతిలో ఏ స్థానంలో ఉన్నారన్న ప్రశ్నకు జవాబిస్తుంది. ఇక్కడ సంక్షిప్తమైన సమాధానం చెప్పుకొందాం. ఎందుకంటే రాబోయే అధ్యాయాల్లో వీటిని గురించి విపులంగా చెప్పుకుందాం.

అత్యధిక సమాజం నుంచి, మత వ్యవస్థలో ముస్లీంలు వేరైనప్పటికీ, భారతీయ ముస్లీంలు, ఎన్నో అంశాల్లో సాంప్రదాయిక, మత, నైతిక స్పృహలో, సామాజిక నిర్మాణంలో, కుటుంబ జీవన విధానంలో, సామ్యత కల్గి ఉండటం చేత, జాతీయ సంస్కృతిలో ఇమడగలరు. కాని, హిందువుల్లో అధిక భాగానికి చిహ్నంగా ప్రయత్నించే వారిలో అధైర్య భావానికి కారణం అయింది. హిందీని ఏకైక జాతీయ భాషగా రూపొందించాలనే ఈ సంస్కృతి వైఖరి, హిందీ ప్రాముఖ్యత, రెండూ ప్రత్యేకంగా ప్రోత్సాహాన్ని పుంజుకోడం, గత ఏడున్నర శతాబ్దాల్లో భారతీయ సంస్కృతికి, ముస్లీంలు చేసిన సేవను తిరస్కరించే ప్రయత్నం చేస్తుంది.

ముస్లీంల్లో మాదిరిగానే, హిందువుల్లో, పాశ్చాత్య సంస్కృతికి అనుకూల, ప్రతికూల సంఘటనలు బలమైనాయి. వీటిలో ప్రధమ నిర్మాణాత్మక రూపం పొందింది ఆది బ్రహ్మ సమాజం. ఇది ఇస్లాం, క్రైస్తవ మతాలచే, పాశ్చాత్య సంస్కృతులచే ప్రభావితమైన, ప్రధానంగా ఏర్పడ్డ ఒక మితమైన హైందవ సంస్కరణ ఉద్యమం. కేశవ చంద్రసేన్ భారత దేశంలో బ్రహ్మ సమాజం పేరుతో, నూతన సమాజాన్ని స్థాపించారు. ఇందులో 'మదర్ సమాజ్' నుంచి అభిప్రాయభేదం వచ్చింది. అది క్రైస్తవ మత ప్రభావం వల్ల, సెమిటిక్ మతాల ఫక్కీలో ఏర్పడింది. దీని కార్యక్రమాల్లో సంఘసంస్కరణమనేది కూడా తీవ్రతరమైందే. హైందవ సమాజంలో ఈ రెండో ఉద్యమం అంత ప్రజాదరణను పొందలేదు. అంతర్ పోరాటాల మూలంగా బలహీనమై, రెండు ఉపశాఖలుగా విభజితమైంది. ఇది అమూల్యమైన సేవ చేసింది.

కేశవ చంద్రసేన్ ప్రభావం, బొంబాయిలోని విద్యావంతులైన హిందు

వుల్లో, మత సంస్కరణా భావాన్ని ఉద్రిక్తపరిచింది. అప్పటికే, అదే పంథాలో వాళ్ళు ప్రార్థనా సమాజాన్ని స్థాపించారు. రనడే నాయకత్వంలో, ఈ కొత్త సమాజం ప్రత్యేక విభాగంగా ఏర్పడ్డానికి అవకాశం రాలేదు. హిందూ సమాజంలో బలమైన ఉద్యమంగా రూపురేఖలు దిద్దుకొంది.

మహదేవ గోవింద రనడే, ఆధునిక భారతదేశంలో పేరెన్నికగన్న నాయకుడు. నూతనమైన చైతన్యాన్ని హిందువుల్లో కల్గించాడు. అది, సయ్యద్ అహమ్మద్ ఖాన్ ముస్లింల్లో కల్గించిన దానికన్నా అధికం. రనడే సాంఘిక, విద్యాపరమైన, రాజకీయ చైతన్యాన్ని హిందువుల్లో కల్గించడానికి ఎంతో కృషి చేశాడు. ఈ కృషి దక్కనులోకాక, దేశమంతా వ్యాప్తి చెందింది. ప్రత్యేక సంఘ సంస్కరణలే కాక, మౌలిక సంస్కరణ ధోరణిని హిందువుల్లో కలిగించాడు. దానికి ప్రార్థనా సమాజం, సోషల్ కాన్ఫరెన్స్ ఎంతో దోహదం చేశాయి. సార్వజనీన, దక్కన్ సభలద్వారా ఆధునిక విద్యావిషయంలో కాని, రాజకీయ స్వాతంత్ర్యోద్యమంలో కాని, ఎంతో కృషి చేశాడు. భారత జాతీయ కాంగ్రెస్ స్థాపకుల్లో ఇతడొకడు.

రనడే, రాజా రామ్మోహన రాయ్, ఇతర బ్రహ్మ సమాజ నాయకుల్లాగా, ఉదార దృక్పధానికి ప్రతినిధి. హిందువుల్లో ఆ రకమైన భావాలను కల్గించాడు. ఈ ధోరణి, పాశ్చాత్య సంస్కృతికి అనుకూలంగా స్పందించి, హిందూ మతాన్ని ఆధునిక కాల అవసరాలకు సరిపోయేట్లు, సాంప్రదాయక, విశ్వాసాలను, ఆచారాలను సంస్కరించాలని ప్రయత్నం చేశాడు. హిందూ సమాజం, పాశ్చాత్య సంస్కృతి పట్ల సుముఖత చూపలేదు. వాళ్లను స్పందింపచేసిన ఏకైక అంశం పాశ్చాత్య జాతుల దేశభక్తి, జాతీయతా మాత్రమే. సాంప్రదాయబద్ధ హిందూమతం, సంస్కృతి, స్వయం సమృద్ధమైనవనీ, అవసరాలకు అనుగుణ్యమనే విషయం స్పష్టమైంది. అవసరమైంది ఒక పునఃనిర్వచనం మాత్రమే. భారతదేశానికి విముక్తి పాశ్చాత్య దేశాలను అనుసరించడంలో లేదు. భారతమాతను పాశ్చాత్య దాస్య శృంఖలాల నుంచీ విముక్తురాల్ని చేయడంలో ఉంది. రాజకీయ, మేధా సంబంధమైన ఆధిపత్యం నుంచి దానిని తప్పించి, స్వాతంత్ర్య దేశంగాను, జాతీయ సంస్కృతితో వెల్లివిరిసేటట్లు చేయాలి. విదేశీ ప్రభావం నుంచి విముక్తి లభించాలి. వారికి దేశమంటే, మొత్తం హిందూ సమాజమే. ముస్లింలు, బ్రిటీష్‌వాళ్లల్లాగే విదేశస్థులు.

సాంప్రదాయక హైందవ మతానికి ప్రఖ్యాత నాయకుడు బాలగంగాధర తిలక్. ఇతడు రనడేకు ప్రబల శత్రువు. రనడే రాజకీయ సాంఘిక ఉదారతను ఖండించాడు తిలక్ 24 సంవత్సరాల ప్రాంతంలో తన ప్రజా జీవితాన్ని ప్రారంభించాడు. మరాఠా, కేసరి పత్రికలకు సంపాదకుడు. ఔత్సాహికులైన యువకుల సహాయంతో త్వరలోనే విజయాన్ని సాధించాడు. దక్కన్ విద్యా సమాజాన్ని, ఫెర్గూసన్ కళాశాల (1882)ను స్థాపించడంలో ప్రముఖ పాత్రను వహించాడు

తిలక్ సారస్వత కార్యక్రమాలు హిందువుల్లో పూర్వ ఉజ్వల వైభవానికి దగ్గరగా రావడానికి దోహదపరచాయి తిలక్ ప్రముఖ సంస్కృత విద్వాంసుడు ఆంగ్ల భాషలో రాసిన The Arctic Home in the Vedas మరియు 'Orion,' ఇంకా మరాఠీ భాషలో భగవద్గీత, గీతా రహస్యాలపై రాసిన వ్యాఖ్యానాలు విద్యావంతులైన హిందువుల మనస్సులపై ప్రగాఢమైన ప్రభావాన్ని చూపాయి. హైందవ జాతీయతకు స్వల్పమైన పునరుద్ధరణ స్పర్శతో మత ముద్ర వచ్చింది

ఆర్య సమాజ ఉద్యమం మొత్తం మీద పునరుద్ధరణ విధానాన్నే ఆచరణలో పెట్టింది ఇది హైందవ మతాన్ని వేరకాల దివ్యత్వం వైపు వెనకకు మరల్చడానికి ప్రయత్నం చేసింది. ఇందుకోసం వేదాంత, పురాణ సంబంధాలను ఖండించింది. ముస్లీం, పాశ్చాత్య సంబంధాలను తోసిపుచ్చింది.

అనిబిసెంటు ప్రాతినిధ్యం వహించిన మార్మికమత శాఖ దివ్యజ్ఞానం, హిందూ సమాజంలో ఎక్కువ ప్రాముఖ్యాన్ని పొందలేదు హిందూ మతానికి ఆమె చేసిన వ్యక్తిగత సేవలు గణనీయమైనవి. సెంట్రల్ హిందూ కాలేజి (కాశీ విశ్వవిద్యాలయం) స్థాపకురాలు. భారత స్వాతంత్ర్యోద్యమంలో హోంరూలు ఉద్యమంలో ఆమె పాత్ర ప్రముఖమైంది.

ఈ సంస్కరణోద్యమాలు, నిజంగా హిందువుల్లో యోచనా శక్తుల పునరుద్ధరణ, అద్భుతమైన చొరవ, చాకచక్యాలవల్ల ఏర్పడ్డాయి. ఇవి పరోక్షంగా మత, భాషలపై ప్రభావాన్ని చూపాయి. మత చైతన్యం, అసలు అర్థంలో, నిజానికి పూర్తి మత అనుభవం, పరమ సత్యం రూపాన్ని ప్రత్యక్షంగా సాక్షాత్కారం పొందిన అనుభూతి ఏర్పడింది. ఈ అనుభూతిని కల్గించిన మహానుభావులు శ్రీరామకృష్ణ పరమహంస, అతని అనుయాయుడైన శ్రీ వివేకానందుడు. శైశవం నుంచి రామకృష్ణ సత్యాన్వేషణ కోసం ప్రయత్నించాడు. ఈ

శోధనను ఆత్మశుద్ధి, ఆత్మ శిక్షణగల సన్యాస మార్గం ద్వారా పొందాలనే బలవత్తరమైన కాంక్ష ఉండేది. హైంధవ మార్మిక పద్ధతులన్నింటినీ, వివిధ పద్ధతుల ద్వారా తెలుసుకోవాలన్న దృఢ నిశ్చయం మూలంగా సాధ్యమైంది. కాళీమాతను, సీత, కృష్ణుని దర్శించడమే కాక, ఇస్లాం, క్రైస్తవ మత భక్తి భావాలను ఆకళింపు చేసుకున్నాడు. వీటి మూలంగా మహమ్మద్ ప్రవక్త, జీసస్ క్రైస్ట్ మహోదాత్తమైన రూపాన్ని ప్రత్యక్షంగా చూచి గొప్ప అనుభూతిని పొందాడు. రామకృష్ణ పరమహంస, తన జీవితంలో, చివరి ఏడు సంవత్సరాలు, తన్నాశ్రయించుకొన్న శిష్యులకు ఆధ్యాత్మిక జీవనంలోని మహత్తులను, దీక్షామార్గం, నేర్పడంలో కృషి చేశాడు. ఆ శిష్యుల్లో అగ్రగణ్యుడు స్వామి వివేకానందుడు.

తన గురువు మరణ కాలానికి, స్వామి వివేకానందుని వయస్సు ఇరవై మూడు సంవత్సరాలు మాత్రమే. ఐదు సంవత్సరాలు, భారతదేశం ఆసేతు హిమాచల పర్యంతం తిరిగాడు. అజ్ఞానం, పీల్చి పిప్పిచేసే పేదరికంలో కూరుకుపోయిన తన జాతి ప్రజల పరిస్థితులు అతని హృదయానికి హత్తుకున్నాయి. కన్యాకుమారిలో, పవిత్ర దేవాలయం దర్శించిన తర్వాత, హిందూ మహా సముద్ర తీరాన, ఒక రాతిపై నిలబడి, భారతదేశంలోని కోట్లాది బీద ప్రజల విద్య, ఐహిక, ఆధ్యాత్మిక అభ్యుదయానికి, తన జీవిత సర్వస్వాన్ని ధారపోస్తానని పవిత్ర శపథం చేశాడు. తర్వాత కొద్ది కాలానికే, చికాగో ప్రపంచ మతాల మహా సభలో పాల్గొని, తన విశ్వాసాల ప్రచారానికి, మంచి అనుకూల వాతావరణం ఉండటాన్ని గ్రహించి, అమెరికాలో ఉపన్యాసాలు ఇస్తూ పర్యటించి, వేదాంత తత్త్వశాస్త్ర బోధనకై సెమినార్లు జరిపాడు. రాజయోగంపై గ్రంథం రచించాడు. వేదాంత సొసైటీని న్యూయార్కులో స్థాపించాడు. విదేశాల్లో గడిపిన కాలంలో స్విట్జర్లాండు, జర్మనీ, ఇంగ్లండు సందర్శించి, లండనులో ఎందరో శిష్యులను సంపాదించాడు. స్వామి వివేకానందుడు, భారతదేశానికి మరలి వచ్చి, ఘనమైన స్వాగత సన్మానాలు పొందాడు. మరోమారు దేశమంతా పర్యటించాడు. ఈసారి హిందువులను సంఘసేవ, సంస్కరణ చేపట్టమని, ప్రత్యేకంగా, పాశ్చాత్య పద్ధతిలో నిర్మాణాత్మకంగా స్త్రీల విద్యను, ఉద్ధరణ చేయమని హెచ్చరించాడు. 1897 సంవత్సరంలో, అటువంటి సంస్థలకు ఆదర్శంగా ఉండటం కోసం రామకృష్ణ మిషన్ స్థాపించాడు. 1899లో, తన అనుయాయుల నివాసానికి బేలూరులో మఠం కట్టిం

చాడు. అల్మోరాలో అద్వైత ఆశ్రమం స్థాపించాడు. మరోమారు, అమెరికా పర్యటన తర్వాత, భారతదేశానికి మరలివచ్చి, తన ఆరోగ్యం క్షీణించేంత వరకు, ప్రేమ, సేవ అనే తన సందేశాన్ని అందించడంలో నిమగ్నుడైనాడు. తర్వాత బేలూరు మఠంలో ఉండి, 1902లో శిష్యులకు వేదాంత శాస్త్రం బోధిస్తూనే జీవితాన్ని చాలించాడు.

వేదాంత శాస్త్రానికి, మరో వ్యాఖ్యానాన్ని శ్రీ అరవింద ఘోష్, తన ఆధ్యాత్మిక భావాలకు నూతన వ్యాఖ్యానాన్ని అందించాడు. అది మేధో సంబంధమైన విచారణ, అంతర్గత అనుభవం మూలంగా త్వరితగతిని సాధించవచ్చు. 1872లో, కలకత్తాలో జన్మించి, తన ఏడో సంవత్సరం నుంచి, ఇరవై ఒకటో సంవత్సర ప్రాయం వరకూ, ఇంగ్లండులో విద్యాభ్యాసం చేశాడు. భారతదేశానికి తిరిగి వచ్చిన తర్వాత, పదమూడు సంవత్సరాలు బరోడా రాజు కొలువులో గడిపాడు. ఆ కాలంలో సంస్కృత భాషను అభ్యసించి, హైందవ మత, సంస్కృతులను క్షుణ్ణంగా పఠించాడు. 1906లో బెంగాల్ పోరాటంలో, బరోడా వదలివచ్చి, కలకత్తాలో, జాతీయ ఉద్యమానికి నాయకత్వం వహించి నడిపించాడు. ముఖ్యంగా, అతని ప్రేరణ మూలంగానే, జాతీయ పార్టీ స్వదేశీ, అసహాయోద్యమ ప్రణాళికలను ఆచరణలో పెట్టింది. జాతీయ కాంగ్రెస్ వాటిని తర్వాత చేపట్టింది ఆ సమయంలో ఒక బ్రహ్మాండమైన మతానుభవం, అరవిందుని జీవితాన్ని మార్చి వేసింది. శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై, హైందవ సమాజానికి, సనాతన ధర్మానికి సేవ చేయమని ఆదేశించడం ఒక గొప్ప అనుభూతి కల్గింది. కాని అరవిందుడు, హిందువులు, ఆధ్యాత్మిక చింతన అభివృద్ధిలో, ఇంకా ఉన్నత స్థాయి పొంద గలిగితేనే, తమ దేశాన్ని పరాధీనత నుంచి రక్షించి, ధర్మాన్ని ఉద్బోధించగలరని విశ్వసించాడు. ఆధ్యాత్మిక చింతనా వైఖరి, రూపం, పద్ధతిని గూర్చి ధ్యానం చేయడానికి పాండిచ్చేరి (ఫ్రెంచివారి ప్రాంతం) చేరి, ఒక ఆశ్రమం నెలకొల్పాడు. అక్కడే మరణకాలం వరకూ ఉన్నాడు. 'ఆర్య' అనే పత్రికను ఏడు సంవత్సరాలు నడిపాడు. 'దివ్యత్వ జీవితం' అనే పేరుతో తన స్వీయ చరిత్రను ప్రచురించాడు. తర్వాత, అది మూడు సంపుటాలతో కూడిన గ్రంథమైంది. భగవద్గీతపై అరవిందుడు ప్రచురించిన వ్యాఖ్యానం ఉదాత్తమైంది.

ఆయన విద్యాధికులైన హిందువులను ప్రగాఢంగా ప్రభావితం చేశాడు. ఆయన వేదాంత భావాలను, సామాన్య ప్రజానీకం అవగాహన చేసుకోటం

కష్టం. అరవిందుని దైవికాంశాన్ని అందరూ ప్రేమించారు, గౌరవించారు.

హిందూ సమాజంలో, నూతన మత, వైజ్ఞానిక ఉద్యమాల సంక్షిప్త విమర్శనలో, మనం రెండు విరుద్ధమైన ప్రపత్తులను చూస్తున్నాం. (అ) ఒక ఉదార ఉద్యమం. ఇది మతంలో వెలుగును కల్గించేదిగాను, సంఘ దృష్టిలో ఆధునికమైందిగానూ, రాజకీయాల్లో మితవాదంగానూ రూపొందింది. (ఆ) సాంప్రదాయిక ఉద్యమం. దీనికి రెండు రూపాలున్నాయి. ఒకటి వేదమతాన్ని, సామాజిక జీవిత పునరుద్ధరణ చేపట్టగా, మరొకటి వేదాంత శాస్త్రాన్ని, మత జీవనాన్ని ప్రాతిపదికగా చేసికొని, దాన్ని పౌరాణిక హిందుమతంతో సమన్వయం చేసేది. మత అంతరార్థమును మార్చకుండా హైందవ సమాజ తీరు తెన్నులు మార్చాలని ప్రయత్నించింది. రాజకీయాల్లో సాంప్రదాయ ఛాందసులందరూ ఐకమత్యంతో విదేశీ అధికారాన్ని ఎదిరించి హైందవ జాతీయతను ఉద్ధరించాలని అంగీకరించారు. ఉదారవాదులకు, సాంప్రదాయ వాదులకు మధ్య జరిగిన పోరాటం సాంప్రదాయవాదుల విజయంతో ముగిసింది. వారు జాతీయ కాంగ్రెసులో తమ ప్రాబల్యాన్ని కోల్పోయారు. ప్రజా జీవనం నుంచి పూర్తిగా నిష్క్రమించారు. దీనిమూలంగా ఛాందసులు రాజకీయ స్వాతంత్ర్య ఉద్యమాన్ని తీవ్రతరం చేశారు. కాని జాతీయతను గురించిన సాంప్రదాయకవాదుల వాదన, లిబరల్ పక్షం వారికన్నా, సంకుచితమైంది. కేవలం హిందూ జాతికే పరిమితమైంది.

కాని అదృష్టవశాత్తు, భారతదేశం ముగ్గురు మహనీయుల నాయకత్వంలో ప్రగతిని సాధించింది. ఒకరు కవి, మరొకరు తత్త్వవేత్త, ఇంకొకరు నైతిక బోధకుడు. వీరు హిందూ పరిధులను దాటి, సమస్త మానవ కుటుంబాల ఉనికితో సమత్వం పొందే వరకు తమ భావజాలాన్ని విస్తృతం చేసుకొని, హిందువులలో విశాల జాతీయ దృక్పథాన్ని సృష్టించారు. ఈ దృక్పథం వారిని, ముస్లీంలను తదితర అల్పవర్గం వారి సహకారం భారతజాతి నిర్మాణానికి ప్రోత్సహించి, ప్రేరేపించింది.

కవి టాగోర్, తన దృక్పధాన్ని "విశాల భారతదేశం" అనే గ్రంథంలో స్పష్టం చేశాడు. భారతదేశ చరిత్ర సృష్టికర్తలు హిందువులు మాత్రమే, కాదన్నాడు. ఎన్నో శతాబ్దాలకు పూర్వం ముస్లీంలు, తమ సాంస్కృతిక వారసత్వంలో వచ్చి, భారతదేశ చరిత్రలో భాగస్తులైనారని తెల్పాడు. బ్రిటీష్ వారు పాశ్చాత్య సంస్కృతీ నిక్షేపాలతో వచ్చారు. నవ్య భారతదేశం ఏ

ఒక్క తెగకు, జాతికి సొంతం కాదు. అనేక మతాలు, సంస్కృతులు, శాంతి సౌభాగ్యాలతో మనుగడ చేయాలి. అలాంటి అనుకూల వాతావరణాన్ని సృష్టించడం, సామరస్యం, ప్రేమలను వృద్ధి చేయడం భారతదేశంలో ప్రధానమైన సమస్య. టాగోర్ స్వయంగా తానే, ఈ సమస్యను పరిష్కరించడానికి శాయశక్తులా ప్రయత్నించాడు. శాంతి నికేతనంలో ఈయన స్థాపించిన 'విశ్వ భారతి' అనే అంతర్జాతీయ విశ్వవిద్యాలయ ధ్యేయం సర్వమానవ సౌభ్రాతృత్వానికి అవసరమైన వాతావరణాన్ని కల్పించడమే. అందులో ప్రాక్పశ్చిమ సంస్కృతుల, ఉత్కృష్ట ప్రతినిధులను చేర్చి, వారి మధ్య భారతీయ యువతను తర్ఫీదు చేయటమే.

తత్త్వవేత్త రాధాకృష్ణన్, జాతీయత అన్న పదాన్ని ఉన్నతస్థాయిలో వ్యవహరించిన, హైందవ జాతీయతకు సాటిలేని ప్రతినిధి. ఇతడు హైందవత్వంలోని గొప్ప మత, సాంస్కృతిక ఉద్యమాలను, వేదాలనుంచి, నూతన వేదాంతాల వరకూ పరిణామ క్రమంలో గొలుసులో లింకులుగా పేర్కొన్నాడు. 'దానిలోని సిద్ధాంతాలు కర్మకాండలు, సామాజిక వ్యవస్థలని పేర్కొన్నాడు. ఒకే కేంద్ర భావనకు, వాటిని తార్కికమైన ఫలితాలుగా పునఃవ్యాఖ్యానించాడు. అహంభావంతో, ఐహిక సంపదతో నిండిన ఈ యుగంలో హిందువులు, తమ నైతిక, ఆధ్యాత్మిక విలువలను సజీవంగా నిల్పాలంటే వారి బాధ్యతను గుర్తించేటట్లు చేశాడు. ఈ విధంగా, ఆయన మహోన్నతమైన ఉద్రిక్తపూరితమైన పరమావధి సమకూర్చాడు. కానీ, వీటితో సమంగా హిందువుల గతాన్ని పునరుద్ధృతం చేయడమనే భావాన్ని వదిలి, ప్రస్తుత పరిస్థితిలో సమన్వయం సాధించమని చెప్పాడు. చరిత్రతో, చైతన్యవంతమైన సంబంధం నిలుపుకోవాల్సిన అవసరాన్ని వక్కాణించాడు. చరిత్రను తలకిందులు చేసే వ్యర్థ ప్రయత్నాన్ని మానమన్నాడు. హిందువులకు చూపిన ఆదర్శమేమంటే, జాతీయ సంప్రదాయాలను, సూత్రాలను, విలువలను క్షుణ్ణంగా అవగాహన చేసుకొని, వాటిని, కొత్త అవసరాలకు, సందర్భాలకు సమన్వయం చేసుకోడానికి, కొత్త శక్తులను ప్రయోగించే నూతన జీవితాన్ని నిర్మించాలన్నాడు.

కవి (టాగోర్) తత్వవేత్త (రాధాకృష్ణన్)ల భావాలను, కార్యరూపంలో సాధించడానికి, మాటలను క్రియారూపంలో మార్చడానికి, ఉన్నత కులాలకు పరిమితమైన హైందవ జాతీయత్వాన్ని విస్తృతం చేసి భారతీయ జాతీ

యతను అన్ని కులాల, మతాలవారు ఆలింగనం చేసి కొనేటట్లు క్రియారూపంలో మార్చడానికి దైవికంగా ఒక నీతి బోధకుడు, బుద్ధుని తరువాత అంతటి ఘనుడు నిర్ణీతమై ఉన్నాడు. మహాత్మాగాంధీ రాజకీయ కార్యకలాపం అంతకంటే మహోత్కృష్టమైన జీవిత ఆదర్శం-మానవుల ఆధ్యాత్మిక, నైతిక పునరుద్ధరణ కోసం, భారత స్వాతంత్ర్యం కోసం పాటు పడటం. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు గల భారతదేశానికే నైతిక భావం ఉంటుందని చెప్పాడు. తన దర్శకత్వంతో ఇతర దేశాలు భారతదేశాన్ని అనుసరించేటట్లు చేయగలదు.

ఆయన ఉన్నత ఆదర్శాన్ని, సత్యసాధనను అహింసా మార్గంలో సాధించాలన్నాడు. దానిని ఒక్క హిందూ సమాజమే చేయగలదు అని నమ్మాడు. తన విశ్వాసాలు, హిందూ తాత్విక జీవిత విధానం ఒకటేననుకొన్నాడు. నిరపేక్ష, వాస్తవికత ద్వారా సత్యాన్ని సాధించాలన్నాడు. ఈ సత్యసాధన, రాజకీయ, సాంఘీక, ఆర్థిక విధానాల్లో చేకూరాలన్నాడు. మంచి లక్ష్యాలను, పవిత్రమైన మంచి మార్గాలద్వారా సాధించాలన్నాడు. నియంత్రణ చేయలేని కోరికలే సత్య సాధనకు అడ్డు అన్నాడు. మహాత్మాగాంధీ దీన్ని 'హింస' అనే పదంలో వివరించాడు. సత్య సాధకుడు 'అహింస'ను ఆలోచనల్లో, మాటల్లో, కృషిలో అలవరచుకోడానికి ప్రయత్నం చెయ్యాలన్నాడు.

మహాత్ముని వ్యక్తిగత జీవితం చాలామందికి మార్గదర్శకమైంది. ఆయన బోధనలకన్నా, నూతనమైన ఉత్తేజాన్ని అన్ని వర్గాలకు చెందిన ఎక్కువ మంది హిందువుల్లో కల్గించాడు. వారిలో స్వయం శిక్షణ, ఆత్మ త్యాగం, సహనం, ప్రేమలను ప్రేరేపించి స్వాతంత్ర్యాల కోసం, ప్రగతి సాధన కోసం శాంతియుత పోరాటాన్ని చేయటానికి సిద్ధం అయ్యాడు.

అయితే, మహాత్మాగాంధీ సత్యసాధన, అహింసా సందేశాల్ని, కేవలం దేశ స్వాతంత్ర్య పోరాటానికి, హిందువులకే కాక, అందరికీ అందించాడు. విశాలమైన హృదయంతో అల్ప సంఖ్యాక వర్గాలను, అంటే ముస్లింలను కూడా, తన వాళ్లవలే భావించాడు. దూరదృష్టితో ఆలోచించి, భారతదేశం స్వాతంత్ర్య సాధనలో హిందువులు మాత్రమే కాదు అధిక సంఖ్యాకులైన అల్ప సంఖ్యాక వర్గం కూడా ముఖ్యపాత్రను నిర్వహించాలని ఆశించాడు. జాతి శరీరంలో ముస్లింలు కూడా భాగమే. అందుకే, 'ముస్లిం జాతీయత'ను, 'హైందవ జాతీయత'ను ఏకం చేసి 'భారతీయ జాతీయత'ను సాధించా

లని భావించాడు.

రాజకీయ సమైక్యత అనే ఆధారంతో, రెండు సమాజాల మధ్య సాంస్కృతిక సామరస్యాన్ని సాధించాలన్నాడు. ఆయనకు తెలుసు భారతదేశం సాంస్కృతిక సామరస్య చరిత్రలో అన్నిటికంటే గొప్పది మత సామరస్యమని. ఖురాన్ అధ్యయనం వల్ల ఇస్లాం మతంలోనున్న ప్రధానమైన భావన, దాదాపు హిందూమతంతో ఏకీభవిస్తుంది. కాకుంటే కొంత మార్పు ఉండవచ్చు. తన ప్రార్థనా సమావేశాల్లో ఎక్కువ మంది హిందువులే హాజరయ్యేవారు. అందులో ఖురాన్ నుంచి రెండు సురయాలను, బైబిల్‌నుంచి కొంత భాగాన్ని చేర్చాడు. ఆయన దృక్పధానికి ఇదో మచ్చు తునక. భక్తి ఉద్యమంలో, కబీర్, గురునానక్‌లు, గొప్ప నాయకులు సాధించిన సామరస్యాన్ని సాధించాలని ప్రయత్నించాడు. ఇది ముస్లింల్లో కొన్ని సంవత్సరాల వరకు మంచి వాతావరణాన్ని కలిగించింది. తర్వాత ముస్లింలీగ్, కాంగ్రెస్‌ల మధ్య ఏర్పడ్డ తీవ్ర కలహాల వల్ల ఈ సామరస్యం నశించింది. రాజకీయ ప్రమేయంలేని పవిత్రమైన మతం, హిందువులు, ముస్లింల మధ్య సన్నిహితత్వాన్ని కలిగిస్తుంది. ఇది అంతకు ముందు కాలంలో నిరూపితమైంది కూడ.

మహాత్మాగాంధీ అనుసరించిన సాంస్కృతిక విధానంలో, ఆయన ప్రభావంతో జాతీయ కాంగ్రెస్ అనుసరించిన విధానంలో కీలకమేమంటే, జాతీయ భాషగా హిందూస్తానీ, భాషను ప్రారంభించడమే. ఆయన భారతదేశ ప్రజలతో, తన దేశ యాత్రల్లో సన్నిహితంగా ఉన్నందువల్ల గమనించిన అంశమేమంటే, ఒక కోటికిపైగా ఉన్న ప్రజలకు మాతృభాష హిందూస్తానీ. ఇది మధ్య ప్రాంతాల్లో ఇంకా ఎక్కువ ఉండవచ్చు. జాతీయ భాష పర్షియన్, దేవ నాగరి లిపులకు సంబంధించింది కాబట్టి, దాన్ని ఉర్దూ, హిందీకి క్రమంగా మార్చాలని కాంగ్రెస్ చేత ప్రకటించాడు. ఈ విధానాన్ని హిందువులు వ్యతిరేకించారు. దానికంటే ఆశ్చర్యం అనిపించిందేమంటే చాలామంది ముస్లింలు దీన్ని వ్యతిరేకించారు. ఈ వైరుధ్యమే, మహాత్మాగాంధీ, జాతీయ ముస్లింల సహకారంతో సృష్టించిన మత సద్భావాన్ని కలచి వేసింది. అంతర్‌కలహాలు ప్రారంభమవడానికి ముఖ్య కారణమైంది.

ఈ భయంకర పోరాటం మూలంగా మహాత్మాగాంధీ తన ఆశయ సాధనలో ఎంతో విజయాన్ని సాధించినా అది పూర్తి కాలేదు. ముప్పై సంవత్సరాల కొద్ది కాలంలో దేశానికి స్వాతంత్ర్యాన్ని కొనితెచ్చారు. ప్రపంచంలోనే

అత్యున్నత అధికారంగల దేశ పెత్తనం నుంచి స్వేచ్ఛను సాధించ గలిగాడు. ఎంతో మంది ముస్లిం, హిందువులను ఒక జాతిగా కలప గలిగాడు. ఫలితంగా చెల్లించిన మూల్యం భారతదేశంలో నాల్గోవంతు భూభాగాన్ని, ఐదవవంతు జనాభాను పోగొట్టుకోవాల్సి వచ్చింది. అదే స్వతంత్ర పాకిస్తాన్ రాజ్యంగా మారింది.

ముస్లిం వ్యతిరేక వాతావరణంలో భారతదేశ విభజనకు ప్రతి చర్యగా ముస్లిం వ్యతిరేక వాతావరణంలో రక్తపాతం జరిగింది. అలజడులు పెచ్చు పెరిగాయి. అనేక మంది హిందువులు గాంధీకి దూరమయ్యారు. మహాత్ముని మృతి తర్వాత, రాజ్యాంగ నిర్మాణ సభ, అత్యధిక సంఖ్యలో కాంగ్రెస్, దేవ నాగరి లిపిలో హిందీని జాతీయ భాషగా ప్రకటించింది. హిందీని సాధ్యమైనంత వరకూ, వ్యవహారంలోనున్న భాష, హిందూస్థానీకి సన్నిహితంగా ఉంచడానికి ప్రయత్నం జరిగింది.

భాషకు సంబంధించిన అంశాన్ని రాజ్యాంగ శాసనంలో చేర్చిన తర్వాత, ముందు వ్యతిరేకించిన వారంతా, ముస్లింలతో సహా, తమ శక్తి అనుసారం అంగీకరించారు. కానీ ఉద్రిక్తులైన, హిందీ భాషా ప్రచారకులు, సామరస్యంతో కూడిన విధానాన్ని ఆచరణలో పెట్టడానికి సామర్థ్యం లేక, ముస్లింల్లోనే గాక అనేక ఇతర ప్రాంతాల్లో కూడా, విపరీతమైన అసంతృప్తి ఏర్పడింది. ఇదే రీతిగా, ప్రాంతీయ భాషా భూభాగాల్లో నివసించే అల్పసంఖ్యాక వర్గాలు తమ భాష విషయంలో ఏమి చేయలేక, అత్యధిక సంఖ్యాక వర్గాల వైఖరితో అసంతృప్తి చెందారు. భాషా సమస్యను, తర్వాత ప్రకరణంలో మనం కూలంకషంగా చర్చించుకుందాం. దీనివల్ల అనవసరంగా వివిధ సాంస్కృతిక సముదాయాల్లో ఏర్పడ్డ ఉద్రిక్తతను ఎలా తగ్గించగలమో ఆలోచిద్దాం.

ఇక్కడ, సాంస్కృతిక ఉద్రిక్తతకు మరో కారణాన్ని చెప్పాల్సి ఉంది. (ఇది భాషా సంబంధమైన దానికంటే బహుశా భవిష్యత్తులో ఎక్కువ ప్రమాదకరమైంది). ఉదార, ఛాందస వర్గాలు ఒకర్నొకరు ఢీకొంటున్నారు. జన సంఘం మాత్రమేకాక, హిందూ మహాసభ, రామరాజ్య పరిషత్, హిందూ జాతీయతలో ఛాందస సాంప్రదాయాలను చొప్పిస్తున్నారు. జాతీయ కాంగ్రెసులోనే ఛాందస గాంధీవర్గం, ఉదార వర్గంతో ముఖ్య సమస్యల విషయంలో విభేదిస్తున్నారు. పాత మిత్రుల మధ్య తలెత్తిన భేదాభిప్రాయాలు, ప్రస్తుత అలజడికి కారణం కాజాలవు. ఎందుకంటే వారు పరస్పరం గౌరవ, అభిమా

నాలతో కట్టబడి ఉన్నారు. వారిని సమాధాన పరిస్తేగానీ, జాతీయ ఐక్యత బురుజుగా, సఖ్యతగల జాతీయ సంస్కృతిని, వేగంతో, సరైన దృక్పథంతో నిర్మించడం సాధ్యం కాదు.

# 14. సాంస్కృతిక సమైక్యతాభివృద్ధి: ఈనాటి పరిస్థితి

భారతదేశంలోని సాంస్కృతిక పరిస్థితులను చూచినట్లైతే పాత పద్ధతికి చెందిన భిన్నత్వంలో ఏకత్వం ఉన్నప్పటికీ, ఏకత్వమనేది తగ్గిపోయి భిన్నత్వపు ఛాయలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. మనం కష్టపడి, సమైక్యత కోసం పాటుపడి, కాలికమైన రూపాన్ని నిలుపుకోకపోతే ఈ సున్నితమైన సమతౌల్య భావన శాశ్వతంగా కుప్పకూలుతుంది.

ఇపుడు మనం సాంస్కృతిక సమైక్యతకు తోడ్పడ్డ అనుకూల ప్రతికూల అంశాలనన్నింటినీ పరిశీలించినట్లైతే, మొదటిదాన్ని అంటే ఏకత్వాన్ని ఏ విధంగా కాపాడుకోవాలి, రెండోది అంటే భిన్నత్వాన్ని ఏ విధంగా అదుపులో ఉంచాలి అనే విషయాన్ని పరిశీలించాలి.

మొదటగా ప్రతికూల అంశాలను చూసినప్పుడు, సాంస్కృతిక సమైక్యతకు ప్రధానమైన అడ్డుగోడ భాషల వైవిధ్యం. భారతదేశంలో పధ్నాలుగు ప్రధానమైన భాషలు, కొన్ని మాండలికాలు, నాలుగు భాషా కుటుంబాలకు సంబంధించినవిగా కనిపిస్తాయి. విదేశీయులు భారతీయులంతా ఒక జాతి వారు కాదని, ఐరోపా వాసులవలె వివిధ సముదాయాలకు విభిన్న సంస్కృతులకు చెందిన వారని భావిస్తున్నారు. ఐరోపాలాగే భారతదేశంలో కూడా విభిన్న భాషలు మాట్లాడేవారున్నట్లు మనకు తెలుసు. వస్త్రధారణలోనూ జీవిత విధానంలోనూ యూరప్‌కన్నా భారతదేశానికే ఎక్కువ విశిష్టమైన స్థానం ఉంది. వీటికి తోడు ఆధ్యాత్మిక, నైతిక భావాలు, సామాజిక సంస్థలు భారతదేశానికి ఒక సమైక్యతా భావాన్ని కలిగించాయి. ఈ భావాలు యూరప్‌లో లేవు. అయినప్పటికీ భాషాపరమైన అడ్డుగోడ వివిధ ప్రాంతాల్లో నివసించే భారతీయుల్లో ఉంది. మత విషయంలో తప్ప తక్కిన విషయాల్లో వీరికి పరస్పర అవగాహన లేదు. దక్షిణ భారతీయుడు హిందీ, ఆంగ్లభాష రాకుంటే ఇతర ప్రాంతాల్లో క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొంటాడు. వారిరువురికి మధ్య ఉన్న అవగాహనా శక్తి చాల స్వల్పం. భావ గర్భితమైన ఆలోచనా

ధోరణి వారిరువురి మధ్య ఉండటం కష్టం. దేశానికంతటికీ సంబంధించిన ఒక అనుసంధాన భాష (link language) లేనట్లైతే దేశంలో సాంస్కృతిక సమత చేకూరదు. భాషా వైవిధ్యం భారతదేశ సమైక్యతకు అడ్డుగోడ కాదు. కాని భాషా సంబంధమైన ప్రాంతీయతత్వం దురభిమానానికి దారితీయ కుంటే హానికరం కాదు. మన సామాజిక వ్యవస్థలో ఉన్న ఈ విషయమే భాషా ప్రయుక్త రాష్ట్రాలకు దారి తీసింది. దాన్ని హేతుబద్ధమైన, చారిత్రక, ఆచరణాత్మక దృష్టితో చూచినప్పుడు న్యాయబద్ధమైందిగా పేర్కోడం జరిగింది. ఈ సమస్య ప్రతి ఒక్కరికీ సంబంధించిందే. దేశాభిమానం ఉన్నంత వరకు ఈ సమస్యను పరిశీలించాల్సిన అవసరం ఉంది.

ఈ భాషాపరమైన ప్రాంతీయతత్వం అంటే ఏమిటో మనం అర్థం చేసుకోవాల్సి ఉంది. ఒకే భాష మాట్లాడేవారు తాము విభిన్నమైన సముదాయానికి చెందినవారమని భావించడం సహజమే. వారందరిలో ఈ చైతన్యం ఉంటుంది. ఒకే ప్రాంతంలో నివసిస్తున్న వారిలో కొందరు విభిన్నమైన భాషను మాట్లాడినప్పుడు, వారిని పరాయివారిగా చూచినప్పుడు నిజమైన సమస్య ఏర్పడుతుంది. అలాంటి క్లిష్టమైన పరిస్థితుల్లో జాతీయ సమైక్యత కుంటుపడుతుంది. ఇది నిజానికి సమర్థనీయమైన విధానం కాదు. అంతేకాక అధిక సంఖ్యాకులు ఒకే భాషను మాట్లాడినప్పుడు అల్ప సంఖ్యాకులను నిర్లక్ష్యం చేయడం అనేది కూా హానికరమే. వారి భాషను, సంస్కృతిని అభివృద్ధి పరచుకోటానికి రాజ్యాంగ శాసనమే వారికి రక్షణను కల్పించింది ప్రధానంగా వారు మాతృభాషలో ప్రాథమిక విద్యను నేర్చుకోటం. అంతేగాక ఈ అల్పసంఖ్యాక వర్గాలను రాష్ట్ర ఉన్నత పదవుల్లోకి చేర్చుకోకపోవడం. అట్లే ఇతర విషయాల్లో కూడా ఈ వ్యత్యాసాన్ని పాటించడం. ఈ దురభిమానమే ప్రస్తుతం భారతదేశంలో చాలా బాధాకరమైన పరిస్థితులను సృష్టించింది. భాషా ప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికపై రాష్ట్రాలను పునర్నిర్మించిన తర్వాత ఆ రాష్ట్రాల్లో ఉండే అల్ప సంఖ్యాకులు ఎన్నో రకాలైన బాధలకు గురయ్యారు. ఈ భాషాప్రయుక్త రాష్ట్రాల ఎల్లలను మరల మార్చాలంటే సరిహద్దు ప్రాంతాల్లో ఎన్నో రకాలైన ఆందోళనలు, సంఘర్షణలు ఏర్పడుతున్నాయి. ఆయా ప్రాంతం, వారికే సంబంధించిందనీ, వారి భాషనే రాజభాషగా చేయాలనే అభిప్రాయం ఉంది. ఈ సరిహద్దు ప్రాంతాల్లో నివసించేవారికి సమానమైన ఆదరణ లభించినట్లైతే, రాజ్యాంగపరమైన హక్కుల రక్ష

ణను వారు అనుభవించినట్లైతే భాషా ప్రయుక్త రాష్ట్రాల నుంచి ఈ సమస్య లను తొలగించవచ్చు. భాషాపరమైన ప్రాంతీయతత్వం పరిధులు దాటడం జరగలేదు కాబట్టి, ఇది ఒక అనుకూలమైన అంశంగా చెప్పుకోవచ్చు. ఇది రాజకీయ అనైకమత్యానికి ఎక్కువ దోహదకారి కాలేదు. సంఘర్షణలను ఎదు ర్కొంటున్న సముదాయాలకూ, ప్రాంతాలకూ కేంద్రప్రభుత్వంపై పూర్తి విశ్వాసం ఉంది. ఆ ప్రభుత్వ ఆధ్వర్యంలో సాంస్కృతిక సమస్యలను పరిష్కరించు కోటానికి సంసిద్ధులుగా ఉన్నారు. ఈ ప్రయోజనాన్ని జాగ్రత్తగా ఉపయోగిం చుకోవాలి. అప్పుడే హేతుబద్ధమైన భాషా విధానాలను రూపొందించుకొని, ఒక్కొక్క రాష్ట్రంలోనూ, దేశంలోనూ సాంస్కృతికంగా సంఘీభావాన్ని ఏర్ప ర్చుకోవచ్చు.

ఇంకో ప్రధానమైన అంశం ఏమంటే, గత అరవై, డెబ్బై సంవత్సరాల్లో ఏర్పడ్డ రాజకీయ భావాలు కూడా సాంస్కృతిక సమైక్యతకు దోహదం చేశాయి. బ్రిటిష్ పాలన భారతదేశానికి ఎంత హాని చేకూర్చినప్పటికీ, దీన్నుంచి ఒక గొప్ప మేలు కూడా జరిగింది. ప్రజాస్వామ్య దేశాలతో సత్సంబంధాలు ఏర్పడటమేగాక, ఆధునిక ప్రజాస్వామ్య సిద్ధాంతం కానీ, ఆచరణ కానీ చక్కగా అలవడింది. ప్రజాస్వామ్య మౌలికతత్వంలో, ప్రాజ్ఞ ఉదార దృక్ప థాన్ని అధ్యయనం చేస్తే ఇది కేవలం కొంతమంది మేధావి వర్గాలకు మాత్రమే చెందుతుంది. రిప్పన్ ప్రభువు స్థానిక స్వపరిపాలనను ఏర్పరచి భారతీయు లకు ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంలో ఆచరణాత్మకమైన శిక్షణను ఇవ్వడం జరిగింది. వీటి మూలంగా రాజకీయ దృక్పథంలో ఏకస్వామ్య భావన ఏర్ప డింది. వాస్తవానికి ఇది తూర్పు దేశాల్లో అరుదుగా సంభవించింది. పశ్చిమ దేశాల్లో కూడా ఈ భావన తక్కువే.

ఆధునిక పశ్చిమ సంస్కృతుల ప్రభావాలు విద్యావంతులైన వారి ఆలో చనా విధానంలోనూ, జీవితపథంలో ఒక సాధారణమైన అంశంగా భావించ వచ్చు. దీన్ని చాలా విలువైన సమైక్య భావనగా పేర్కోవచ్చు. ఆంగ్లభాష, వివిధ ప్రాంతాలకు చెందిన మేధావి వర్గాల్లో భావ వ్యక్తీకరణకు ఒక ప్రధా నమైన భాషగా రూపొందింది. హిందీ బాగా అభివృద్ధి చెంది జాతీయ భాషగా రూపొందే వరకు ఈ పరిస్థితియే కొన్నాళ్లు కొనసాగవచ్చు. శాస్త్ర సంబంధమైన భావాలు స్పష్టంగా, సంక్షిప్తంగా వ్యక్తీకరించడం హిందీలో కొనసాగుతూనే ఉంది. ఆధునిక విద్యావంతులు, పోయిన శతాబ్దం చివరి

వరకు స్వాతంత్ర్యోద్యమంతో ప్రభావితులైనారు. వలసవాద నాగరకతను అనుసరించే బానిసలవలెకాక ఆంగ్లేయ సంస్కృతిలో ఉన్న అసలైన శక్తిని జీర్ణించుకొన్నారు. పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రదృక్పథం, ఉదార భావాలతో కూడిన జీవిత విధానం, ఆర్థిక అంశాలను అవగాహన చేసుకోడం, ఆ వ్యవస్థను అవగాహన చేసుకోగలిగిన మానసిక శక్తిని ఏర్పర్చుకొన్నారు.

సక్రమమైన ఆధునికీకరణానికి ఈ నూతన వైఖరిని తీసుకొని రావచ్చు. మన జాతీయ జీవన విధానంలోకి ఈ భావాన్ని చొప్పించవచ్చు. దీన్ని అన్ని సాంస్కృతిక రంగాలకు కూడలిగా చేయవచ్చు. అప్పుడే సామరస్యంతో కూడిన జాతీయ సంస్కృతి ఏర్పడుతుంది. మన రాజకీయ, ఆర్థికాభివృద్ధికి ఆధునిక పాశ్చాత్య సంస్కృతిలోని మౌలిక సిద్ధాంతాలను జీర్ణం చేసుకోడం చాల అవసరం. అప్పుడే మనం ఆశించిన సాంఘిక, ప్రజాస్వామ్య, లౌకిక, ప్రణాళికాబద్ధమైన పారిశ్రామిక విధానాలను సాధించవచ్చు.

సాంస్కృతిక సమైక్యతకు, వీటన్నింటికంటే ప్రధానమైన అంశం ఏమంటే, భారతదేశంలో అధిక సంఖ్యాకులకు ఆధ్యాత్మికపరమైన, నైతికపరమైన, సామాజిక భావాలను హిందూమతం చేకూరుస్తుంది. జాతీయ భాష ఏర్పడ్డప్పుడు, ఈ భాషా వైవిధ్యత సన్నగిల్లుతుంది. అటువంటప్పుడు జాతీయ సంస్కృతి అనే సమస్య చాల చిన్న సమస్య అవుతుంది. హిందూ మతానికి, ఇతర అల్ప సంఖ్యాకవర్గం వారి మతాలకు అవగాహన ఒక్కటే అవసరం. ఇప్పటికీ చిన్న చిన్న మతాలకు సంబంధించిన సిక్కులు, క్రైస్తవులు, పార్సీలు హిందూ మతంతో కల్సిపోయారు. దాదాపు వారిని హిందువులు అంగీకరిస్తున్నారు అల్ప సంఖ్యాకవర్గాల్లో అధిక సంఖ్యాకులు ముస్లీంలు. వీరి సంఖ్య ఆరుకోట్లు. జనాభాలో వీరి శాతం పదో లేక పదకొండో వంతు. భారతదేశంలో అభివృద్ధి చెందుతున్న సాంస్కృతిక విధానంలో వీరు ఇమడగలరా లేదా అని చాలామంది భావిస్తున్నారు. ముస్లీంలు ఒకప్పుడు హిందువులతో కలిసిపోయి హిందూస్తానీ సంస్కృతిలో భాగమైనారు. మరల ముస్లీంలు హిందూ సంస్కృతితో కలవగలరా అనే ప్రశ్న ఉదయిస్తుంది. ఇది సంశయాత్ములను సంతృప్తి పరచలేదు. ముస్లీంలకు హిందువులకన్నా ప్రత్యేక సంస్కృతి ఉన్నందువల్లే, దేశ విభజన జరిగింది. అందువల్ల మౌలికమైన ఈ ఇరువురి సాంస్కృతిక విధానాలను గమనించి, వారిరువురిలో సామరస్యం తీసుకొని వచ్చే విధానాన్ని పరిశీలించాలి.

హిందూ, ముస్లిం సంస్కృతుల్లోని ప్రధానాంశాలను పరిశీలించి, వివరించాల్సి ఉంది. ఇరువురు, సంధి యుగంలో ఎన్నో మార్పులకు గురవుతున్నారు. ఎన్నో సంఘర్షణలు వాళ్ల మనస్సుల్లో తలెత్తుతున్నాయి. కవి తన కాలానికి ప్రతిబింబం. ప్రజల భావాలే ఆయన భావాలు. మన కాలంలో అదృష్టవశాత్తు అటువంటి కవులు ఇద్దరున్నారు. హిందువుల్లో టాగోర్, ముస్లింల్లో ఇక్బాల్. హిందూ సంస్కృతిని గురించి టాగోర్, ముస్లిం సంస్కృతిని గూర్చి ఇక్బాల్ అర్థం చేసుకున్నట్లుగా మరెవరూ అర్థం చేసుకోలేదు. వారి ప్రేరణతో నూతన సాంస్కృతిక భావాలు తలెత్తాయి.

భిన్నత్వంలో ఏకత్వమనే ఈ సిద్ధాంతం, ఇంతకు ముందే మనం పేర్కొన్నాం, అదే భారతీయుల మౌలిక లక్షణం. కేంద్రీకృతమైన ఈ ముఖ్యాంశం వాస్తవానికి జీవాన్ని చేకూర్చేది. ఇది మత అనుభవమే. మతతత్వమే భారతదేశంలో ప్రధానమైన అంశం. వాస్తవానికి భారతదేశంలో నైతిక విలువలకు మత సంబంధమైన విలువే కేంద్రీకృతంగా ఉన్నాయి. ఈనాటికీ మత తత్వం ఈ విధంగా ఛాందసులైన భారతీయుల మనసుల్లో ప్రవహించేటప్పుడు, అది చలించకుండా ఉండటానికి కాని, ఆధునిక విద్యావంతుల్లోని డొల్లతనానికి కాని మత ప్రేరణ ఎక్కువ. కాబట్టే, ఇద్దరూ జీవితతత్వాన్ని మతం లేకుండా ఊహించుకోలేదు.

సూర్యుడు సోలార్ విధానంలో ఏ విధమైన స్థానంలో ఉన్నాడో, అట్లే మతం కూడా మన జీవితాల్లో చాలా ప్రధానమైన స్థానంలో ఉంది. వైజ్ఞానిక, సాంస్కృతికోద్యమాల్లో హిందువులకు స్ఫూర్తినిచ్చింది ఈ మత ప్రేరణయే. వారిలో ప్రముఖుడు, ఛాందసత్వాన్ని వ్యతిరేకించిన వాడు టాగోర్. ఆయన తలుపులను తెరిచి, ఆధునిక పాశ్చాత్య ప్రపంచ వెలుగును ఆహ్వానించాడు. ప్రకృతిలోని రహస్యాలను, వాటి బలవత్తరమైన శక్తులను, చట్టాలను గుర్తించాడు. ఈ శక్తుల నియంత్రణ ఏ విధంగా జరుగుతుందో తెలుసుకున్నాడు. వీటిని మానవుని భౌతిక సంక్షేమం కోసం ఏ రకంగా అభివృద్ధి పరచవచ్చో అర్థం చేసుకున్నాడు. కాని, ఈ ఆదర్శం కూడా అతనికి తృప్తినివ్వలేదు. సత్యాన్వేషణకు సరైన జవాబు దొరకలేదు. ఏ ఉపనిషత్తులైతే, 2500 సంవత్సరాలు సత్యాన్వేషణకు ఉపకరించాయో వాటివైపే ఆయన మొగ్గుచూపాడు. కళాకారునికి ప్రకృతికి ఉన్న సంబంధాన్ని టాగోర్ ఈ విధంగా పేర్కొన్నాడు.

ప్రపంచం ప్రశ్నిస్తుంది: ''స్నేహితుడా! నీవు నన్ను చూచావా? నాకు ఆహారాన్ని, పండ్లను అందిస్తున్నందుకు కాదు. ఏ చట్టాలను నీవు కనుక్కొన్నావని కాదు. నీకు నచ్చిన వ్యక్తిగా నీవు నన్ను ప్రేమిస్తున్నావా?''

కళాకారుడు ఈ విధంగా జవాబు చెప్పాడు: "నిజంగా నిన్ను చూచాను. నిన్ను తెలుసుకొని నిన్ను ప్రేమిస్తున్నాను. నీవు నాకు ఉపకరిస్తావని కాదు. నా అధికారం కోసం నీ శాసనాలను వాడుకోడానికి కాదు. నాకు తెలుసు. ఆ శక్తులు ఎట్లా పనిచేస్తాయో, ఎట్లా నడిపిస్తాయో, ఎలా అధికారానికి వస్తాయో; వాటి కోసం కాదు. నీవు ఎక్కడున్నావో, నేనేమిటో నాకు తెలుసు.''[1] ఈ విధంగా నిరపేక్షుడైన భగవంతుని తెలుసుకోడంలో 'నీవు', 'నేను' అన్న భేదభావాన్ని తొలగించిన, హిందూ తాత్విక సిద్ధాంతంలో కీలకమైంది నైతిక విలువ

ముస్లింల్లోని ఛాందస విభాగం-మతం, సాంస్కృతిక జీవితానికి ప్రధానమైందిగా-భావిస్తారు. ఆధునిక విద్యావంతుల వర్గం కూడా సంస్కృతికి మూలం మతమనే విషయాన్ని గుర్తించారు. ఆధునిక మతతత్వానికి ప్రత్యేకమైన ప్రతినిధి ఇక్బాల్. అతడు మత ప్రవక్త కాదు కేవలం మతతాత్వికుడు, కవి మాత్రమే. ఆయన ఉన్నత విద్యాభ్యాసం ఇంగ్లండ్, జర్మనీల్లో జరిగినందు వల్ల టాగోర్ కన్నా ఎక్కువ పాశ్చాత్య తత్వ ప్రభావితుడు. సాంస్కృతిక సమస్యల పట్ల ఆయన దృక్పథం శాస్త్రీయమైంది, విమర్శనాత్మకమైంది. మత ప్రాధాన్యతను గూర్చి టాగోర్ ఎట్లా భావించాడో ఈయన కూడా ఆ విధంగానే భావించాడు.

మతం ఏ విభాగానికీ చెందిన విషయం కాదు. ఇది కేవలం తాత్విక విచారం కాదు, కేవలం ఒక భావన కూడా కాదు; కేవలం ఒక ఆచరణ కూడా కాదు. ప్రతిబింబ విశ్లేషణలో మతమే కేంద్ర బిందువు అని తెలుసుకోవచ్చు.[2]

టాగోర్ వలె ఇక్బాల్ మత స్వభావమేమిటంటే, మనిషికీ, సత్యానికీ ఉన్న సంబంధమే. ఆయన దృష్టిలో "ఖురాన్ ప్రధానోద్దేశం మానవునిలో

---

1 టాగోర్. పర్సనాలిటీ, పుట 22. రాధాకృష్ణన్ రాసిన 'రవీంద్రనాథ్ టాగోర్ తత్త్వం,' మేక్‌మిలన్, పుటలు 130-131.

2 ఇక్బాల్. '*Reconstruction of Religious Thought in Islam*' పుట 2.

ఉన్నత చైతన్యాన్ని మేల్కొల్పి, దేవునితోను, ప్రపంచంతోను సంబంధాన్ని ఏర్పరచడం.''[1]

మేధోపరమైన విశ్లేషణకు పూర్వం మౌలికమైన మతానుభవం, హిందూ ముస్లింలకు ఒక్కటే. ఇప్పటిలాగే మధ్యయుగాల్లోని హిందూ మత భక్తులకు, ముస్లిం సూఫీలకు కూడా ఈ భావం సమానంగానే ఉండేది.

ఈ ఆధ్యాత్మిక అనుభవంలో, స్వల్ప తేడాలు, హిందూ ముస్లింలలో ఉండవచ్చు. ఈ ఇద్దరు తాత్విక కవులను విజ్ఞానపరంగా చూచినప్పుడు, యిద్దరి తాత్విక కవుల్లో ఏవో కొన్ని తేడాలుండవచ్చు. సత్య సాధనకు టాగోర్ దృష్టిలో, తమ దేవుడే కారణమని భావించవచ్చు. ముఖ్యంగా భక్తి ఉద్యమ కారులైన మాధవాచార్య, రామానంద్, కబీర్, చైతన్య చేసిన కృషి ప్రధానం. అంతేగాకభక్తి ఉద్యమం, వేదాంత మార్గానికి సంబంధించిన భావం కూడా. టాగోర్‌లో ఎంతో మార్పు తేవడానికి ఇవి కారణమైనాయి. భగవంతుడంటే మానవుడి ఆత్మకు సంబంధించినవాడు. ఆయనకు రూపురేఖలుండవు.

ఒకచోట టాగోర్ ఈ విధంగా పేర్కొన్నాడు. "ఆత్మ ఆకాశం వరకు వ్యాపిస్తుంది. మచ్చలేని ఆ స్వచ్ఛమైన ఆకాశంలో విహరిస్తుంది. రాత్రి, పగలనే తేడా ఉండదు. రూపురేఖలుండవు రంగు, రుచి ఉండదు ఈ ఒక మాట కూడా ఉండదు."[2]

టాగోర్ తత్వంలో మనిషికి, దేవునికి రెండు అంశాల్లో సన్నిహితత్వం వుంది. తాను భావించే భగవంతుడి విషయంలో ఆత్మ స్వతంత్రమైంది. భగవంతుడు నిరపేక్షకుడైనప్పుడు అతని రూపు కన్పించదు కేవలం పరమార్థమే కన్పిస్తుంది. ఆయనిలా పేర్కొన్నాడు. ''ప్రేమలో, తనకు సంబంధించిన అంశముంటుంది మిగిలినప్పుడు అది ఉండదు. 'నేను' లేక 'అహం' అనే భావముంటుంది. లేకుంటే 'నేను కాదు' అనే భావం ఉంటుంది. స్వార్థపరత్వం లేకుంటే ప్రేమ అర్థం ఏమిటి? స్వార్థం ఉన్నట్లైతే ప్రేమ సాధ్యం కాదు."[3]

**ఈ ద్వంద్వ సిద్ధాంతాన్ని మనిషికి, భగవంతుడికి ఉన్న సంబంధాన్ని డా॥ రాధాకృష్ణన్ ఈ విధంగా తెలియజేశాడు: తన పరిమిత విజ్ఞానంతో,**

---

1. ఇక్బాల్, పైన చెప్పిందే, పుట 8.
2. గీతాంజలి, పుట.67, రాధాకృష్ణన్, పైన చెప్పిందే, పుట 47.
3 సాధన, పుటలు. 114-15 రాధాకృష్ణన్ పైన చెప్పిందే. పుట 53.

'కఠోర సత్యానికి' మనిషి భయపడతాడు. తనకంటే భిన్నమైన భగవం తుణ్ణి తన ఇష్టదైవంగా భావిస్తాడు. కాని, అంతకన్నా ముందుకు పోలేడు. ఈ రకమైన మేధో విశ్లేషణను అధిగమించి, మత అంతర్వాణిని తెలుసుకోగల్గితే దేవునిలో ఐక్యం కాగలడు, మనిషి ప్రపంచాన్ని తెలుసుకోగలడు.

ఇక్బాల్ తాత్విక చింతనలో తుదిసత్యం రెండు ఆలోచనా స్రవంతుల కలయిక ద్వారా లభిస్తుంది. (అ) ముస్లిం సూఫీల షాహుదీ విధానం. వారి భావాలన్నీ ఖురాన్ మూలంగా లభ్యమైనాయి (ఆ) ఆధునిక యూరోపియన్ తత్వవేత్తలైన నిట్సే, బర్గ్‌సన్ (Nietzsche and Bergson)ల తాత్వికత నుండి లభించాయి. ఇక్బాల్ వీటిని కలిపి సామరస్య విధానాన్ని కనుక్కోవాలని ప్రయత్నించాడు ఆయన తుట్టతుది సత్యాన్ని,'వ్యక్తిత్వం' అనే మంచి అర్థంలో ఈ విధంగా పేర్కొన్నాడు. "విమర్శనా దృష్టితో చూచినప్పుడు మన అనుభవంలో సత్యం అనేది హేతుబద్ధంగా, మన అనుభవానికి అనుగుణంగా 'జీవితాన్ని' నడిపించేది. దాన్ని, ఒక దానితో ఒకటిగా, పెనవేసుకొన్న అన్ని అంశాలతో చూడాలి. కేంద్ర అంశమొకటి ఉంటుంది. అదే మనిషి నడవడిక. ఇది జీవిత స్వభావం కాబట్టి, అంతిమ జీవితాన్ని అహంగానే పరికించాలి."[1]

నిరపేక్ష స్థితికి, మానవ వ్యక్తిత్వానికి మధ్య ఎలాంటి సాదృశ్యం లేదని ఇక్బాల్ హెచ్చరించాడు. "అంతిమ సత్యం జీవితాన్ని సృజనాత్మకంగా నడిపించే హేతుబద్ధమైన ప్రక్రియ. జీవితాన్ని 'అహం' అనే దృష్టితో చూడ్డం, మానవుడి ఊహను బట్టి దేవుడిని ఊహించడం కాదు. మామూలు అంశమైన అనుభవాన్ని గుర్తించడం. జీవితం రూపులేని ద్రవం కాదు. అయితే అది ఏకత్వానికి వ్యవస్థీకృతమైన సిద్ధాంతం, సంయోగాత్మకమైన కార్యక్రమం. ఇది నిర్మాణాత్మకమైన విధికోసం చేసే ఒక ప్రక్రియ."[2]

టాగోర్, ఇక్బాల్ ఆ మత సంబంధమైన అనుభవాలను పురస్కరించుకొని, వారి వారి దృష్టితో చేసే వ్యాఖ్యానాలను తెలుసుకోవచ్చు. టాగోర్ యొక్క దేవుడు, వేదాంత సంబంధమైన బ్రాహ్మణుడు, తన దైవం అనే భావం, జీవించడానికి ఆశను, కవిత్వం రాయడానికి ఆసక్తిని కల్గిస్తుంది.

---

1 ఇక్బాల్, పైన చెప్పిందే, పుట 74.

2. ఇక్బాల్, పైన చెప్పిందే, పుట 58.

ఆయనకు సత్యభావన పరిమితమైంది. ఇది మానవుడి పరిమిత విజ్ఞానానికి సంబంధించింది. ఇక్బాల్ భావనలో దేవుడు వ్యక్తిత్వ ఏకత్వానికి మారు రూపం, ఏకైక ఆదర్శమూర్తి, వేదాంతానికి సమమైన వాడు. సూఫీలందరికీ యీ నమ్మకం ఉంది. ఇక్బాల్ దృష్టిలో యిది హృదయానికి సంబంధించిన దశ. సత్యాన్వేషణలో మధ్యే మార్గం. టాగోర్, ఇక్బాల్ ఇరువురూ ఆస్తికత, ఏకత్వ సిద్ధాంతాలు రెండింటినీ అంగీకరించారు. ఈ సిద్ధాంతాల పోలికను అంచనా వెయ్యడంలో ఇద్దరికీ మధ్య తేడా కన్పిస్తుంది.

అయితే ఇరువురి అంటే ఇక్బాల్, టాగోర్ మౌలిక తాత్విక భావాలను పోల్చే ముందే హిందూ, ముస్లీం మత సంబంధమైన మత, సాంస్కృతిక వ్యత్యాసాలను పరిశీలించాల్సి ఉంది. వేటికి, ఆ తత్వాలు ప్రాతినిధ్యం వహిస్తాయో అన్న విషయం, కేవలం వైజ్ఞానిక స్థాయివరకే పరిమితమై ఉంది. వాస్తవిక, మత పరమైన జీవితానికి సంబంధించి హిందూ ముస్లీంలిద్దరూ, వారి వారి అనుభవాన్ని బట్టి, ఆదర్శవంతమైన ఏకరూపతను బట్టి, ఆస్తికతను బట్టి నిరూపించు కొంటారు. రెండూ, ఈ దృష్టితో చూచినప్పుడు, సమానంగా ఉన్నాయా? వాటి దృష్టి ఏమిటి? భక్తి ఏర్పడ్డానికి పరిస్థితులేమిటి? వీటన్నిటిని పరిశీలించడానికి వారి వారి మత సారాంశమేమిటి? హిందువులు వేద వాఙ్మయం నుంచి చదివే శ్లోకాలు లేక భగవద్గీత, ఇవి 'నిరపేక్ష సత్యం' గురించే, అయితే దీనికి పేరుగానీ రూపంగానీ ఉండని, నిరాకారుడైన దేవుని, ప్రేమతో ఈశ్వరుడు, ఆయన అవతారాలను భక్తితో పూజించడం జరుగుతుంది. ముస్లీంలు. అల్లాకోసం ప్రార్థనలు భక్తిశ్రద్ధలతో చేస్తారు. సూఫీ కవులు రాసిన పద్యాలను పాడతారు. దేవుడు సర్వాంతర్యామి, సృష్టికర్త. మానవుణ్ణి కూడా సృష్టించినదతడే హిందూ భజనపాటలను ముస్లీం 'హక్కానీ' వల్లె వేసే మంత్రాలుగా మార్చవచ్చు ఈశ్వరుడు బదులు అల్లా అని రాయడం. అట్లే, ముస్లీం పాటలను, పేరు మార్చుకొని హిందువులు ఉపయోగించుకుంటున్నారు. హిందూ, ముస్లీంలు ఇరువురు ఒకరి సంగీత కచ్చేరీలకు మరొకరు హాజరవుతున్నారు. దేవుడిని తాము కొలిచే విధానం, కర్మకాండలు వేరైనా హిందువులు 'కవ్వాలీ'కి ముస్లీంలు 'భజన మండలికి' రావడం జరుగుతూనే ఉంది.

టాగోర్, ఇక్బాల్ ఇరువురి తాత్విక సిద్ధాంతాలను, మానవ వ్యక్తిత్వం మనిషికి దేవుడికి ఉన్న సంబంధాన్ని చూచినప్పుడు, వారి వారి భావాలు

అర్థమౌతాయి. టాగోర్ మానవుని వ్యక్తిత్వాన్ని సాపేక్షం కంటే వాస్తవంగా భావించాడు. నిరపేక్ష సత్య దృష్టి కన్నా, మానవతా దృక్పథంతో చూశాడు. సత్యాన్ని ఏ దృష్టితో చూస్తామో, వ్యక్తి మనస్సు ఎలా ఉంటుందో, అదే భావన అనంతమైన విశ్వాన్ని దర్శించినప్పుడు ఉంటుంది. ఎప్పటికైనా, అనంతంలో లీనమవ్వాలి. గమ్యానికి చేరేటప్పుడు, వాస్తవికత పెరుగుతుంది, వ్యక్తిత్వం సన్నగిల్లుతుంది. పూర్తిగా తనదంటూ ఏమీ లేకుండా, అనంతమైన విశ్వంలో లీనమైపోవడమే అత్యున్నతమైన ఆనందం. "మనిషికి సంతృప్తి, తాను పొందడంకంటే, తనకన్నా గొప్పదైన దానికి ఇవ్వడంలోనే ఉంది."[1]

ఇక్బాల్‌కు కన్పించే మానవుని వ్యక్తిత్వమే సత్యమైంది. అనంతమైంది నిరపేక్షమైందని భావిస్తాడు. అనంతంలో లీనమయ్యే దశలో ఇక్బాల్ దృష్టిలో పరిమిత మానవుని వ్యక్తిత్వం పోదు. పైగా వ్యక్తిత్వం సంపూర్ణత్వాన్ని సాధించగలుగుతుంది. ఆయన, వ్యక్తి మనస్సులో వ్యక్తిత్వం అనంతంలో లీనమయ్యేటప్పుడు ఈ విధంగా ఉంటుందని భావిస్తాడు. "అనంతం సహజ ధోరణిని అర్థం చేసుకోడంలోనే క్లిష్టత ఉంది. పూర్తిగా అనంతాన్ని చేరడమంటే, అది సర్వవ్యాప్తం అవాలి. ఎంత త్వరితంగా పనిచెయ్యడంలోనే ఉంది కాని, ఎంత విస్తృతంగా చెయ్యడంలో లేదు. ఎప్పుడైతే అతి త్వరలో మనం భగవంతునిలో లీనం కావాలనుకుంటామో, మనలోని 'అహం' తగ్గడం ప్రారంభిస్తుంది."[2]

టాగోర్ తత్వంలోని, అనంతం అనే భావన వేదాంతం నుంచి తీసుకోడం జరిగింది. ఆయన దృష్టిలో భౌతిక ప్రపంచానికీ నిరపేక్షతకూ సంబంధం ఉంది. మానవ మనస్తత్వం, తన్ను తాను గుర్తిస్తుంది. వాస్తవికతను గుర్తిస్తుంది. మాయ, అహం, పరమాత్మ, భౌతిక ప్రపంచం, ఇవన్నీ అనంత సత్యంలో రెండు భాగాలు వీటిలో ఒకటి ఎక్కువ పనిచేస్తుంది. రెండోది, స్తబ్దుగా ఉంటుంది. భౌతిక ప్రపంచంలో మనుగడ సాగిస్తుంటే, ఆధ్యాత్మిక భావన ఏర్పడుతుంది. "మనిషి, ప్రపంచంతో ఉన్న సంబంధాన్ని గుర్తించక, కేవలం జైలు పక్షిలా జీవిస్తే దాని గోడలు పూర్తిగా అతనికి కొత్త అవు

1. టాగోర్. సాధన. పుట 152 రాధాకృష్ణన్. పైన చెప్పిందే. పుట 72.
2. ఇక్బాల్. పైన చెప్పిందే. పుట 118

తాయి. ప్రతివస్తువులో ఆధ్యాత్మికతను చూచినప్పుడు, అతడు తను జన్మిం చిన ప్రపంచపు సంపూర్ణతను అర్థం చేసుకుంటాడు. వాస్తవానికి దగ్గరౌ తాడు. అన్నింటితో సంయమనం ఏర్పడుతుంది.''[1]

ఇక్బాల్ యొక్క ప్రాపంచిక భావం, సత్యంలాగే, ఖురాన్ నుంచి గ్రహిం చడం జరిగింది. అట్లే కొంత భాగం జీవశక్తి తత్వానికి సంబంధించింది. ప్రపంచ స్వభావం సత్యమనే భావన ఆయనకుంది. ఇది దేవుడి వునికికి విరుద్ధమైంది కాదు. 'దేవునికి అలవాటు' అయిందే. ''ఇది భౌతికమైన పదార్థం కాదు. ఎన్నో సంఘటనల ఫలితంగా, క్రమబద్ధమైన నడవడిక మూలంగా ఏర్పడింది. అలాంటప్పుడు అత్యున్నతమైన అహానికి సాధనం మాత్రమే. మానవునికి నడవడిక ఎట్లో, దేవునికి స్వభావం అట్లే. ''[2]

అనంతమైన మానవ మేధస్సు, భౌతిక ప్రపంచం వ్యతిరేకమైందని భావించి, దాన్నుంచి జాగ్రత్తగా తప్పుకొంటుంది. ప్రపంచమంటే ఏర్పడ్డ పరిజ్ఞానం ప్రతిక్షణం మారుతుంది. ఇది 'దృష్టికి' అగోచరమైన 'అంత ర్వాణి.' అంతర్వాణి అహాన్ని గుర్తిస్తూనే, ఐహికమైన, అంతరిక్ష సంబంధ మైన, హేతు సంబంధమైన విషయాలకు ప్రాధాన్యతనిస్తుంది. మనం ఏం చెయ్యాలి అనేది, మనం సాధించే లక్ష్యాన్ని బట్టి ఉంటుంది. సాధించాలని చేసే పని విజయవంతమై, మన లక్ష్య సాధనకు ఉపకరిస్తుంది.

అందుచేతనే ఇక్బాల్ ప్రకృతిని మానవుడు అర్థం చేసుకోడాన్ని 'వశ పరచుకోడం' అనే పదాన్ని వాడాడు. ఈ వశపరచుకోడం ద్వారా మాన వుడు తన వ్యక్తిత్వాన్ని సంఘటిత పరచుకుంటాడు.

భగవంతుడి గురించి కాని, వ్యక్తిని గురించిగాని, ప్రపంచాన్ని గురించి గానీ ఏర్పడ్డ టాగోర్, ఇక్బాల్ భావాలు వారి తాత్విక చింతనలోనే ఉన్నాయి. టాగోర్ పైన మనం చూసిన విధంగా "అజ్ఞానమనే తెరను తొలగించాలనీ ఇది వ్యక్తులను, భౌతిక ప్రపంచాన్ని వేరు వేరుగా భావిస్తుందనీ వీటన్నింటిని మించిన అలౌకికతను చేరాలంటే, అత్యున్నత సత్యాన్ని చూడాలి." "భార తదేశంలో ఉన్న ప్రధానమైన విషయం ఏమంటే, విద్య లేకుండడమే - మని షిలోని నిజమైన శక్తి బయల్పడపోవడానికి కారణం. వాస్తవికమైన దాన్ని

1. టాగోర్, సాధన పుట.8. రాధాకృష్ణన్ పైన చెప్పిందే, పుట.19
2 ఇక్బాల్, ముందు చెప్పిందే, పుటలు 53-54.

నాశనం చెయ్యడానికి కాదు. అది సాధ్యం కాదు కూడా. మన సత్యాన్వేష ణకు అడ్డు తగిలే భావనను తొలగించుకోవాలి. ఈ అజ్ఞానాంధకార తెరను తొలగిస్తే, కళ్లు వాటంతట అవే తెరిపిడి పడ్తాయి. అప్పుడు కంటికి నష్టం ఉండదు.''[1] అప్పుడే అతడు 'శుద్ధ సత్యాన్ని' అన్వేషించగలడు.

ఈ అత్యున్నత లక్ష్య సాధన, ఇంద్రియాల వల్లగాని, హేతుబద్ధత వల్ల గాని జరగదు. అంతర్వాణి మూలంగా జరుగుతుంది. మనస్సుకు శిక్షణ ఇచ్చి, వైజ్ఞానిక అంతరాలను ఎప్పటికప్పుడు తట్టి లేపితే, క్రమశిక్షణ మూలంగా ఒక అద్భుతమైన స్ఫూర్తి వస్తుంది. ఈ మత ఆదర్శమే, మానవ జీవితం లోని నైతిక ఆదర్శాన్ని నిర్ణయిస్తుంది. మనుష్యులందరూ సమానమేనన్న భావన ఈ ఏకత్వోపాసన మూలంగా అర్థం అవుతుంది. ఇతరులు మనలాం టివారేననే భావం కలగడం, వారిని ప్రేమించడం జరుగుతుంది. వారికి సేవ చేయగల్గుతాము. అన్నింటికి మూలమిదే. మనిషికి, మనిషికీ మధ్య తేడాలు రావడం ఇతరుల కంటే మనం'' వేరనే భావన, కోరికలను తలెత్తనియ్యడమ నేది అన్నింటికన్నా నికృష్టమైంది. ''మన కోరికలే, సత్యాన్వేషణ పరిధికి ప్రతిబంధకాలౌతాయి. మనస్ఫూర్తికి అడ్డు తగులుతాయి. తప్పు చెయ్యడా నికి అవకాశాన్ని కల్పిస్తాయి. భగవంతుడి నుంచి దూరం చేస్తాయి. మనలోని అహాన్ని పెంచుతాయి. పాపం అనేది ఒక చర్య మాత్రమే కాదు. అదొక జీవిత విధానం. మన లక్ష్యం, అత్యున్నత సత్యాన్ని తెలుసుకోడమే. మనం దరం ఒకటి కాదు. ప్రతి ఒక్కరికీ ప్రత్యేక మనుగడ ఉంది."[2]

కవిత్వం మనిషిని వ్యక్తిగత కోరికల నుంచి తప్పిస్తుంది. "కవులమైన మనం మానవులు కోరికలు లేకుండా స్వేచ్ఛగా ఉండాలంటాం."[3] తను ప్రత్యేకమైన వ్యక్తిత్వం ఉన్నవాడని భావన తొలగించుకుంటే, అహానికి, పర మాత్మకు సంబంధాన్ని కళాకారుడు గుర్తించగలగాలి. ప్రపంచానికి మనం ఈ రకంగా చెప్పాలి. ''నీవెక్కడున్నా, నేను చూడగలుగుతాను. నేనేమిటో

---

1. టాగోర్, సాధన. పుట 72, రాధాకృష్ణన్‌నుంచి గ్రహించబడింది. ముందు చెప్పిందే, పుటలు 112-13.
2. టాగోర్. ముందు చెప్పిందే, పుట. 111. రాధాకృష్ణన్ ముందు చెప్పిందే. పుట. 94.
3. టాగోర్. 'ది సైకిల్ ఆఫ్ స్ప్రింగ్' పుట. 18. రాధాకృష్ణన్ నుంచి గ్రహించడం జరిగింది. ముందు చెప్పిందే, పుట. 121.

తెలుసుకుంటాను."[1] ఈ రకంగా సత్యాన్ని భావించడమే కళకు, కవిత్వానికి ప్రధానమైంది. "ప్రాచీన భారతదేశంలో అలంకార శాస్త్రవేత్తలు సారస్వతాన్ని చదవడమే ఆనందదాయకమని చెప్పడంలో ఏమాత్రం సందేహించరు."[2]

ఇక్బాల్ జీవితతత్వాన్ని పరిశీలిస్తే, పుట్టుక నుంచి కష్టపడి పని చెయ్యాలి అనే భావన అందులో ప్రధానమైంది. టాగోర్ కూడా పనిమీదనే శ్రద్ధ చూపాడు. మార్పు అనేది, టాగోర్ సిద్ధాంతంలో ప్రధానమైంది. ఇక్బాల్, 'లెబెన్ సాన్స్ చుంగ్'లో కృషి, అందుకోసం పాటుపడ్డం అనేవి, నిర్మాణమంతటికీ ప్రధానమైనవి. ఆయన దృష్టిలో మానవ జీవితాదర్శం, తనది కానటువంటిదాంట్లో లీనం కావడం కాదు. తను స్వయంగా పైకి రావడం. దేవుడు నిరపేక్షకుడు, నిరాకారుడు. మనిషి కృషిచేసి తను చేయగలిగినంత చెయ్యాలి. తన వ్యక్తిత్వాన్ని అభివృద్ధి పరచుకొని దైవత్వానికి దగ్గరవాలి. తనచుట్టూ ఉన్న ప్రపంచాన్ని చూచి భయపడక, ప్రకృతి శక్తులను, చట్టాలను, తాను దైవ సాన్నిధ్యాన్ని పొందడానికి ఉపయోగించాలి. "నూతన ప్రపంచాన్ని ఊహించుకొని, అది ఎట్లుండాలి, తనలోని స్వార్థచింతన ప్రత్యేకతను సమగ్ర వ్యక్తిత్వాన్ని సాధించాలంటే, నిరంతర జీవిత కొనసాగింపుకు, వివిధ పరిసరాలను వుపయోగించుకోవాలి."[3]

సత్యాన్వేషణలో, సూఫీలు పేర్కొన్న క్రమశిక్షణకంటే, ప్రకృతిని జయించడం మంచిది మానవ వ్యక్తిత్వ పెంపుదలకు చేసే పోరాటం, ఇక్బాల్ పేర్కొన్నట్లు "మన జీవితాన్ని మలచుకోడం, మన తెలివితేటలకు వన్నె తేవడం, మానవ అనుభవాలతో, మనల్ని మనం వన్నె తెచ్చుకుంటూ, వైజ్ఞానిక ప్రయత్నంతో అడ్డంకులను తొలగించుకోడం"[4]

ప్రపంచాన్ని గూర్చిన విజ్ఞానాన్వేషణలలో ఎంత లోతుకు పోగల్గితే, అంత వైజ్ఞానికంగా, ఆధ్యాత్మికంగా ఎదగగల్గుతాం. "ప్రకృతి పరిశీలనలో, దైవత్వంతో ఏకం కావడానికి ప్రయత్నించాలి. ఇది ధ్యానంలో ఇంకో మార్గం"[5]

---

1 టాగోర్, వ్యక్తిత్వం పుట 22, రాధాకృష్ణన్ నుంచి గ్రహించడం జరిగింది పుట.131

2. టాగోర్, పైన చెప్పిందే, పుట. 8; రాధాకృష్ణన్, పైన చెప్పిందే, పుట 126.

3. ఇక్బాల్, పైన చెప్పిందే, పుట 73.

4 పైన చెప్పిందే, పుట. 15.

5. పైన చెప్పిందే, పుట. 58.

మంచి చెడ్డలకంటే ఉన్నతమైంది, సామాజిక న్యాయలకన్నా స్వేచ్ఛాయుతమైన మానవ వ్యక్తిత్వాన్ని కోరలేదు. ఇక్బాల్, వ్యక్తిత్వాభివృద్ధి, స్వేచ్ఛ, సోదరత్వం, సమానత్వంతో వ్యవస్థీకృతమైన సమాజంలోనే లభిస్తుందంటాడు. దైవభక్తి అనేది అవసరమే. టాగోర్‌లాగే, ఇక్బాల్ మానవత్వ సమైక్యత అవసరమని భావిస్తాడు. దానికి నైతిక జీవితం ఉండాలి. ఈ భావన భగవంతుని నుంచి సంక్రమించదు. సృష్టినుంచే లభిస్తుంది. మనుషులందరూ ఒకటే. నిరంకుశ మనుగడలో భాగమని కాదు. వారినందరిని సృష్టించింది భగవంతుడే. వ్యక్తిత్వ న్యాయం ప్రకారం మానవుని ఎదుగుదల చాలా ముఖ్యం. అతడు సత్యాన్ని తెలుసుకోవాలి. దేవుని ప్రతినిధిలా బతకాలంటే, ప్రకృతి శక్తులను నియంత్రించుకోవాలి. ఆధ్యాత్మిక జీవితంలో మునిగిపోవాలి. నీతికి, కళకు ఈ జీవితమే ముఖ్యమైన ఆదర్శం.

ఇక్బాల్, టాగోర్ ఇరువురికీ కళలన్నీ సత్యాన్వేషణకు ఉపకరిస్తాయన్న సిద్ధాంతంలో నమ్మకముంది. కళ నిర్వర్తించాల్సిన విధుల విషయంలో ఇద్దరికీ తేడా ఉంది. ఇక్బాల్ దృష్టిలో ప్రధానంగా కళ అంటే ఆత్మకు, పరమాత్మకు తేడా లేక పోవడం. ఈ రెంటి మధ్య తేడాను పోగొట్టి మనిషి వ్యక్తిత్వాన్ని పెంపొందించడం, అతని జన్మ రాహిత్యానికి తోడ్పడ్డం. అది విరామం కాని, పూర్తి మైకాన్ని కాని, ఏకీభావన కాని కోరుకోకూడదు. సృజనాత్మకమైన విరామ రాహిత్యాన్ని, మార్పు చెందుతున్న ఉత్సాహాన్ని, వేదాంత సంబంధమైన ఉత్సాహాన్ని పొందాలి. "కళ ఉద్దేశం, జీవితానికి సంబంధించిన అనంతత్వాన్ని పొందాలి. ఉచ్ఛ్వాసాల్లాంటి కొన్ని క్షణికమైన ఆనందాలు కావు. కవిత్వ ఝరీ, సంగీత విద్వాంసుని గానమాధుర్యం, పూలు, దుఃఖపూరితంగా ఉండడం, ఉదయాన వీచే గాలి కాదు. ఒక అద్భుతం జరగకుంటే, అణగారి పోయిన దేశాలు మరల అవతరించవు. నిజమైన కళ మోసెస్ తన గారడీతో అద్భుతాన్ని కలిగించినట్లు నైలునదీ లోయల్లో చొచ్చుకుపోతుంది."[1]

ఈ విధంగా వాల్టన్ ఛాంగ్, అస్పష్టమైన క్షణికంలాగే, ఆధునిక హిందూ, ముస్లిం విద్యాధిక వర్గాలు, టాగోర్, ఇక్బాల్ తత్త్వాల్లో ప్రతిబింబిస్తారు. భారతీయ తత్వంలో, మతస్ఫూర్తితో పయనించే పాయలు రెండింటికీ ఆధార మొక్కటే. అవి ఒకే వైపున పయనిస్తున్నాయనే విషయం తేటతెల్లమౌతుంది.

---

1. ఇక్బాల్, పైన చెప్పిందే.

అందువల్ల, రెండింటికీ తేడా లేదు. ఆలోచనా విశ్లేషణల్లో హిందూ, ముస్లిం మతాలనే తేడాతో వచ్చిన రెండు పాయలు మాత్రమే ఇవి. మరల అవి కలుసుకొంటాయి. జీవితంలో సామాజిక, నైతిక, రసానుభూతి కల్గినప్పుడు అవి ఒకటౌతాయి.

హిందూ, ముస్లింల జీవితాల్లోని ప్రధానాంశాలను పరికించినప్పుడు, రెండు వందల సంవత్సరాల నుంచి ప్రత్యేక ఉద్యమాలు తల ఎత్తినా, అక్బర్ కాలం నుంచీ ఏర్పడ్డా సాంస్కృతిక సమ్మేళనమనే అంశం ఇంకా చెరిగిపోలేదు. ఆధునిక పాశ్చాత్య సంస్కృతీ ప్రభావాల మూలంగా రెండింటికీ సంబంధించిన సమానాంశం కూడా దృఢపడింది.

హిందూ, ముస్లిం నైతిక భావాలు, భిన్నమైన తాత్విక దృక్పథాలతో తలెత్తినప్పటికీ, రెండు మతాల మౌలికమైన మతానుభవాలు ఒక్కటే. భౌతిక, ఆర్థిక పరిస్థితులు, ఆచరణలోని నైతిక శిక్షా స్మృతులు సమానమే. ఇక్కడ మనం రెండు ఉదాహరణలివ్వవచ్చు. దేవునిపై ఉన్న భక్తి భావం, ప్రేమ రెండు మతాలకు సమానం. నిస్వార్థపరత, సంఘసేవ, ఔదార్యం, తమ బంధువులపై అపారమైన ప్రేమ, అతిథి మర్యాదలు, దాన, ధర్మ గుణాలు (క్రైస్తవులు పాటించే 'చారిటీ') ఇరువురికీ సమానమే గ్రీకుల నాలుగు సూత్రాలకంటే, ఇవి ప్రధానమైనవే. ఈ గుణగణాలను ఇద్దరూ తుదిదాకా లాగి అవలక్షణాలుగా తయారు చేసేంత వరకూ వెడతారు. నిస్వార్థం, సేవ, ఆతిథ్యం, అనే మంచి గుణాలను దుబారాపరులు, నిష్క్రియాపరులు, విచక్షణా రాహిత్యంగా దుర్వినియోగం చేస్తారు. ఔదార్యం మూలంగానే, వృత్తిగా చేసుకున్న బిక్షగాళ్లు, పరాన్నభుక్కులు తయారవుతారు. బంధువుల పట్ల ఆదరణ మంచిదేకాని బంధుప్రీతి విపరీతంగా పెరిగిపోతుంది 'మురవ్వత్' (Muruwwat) అనే అరబ్ పదానికి శరణాగత రక్షణ అనే అర్థం ఉంది. భారతీయుల్లో సర్వ సాధారణంగా ఉండే దయాదాక్షిణ్యాలని చెప్పవచ్చు. ఇప్పుడది వెన్నెముక లేని ఔదార్యంగా మారిపోయింది.

మితం, వినయం, శీలం అనే గుణాలకు హిందూ, ముస్లింలు ఇరువురూ ప్రాముఖ్యాన్నిస్తారు. పాశ్చాత్యులకు, వీళ్ళకు ఉన్న తేడా ఏమంటే, ఆస్తికి సంబంధించిన నేరాలనే పాశ్చాత్యులు పరిగణనలోకి తీసుకుంటారు; కాని, శీలానికి అంత ప్రాధాన్యత ఇవ్వరు. హిందూ, ముస్లింలు దొంగతనంకన్నా శీలానికే ఎక్కువ ప్రాముఖ్యాన్నిస్తారు.

ఇంకా సమానమున్న లక్షణం ముఖ్యంగా కుటుంబ జీవితాన్ని గూర్చి, ముస్లింలకు సాంఘికపరమైన తేడాల్లేవని, సామాజిక క్రమానుగత శ్రేణి లేదని భావిస్తాం. కులవ్యవస్థలాగే వీళ్ళకు, వంశపారంపర్యవృత్తి సముదాయాల మధ్య వ్యత్యాసముంది. హిందువుల కుల వ్యవస్థకు, ముస్లింల సామాజిక సముదాయాలకు మధ్య తేడా కొంత ఉంది ఛాందసులైన ముస్లింలు విభిన్న సామాజిక సముదాయాలకు చెందినా కలిసి భోజనం చేస్తారు. హిందువుల్లో ఇలా జరగడం ఒక కల మాత్రమే వారి మధ్య వివాహ సంబంధాలుండవు

ఇరువురి కుటుంబ వ్యవస్థలు ఒకే పద్ధతిలో వుంటాయి. కుటుంబంలో, పాశ్చాతుల్లా ఒక చిన్న విభాగం భార్య, భర్త, బిడ్డలు అనేటట్లుగాక ఉమ్మడి కుటుంబ వ్యవస్థగా ఉంటుంది.

హిందూ ధర్మ శాస్త్రాన్ననుసరించి, ఉమ్మడి కుటుంబ ఆస్తి అనేది, ముస్లింల్లో షారియా మరణించిన వారి ఆస్తులు భార్యా బిడ్డలకు పంచాలనే విషయంలో సమానంగా లేవు. ఇరువురిలో నెలసరి ఖర్చు కుటుంబ పెద్ద అయిన తండ్రి నిర్వహించడమనేది సాధారణమే. సాధారణంగా కుటుంబమంతా, ఒకవేళ ఉమ్మడి కుటుంబమైనా, ఒక వ్యక్తిపై ఆధారపడ్డం, అతని మరణానికి దారి తీస్తుంది. కుటుంబ సభ్యులు, ఆర్థిక విషయాల్లోనే కాక, ప్రతి చిన్న విషయంలో కూడా తమ సొంతవైనా, కాకపోయినా జోక్యం చేసుకుంటారు.

పెద్దవాళ్లకు, ముఖ్యంగా తల్లితండ్రులకు, విధేయత చూపడం హిందూ, ముస్లింలిద్దరికీ సమానమే. భార్య కూడా భర్తకు విధేయురాలే ముస్లిం, హిందూ కుటుంబాల్లో స్త్రీ పరిస్థితి సమానమే ఇస్లాం మతం స్త్రీకి ఎక్కువ హక్కులు ఇచ్చినా, ఆచరణలో, పురుషులకు స్త్రీలు లోబడాలి. ముస్లిం సమాజంలో, స్త్రీలను ప్రత్యేకంగా ఉంచడమనే కారణంగా, వాళ్లు 'పర్సనల్ లా' ఇచ్చిన హక్కులను వినియోగించలేకున్నారు. ఎక్కువ చదువుకోడం లేదు. అజ్ఞానం వల్ల వాళ్లు తమ హక్కులను గూర్చి తెలుసుకోలేక పోవడమే గాక, నిస్పృహాయులుగా ఉన్నారు. క్రిందటి దశాబ్దిలో ఈ పరిస్థితికి కొంత మార్పు వచ్చింది. హిందూ స్త్రీలలో, కొంత తక్కువ స్థాయిలో - ముస్లింలలో, విద్యావంతులైన వారిలో తమ ఆత్మ గౌరవాన్ని, హక్కులను, గట్టి ప్రయత్నంతో కాపాడుకోవాలని, సమాజంలో సముచిత స్థానాన్ని పొందాలని ప్రయత్నిస్తున్నారు.

ఆహారం, వేషధారణ, దైనందిన జీవన విధానం దాదాపు సమానమే. కొన్ని తేడాలున్నప్పటికీ, అవి ప్రాంతీయమైనవే కాని, మత సంబంధమైనవి

కావు. ఉత్తర హిందూస్థానంలో, ఈనాటికీ హిందూస్తానీ సంస్కృతి అభివృద్ధి చెందుతూనే ఉంది. పుట్టుక, వివాహం, మరణం, హిందూ, ముస్లింలలో సమానమే.

హిందువులను, ముస్లింలను కలిపే శక్తివంతమైన అంశం, మొగలాయిల కాలంలోని లలిత కళలు. కళకు సంబంధించిన తాత్విక చింతన (టాగోర్, ఇక్బాల్ చెప్పినట్లు) వేరుగా ఉండవచ్చు. కాని, వారి మనస్సులను కలిపిన భావం, వైజ్ఞానిక అనుభవాలకన్నిటికీ అతీతమైన భావం, రసానుభూతియే. కళను గురించి ఆలోచించినప్పుడు అందరూ భారతీయులే. హిందువులైనా, ముస్లింలైనా ఒకే ప్రవాహంలో జీవితాన్ని గడుపుతున్నవారే. చల్లనైన వాతావరణంలో సేదదీర్చుకున్నవారే. భిన్న ప్రాంతాలకు చెందిన వారైనా, భిన్నమైన భాషలు మాట్లాడినా, ఒకరి భాషాపదాలు ఇంకొకరికి అర్థం కాకపోయినా, వారి హృదయాంతరాళాల్లో వున్న భాష ఒక్కటే. ఏ కళను తీసుకున్నా, హిందూ, ముస్లిం కళాకారులు సోదరులే. ఈ సౌభ్రాత్రభావమే, భారతదేశ సాంస్కృతిక సమైక్యతకు ఆశాకిరణం.

వీటికి తోడు సాంస్కృతిక జీవితానికి, ఇంకా కొన్ని శక్తులు తోడ్పడ్డాయి. ఆధునిక పాశ్చాత్య ప్రభావాలు, ప్రధానంగా ఇంగ్లీషు భాష, ప్రజాస్వామ్య భావాలు, సంస్థలు. ఉదార దృక్పథం, శాస్త్రీయ దృష్టి, ఆర్థిక పరిస్థితులకు సంబంధించినవి. ప్రధానమైన ఈ అంశాలన్నీ, ముస్లింలు స్వల్పసంఖ్యాకులైనా, జాతీయ సంస్కృతిలో భాగస్వాములయ్యేందుకు దోహదం చేస్తున్నాయి. విభిన్నతకు ఈ సంస్కృతి అవకాశం ఇవ్వాలి.

దురదృష్టవశాత్తూ, కొంతమంది హిందువుల ఆలోచనలను బట్టి, భాషా విధానంలో ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పడ్డం, ముస్లింల భయాందోళనలకు తావిచ్చింది. సాంస్కృతిక ప్రత్యేకతల అభివృద్ధికి ఎక్కువ అవకాశం ఇవ్వలేదు. 1937-47 మధ్య ఏర్పడ్డ వేర్పాటువాదం, ఆనాటి ఆర్థిక దుస్థితి, జమీందారీ విధానం రద్దు, రాష్ట్ర సర్వీసుల్లో ముస్లింలను ఎక్కువ తీసుకోకపోవడం, ముస్లింల మధ్య తరగతి వర్గాల్లో, నిరుత్సాహాన్ని కల్గించింది. రాజ్యాంగ శాసనం మూలంగా, లభ్యమైన హక్కుల విషయంలో కూడా, ఇతరులు జోక్యం చేసుకుంటున్నారనే భావం ఏర్పడింది. వారి మనఃక్లేశాలను రాబోయే అధ్యాయంలో చూద్దాం. అయితే, భారతీయుల్లోని ముస్లింలను గురించి ఆలోచిస్తే, వారొక ప్రత్యేక ప్రతిపత్తిలో వున్నారన్న భావన

హిందువుల్లో లేదు. అందువల్ల దీనికి సత్వరమైన పరిష్కార మార్గాన్ని ఆలోచించాల్సి ఉంది. ఉత్తర హిందూస్థానంలోని ముస్లింలు, ఢిల్లీ సుల్తానుల కాలం నుంచి, ఈనాటి వరకు, జమీందారీ లేక జాగీర్దారీ విధానంపై గాని, రాష్ట్ర సర్వీసులపై ఆధారపడ్డవారే. జమీందారీ హక్కులు పోయాయి. రాష్ట్ర సర్వీసుల్లో వాళ్ల వాటా తగ్గింది. లభ్యమయ్యే ఉద్యోగావకాశాలు తక్కువ. దినదిన గండం నూరేళ్ళాయుస్సులాగ పరిస్థితులు తయారయ్యాయి. రాష్ట్రం తీసుకున్న చర్యల మూలంగా, గట్టి దెబ్బ తిన్నవారు ముస్లింలే. ఉద్యోగ సమస్య, ముస్లిం మధ్య తరగతి వర్గానిదే కాకపోయినప్పటికీ ఎక్కువ బాధ పడ్డ వాళ్ళు వాళ్లే. వాళ్ళ మీద శ్రద్ధ చూపించాలి. ముస్లింల, ఇతర అల్ప సంఖ్యాక వర్గాల ఆర్థిక ఇబ్బందులు, సాంస్కృతిక క్లేశాలను పోగొట్టడానికి, ప్రభుత్వం ప్రయత్నిస్తూనే ఉంది. ప్రభుత్వ విధానం, అనుకున్నంత ప్రభావాన్ని వాళ్లపై చూపలేకపోయింది. కారణాలు, విధాన అమల్లో ఉన్న నిర్లక్ష్యం, ముస్లిం మతనాయకత్వ నిర్లక్ష్య వైఖరి.

పై విషయాలను దృష్టిలో వుంచుకొన్నప్పుడు, ముస్లింలు చాలా ముఖ్యమైన అల్పసంఖ్యాక వర్గంగా కన్పిస్తుంది. మానసికంగా, ఆర్థికంగా దుస్థితికి గురయ్యారు. వారి సాంస్కృతిక హక్కులను పూర్తిగా గౌరవించ లేకపోయాం. ఇది సాంస్కృతిక సమైక్యతకు, దేశ ప్రగతికి మంచిది కాదు. దీన్ని పోగొట్టడానికి వీలైనంత వరకు ప్రయత్నాలు చెయ్యాలి. అంటే అసంతృప్తి పొందిన ముస్లింలు పాకిస్తాన్‌తో చేతులు కలుపుతారని కాదు. వారా దృష్టిలో లేరు. ఆ విధంగా చెయ్యలేరు కూడా. వీళ్లు ద్రోహపూరితమైన శక్తులకు తోడ్పడతారని కాదు, భారతదేశ సంస్కృతికి, ప్రగతికి తోడ్పడ్డ ముస్లింలు, దేశ భవిష్యత్తుకు తోడ్పడగల శక్తి ఉన్నవారు, నిరుత్సాహంగా, సోమరులు కాకూడదు. దేశాభివృద్ధికి అడ్డుగోడలు కాకూడదు. వీళ్ళల్లో చాలామంది వృద్ధులు. 8 నుంచి 16 శతాబ్దాల్లో భారతదేశానికి వచ్చినవాళ్లు, పూర్తిగా భారతీయులయ్యారు. వీరి సమాజం భారతదేశంలో భాగమైంది. భారతీయత వీరిలో ఉట్టిపడుతూ వుంది. భారతీయ శరీరంలో ముస్లింలు ఒక ముఖ్యమైన భాగం. వీరు భారతదేశాభివృద్ధికి దోహదం చేసేవారు. వాళ్లు లేకుంటే, భారతదేశం అనే శరీరం అంతా దెబ్బ తింటుంది.

* * *

ముగింపుగా భారతదేశంలోని వివిధ భాషాప్రయుక్తమైన, మతపరమైన సమా

జాల్లో చాలా వరకు సాంస్కృతిక సమైక్యత ఉంది. భారతీయ ముస్లింలలో కూడా ఈ భావం ఎక్కువే. జాతీయ సమైక్యత అంటే, పూర్తి ఏకత్వమని కాదు. వివిధ ప్రాంతాలకు, వివిధ విభాగాలకు సంబంధించిన సంస్కృతిలో సామరస్యమేర్పడాలి. విశాలమైనదిగా, వైదిక హిందూ, బౌద్ధ, పురాణిక్ హిందూ, మొగల్ హిందూస్థానీ నాగరకతల నుంచీ, ఆధునిక పాశ్చాత్య సంస్కృతి నుంచీ, పొందిన వారసత్వాల మూలంగా ఏర్పడ్డ సామరస్య పూర్వకమైన సంస్కృతే దేశ సంస్కృతిగా భావించాలి.

# 15. నూతన జాతీయ సంస్కృతి కోసం

## 1 - భాషా సమస్య

స్వాతంత్ర్యం, రాజకీయ సమస్యకు పరిష్కారాన్నిచ్చినా, సంస్కృతి పరంగా సమస్య పరిష్కారం కాకపోగా, ఇంకా అధ్వాన్నస్థితికి వచ్చింది. స్వాతంత్ర్యానంతరం పాశ్చాత్య సంస్కృతి, ఆంగ్లభాష యొక్క ప్రభావం తగ్గనారంభించింది. దీంతో వివిధ ప్రాంతీయ సంస్కృతుల్లో విభిన్నత తారసిల్లింది. అధికార భాష, జాతీయ భాషల విషయంలో ఎంతో తేడా స్పష్టంగా కనిపించింది. మన జాతీయ సమైక్యతాభావం గట్టి పడాల్సిందిపోయి, బలహీనపడుతూ వచ్చింది.

స్వాతంత్ర్యానంతరం తల ఎత్తిన భాషావిభేదం, ఎంత ఉపద్రవంగా ఏర్పడ్డప్పటికినీ ఎదుర్కొక తప్పలేదు. ప్రజాస్వామిక రాజ్యాంగాన్ని అనుసరించాలంటే, అధికార భాషలో ఈ మార్పు తప్పదు. అధికారం చేజిక్కించుకున్న ఆంగ్లేయులకు, సామాన్య ప్రజల అంగీకారంతో పనేలేదు. వారు ఆంగ్లభాషను అధికార భాషగా చేశారు. ప్రాతినిధ్య ప్రభుత్వం ఏర్పడగానే, ప్రజలతో సన్నిహిత సంబంధం ఉండి తీరాలనే విషయం స్పష్టమైంది. ఎందువలనంటే వారు వారి భాషతోనే మాట్లాడాలి. అప్పుడే వారి విశ్వాసాన్ని చూరగొనడానికి అవకాశం ఏర్పడుతుంది.

ఏ ప్రాంతానికి చెందిన వారి ప్రాంతీయ భాషను, ఆంగ్లభాషకు బదులుగా స్వీకరించాలి. అదే విధంగా, కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలు పరస్పరం, ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకోడానికి, రెంటికీ సంబంధించిన ఒక అనుబంధ భాష ఇంగ్లీషుకి బదులుగా ఉండి తీరాలి.

స్వాతంత్ర్యానికి పూర్వం, భారత జాతీయ కాంగ్రెస్ మహాత్మాగాంధీ నాయకత్వాన, హిందూస్థాని భాషను జాతీయ భాషగా గుర్తించడం జరిగింది. అదే, స్వాతంత్ర్య భారతదేశ కేంద్ర ప్రభుత్వ భాషగా, సూచనగా స్పష్టీకరించడం

జరిగింది. అయితే, రాజ్యాంగాన్ని తయారుచేసే కాలానికి పరిస్థితులు అనుగుణంగా లేవు. ఎంతో కాలం, మల్ల గుల్లాలు పడిన తరువాత, కేంద్ర ప్రభుత్వ అధికార భాషగా దేవనాగరి లిపిలో హిందీని ఒక్క ఓటు ఆధిక్యతతో ఆమోదించడం జరిగింది. రాష్ట్రాలు వాటి అధికార కార్యక్రమ నిర్వహణకు, ఒక భాషను కాని, కొన్ని భాషలను కానీ, వాటి ఇష్టానుసారం స్వీకరించవచ్చు.

హిందీ అధికార భాష కావడానికి మూడు వ్యతిరేక అంశాలు ఉన్నాయి: (1) హిందూస్థానీ భాషను అంటే సంస్కృత పదజాలంతో ఉన్న లేక సాహిత్యపరంగా ఉన్న హిందీ భాషా ప్రాముఖ్యం 'హిందీ' మాట్లాడే ప్రాంతాల్లో కూడా తగ్గనారంభించింది. అంటే ఆ భాష మాట్లాడేవారి సంఖ్య చాలా స్వల్పం. (2). హిందీ మాట్లాడని ప్రాంతాలు, అనగా దక్షిణ దేశ ప్రాంతాల్లో, ఆంగ్లభాషకు బదులు, అధికార భాషగా హిందీని ప్రత్యామ్నాయంగా వాడితే, అఖిల భారత సర్వీసుల్లోనూ, కేంద్ర సర్వీసుల్లోనూ, హిందీ మాట్లాడే వారితో పోటీ పడలేమని, ఈ విషయాన్ని వ్యతిరేకించారు. (3) పాశ్చాత్య విద్యనభ్యసించిన వారు, అటు హిందీ కాని, ఇటు ఇతర ప్రాంతీయ భాషలు కాని, అధికార కార్యక్రమాలకు వుపయోగించడానికి, చాలాకాలం వరకు పనికిరావని అభిప్రాయపడ్డారు. ముఖ్యంగా న్యాయం, న్యాయశాస్త్ర విజ్ఞానం వంటి సిద్ధాంతాలను ఈ భాషల్లో అర్థం చేసుకోటం చాలా కష్టమని వారు భావించారు.

ఈ అభ్యంతరాలను దృష్టిలో వుంచుకొని, రాజ్యాంగంలో కొన్ని రక్షణలను కల్పించడం జరిగింది. హిందీలోని చిన్న చిన్న పదాలను, మెళకువలను, కొత్త నమూనాలను, సరియైన శైలిని హిందీ నుంచి కానీ, ఇతర భాషలోంచి సమానంగా సరిపడేట్లు చేసుకోడానికి, హిందీ భాషను సమగ్రంగా అభివృద్ధి చేసేందుకు, ఒక ఆదేశాన్ని కేంద్ర ప్రభుత్వం జారీ చేసింది. దీని ద్వారా రాబోయే పరిణామాలను దృష్టిలో పెట్టుకొని 1965 వరకు ఆంగ్లభాష అధికార భాషగా ఉంటుందని తెలిపింది. అవసరమైతే, ఆ తర్వాత కూడా కొంత కాలం వరకు ఆంగ్ల భాష ఉపయోగాన్ని పొడిగించ వచ్చని తెలియజేశారు. న్యాయశాస్త్రానికి సంబంధించి, సుప్రీంకోర్టులో గాని, హైకోర్టుల్లో కాని, పార్లమెంటు బిల్లులు, చట్టాలు, పార్లమెంటు చట్టం ద్వారా సవరించేంత వరకు, ఆంగ్లంలోనే కొనసాగుతాయని నిర్ణయించబడింది.

ముందు జాగ్రత్త కోసంగా రాజ్యాంగంలో మరో ఏర్పాటు గూడ చేశారు.

కొత్త భాషా విధానాన్ని అమలుపరచే ముందు రాష్ట్రపతి ద్వారా ఆదేశించిన రెండు కమిషన్లను 'అయిదు సంవత్సరాలకొకసారి, ఒకదాని తర్వాత మరొకటి నియమించాలి. ఈ కమిషన్లు దేశాభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని ప్రజాభిప్రాయాన్ని సేకరించి, భాషా విధానాన్ని ఎలా అమలు పరచాలో రాష్ట్రపతికి సిఫార్సు చేయాలి దేశ పరిస్థితులకు, ప్రాంతీయ ఇష్టానికి నష్టం జరుగనట్లుగా అమలుపర్చాలి. దాని మూలంగా మొదటి కమిషన్‌ను 1954లో నియమించడం జరిగింది. అది దాని నివేదికను 1956లో సమర్పించింది. రాజ్యాంగంలో పొందుపర్చిన, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించిన అంశాలను అమలు పర్చడంలో కొన్ని ఉపయోగకరమైన సూచనలు చేయడం జరిగింది.

భాషా ప్రతిపత్తికి సంబంధించిన సమస్యలకు, అంత త్వరగా, సులభతరమైన పరిష్కార మార్గం లభించడం కష్టం. భాషాపరమైన కమీషన్, నివేదిక ప్రచురించినప్పటి నుంచీ, దేశంలోని ఒకటి, రెండు రాష్ట్రాల్లో తప్ప, అంతటా స్పష్టమైన, నిర్మాణాత్మకమైన ఆలోచనా ధోరణి తలెత్తింది. భాషాదురావేశం క్రమేణా తగ్గుతూ అర్థం చేసుకోగల రాజీ ధోరణి తలెత్తింది. దాని మూలంగా భారత రాజ్యాంగంలోని గుర్తింపు పొందిన భాషలన్నీ, వాటి పలుకుబడిని బట్టి అభివృద్ధి చెందవచ్చు. అంతర్జాతీయ సాంస్కృతిక, వైజ్ఞానికాభివృద్ధికి ఆంగ్లభాష ప్రాధాన్యం వహిస్తుంది. వ్యవహార సరళిలో అందరికి అంగీకార భాషగా మారిన హిందీ, అనుసంధాన భాషగా ఉంటుంది. ఈ విధమైన కమిషన్ సిఫారసుల ఆమోదంలో నూతన జాతీయ సంస్కృతిని ఏర్పర్చుకోడానికి అవకాశముంటుంది. ఈ అనుసంధాన భాష, వ్యవహారిక హిందుస్తానీకి దగ్గరగా ఉండాలి. అప్పుడే హిందూస్థానీ సంస్కృతి నుంచీ, నూతన జాతీయ సంస్కృతిని ఏర్పర్చగలం. దాని కోసం వివిధ ప్రాంతీయ భాషలు విస్తృతమైన విషయ సంపత్తిని అందించగలుగుతాయి.

## 2 - నూతన సాంస్కృతిక సమన్వయ సమస్యలు

భారతదేశ చరిత్రలో, మూడు పర్యాయాలు, ప్రాంతీయ సంస్కృతులు, లేక సాముదాయక సంస్కృతులు, సమ్మిశ్రితమైనాయి. మొట్టమొదట ఆర్యులు, ద్రావిడులు, తర్వాత హిందువులు, బౌద్ధ మతస్థులు, చిట్టచివరగా హిందూ, మహమ్మదీయ సంస్కృతులు సమ్మేళనం చెందడం జరిగింది. ఈనాడు కూడా మనం అదే సమస్యను ఎదుర్కొంటున్నాం. కాని అది మరీ క్లిష్టంగాను,

ఎన్నో అంశములతో కూడుకొని ఉన్నది.

హేతుబద్ధమైన పరిష్కార మార్గాన్ని కనుగొనే ముందు, వేదకాల, లేక పురాణయుగం నాటి సంస్కృతిని పునరుద్ధరించాలనే వెర్రితనాన్ని మానుకోవాలి. అంటే, ఇతర దేశాల నుంచి వచ్చిన అంశాలన్నింటినీ విడనాడాలి. ముఖ్యంగా, ముస్లిం సంస్కృతి భారతీయ మేధాసంపత్తిలో, సౌందర్య విధానంలోకాని, సామాజిక జీవన సరళిలో కాని, రక్తనాళాల్లో కలిసిపోయిన ముస్లిం సంస్కృతి కూడా వుందన్నమాట. అయితే, యింతగా రక్తంలో జీర్ణించుకు పోయిన ఈ సంస్కృతీ అంశాలను తొలగించాలంటే సాధ్యం కాని విషయం. పైగా అలా చేస్తే, మన సంస్కృతి నిర్వీర్యమై, ప్రమాదకరమైన రక్త హీనతకు దారితీస్తుంది తప్ప, మరొకటి కాదు. ప్రప్రథమంగా ప్రస్తుతం అమల్లో ఉన్న సంస్కృతి ప్రధానంగా ఉత్తర హిందూస్థానపు సంస్కృతియే. అందువల్ల, దక్షిణ భారతదేశం మీద ఈ సంస్కృతి ప్రభావం చాలా తక్కువగా ఉంది జాతీయత అనేది తెల్సుకోవాలంటే, వివిధ ప్రాంతీయ సంస్కృతులను కూడా కలుపుకోవాలి ముఖ్యంగా దక్షిణ భారత సంస్కృతిని జీర్ణించుకోవడం చాలా అవసరం దీనికి, పూర్తి సాంస్కృతిక సంబంధాలు నెలకొనాలి కేంద్ర విద్యాశాఖ మంత్రాలయం 1950 దశాబ్ది చివరి భాగంలో, యువజన మహోత్సవాలను ప్రారంభించింది. ఇవి ప్రతి సంవత్సరం చలికాలం ప్రారంభంలో దేశంలోని పలు ప్రాంతాల నుంచి విశ్వ విద్యాలయ విద్యార్థులు పాల్గొనడానికి మంచి తరుణం అది. గానం, నృత్యం, నాటకం, చిత్రలేఖనం, శిల్పం మొదలైన వివిధ లలిత కళల్లో ఆరితేరిన వారు ఇందులో పాల్గొనేవారు దీని మూలంగా, వీరికి వివిధ ప్రాంతాల సాంస్కృతిక జీవితంలోని విశేషాలను దర్శించడానికి వీలు కలిగింది. అంతేకాక, విద్యార్థులు కలసి మెలసి, కొన్ని రోజుల పాటు జీవించటానికి అవకాశం ఏర్పడింది. ఇంతకు పూర్వం మూడు అకాడమీలు ఏర్పడ్డాయి ఒకటి లలిత కళల అభివృద్ధికి; రెండోది సంగీతం, నృత్యం, నాటకాల అభివృద్ధికి; మూడోది సాహిత్య అభివృద్ధికి పాటుపడ్డాయి అయితే ఈ అకాడమీలు, వాటి సభ్యులు కలసి మెలసి ఉండటానికి, కొన్ని రోజులు మాత్రమే అవకాశం ఇచ్చేవి. మిగిలిన కాలంలో, శాశ్వతమైన అనుబంధం ఏర్పడ్డానికి అవకాశం లేకపోయింది. వివిధ సంస్కృతీ సముదాయాలు కలిసి ఉండాలనే జాతీయ సంస్కృతి పురోభివృద్ధి చెందటానికి అవకాశం ఉండేది. గుప్తుల, మొఘలుల కాలాలనాటి సాంస్కృతిక పరిశోధనాలయాలుగా

పనిచేయాలంటే వీటిని సంస్థలుగా రూపొందించాలి. శాశ్వత సభ్యులకు అవి ఆలవాలరి కావాలి. ఆర్థికంగా ఉత్పన్నమయ్యే సమస్యలన్నింటికీ దూరమై, ఉదారమైన పెన్షన్లతో వారు హాయిగా కాలాన్ని గడపటానికి అవకాశం ఉండాలి. అటువంటపుడే, వారు పూర్తిగా ఈ కార్యక్రమంలో నిమగ్నులై, జాతికంతటికీ సంబంధించిన కళలను, సాహిత్యాన్ని అభివృద్ధి పరచటానికి కృషిచేస్తారు వాళ్ళలో నిబిడీకృతమైన శక్తి సామర్థ్యాలు పైకి రావటానికి అది చక్కని అవకాశం. వారందరిలో సమైక్యతా భావం ఏర్పడడానికి చక్కటి అవకాశం కలుగుతుంది. ఈ దృష్టితోనే భారత ప్రభుత్వం 'నేషనల్ బుక్ ట్రస్ట్' అనే సంస్థను ఏర్పరచింది 'ఆదాన్ ప్రదాన్' అనే కార్యక్రమం కింద, ప్రాంతీయ భాషల్లో వివిధ గ్రంథాలను తర్జుమా చేయటానికి, రచయితలకు ఇది మంచి అవకాశం

వేర్వేరు ప్రాంతీయ భాషల మధ్య ఏర్పడ్డ అడ్డంకులను తొలగించాలంటే, ఏర్పర్చాల్సిన ఇంకో విధానం ఏమంటే, ఒక ప్రాంతం నుంచి ఇంకొక ప్రాంతానికి ఉపాధ్యాయులను తరలించినట్లయితే, సాంస్కృతిక సమైక్యత ఏర్పడ్డానికి అవకాశం వుంది ఈ మార్పిడి వల్ల, ఎంపికైన ఉపాధ్యాయులు ఒక ప్రదేశం నుంచి ఇంకో ప్రదేశానికి మారినట్లయితే, ఎక్కువకాలం ఆయా ప్రాంత ప్రజలతో కలిసి ఉండటం వల్ల, ప్రాంతీయ సంస్కృతి అభివృద్ధి చెందటానికి అవకాశం ఏర్పడుతుంది వారియొక్క సంస్కృతుల్లో, విభిన్నమైన స్థానిక వైవిధ్యాన్ని ఒకే చోటికి తీసుకొని వచ్చినట్లైతే, భారతదేశ సంస్కృతిని ఏర్పరచుకోటానికి అవకాశం ఉంటుంది. అట్లాంటప్పుడు, వారికి ఉదారమైన వేతనాలను ఇవ్వాల్సి ఉంటుంది. ఈ ఉపాధ్యాయులు, జాతీయ అకాడమీలలోని సభ్యులవలె. జాతీయ సంస్కృతికి సృష్టికర్తలే కాక, జాతీయ సంస్కృతికి దూతలుగా కూడా ఉపకరిస్తారు.

మనం సాధించాలి అనుకున్న సంస్కృతీ సమ్మేళనంలో, రెండో అంశం ఏమంటే, మనంతట మనమే, కొంత తారతమ్యంలో పాశ్చాత్య సంస్కృతీ ప్రభావాన్ని కూడా అంగీకరించాము. రాజకీయ, ఆర్థిక ఒత్తిడుల మూలంగా బ్రిటిష్ పాలక వర్గం మనపై ఈ పాశ్చాత్య సంస్కృతిని రుద్దడం జరిగింది. పాశ్చాత్య సంస్కృతిని, విదేశీ పాలకులు మనపై రుద్దడం, అంటే మనపై బానిసత్వాన్ని రుద్దడం, మనల్ని దోచుకోడం. దీన్ని చాలా మంది తీవ్రంగా ఖండించారు. స్వాతంత్ర్యానంతరం, దురభిప్రాయాలు లేకుండా, వస్తు పరతా

దృష్టితో చూసినపుడు ఆధునిక పాశ్చాత్య నాగరకత మనకెంతో మేలు చేసిందని, ఎంతో విలువైందని గుర్తించడం జరిగింది. గత ముప్ఫయి సంవత్సరాల్లో భారత దేశాభివృద్ధిని సమీక్షిస్తే, మూడు మౌలిక లక్ష్యాలు, మనదేశ పునర్నిర్మాణ కార్యక్రమంలో గోచరిస్తాయి. అవి మతాతీత ప్రజాస్వామ్య రాజ్యం, సామ్యవాద తరహా సమాజం, పారిశ్రామికాభివృద్ధి. ఇవి పాశ్చాత్య దేశభావాల నుంచి వచ్చినవే. నిజానికి, ఈ లక్ష్యసాధన కోసం, మనం పాశ్చాత్య భావాలను గుడ్డిగా నమ్మనక్కర లేదు. మన పరిస్థితులకు, అవసరాలకు అనుగుణంగా వాటిని మలచుకోవాలి. అయినప్పటికీ, ఐరోపా, అమెరికా, సామ్యవాద ప్రపంచంనుంచి, ఎన్నో సాంఘిక, రాజకీయ సంస్థలను గురించి అధ్యయనం చేసి తెలుసుకోవాలి. ఆధునిక పారిశ్రామిక సమాజ నిర్మాణం కోసం, అభ్యున్నతిని సాధించిన రాజ్యాలనుంచి భౌతిక వనరులను, సాంకేతిక సహాయాన్ని పొందాలి. మన ఆధ్యాత్మిక, నైతిక, సాంస్కృతిక జీవితాన్ని మలచుకోవడంలో, మన వారసత్వం పైనే ఎక్కువగా ఆధారపడాలి. కానీ రాజకీయ, ఆర్థిక జీవన విధాన పునర్నిర్మాణంలో మాత్రం పాశ్చాత్య దేశాలపై ఆధారపడక తప్పదు. అది సబబే.

పారిశ్రామికీకరణ ప్రణాళికల్లో విజయాన్ని సాధించాలంటే, కొంతవరకైనా, మనం మన నైతిక విలువల్ని పునరుద్ధరించుకోవాలి. ఏ దేశమైనా, ఆర్థిక విలువను, నికరమైన భౌతిక విధానంగా మాత్రమే పరిగణించి తోసి పుచ్చితే, పారిశ్రామికాభివృద్ధికి అవసరమైన త్యాగాన్ని, మొండి ప్రయత్నాన్ని చేయలేదు. మనం మానవ జీవితాన్ని గౌరవిస్తే ప్రజల మనుగడకవసరమయ్యే ఆర్థిక వనరులను కూడ మనం గౌరవించగలం. కోట్ల సంఖ్యలోనున్న మనదేశ ప్రజలను, బాధల నుంచి, దారిద్ర్యం మూలంగా ఉత్పన్నమయ్యే అవమానాల నుంచి, రక్షించడమే మన పవిత్ర బాధ్యత అనుకుంటే, దానికి ప్రధానంగా అవసరమైన ఉత్పత్తిని పెంపొందించాల్సిన బాధ్యత కూడా వుంది. భోగ భాగ్యాలను అనుభవించడం కాదు. ప్రజల మనుగడకవసరమైన కనీస సౌకర్యాలను ఒనగూర్చాలి. వారి జీవితం, ఎంతో హుందాగా, ఆత్మగౌరవంతో, సుఖంగా కొనసాగాలనడం భౌతిక తత్వం కాదు. ఇది ఆధ్యాత్మికంగా ఎంతో ఎత్తులకు తీసుకొని పోయే మార్గం.

పారిశ్రామికాభివృద్ధికి కావల్సిన మరో లక్షణం, మూఢ నమ్మకాల నుంచి సాంప్రదాయ భావాలనుంచి వైదొలగి, విజ్ఞాన శాస్త్రాధ్యయనం చెయ్యడం.

దీని మూలంగా, మనం విజ్ఞానవంతులం కావడమే కాక, ఆసియా, ఆఫ్రికా ఖండాల్లో తీవ్ర ఆకలిబాధలకు గురవుతున్న ఎన్నో మిలియన్ల ప్రజానీకాన్ని ఆకలి బాధ నుండి రక్షించగలం.

అట్లే లౌకిక ప్రజాస్వామ్య రాజ్యాన్ని, సామ్యవాద సమాజాన్ని నిర్మించాలంటే, పాశ్చాత్య దేశాలనుంచి, సోషలిష్టు రాజ్యాలనుంచి రాజకీయ, ఆర్థిక సంస్థలనెన్నింటి నుంచో మనం అరువు తీసుకోక తప్పదు వీటిని, మన పరిస్థితులకు అనుకూలంగా మలచుకోవాలి. అంతేగాక, వారి నుంచి మత సామరస్యాన్ని, మేధాపరమైన సహనాన్ని పెంపొందించుకొని, వ్యక్తిస్వేచ్ఛను అభివృద్ధి పరచుకోవాలి. స్వేచ్ఛకు, సాంఘిక న్యాయానికి, రెండింటికి, సమతౌల్యాన్ని సాధించడానికి ప్రయత్నం చేయాలి. ఇతర దేశాల్లోని ప్రజల భావాలను, అలవాట్లను నిస్సంకోచంగా గ్రహించడానికి ఏమాత్రం సంకోచించనక్కర లేదు. రాజ్యాంగ శాసనాన్ని అనుసరించేటప్పుడు ఏ విధంగా అనుసరించామో, ఈ విషయాల్లో కూడా అలాగే వ్యవహరించాలి.

మన కొత్త జాతీయ సంస్కృతిని ఇంత విశాల దృక్పథంతో, బలమైన పునాదులతో నిర్మించాలనుకుంటే, సాంస్కృతిక సమన్వయానికి సంబంధించి ఇంకో పని కూడా చెయ్యాలి పట్టణాల్లో నివసించే ఉన్నత, మధ్య వర్గాల సంస్కృతితో అశేష గ్రామీణ ప్రజల సంస్కృతిని మేళవం చేయాలి. ఉన్నతమైన, సంపన్నమైన సంస్కృతి పట్టణాల్లో వుండేమాట నిజమైనా, దానికి మూలమైన జీవధాతువు గ్రామాల మట్టిలోనే వుంటుంది. సంస్కృతి అభ్యున్నతికి పట్టణ, గ్రామ. వాసుల మధ్య సన్నిహిత సంబంధం ఉండాలి. వీటి పరస్పర ప్రభావం ఎక్కువగా వుంటుంది. భారతదేశంలో ఇది మరీ అవసరం. ఎందుకంటే. గడచిన నూట యాభై సంవత్సరాల్లో ప్రాక్పశ్చిమ దేశాల నుంచి ఎన్నో సాంస్కృతిక అంశాలను గ్రహించి పట్టణాల్లో నిలుపచేశారు. ఇవి, పూర్తిగా మన సంస్కృతిలోకి చొచ్చుకొనిపోయి, సామరస్యాన్ని సమకూర్చలేక పోయాయి జాతీయ సంస్కృతిని సాధించడానికి. ఇప్పటికీ. దారిద్ర్యంతో, అజ్ఞానంతో కొనసాగించే గ్రామీణ ప్రజల సాధారణ జీవితానికి ఈ సాంస్కృతిక మౌలికాంశాలు ఉపయోగపడేలా ఉండాలి.

గతంలో, చిన్నపట్టణాలే, పట్టణాలకు, గ్రామాలకు, మధ్య సాంస్కృతిక సామరస్యాన్ని చేకూర్చాయి. ఆర్థిక పరిస్థితుల్లో వచ్చిన మార్పుల వల్ల, ప్రధానంగా జమిందారీ విధానం రద్దువల్ల, ఈ పట్టణాలే గ్రామాలుగా

మారిపోవడం, పట్టణ, గ్రామీణ సంబంధాలు బాగా సన్నగిల్లడం జరిగింది. ఈ విపత్తునుంచి రక్షణ కావాలంటే, పారిశ్రామిక విధానంలో మార్పు తేవాలి. పరిశ్రమలన్నీ పెద్ద పెద్ద పట్టణాల్లో గాక, పల్లెటూళ్ళలో నిర్మించాలి. దానిమూలంగా గ్రామాలు చిన్న పారిశ్రామిక పట్టణాలుగా అభివృద్ధి చెందుతాయి. జానపద కళలను, సంస్కృతిని, రేడియో, దూరదర్శన్‌ల ద్వారా పట్టణాల్లో వ్యాపింపజేస్తున్న ప్రభుత్వ విధానం చాల ఉపయోగమైంది. అట్లే, పట్టణాలకు సంబంధించిన కళలను, సంస్కృతిని గ్రామాలకు తేవాలి. ఆర్థికాభివన్రృద్ధి, పారిశుద్ధ్యం, విద్య, వీటితోపాటు, కళలను, సంస్కృతిని అభివృద్ధి పరచడానికి, మన గ్రామీణాభివృద్ధి పథకాల్లో చోటు కల్పించాలి. కళాకారులు పట్టణాల నుంచి, గ్రామాలకు పోయి సంస్కృతీ ఔన్నత్యాన్ని, అభిరుచుల గూర్చి చెప్పాలి. గ్రామీణ జీవితపు మూల కందాలైన జీవితంపై విశ్వాసం తోటి మానవుని ప్రేమించడం లాంటి విలువలను అలవర్చుకోవాలి.

కళ, సంస్కృతులపై నున్న సంకుచిత కులీనవర్గ స్వభావాన్ని, వ్యక్తివాద సిద్ధాంతాలను విడనాడి, పట్టణ, గ్రామీణ, లేక ఉన్నత, మధ్య వర్గాల ప్రజలందరి సాంస్కృతిక విలువలను సమన్వయ పరిస్తే ఒక విస్తృత పరిధిలో జాతీయ సంస్కృతి సాధ్యమవుతుంది. కులీన సంస్కృతి, జమిందారుల కాలం నుంచి అభివృద్ధి చెందింది అది సమాజంలోని ఉన్నత వర్గాల ప్రత్యేక విలువల భూస్వాముల ప్రతీక. అది కేవలం వాళ్ళ సృజనాత్మకతయే. కనుక అనుభవం కూడా వారిదే. వ్యక్తివాద సాంస్కృతిక సిద్ధాంతం ప్రకారం సంస్కృతి మానవుడిలోని సృజనాత్మక శక్తులతో వికసించింది. అవి, ఏ ఆటంకం లేని వాతావరణంలోనే అభివృద్ధి చెందుతాయి. ఈ సిద్ధాంతమే మతంలో సాంప్రదాయాలకు బద్ధుడు కాకపోవటానికి, ఆర్థిక జీవన విధానంలో పెట్టుబడిదారీ విధానానికి, కళల్లోని జాతీయశైలి పొడచూపడానికి కారణమైంది మనం ఇక్కడ ఈ భావాలను గూర్చి అంత విపరణకు పోనక్కరలేదు. మనం ప్రజాస్వామ్య, సామ్యవాద సమాజంలో నమ్మకం ఉందని చెప్పడమే చాలు. అటువంటప్పుడు మనం సంస్కృతిలో ఉన్నత వర్గ వ్యక్తిగత భావాలకు చోటు ఇవ్వనక్కర లేదు. సంస్కృతి ఒక ఉన్నత వర్గాలకు చెందిందనడం ప్రజాస్వామ్య విరుద్ధం. వ్యక్తిగతమైన వికారాలకు ఆస్కారం ఇవ్వడం సమాజానికే హానికరం, అట్లే సామ్యవాదానికి వ్యతిరేకం. ఏ సమాజంలో స్వేచ్ఛ, సమానత్వాల సమతౌల్యం ఉంటుందో ఆ సమాజంలో సంస్కృతి

విశ్వజనీన సామరస్యానికి దోహదం చేస్తుంది. ఇది మనుష్యులందరికీ సమానం. అది ఉన్నత వర్గం వాడైనా, తక్కువ వాడైనా, ధనికుడైనా, పేదవాడైనా అందరికీ అందుబాటులో ఉండాలి. వ్యక్తి తన శక్తులన్నీ వినియోగించుకొని, కళలు, సంస్కృతి అభివృద్ధి చెందాలంటే పూర్తి స్వేచ్ఛ ఉండాలి. అయితే, సమాజంలో అత్యధిక ప్రయోజనాలకు వ్యతిరేకంగా ఉండరాదు.

దేశం, ఒక కళాకారునిపై, సమాజ ప్రయోజనాల కోసం, ఒత్తిడి తీసుకుని రాకూడదు. ఆ రకంగా కళను, సంస్కృతిని దాస్యం చేయించాలని చూడరాదు. పౌర, సాధారణ శాసనాలకు వ్యతిరేకంగా ఉన్నప్పుడు మాత్రమే కళను కాని సంస్కృతిని కాని ఆటంక పరచవచ్చు. అంతేకాని, ఇంతకంటే అధిగమించి దేశ ప్రజల సాంస్కృతిక జీవన విధానంలో జోక్యం చేసుకోడం మంచిది కాదు. అట్లే, వాటి లక్ష్యాలను విధానాన్ని నిర్ణయింపరాదు. ఆ విధంగా చేసినట్లైతే స్వేచ్ఛను గొంతు నులిమినట్లే. స్వేచ్ఛ లేనిచోట, కళ కాని, సంస్కృతి కాని అభివృద్ధి చెందలేదు. ప్రజాస్వామ్య సమాజంలో కళను, సంస్కృతిని నిర్దేశించడం, నియంత్రించడం ప్రజాభిప్రాయానికే వదిలి వేయాలి. భారతదేశంలో సాంఘిక శ్రేయోరాజ్య స్థాపనకు కృషి చేస్తున్నాం. అటువంటప్పుడు కళను, సంస్కృతిని అభివృద్ధి పరచడం ఆ రాజ్య కర్తవ్యం. అట్లే, ఆర్థిక సహాయం చేయడం సాంస్కృతిక సంస్థలకుగానీ, వ్యక్తులకు గానీ చాలా ప్రధానమైన అంశం. దీని మూలంగా వారి ఆలోచనా సరళిని పరిమితం చేయడం సబబు కాదు. లేక ఈ సాధనంతో వారిని దోపిడీ చేయరాదు. అయినప్పటికీ సాంస్కృతిక జీవితాన్ని కొంతవరకూ నియంత్రణ చేయుడం కూడా అవసరమే. ప్రభుత్వం, శాసనాలను రూపొందించి దేశ సాంస్కృతిక సంపదను కాపాడాలి ఇవి వినాశనం కాకుండా చూడ్డం రాజ్యకర్తవ్యమే. ఉదాహరణకు, అసభ్యమైన పుస్తకాలను గాని, కళారూపాలను గాని దేశ పొలిమేరలను దాటకుండా శాసనాల రూపంలో ఆపడం రాజ్యం యొక్క కర్తవ్యం. ఎవరైతే చారిత్రక భవనాలను, పురావస్తు శాస్త్రానికి సంబంధించిన వస్తువులను చెడగొడతారో, చూడకూడని గ్రంధాలను కాని, చిత్రలేఖనాలను కానీ, సినిమాలను కానీ ప్రోత్సహిస్తారో వారిని శిక్షించాల్సిన అవసరముంది. ఈ నియంత్రణల పరిమితులను చెప్పడం చాలా కష్టం. అధికారంలో ఉన్న పార్టీ కోసమో లేక ఇతర పార్టీల కోసమో మతం కోసమో, వర్గం కోసమో అధికారాన్ని చెలాయించరాదు. ఆ అధికారం ప్రజాప్రయోజనం

కోసం, ప్రజానీతి కోసం చేసినట్లైతే ఎంతో ఉపయోగకరం.

ముగింపుగా, ఇంతవరకూ చెప్పినదాన్ని సమీక్షిస్తే, చరిత్ర పునరావృత్త మౌతుంది. ఎక్కడైతే అపకేంద్ర బలాలు అధిగమిస్తాయో అక్కడ దేశ సాంస్కృతిక క్షీణతకు విపత్తు ఏర్పడుతుంది. అట్టే రాజకీయ అరాచకత్వం, విదేశీ పెత్తందారీతనం చోటుచేసుకుంటాయి. ఇంతకు ముందు ఈ సమస్యలను పరిష్కరించినట్లే, ఇప్పుడు కూడా మనం ఈ సమస్యను పరిష్కరించుకోవాల్సి వుంది. ప్రాంతీయ, సాముదాయక సంస్కృతులను సంరక్షించుకోవాల్సిన బాధ్యత వుంది. అట్లే నూతనమైన జాతీయ సంస్కృతిని కూడా ఏర్పరచుకోవాలి. మన ఉద్రేకాలు, కోరికలు పెనవేసుకుని, దేశ సమైక్యత, స్వేచ్ఛ వర్ధిల్లుతాయి. ఇది సాధించాలంటే పునరుద్ధరణ భావాలను వదలివేయాలి. హిందూస్థానీ సంస్కృతి ద్వారా జాతీయ సంస్కృతిని నెలకొల్పాలి. స్వేచ్ఛగా దాన్ని అభివృద్ధి పర్చాలి. వివిధ ప్రాంతాలనుంచి, అంటే గ్రామీణ పట్టణాల సంస్కృతి నుంచి గానీ, పాశ్చాత్య సంస్కృతి నుంచి గానీ అరువు తెచ్చుకొని అయినా దీనిని అభివృద్ధి పరచాలి. ఈ సాంస్కృతిక సంయోగం జాతీయ భాషనుంచి ఏర్పడుతుంది. ఎందుకంటే భాష సంస్కృతికి ఆత్మవంటిది.

భారతీయ సంస్కృతిలో, ఏకత్వంలో భిన్నత్వం అనేది విశిష్టమైన లక్షణం. నూతన జాతీయ సంస్కృతిని నిర్మించడానికి మన ప్రయత్నాలన్నింటికీ దీన్ని లక్ష్యంగా తీసుకోవాలి. దీనిమూలంగా మన సమస్యల్లో విజయం సాధించటమే కాక, యీ ఉదాహరణతో ఈనాడు ప్రపంచం ఎదుర్కొంటున్న అనేక సమస్యలకు పరిష్కార మార్గాలను చూపవచ్చు. ఆ విధంగా మానవ జాతి వైవిధ్యంలో సమైక్యతను సాధించగలం.

మన సామాజిక జీవన విధానానికి సంబంధించి, స్వాతంత్ర్యం అనేక ఒత్తిడులను పరిష్కరించ గలిగింది. అయితే కొన్ని నూతన సమస్యలు కూడా తలెత్తాయి. సామాజిక మార్పును స్వాతంత్ర్యం ముందూ, వెనుకా వచ్చిన ప్రధానమైన మార్పుల ధోరణులను పరిశీలించాలి. దీన్ని ఎంతో మంది సంఘ సంస్కర్తలు పరిష్కరించడానికి ప్రయత్నించారు. సమాజంలో పాతుకుపోయిన సాంఘిక దురాచారాలను పోగొట్టడానికి, ఉదార దృక్పథంతో పాటు పడ్డారు. సమాజ చట్రాన్ని కాక వ్యక్తిని సంస్కరించాలని ప్రయత్నించారు. స్వాతంత్ర్యానికి పూర్వం ఉదారవాద ప్రజాస్వామ్యం కూడా సాంప్రదాయ సామాజిక విధానంలో మార్పు తేవాలని ప్రయత్నించింది. స్వాతంత్ర్యానంతర

భారతదేశం, పారిశ్రామిక సమాజాన్ని నిర్మించాలనే ఉద్దేశంతో సామ్యవాద తరహా సమాజాన్ని రూపొందించాలని ప్రయత్నిస్తున్నది. ఇది చాలా మౌలికమైన మార్పు. దీని మూలంగా ఎన్నో కష్టాలను ఎదుర్కోవాల్సి ఉంటుంది. మార్పును ప్రతిఘటించకుండా మార్పుకు ఉత్పన్నమవుతున్న సమస్యలను తెలిసికొని వాటికి అనుగుణ్యమైన పరిష్కార మార్గాలను సాధించడమే మన కర్తవ్యం.

గత శతాబ్ది ప్రారంభంలో, కొందరు ప్రాజ్ఞులైన భారతీయ నాయకులు, సంఘ సంస్కరణలను ప్రవేశపెట్టడం, అత్యవసరమని భావించారు. స్త్రీ జాతి విముక్తి, అస్పృశ్యతా నివారణ, వైవాహిక, వారసత్వ చట్టాలలో ఉదారభావాలను సాధించారు. మత, సాంఘిక ఉద్యమాలు, వాటిని నడిపిన బ్రహ్మ సమాజం, ప్రార్థనా సమాజం, రామకృష్ణ మిషన్, సార్వజనీక సభ, సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ, ఇటువంటి సంస్కరణలనే తలపెట్టాయి. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత, మహాత్మాగాంధీ సంఘ సంస్కరణలో నిర్మాణాత్మక కార్యక్రమాన్ని తలపెట్టాడు. అందులో ప్రధానమైన అంశం, అస్పృశ్యతా నివారణ. ఈ అస్పృస్యతా నివారణ ద్వారా సాంఘిక, మత హక్కులను తక్కిన హిందువుల్లాగే వారును అనుభవించడానికి అవకాశాన్ని కలిగించాడు. వీటికి తోడు ఆర్థిక, రాజకీయ భద్రతలను కూడా కల్పించాడు. ఈ ఉద్యమాల వల్లను, సంఘ సంస్కరణ భావాల వల్లను అనేక మంది ప్రజల భావనలో మార్పు వచ్చింది. వీటి ప్రభావం వారి జీవితాల మీద వత్తిడి తెచ్చి, కొన్ని సాంఘిక సంస్కరణ చట్టాలను చేయించారు. ప్రధానంగా, బాల్య వివాహాలను నిషేధించడం, దళితులకు దేవాలయాల ప్రవేశం యిందులో ప్రధానమైనవి. బ్రిటీష్ ప్రభుత్వం రాజకీయ అవసరం మూలంగా సాంప్రదాయ వాదులను సమర్థించినప్పటికీ, ఈ చట్టాలను రూపొందించింది.

మనం ముందు పేర్కొన్నట్లుగానే, స్వాతంత్ర్యానికి ముందు సంఘ సంస్కరణ ఉద్యమాలు ప్రారంభించడానికి కలిగిన ప్రేరణ మానవత్వంలో ఉన్న స్వేచ్ఛకు, గౌరవానికి ప్రాముఖ్యం యివ్వడమనే కారణంతోనే. సంఘ సంస్కరణ వాదులు కుల, వర్గ, లింగ భేదాలు లేకుండా, ప్రతి వ్యక్తీ తనకు తాను అభివృద్ధి చెందడానికీ, తన భావాలను వ్యక్తీకరించడానికీ, పూర్తి అవకాశముండాలని భావించడం జరిగింది. సామాజిక నిర్మాణంలో మార్పు తీసుకు రాకుండానే, ఈ మౌలికమైన మార్పును తీసుకొని రావాలని భావించారు. ఉదాహరణకు: కులాన్నికాని, ఉమ్మడి కుటుంబ వ్యవస్థను కాని నిర్మూలించడం

అవసరమని వారు భావించలేదు. నిజానికి, హిందూ, సమాజ వ్యవస్థ అంతా ఈ విధానాల మీదనే ఆధారపడి ఉంది. ఈ విధానాల్లో ఉన్న పరిమితులను, కొంతవరకు సడలించడమే వారి ధ్యేయం. కాని కులం ఒక వైపు, ఉమ్మడి కుటుంబ వ్యవస్థ మరోవైపు ఉన్నప్పుడు వ్యక్తి అభివృద్ధికి కావాల్సిన స్వేచ్ఛకాని, భావ వ్యక్తీకరణకు అవకాశం కాని లభించవు. ధైర్యవంతులైన సంస్కరణ వాదులు కొందరు కుల వ్యవస్థను మార్చాలని ఉద్యమాన్ని లేవదీశారు. ఉమ్మడి కుటుంబ వ్యవస్థ విషయంలో వ్యవస్థీకృతమైన ఉద్యమాన్ని ఎవ్వరూ నిర్వహించలేదు. అయితే, అసంతృప్తి మాత్రం ఏర్పడింది. ప్రత్యక్షంగా తిరగబడ్డం మాత్రం జరగలేదు.

స్వాతంత్ర్యానంతరం, సాంఘిక సంస్కరణల విషయంలో ప్రభుత్వం, ప్రైవేటు సంస్థలు కలిసి కృషి చేశాయి. చట్టబద్ధమైన నిబంధనలను పరిశీలిస్తే, మన రాజ్యాంగం స్త్రీ, పురుషులకు, దళితులకు, తదితర హైందవ కులాలకు వ్యత్యాసం చూపలేదు. మన పార్లమెంటు, వివాహం, వారసత్వాన్ని గురించి అనేక ఉదార, అభివృద్ధికరమైన చట్టాలను చేసింది. చట్టానికి, ఆచరణకు సంబంధం లేకుండా పోయింది. ప్రభుత్వం ఈ చట్టాలను అమలు పరచడానికి ఎంతో కృషి చేసింది. దళితుల విద్య విషయంలోను, ఉద్యోగ విషయంలోను, ఎన్నో ప్రత్యేక అవకాశాలను కల్పించింది. స్త్రీలకు, వాళ్ళ తెలివి తేటలను బట్టి ఉద్యోగాలను, గౌరవాలను కలిగించింది. న్యాయస్థానాలు, స్త్రీల వివాహానికి సంబంధించి, వారసత్వానికి సంబంధించి పూర్తి న్యాయం చేకూర్చడానికి ప్రయత్నం చేశాయి. అయినా, సమాజంలో, పాత దురభిమానాలు, అసమానత్వం, అన్యాయం గతంలాగే పేరుకొని ఉన్నాయి. వీటిని పూర్తిగా నిర్మూలించడమనేది ప్రభుత్వం చేతిలో లేదు. న్యాయస్థానాల చేతిలోనూ లేదు. సంస్కరించాలనే ఉత్సాహం, సాధించాలనే తపన ప్రైవేటు వ్యక్తుల్లోనూ, సంస్థల్లోనూ ఉండాలి. సామాజిక, సాంస్కృతిక జీవితాల్లో సంస్కరణ, అభివృద్ధి అనేవి ప్రభుత్వం, ప్రజల మధ్య సహకారాన్ని బట్టి ఉంటుంది. ఎవరు, ఎంతవరకు, ఏ పనిని నిర్వహించాలో నిర్వహించడం, పరిమితులను ఏర్పరచడం మంచిది. సాధారణంగా, సిద్ధాంతాన్ని బట్టి సంఘ సంస్కరణ మూడు స్థాయిల్లో జరుగుతుంది.

1. సంఘ సంస్కరణను ఆశించే వ్యక్తులు, సంస్థలు మార్పు తేవడానికి ముందు ప్రజాభిప్రాయాన్ని సిద్ధం చేయాలి.

2. ప్రజలందరూ అంగీకరించినపుడు, వ్యతిరేక వర్గంలో మార్పుకోరని మొండివాళ్ళు, స్వప్రయోజనా పరులు వున్నప్పుడు, మార్పు తీసుకురావటానికి ప్రభుత్వం కొన్ని శాసనాలను చేయాల్సి వుంటుంది.
3. ఏ సంస్థలైతే సంఘ సంస్కరణలను తలపెట్టాయో, అవి ప్రభుత్వానికి సహాయం చేసి కొత్త శాసనాలను ప్రచారం చేసి ఆచరణ కోసం కృషి చేయాలి.

సంఘ సంస్కరణ విషయంలో, ప్రభుత్వంకంటే ప్రైవేటు వ్యక్తులే బాధ్యతను తీసుకోవాలి. ఈనాడు దేశం ఎదుర్కొంటున్న క్లిష్ట పరిస్థితుల్లో, రెండు ప్రధానమైన బాధ్యతలున్నాయి. ప్రజాదరణ పొందిన సాంఘిక సంస్కరణలు శాసనమై, వెనువెంటనే అమలులోకి వచ్చాయి. ఇవి సమాజ నిర్మాణంలో మార్పును తేవడానికి కూడా ఉపకరించాయి.

ముందు అనుకున్నట్లుగా, ఏ పరిస్థితులైతే ఇటువంటి మార్పుకు అనుకూలించాయో, అవే రాజకీయ స్వేచ్ఛకు ఫలితాలుగా పేర్కొనవచ్చు. ఇక్కడ రెండిటిని గురించి పేర్కొంటాం. ప్రాథమికమైన మానవ హక్కులను గురించి, మన రాజ్యాంగ శాసనం, విద్యావంతుల్లో వ్యక్తిస్వేచ్ఛ, బాధ్యతలను గురించి తెలియజేసింది.

రెండో అంశం, పారిశ్రామిక అభివృద్ధి మూలంగా, ప్రాథమిక దశలో అధిక సంఖ్యాక ప్రజల రాబడిలో మార్పు లేక పోయినప్పటికీ, జీవన విధానంలో పెరుగుదల కన్పిస్తుంది. ఈ రెండు అంశాలూ యువకుల్లో కాని, స్త్రీ - పురుషుల్లో కాని, పిల్లల్లో కాని, ప్రధానమైన మార్పును తెస్తాయి. సుఖమైన కుటుంబ జీవితాన్ని వదలి, ఆఫీసుల్లో, షాపుల్లో, ఫ్యాక్టరీల్లో పనిచెయ్యడానికి అవకాశాన్ని కల్పిస్తున్నాయి. ఫలితంగా, పెద్ద పెద్ద ఉమ్మడి కుటుంబాలు చితికిపోయి, భార్య, భర్త, పిల్లలు ఉన్న చిన్న చిన్న కుటుంబాలుగా పరిణామం చెందాయి. దానికితోడు, చాలా మంది పురుషులు, స్త్రీలు జీవితంలో వయసు ముదిరిన తర్వాత వివాహాలు చేసుకోవడం, అసలు చేసుకోక పోవడమూ, జరుగుతుంది. అంతేకాక, ప్రజలు కొందరు గ్రామాల నుండి పట్టణాలకు వస్తున్నారు. ఈ మార్పులు కొత్త సమస్యలకు దారి తీస్తున్నాయి. ఉదాహరణకు: ఒంటరిగా రక్షణ లేని జీవితాన్ని గడిపే అమ్మాయిలు ఎన్నో నైతిక, సామాజిక సమస్యలను ఎదుర్కొంటున్నారు. తల్లిదండ్రులిద్దరూ పనులకు పోయినపుడు, పిల్లల పెంపకంలో సమస్య ఎదురౌతుంది. వృద్ధాప్యంలో ఉన్న స్త్రీ, పురుషులు

తమను చూచే దిక్కులేకుండా ఉన్నారు. ఇల్లు లేక పోవడం, మురికి వాడలు ఎక్కువ కావడం మూలంగా, ఆరోగ్య సమస్యలు, నైతిక సమస్యలు తల ఎత్తుతున్నాయి. సంఘ సంస్కరణ వాదులు ఈ మార్పులకు మూడు విధాలుగా స్పందించవచ్చు. వాళ్ళు పారిశ్రామికాభివృద్ధిని పూర్తిగా వ్యతిరేకించవచ్చు. అభివృద్ధి చెందినా పాత సామాజిక విధానాన్ని కాపాడ్డానికి కృషి చేయవచ్చు. మార్పు కోసం ఇటువంటి సమస్యలు తల ఎత్తకుండా చూడవచ్చు. లేక పారిశ్రామికీకరణాన్ని అంగీకరిస్తూ, దాని మూలంగా ఉత్పన్నమైన సాంఘిక మార్పులను పరిష్కరించడానికి ప్రయత్నించవచ్చు.

మన దేశంలో పారిశ్రామికాభివృద్ధిని వ్యతిరేకించే వారి సంఖ్య ఎక్కువ. ఆర్థిక పరమైన ఈ సౌఖ్యం, ప్రజల ఆధ్యాత్మిక భావనకు అడ్డుగోడ అని భావించేవారున్నారు. సన్యాసి జీవితాన్ని కాని, నిరాడంబరమైన జీవితాన్ని కాని జీవించవచ్చునే వారున్నారు. పారిశ్రామికాభివృద్ధి మూలంగా సంక్రమించేది ఆర్థికపరమైన సౌఖ్యాలు మాత్రమే. పారిశ్రామికీకరణాన్ని వ్యతిరేకించడాన్ని మనం అర్థం చేసుకోవచ్చు. అయితే, ఆశ్చర్యకరమైన విషయమేమంటే, మన సంస్కరణ వాదులు పారిశ్రామికాభివృద్ధి మూలంగా దారిద్ర్యాన్ని, అనారోగ్యాన్ని పోగొట్టి, ప్రజల నైతిక, ఆధ్యాత్మిక జీవితాలను పెంపొందింప వచ్చని చెప్తున్నారు. అయినప్పటికీ, సాంఘిక జీవనంలో మనం పేర్కొన్న ఈ బాధలను పోగొట్టడానికి, మౌలికమైన మార్పును సూచించలేదు. పారిశ్రామిక దేశాల చరిత్రను చూస్తే, పారిశ్రామికీకరణం సామాజిక నిర్మాణంలో మార్పు తెచ్చింది. ఈ మార్పనేది తప్పదు. ఇది రాకుండా ఉండాలనుకోవటం కేవలం వ్యర్థం. హేతుబద్ధమైన, నిర్మాణాత్మకమైన దృక్పథంతో పరిశీలిస్తే, పారిశ్రామికాభివృద్ధి వల్ల ఉత్పన్నమవుతున్న ఎన్నో రకాల మార్పులను, వాటి మూలంగా వస్తున్న సమస్యలను ఎదుర్కోడానికి సంసిద్ధంగా ఉండాలి. విజ్ఞతతో చేసిన ప్రణాళికల వల్లను, సామాజిక శాసనాల వల్లను, సాంఘిక సంక్షేమ ఉద్యమ సంస్కారాల వల్ల, ఇతర దేశాలన్ని ఈ సమస్యలనన్నింటినీ తట్టుకొని నిలబడగలిగాయి. వాళ్ళ ఉదాహరణతో మనమెందుకు లాభపడకూడదు? మన పరిస్థితులకు అనుగుణ్యమైన పద్ధతులలో, మనలను మనం మలచుకుంటూ, పారిశ్రామికాభివృద్ధి మూలంగా ఉత్పన్నమౌతున్న అవసరమైన సాంఘిక ఫలితాలను పోగొట్టుకొనవచ్చు.

ప్రజాస్వామ్య సమాజాన్ని, సాధారణమైన ఆదర్శాలతో, అందరికీ

ఉపయోగకరమైన సంస్కృతినీ ఏర్పరుచుకోవాలంటే, మన విద్యావిధానంలోనే ప్రజాస్వామ్య దృష్టిని ఏర్పరిచి దేశమంతా ఒక్కటే అనే భావాన్ని కలిగించాలి. ఇందుకో ప్రధాన లక్ష్యం మన విద్యార్థీ విద్యార్థినులు, కులం, వర్గం, తేడా లేకుండా ఒకే విధానంలో నిర్బంధోచిత విద్యను నేర్చుకోవాలి. తెలివి తేటలున్న పిల్లలందరూ ఉన్నత విద్యను అభ్యసిస్తారు. రెండో లక్ష్యమేమంటే, మామూలుగా నేర్చుకునే విద్యకూ, వృత్తి విద్యకూ, లౌకిక మత ప్రాధాన్యమైన విద్యకూ, ప్రాథమిక దశలోనే తేడా వుంది. అందరి పిల్లలకూ పనికివచ్చే ఐక్య ప్రాథమిక విద్యా విధానాన్ని ప్రవేశ పెట్టినపుడు ఈ భేదం పోతుంది.

మొదటి లక్ష్యాన్ని చూచినపుడు, మన రాజ్యాంగ శాసనంలోనే ఆరు సంవత్సరాల నుంచీ పద్నాలుగు సంవత్సరాలు లోపు పిల్లలందరకూ నిర్బంధోచిత విద్యావిధానం ప్రవేశ పెట్టడం జరిగింది. ఈ విధానం పంతొమ్మిదొందల అరవై (1960) వరకు, అంటే పది సంవత్సరాల వరకు, ఆచరణలో ఉంటుందని తెలియజేయడం జరిగింది. కేంద్రప్రభుత్వం కాని, రాష్ట్ర ప్రభుత్వాలు కాని, అన్ని స్థాయిల్లో విద్యను అభివృద్ధి పరచాలని చాలా కృషి చేసినప్పటికీ, ఎనిమిది సంవత్సరాల తర్వాత కూడ ఈ లక్ష్యాన్ని సాధించలేదు. సమాన అవకాశాలు, ఉన్నత విద్యను అభ్యసించడానికి ఏర్పాటు చేసినప్పటికీ, పరిస్థితి అసంతృప్తికరంగానే ఉంది. బీద కుంటుంబాలలోని పిల్లలు ప్రాథమిక విద్య తర్వాత చదువు కోవాలంటే ప్రభుత్వం ఉపకార వేతనాలను ఇవ్వాల్సి ఉంది. ప్రభుత్వం ఉపకార వేతనాలు మినహా, దళితుల పిల్లలకు కాని, వెనుకబడ్డ తరగతులకు కాని ఏ సహాయం చెయ్యలేదు. బలహీన వర్గాల్లో తెలివిగల పిల్లలకు మాత్రమే ఈ స్కాలర్‌షిప్పులు అందేవి. ఈ విధంగా, నిర్బంధోచిత విద్యావిధానం కోసం ఆర్థిక వనరులను ఖర్చు పెట్టడం ప్రభుత్వానికి కష్టమైన పనే. ఆరునుంచి పద్నాలుగు సంవత్సరాల వరకు, ప్రాథమిక విద్యను నేర్పించడం, తెలివిగల పిల్లలకు విశ్వవిద్యాలయాల్లో ఉన్నత విద్య చదువు కోడానికి ఖర్చుపెట్టడం, ప్రభుత్వానికి భారమే. స్థానిక సంస్థలు కాని, విరాళాలిచ్చే దాతలు కాని, ఆర్థిక సహాయం చేస్తే తప్ప, ప్రభుత్వమే ఇంత బాధ్యతను వహించలేదు. అయితే ప్రతి బిడ్డకు, అవకాశమున్నంత మటుకు ఉన్నత విద్యను నేర్పించకపోతే సామ్యవాద ప్రజాస్వామ్య సమాజ స్థాపనకు అర్థమే ఉండదు. అయినప్పటికీ భావి విద్యాభివృద్ధి ప్రణాళికల్లో ఇంతవరకు చూపించినదానికంటే, ఎక్కువ శ్రద్ధను

చూపగలమని నిష్కర్షగా చెప్పలేం. స్వాతంత్ర్యానంతరం, సమైక్య విద్యావిధానాన్ని ప్రవేశపెట్టడానికి ఎక్కువ శ్రద్ధ చూపలేకపోయాం. మహాత్మాగాంధి ఒక్కడే, ప్రాథమిక స్థాయిలో విద్యా విధానాన్ని గురించి ఊహించగలిగాడు. మేథా సంబంధమైన, ఆధ్యాత్మిక సంబంధమైన, వృత్తి సంబంధమైన విద్యా విధానాలను గూర్చి ఆలోచించి, వీటికి ప్రత్యేకమైన సంస్థలుండాలని భావించాడు. వీటి మూలంగా చిన్న పిల్లల్లో ఒక విషయంలో మాత్రమే అభివృద్ధి సాధించడం అనేది లోపభూయిష్ఠంగా కనిపించింది. అది వారిని సంపూర్ణ వ్యక్తులుగా తయారు చేయలేక పోయింది. అందుకనే ఆయన, 'చెయ్యి, తల, గుండె'లాగే సక్రమమైన అభివృద్ధి ప్రాథమిక స్థాయిలో నేర్చుకున్న విద్య మూలంగా సంక్రమిస్తుందని, అభిప్రాయ పడ్డాడు. విద్యా విధానమంటే ఈ క్రింద పేర్కొన్న అంశాలను బట్టి తెలుసుకోవచ్చు.

నిజమైన విద్యకు కావల్సిన మేధాసంపత్తి, సక్రమమైన శిక్షణ మూలంగానూ, శారీరక అవయవాలకిచ్చే శిక్షణ మూలంగాను తెలుసుకోవచ్చు. అంటే చేతులు, కాళ్ళు, చెవులు, ముక్కు మొదలైనవి. ఇంకో విధంగా చెప్పాలంటే బిడ్డ, అత్యున్నతమైన మేధాసంపత్తిని త్వరితగతిని సంపాదించుకోడానికి, శారీరక అవయవాలను ఉపయోగించుకునే విధానాన్ని బట్టి ఉంటుంది. శరీరం, మెదడు, రెండూ ఒకదానితో ఒకటి అభివృద్ధి చెందితేనే, ఆత్మ చైతన్యాన్ని పొందుతుంది. మానసిక అభివృద్ధి ఉన్నప్పటికీ, అది సక్రమమైన అభివృద్ధి కానేరదు. ఆధ్యాత్మిక శిక్షణంటే హృదయానికి సంబంధించిన విద్య. సక్రమమైన, అన్ని విధాలా మానసిక అభివృద్ధి చెందాలంటే, భౌతిక సంబంధమైన, ఆధ్యాత్మిక సంబంధమైన శక్తులు బిడ్డల్లో అభివృద్ధి చెందాల్సి ఉంటుంది. రెండింటినీ విభజించడానికి వీల్లేదు. ఈ సిద్ధాంత ప్రకారం, అభివృద్ధి అనేది, దేనికి సంబంధించి అదే అభివృద్ధి చెందుతుంది కానీ, సంపూర్ణమైన అభివృద్ధి కనిపించదు. తన విద్యావిధానాన్ని ఆచరించడానికి, విద్యావేత్తల సహాయాన్ని గాంధీ కోరాడు. బేసిక్ విద్యావిధానాన్ని రూపొందించమని అడిగాడు. ఈ సిద్ధాంత ప్రకారం, విజ్ఞానం, నైపుణ్యం, కార్యక్రమాలు, బిడ్డల పెరుగుదలకు అవసరం కాబట్టి, ఆ విద్యావిధానం ఒక ఉపయోగకరమైన వృత్తికి సంబంధించి ఉండాలి. ఈ ప్రక్రియ అంతా సాంఘిక, నైతిక, తత్వ ఆధారంగా ఉండాలి. ఈ సిద్ధాంతానికి ఆధారాలు సత్యం, అహింస. భారత ప్రభుత్వం కూడ కొన్ని పరిమితులతో ఈ విద్యావిధానాన్ని

అంగీకరించింది. కాలక్రమేణా ఈ పద్ధతి ప్రకారం ప్రాథమిక విద్యను రూపొందించాలని భావించింది. 1956 చివర ఈ బేసిక్ విద్యావిధానంలో చదువుకునే పిల్లల సంఖ్య 1.1 మిలియన్లు.

బేసిక్ విద్యావిధానాన్ని కేంద్రం, కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు అంగీకరించినప్పటికీ, దానిపై పూర్తిగా మనసు పెట్టలేదు. ఏ ఉద్దేశ్యంతో అయితే వీటిని ఏర్పరచటం జరిగిందో, అది నెరవేరలేదు. దీన్ని అమలు జరపడానికి వీలుకాదని వదిలి వేయటం జరిగింది. ఇటీవలి కాలంలో, భారత ప్రభుత్వ విద్యా నిపుణులు, విద్యా విషయాన్ని గూర్చి ఎంతో లోతుగా ఆలోచించారు. ఇటీవలి సిద్ధాంతాల ప్రకారం, విద్యావిధానాన్ని మలచాలని ప్రయత్నం చేశారు. వాళ్ళు, లభ్యమౌతున్న కొద్ది వనరులతో, ఏ విధంగా విజయం సాధిస్తారో మనం వేచి చూడాలి. అనుకున్నది సాధించినప్పటికీ, భారత జాతీయతలో కాని, జాతీయ సంస్కృతిలో కాని, అసలు సమస్య, అతి ప్రాచీనులకు చెందిన మాతృ భూమి భారతదేశమనీ ''జాతీయత'' అనేది ఆధునిక అర్థంలో భావిస్తే, ఇటీవల మాత్రమే జాతీయతను పొందిన దేశమనీ స్పష్టమౌతుంది. భారతీయులు ఒక పద్ధతిలో జీవితాన్ని గడుపుతారు. సాంప్రదాయాలను గౌరవిస్తారు. జాతిగా వారు ఆధునిక కాలంలో ఎదురౌతున్న తుఫానులకు, ఉద్రేకాలకు, అనేక రకాలైన తాకిడీలకు తట్టుకుంటున్నారు. వాళ్ళు తమ లంగరులను వదలుకోడానికి ఇష్టపడరు. వాళ్ళకు గురిలేని విషయాల జోలికి పోరు. ఉవ్వెత్తున లేస్తున్న అలలవంటి నేటి పరిస్థితుల నుండి తట్టుకోడానికి, స్వేచ్ఛాయుతమైన ప్రజాస్వామ్య రాజ్యాన్ని నెలకొల్పుకోడానికి ప్రయత్నిస్తున్నారు. పసిఫిక్‌లో మునిగిపోయి, లేక పాతకాలపు నీటిలో మునిగిపోయి, స్తంభీకృతం కావాలని అనుకోడం లేదు. స్తంభీకృతమైన విధానానికి, మారుతున్న విధానానికి, పాత కొత్తలకు, సమతౌల్యాన్ని సాధించడానికి ప్రయత్నిస్తున్నారు.

చిట్టచివరిగా విశ్లేషించి చూసినపుడు, ఇదే నిజమైన సమస్య. ఈ సమస్యను పరిష్కరించే ముందు ఇంతకన్నా ప్రధానమైన సమస్య, విభిన్న సముదాయాల సంస్కృతులను, మౌలికమైన సమైక్యతను కలిగించే జాతీయ సంస్కృతిని సమన్వయం చేయాల్సి వుంది. ఇంతవరకు ఈ సమస్యకు పరిష్కార మార్గాన్ని స్పష్టంగా తెలియజేస్తూ, దాన్ని ప్రాముఖ్యాన్ని పేర్కొంటూ కొన్ని ఆచరణీయమైన సూచనలను చేయడం జరిగింది. ఇటువంటి క్లిష్ట

పరిస్థితుల్లో మేధావులు, రాజకీయ నాయకులు, భారతదేశ భవితవ్యాన్ని తీర్చి దిద్దడానికి కృషి చేయాల్సి ఉంది. రాజకీయ, ఆర్థిక సమస్యలతో పాటు, భారతదేశంలో ఉన్న ఈ సాంస్కృతిక సమస్య సమానమైన ప్రాధాన్యం కలదని వారిని నమ్మించగలిగితే మన కృషి ఫలించినట్లే.

Lasertypeset at Printofast, 11/4, Old Rajinder Nagar, New Delhi - 110 060 and printed at J J Offset Printers, 7, Press Area, Wazirpur, Delhi - 110035